# కాశీ మజిలీ కథలు

(AN EVERGREEN CLASSIC IN TREDITIONAL PROSE)

ఒకే సంపుటముగా

## మొదటి, రెండు భాగాలు

ఇయ్యది గోదావరీ తీర స్థితంబైన
రాజమహేంద్రవర పురంబున నివశించియున్న

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవిచే
రచింపబడినది

(ఇది ప్రధమ సంపుటము)

సరళ సుమధుర వచనం:

శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం
భాషాప్రవీణ

ప్రకాశకులు

© 246 52 53
గొల్లపూడి వీరాస్వామి సన్
పబ్లిషర్స్ & బుక్‌సెల్లర్స్
కోటగుమ్మం, రాజమండ్రి - 533 101

# కాశీ మజిలీ కథలు

బ్రహ్మశ్రీ మధిర సుబ్బన్న దీక్షిత కవి
విరచితము

సరళ సుమధుర వచనం
శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం
మచిలీపట్నం భాషాప్రవీణ



నూతన ముద్రణ : 2016

ముఖచిత్రాలంకరణ :
గోల్డెన్ గ్రాఫిక్స్
రాజమండ్రి - 533 103.

టైటిల్ చిత్ర ముద్రణ:
ఈశ్వర్ గ్రాఫిక్స్,
రాజమండ్రి - 533 103

గ్రంథ ముద్రణ:
మహేశ్వరి ప్రింటింగ్ & బైండింగ్ వర్క్స్
రాజమండ్రి.

12 భాగములు
6 సంపుటములుగా
6 సంపుటాల
పూర్తిసెట్టు
(కేస్ బైండ్)
వెల : రూ. 900/-



ప్రకాశకులు:
గొల్లపూడి వీరాస్వామి సన్
కోటగుమ్మం, రాజమండ్రి
ఫోన్ : 0883 - 246 52 53
visit: www.bhaktipustakalu.in
e-mail : gollapudibooks1920@gmail.com

# ఎవరీ సుబ్బన్న దీక్షితులు ?

కాశీ మజిలీ కథల ప్రత్యేకత తెలిసిన వారెవరికైనా, ఇంతటి అద్భుతమైన కథల సృష్టికర్త మధిర సుబ్బన్న దీక్షితుల గురించి తెలుసు కోవాలని ఆసక్తి కలగడం సహజం! గ్రంథస్థమైన చరిత్ర ప్రకారం ఆయన వివరాలు ఇవి:

| | | |
|---|---|---|
| * కవికాలం | : | 1868-1928 |
| * జన్మస్థలం | : | పశ్చిమగోదావరి జిల్లా - తాళ్లపూడిలో క్రీ.శ. విభవనామసంవత్సర మార్గశిర శుద్ధవిదియ. |
| * తల్లిదండ్రులు | : | సోమిదేవమ్మ - కొండయ్య (వెలనాటి వైదికులు) |
| * గురువు | : | ఇవటూరి నాగలింగశాస్త్రి |
| * సహాధ్యాయులు | : | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, మానవల్లి రామకృష్ణ కవి ప్రభృతులు. |
| * జీవిత సంగ్రహం | : | |

కేవలం వినోదం కోసమే కథలు రాస్తున్నానని స్పష్టంగా ప్రకటించి, నేటికి దాదాపు ఆరేడు తరాల పాఠకులకు ఆనందాన్నిచ్చిన కథకుడు - మధిర సుబ్బన్న దీక్షితులు. రాజమండ్రిని స్థిరనివాసంగా చేసుకున్న ఈ కవి, తన ఇరవయ్యో ఏట 1888లో అష్టావధానాలు ఎన్నో చేశారు. ఉభయభాషలలోను కవిత్వం చెప్పగల దిట్ట.

అయితే - ఆయన దృష్టి కథలమీదకు మళ్లడం మన అదృష్టం! తరతరాలుగా మన పాఠకులను ఉర్రూతలూపుతున్న ఈ కాశీమజిలీ కథలు మనకు దక్కాయి. అవధాన కవిగా ఆయన 'మందిలో ఒకడు' గా మిగిలిపోక, **'మార్గ దర్శకుడు'** గా నేటికీ వెలుగొందుతూన్నాడంటే **'కాశీమజిలీ'** తరహా కథలకు బాటవేసిన ఘనత ఆయనదే!

1898లో ఆయన ఏ శుభముహూర్తాన ఈ కథలను ఆంధ్రపాఠక లోకానికి అందజేశారో గాని, తర్వాత దాదాపు అరడజను మంది ఆయనను అనుసరిస్తూ కేవలం ఇటువంటి కథలే రాశారంటే - పైగా పుస్తకాలకు పెట్టిన పేరులోను మజిలీలు అనే మాట ఉంచారంటే - ఆయన తొలినాటి తెలుగు కథా సాహిత్యంపై వేసిన ముద్ర అంతా-ఇంతా కాదు.

**పండితులైన మెచ్చవలె, పామర కోటికి నైన నింపుగా**
**నుండవలెన్, ప్రబంధమున-యోక్తుల నిర్వరకున్ హితంబుగా**
**కుండిన తత్ప్రబంధ మది యొక్క ప్రబంధమె? సాధు పాఠకా**
**ఖండ సుఖప్రదం బగుట ఫలమా! కవితా ప్రసక్తిన్"**

పీఠికలో ఆయనే ఇంత స్పష్టంగా ఇవి 'సాధుపాఠకుల కోసం' అని చెప్పాక, ఇంక సందేహం దేనికీ?

**ఇంకొక విషయం :**

ఇంత ఆదర్శం ఉండి కూడా, కాశీమజిలీలు గ్రామ్యభాషలో గాక, గ్రాంథికంలోనే ఇంతకాలం ఎందుకు లభ్యమైనాయి? - అనే ప్రశ్నకు సమాధానం పైన వివరించాం! గ్రాంథిక భాషలో లేకుంటే దాన్ని మెచ్చేవారు కారు. అదొక్కటీ! అన్ని పాత్రలూ వాడుక భాష మాట్లాడితే 'రచన' అందంగా ఉండదు. ఉదాహరణకు............ఈ కథల్లోని 17వ మజిలీలో దేవలోకం అధిపతి అయిన ఇంద్రుడు ఒక పాత్ర. దేవభాష సంస్కృతం. పూర్తిగా సంస్కృతం రాస్తే, ఎవరికి అర్థం అవుతుంది? ఇటువంటి చోట గ్రాంథికభాష తప్పదు. కాని-ప్రయత్నిస్తే వాడుక భాషలోనూ చెప్పొచ్చు! అసలు - ఆయన ఉద్దేశమే అది!

అట్లాంటిది - ఆనాటి పండితులకు జడిసి వాడుకభాషలో రాసిందాన్నే తిరిగి కష్టపడి **కృతకమైన భాషలో** కి మార్చవలసి వచ్చింది. ఇలాంటి సంక్లిష్ట భాషలోకి మార్చినప్పటికీ, ఈ కథల్లో వ్యావహారిక ప్రయోగాలు కనబడుతూనే ఉన్నాయని, ఉదాహరణలతో సహా **గురజాడ అప్పారావు** గుర్తించారు. గ్రాంథిక వాదులపై యుద్ధం ప్రకటించి, వాడుకభాషలో ఏకంగా 'కన్యాశుల్కం' నాటకాన్నే రాసి, భేష్ అన్పించుకున్న వీరసాహసి గురజాడవారు అనేది అందరికీ తెల్సిందే!

కాశీమజిలీల్లో మొదట వాడుకభాష ఉండేదని ఇంకా నిదర్శనాలు మిగిలాయి. (లభిస్తున్న పాత ప్రతులు ఎవరి దగ్గరన్నా ఉంటే చూడండి!)

మొదటిభాగం ప్రారంభంలోనే గురువుగారితో గొల్లశిష్యుడు ఇలా అంటాడు....

"నీవు భేమ్మడవైతే బోడిగుండేమి? మా భేమ్మడు లాగున లేవేమి? మా భేమ్మన గురువులోడికి ఈతరుప్పలా జుట్టూ-పొలిమేర రాతి మీద

వేసిన కొంగరెట్టలాంటి బొట్టూ, మెడమీద చేపమీసాల వంటి ధారాలు వేసుకొని.....” అనే పాత్రోచితమైన భాష మనకు కనిపిస్తుంది.

ఇలా ఈ కథలు మొదట సరళమైన భాషలోనే వచ్చాయని ఎన్నెన్నో ఉదాహరణలు చూపుతూ, ఎంతైనా రాయవచ్చు! అప్పుడు - కథలకంటే ఉపోద్ఘాతం అధికమయ్యే ప్రమాదం ఉంది. కనుక - అర్థం చేసుకోగల పాఠకులకు, ఇంతకంటె వివరించనక్కర్లేదు. కథలే ఆ పని చేస్తాయి.

## నేపథ్యం

ఆత్మీయులైన శ్రీ గొల్లపూడి వెంకన్నబాబు, దాదాపు రెండు సంవత్సరాల క్రితం బహుశ 2003 మార్చిలో అనుకుంటాను - “మధిరసుబ్బన్న దీక్షితులు మా రాజమండ్రి వాస్తవ్యులు. నేటికి సరిగ్గా వందేళ్లక్రితం ఈ ప్రాంతాల నివశించినవారు. ఆంధ్రదేశాన్ని ఒక ఊపు ఊపిన కాశీ మజిలీ కథల సృష్టికర్త. వారి పట్ల మా అభిమానాన్ని చాటుకొనే విధంగా మేము ఒక బృహద్గ్రంథంగా కాశీ మజిలీ కథలు పునర్ముద్రించ సంకల్పించాం” అని చెప్తూనే “అప్పటికీ ఇప్పటికీ భాషలో వచ్చిన మార్పుల రీత్యా- సరళ వ్యావహారికం వాడుతూ సుమధురంగా కథ నడిచేలా రాస్తే ఈ తరం వారికి మనం గొప్ప గ్రంథాన్ని అందించిన వారమవుతాం” అంటూ తమ మనుసులో మాట వెల్లడించారు. బృహద్గ్రంథంగా కంటే మొత్తం పన్నెండు భాగాలుగా విస్తరించిన ఈ కథలన్నీ ఆరు పుస్తకాలుగా (రెండేసి భాగాలు ఒక పుస్తకం చొప్పున) మూలం లోని జనరంజకత్వ పరిపుష్ఠి చెడకుండా అందిస్తే ఎలా వుంటుందీ? అనే ఆలోచన కూడా పరిశీలించి, చివరికి ఇదే ఖాయపరచడమైంది. ‘చాలా సమయం తీసుకుంటుంది. రెండు రెండున్నరేళ్లు పట్టినా ఆశ్చర్యం లేదన్నాను. ‘మీ రచనా సంవిధానం మాకు తెలిసిందే! తగినంత సమయం తీసుకునే నిర్వహించండీ యజ్ఞం’ అన్నారు.

దీనికి కారణం ఉంది. భాషరీత్యా గంభీరం. రాశిరీత్యా అంబుధి. పైగా ప్రతి ప్రధాన కథకూ పిల్లకాలువల్లా వచ్చిచేరే ఉపకథలు ఎన్నెన్నో. కొన్ని కథలు రెండు మూడు మజిలీల వరకూ సాగుతాయి. దాదాపు 670 ప్రధానప్రాతలు భటులు, పరిచారికల వంటి ఉపపాత్రలు అనంతం. చిక్కనైన

కల్పన. అద్భుతమైన కథాశిల్పం, ఎప్పటికప్పుడు మూలాన్ని సంశోధించి ఆకళింపు చేసుకుంటూ నవీన తరాలకు ఎక్కువ శ్రమకలిగించని సరళ సుమధుర వచనంలోకి మార్చే యత్నంలో **'మూడు రాతప్రతుల చిత్తు'** నుంచి ఈ అనర్ఘ రత్నాలను వెలికి తీసి సాపుప్రతి సిద్ధం చేయడం జరిగింది. ఈ క్రమంలో కొంత జాప్యం జరిగింది. ఈ లోగా ఈ ఆలోచననే ఇతరులు అనుసరించడం మొదలు పెడుతున్నట్లు తెలిసి కార్యాన్ని త్వరితంగా పూర్తి చేయవలసిందిగా నాకు సంస్థనుంచి సంకేతాలు అందేసరికి ఈ బృహత్కథా యజ్ఞంలో అర్ధభాగమైనా పూర్తికాలేదు. అలాగని త్వరత్వరగా ఏదోరీతిన రాసేసి ముగించడం నా అభిమతం కాదని వారికి తెలియజేశాను. ఈ కారణం వల్లనే జాప్యం జరిగి, ఇప్పటికి దాదాపు ఆరునెలలక్రితం 2004 నవంబరు దీపావళి పర్వదినాన వెలువడవలసిన ఈ గ్రంథం ఇప్పటికి (2005 ఉగాది) మీ కరకమలాలను అలంకరించింది. అయితేనేం! 'సరసుమధుర వచన వ్యాఖ్యానం' అనే మాట అక్షరాలా సార్థకమైంది. గుణగ్రహణ పారీణులైన చదువరులు ఈ అంశాన్నే ప్రత్యేకంగా దృష్టిలో ఉంచుకుని. ఈ గ్రంథానికి విశేషప్రాచుర్యం కల్పించగలరని ఆశిస్తూన్నాను

మీ

భాగవతుల సుబ్రహ్మణ్యం

## ప్రవేశిక

ప్రచురణ రంగం పూర్వం వలె లేదు. ఎన్నెన్నో కొత్తపుంతలు త్రొక్కుతోంది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం సంతరించుకుంటూ ఈ పోటీ ప్రపంచంలో ముందుకు దూసుకుపోతోంది. అయితే ఏది ప్రచురించాలి? ఒకనాటి పాతగ్రంథాలు నేడు నవీన రూపాన్ని తొడిగితే ఎలా ఉంటాయి? అనేది మా ఊహ. దీనికి సాకారం కల్పించాలని మేము ఏనాడో 1960 ల్లోనే కలలు కన్నాం! ఎన్నెన్నో ఉత్తమగ్రంథాలను సరళవచనంలోకి పరివర్తించిన ఘనత మా ప్రచురణ సంస్థకు ఉంది. ప్రచురణ రంగంలో నేటికి సుమారు 80 ఏళ్ల చరిత్ర కలిగిన సంస్థ మాది. వచనంలో శ్రీశివపురాణం,

దేవీభాగవతం, రామాయణ, భారత భాగవతాలు మా సంస్థ ప్రచురించగా అవి ఎందరికో మార్గ దర్శకమైనాయి.

ఇక ప్రస్తుత విషయం 'కాశీ మజిలీకథలు' కాలానుసారం వాడుక భాషలో ప్రచురిస్తే ఎలా ఉంటుందనే ఊహ ఈ నాటిది కాదు. దాదాపు పదేళ్ళనాటి స్వప్నం! మా సంస్థకు ఈ గ్రంధం గురించి వాకబు చేసేవారే అందుకు సాక్ష్యం! "పండితుల కాలం కాదండోయ్! ఇది కాన్వెంటు చదువుల తెలుగు పిల్లలు ఇంటింటా వర్థిల్లుతున్నకాలం. చిక్కనైన తెలుగు భాషను చదివి అర్థం చేసుకోగల పరిస్థితి రాన్రానూ సన్నగిల్లుతోంది. కనుక వాడుక భాషలోనే గ్రంధాన్ని వెయ్యండి" అంటూ మా హితైషుల పోరు. ఈ తర్జనభర్జనల మధ్య ఈ కాశీమజిలీకథల ప్రస్తావన ఎప్పుడొచ్చినా "అబ్బో! అవి చాలా పెద్దకథలు. పైగా గొలుసు కట్టుకథలు ఎక్కడో ప్రారంభమై తిరిగి మరో మజిలీలో కనిపించే పాత్రలూ కొన్ని ఉంటాయి అన్నిటికీ మించి అందులో పద్యాలు–శ్లోకాలు సామాన్యులను శ్రమకు గురిచేస్తాయి" అంటూ వాయిదా వేసేవారు మా రచయితల బృందం.

అదీగాక, మధిర సుబ్బన్న దీక్షిత కవి రచనలో కథనశైలిని తేటతెనుగున అనుసరించడం భాష మీద పట్టు ఉన్నవారికి తప్ప అన్యులకు సాధ్యం కాదు. అలాటి "పట్టు" ఒక్కటే సరిపోదు. సరళ సుమధురంగా చెప్పగల కల్పనా చాతుర్యం కూడా ఉండాలి. ఈ రెండు లక్షణాలు, వీటితో పాటు సంస్థ మీద గౌరవం – మా పట్ల అవ్యాజమైన అనురాగం గల శ్రీభాగవతుల సుబ్రహ్మణ్యం గారిని దైవికంగా మేము కలవడం మా ఆలోచన వారి ముందు పెట్టడం జరిగింది. పత్రికారచనలో అపారమైన అనుభవంఉండి, దాదాపు అన్ని ప్రముఖ దిన వార మాస పత్రికల్లోనూ ముఖ్యంగా దూరదర్శన్‌లో కూడా రచనలు చేసిన ఘనత వారిది. ద్రాక్షాపాకంలా కథను వేగంగా పరుగెత్తించే శైలిలో రాయవలసిందని మాత్రమే మేము కోరాం! మా ఆశయానికే వన్నె తెచ్చి మరింత అందంగా అందించిన వారి కృషిని మీ ముందుంచి మీ ఆశీస్సులను అభిలషిస్తున్నాం!

**ప్రకాశకులు**

# కాశీ మజిలీ కథల ప్రత్యేకత

* ఈ కథల్లో స్పృశించని అంశం అంటూ ఏదీ లేదు. నవరసాల్లోను మిన్న అనదగిన శృంగారం మొదలు ప్రేమ, కామం, భక్తి, పురాణాలు, ధర్మాలు, చరిత్ర, లోకజ్ఞానం, లౌకికప్రవృత్తి, వివిధవృత్తులు, చిత్తచాంచల్యాలు, యాత్రాజీవనం, వైరాగ్యం, వేదాంతం వరకూ సుబ్బన్న దీక్షితులు సందర్భానుసారం చర్చిస్తూనే రచనకు రసపుష్టి చేకూర్చారు.

* ఒకనాటి సామాజికులు - జానపదులు **'అలా జరిగిందట- ఇలా జరిగిందట'** అని చెప్పుకొనే 'అట' కబుర్ల - వృత్తాంతాలతో ఎక్కువ భాగం కథలు ఆశ్చర్యదాయకంగా సాగుతాయి.

* పూలహారంలో పువ్వులను కలిపే దారంలా, కథలన్నిటి మధ్య **'ఒక ఏకసూత్రత'** కోసం ప్రవేశపెట్టబడిన ఓ యోగి - ఓ గొల్లవాడి పాత్రలు ఈ కాశీమజిలీ కథలు మనకు అందిస్తాయి.

* పౌరాణిక, చారిత్రక ప్రసిద్ధమైన శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామలింగడు, లవంగి, కళావతి, ఇంద్రుడు, నారదుడు, మహాశివుడు వంటి పాత్రలేగాక ప్రజాబాహుళ్యంలో బాగా పరిచయమైన ఎన్నో పాత్రలు దాదాపు 670 వరకు మనకు ఈ కాశీ మజిలీ సంపుటాలలో కనిపిస్తాయి.

## వీటన్నిటి కంటె ముఖ్యంగా

ఆధునిక నవలలూ-కథలలో ప్రధాన లక్షణాలైన సస్పెన్స్ (ఉత్కంఠత రేకెత్తించే రీతి) టెంపో (బిగి చెడకుండా ఉత్సుకత కలిగించే రీతి) థ్రిల్ (సంభ్రమాశ్చర్యాలు గొల్పే రీతి) ఫ్లాష్ బ్యాక్‌లో కథ చెప్పడం వంటివన్నీ కాశీమజిలీ కథల్లో మనం చూడవచ్చు!

కొన్ని కథలు ఉపకథలను కూడా కలుపుకొంటూ తర్వాత ఏం జరుగుతుందో చకచకా చదివేయాలన్నంత ఆసక్తిదాయకంగా సాగుతాయి. వేయేల? తినబోతూ రుచి అడగడం దేనికీ?

పేజీలు తిప్పండి..మీరే గ్రహిస్తారు......

కాశీ యాత్ర చేసిన వారు రామేశ్వర యాత్ర కూడా చేయాలని మనవారి ఆచారం. కాశీనీళ్లు రామేశ్వరంలో ఎంతో నియమ నిష్టలతో కలపడం ఒకప్పుడు జరిగేది. పాపం! ఈ సంప్రదాయాన్ని మనవాళ్లు కథల్లో కూడా యథాశక్తి చూపించారు. కాశీ మజిలీ కథలు సాహిత్యలోకంలోకి రాగానే 'కాశీమజిలీ కథల నకళ్లా?' అనిపించేలాగ కొందరు – 'రామేశ్వర మజిలీ కథలెందుకు రాయకూడదు? అని ఇంకొకరు – కాశీ నీళ్లూ రామేశ్వరం నీళ్లూ కలగలిపినట్లు 'కాశీరామేశ్వరమజిలీలు' అని మరొకరు ఆంధ్రపాఠకలోకాన్ని చుట్టుముట్టారు. వీటిని బట్టి అవి తొలితరం తెలుగు కథల్ని ఎంత ప్రభావితం చేశాయో మనం ఊహించవచ్చు!

● శ్రీ ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం 12వ సంపుటిలో కథాసాహిత్యం – ప్రజాబాహుళ్యం శీర్షికన ఇచ్చిన (95వ పేజీ) పట్టిక ప్రకారం.....కాశీ మజిలీ కథలను ట్రూ కాపీలు (నకళ్లు) ఇలా దిగాయి.....

* నిజమైన కాశీ మజిలీలు – నందిరాజు చలపతి రావు (1903)
* శ్రీ రంగ మజిలీలు – బత్తుల లక్ష్మయ్య (1911)
* కాశీరామేశ్వర మజిలీలు – గుడిపాటి శేషగిరిరావు (1915)
* రామేశ్వరపు మజిలీలు – కె. వెంకటరంగనాయకమ్మ (1919)
* కాశీ మజిలీలు – నందిరాజు చలపతి రావు (-)

"పుణ్యక్షేత్రం పేరు పెట్టి మజిలీ కథలు మనం కూడా మజాగా రాసెయ్యలేమా" అని ధీమాగా పైన ఉదహరించినట్టి వాళ్లు ఇలాంటి నకళ్లు ఎన్ని దించినా, అవేవీ మధిరసుబ్బన్న దీక్షిత కవి రచనకు సాటిరాలేక పోయాయి. కాలం అనే కొలబద్దకు, నిలబడలేకపోయాయి. చిత్రమేమిటంటే ఈ నకలు రచనలు "నిజమైన" అని కొత్త విశేషణం చేర్చుకోవడం! పాఠకుల్ని భ్రమింపచెయ్యాలన్న ప్రయత్నాలు నాడూ – నేడూ కూడా కనిపిస్తున్నాయి. కాని పాఠకులు ఎప్పుడూ తెలివైనవాళ్లే! 'ఇమిటేషన్ సరుకు'ను ఇట్టే పోల్చేస్తారు.

సుబ్బన్న దీక్షితులుగారు ఎన్ని రచనలు చేసినప్పటికీ, ఆయన 'కాశీమజిలీల కర్త' గానే కీర్తి పొందారు. వారి ఇతర రచనలు కొన్ని : సప్తసాగర సంగ మహాత్మ్యం (1895) పద్యకావ్యం, భద్రాద్రిరామచరిత్రం (1900) పద్యకావ్యం, గౌతమీపుష్కర మహాత్మ్యం – రెండు భాగాలు (శ్లోక,

---

● ఆధారం: సమగ్రాంధ్ర సాహిత్యం– 12 (ఆరుద్ర)–;ఆధునిక ఆంధ్ర కవుల సంగ్రహచరిత్ర(యమ్. వేంకటశాస్త్రి)

పద్య, వచన సహితం) 1908, తెనాలి రామలింగ విజయం (1908) వచనం, శంకర విజయం (1918) వచనం... ఇంకా కన్యాశుల్క నిరసనం, తెలుగు వచన 'కాదంబరి', నారద చరిత్ర, రసికానందం (నాటకం) మొ॥ ప్రస్తుతం అలభ్యాలు. ఇంతటి సత్కవి యొక్క వివాహం, తదితర వ్యక్తిగత వివరాలు కూడా ఎక్కడా లభ్యం కాలేదు.

## కాశీమజిలీ కథలు మొదట వ్యవహార భాషలోనే వచ్చాయట!

ఇది నమ్మలేని నిజం! దీని నేపథ్యం చాలా ఉంది. గ్రాంథిక భాషలోనే ఈనాటి వరకు లభ్యమవుతూ వస్తూన్న ఈ కథలు మొట్టమొదట సరళసుమధురమైన వచనంలో పూర్తి వ్యావహారిక భాషలోనే సుబ్బన్న దీక్షితులు రాశారు. దీనికి ప్రమాణాలు కూడా ఉన్నాయి.

తెలుగుదేశాన్ని 'వీరగ్రాంథిక వాదులు' ఏలుతూన్న తరుణమది....వాడుక భాషలో రచనలు చేయడం వారికి నచ్చేది కాదు. అది పామర భాష అనీ – ఉద్గ్రంథ, సద్గ్రంథ రచనలకు పనికిరాని భాష అనీ వారి తాత్పర్యం. ఎంత గొప్ప పండితుడైనా వాడుక భాషలో రచన చేస్తే, రచనతోపాటు రచయితనీ చులకనగా చూసేవారంటే – నాటి పరిస్థితులు ఎంత జటిలంగా ఉండేవో మీరే ఊహించుకోవచ్చు!

పామరులకు ఇంపుగా ఉండడానికే 'కాశీమజిలీ'లు ఉపయోగపడటం మెచ్చుకోదగ్గ విషయం. గిడుగురామమూర్తి పంతులుగారు చెప్పిన విషయాన్ని బట్టి – ఇవి మొట్టమొదట **వాడుక భాషలోనే** రచించారు.

"కాశీ మజిలీలు మొదట ఏలూరులో గ్రామ్యభాషలోనే అచ్చు వేయించినా, ఇప్పుడు అవి గ్రాంథికభాషలోనే అచ్చుపడుతున్నవి. కథలు నోటను చెప్పినపుడు గ్రామ్యభాష వినడానికి ఇంపుగానే ఉంటుందట!

గ్రాంథికభాషలో ఉంటేనే గాని గ్రంథము కాదని చాలామంది అనుకొంటారు. స్త్రీలకు కూడా గ్రాంథిక భాషమీదనే ఎక్కువ మక్కువ సుమండీ! పల్లెటూళ్లలో కూడా తెలిసినా – తెలియకపోయినా గ్రాంథికభాషలో ఉన్న పుస్తకాలనే అందరూ కొని, కూడబలుకుతూ చదువుతారట!"

(ఇలా వుండే ఆనాటి పరిస్థితులు, నేడు ఎంతగా మారిపోయిందీ

మనం చూస్తూనే ఉన్నాం!) బహుశా ఈ కారణం చేతనే కాబోలు..... మొదట వాడుక భాషలో రాసిన ఈ కథల్ని **'చాలా కష్టపడి'** గ్రాంధికంలోకి ఆనాడు మార్పుచేశారని సాహిత్య చరిత్ర చెబుతున్న సత్యం.

ఆనాటి పరిస్థితులకు అనుగుణంగా - తేలిగ్గా ఉండే భాషని, శ్రమ చేసి కష్టమైన భాషలో రాస్తే, ఈ నాటి పరిస్థితులకు అనుగుణంగా తిరిగి ఈ కథల్ని వాడుకభాషలోనికి మార్చవలసిన అవసరం కలుగుతున్నది. ఆ పనే మేం చేశాం! ఇది ఈనాటి అవసరం. అంటే...దీనివల్ల **కాశీమజిలీ కథల్ని** సుబ్బన్న దీక్షిత కవి ఏ ఉద్దేశంతో రాశారో, ఆ ఉద్దేశం ఈనాటికి నెరవేరిందన్నమాట! ఇప్పటి పరిస్థితుల్ని వందేళ్ల క్రిందటే ఊహించగలిగిన, ఆ మహనీయుని ముందు చూపునకు జోహారు అనవలసిందే!

దీనికి కారణం ఉంది. ఆయన ఈ కథలకోసం ఎన్నుకున్న 'వస్తువు' ప్రజల్లోంచి వచ్చిందే! ఆనాడు దేశంలో బహుళ ప్రచారం పొందిన జానపద గాథలను సేకరించి, వాటిని ముందు తరాల వారికి పదిల పరచాలన్న సత్‌సంకల్పమే ఆయన చేత ఈ కథలను రాయించింది. ఉభయభాషల లోనూ కవిత్వం చెప్పగలిగిన సుబ్బన్న దీక్షితుల దృష్టి - వచనంలో జనం చెప్పుకొనే కథల మీదికి మళ్లడం - ఈనాటి మన పాఠకుల అదృష్టం!

**స్పష్టమైన ఆదర్శం :**

కాశీమజిలీ సంపుటాలు రచించడంలో సుబ్బన్న దీక్షితులు గారికి స్పష్టమైన ఆదర్శం ఒకటి ఉంది. దానిని ఆయన పీఠికలోనే ఇలా వివరించారు.

"మనం ఐహికాముష్మికాల విషయంలో (ఇహం-పరం) ప్రతిరోజూ కృషి చేయవలసి ఉంది. అందుకు సాధనాలు-జ్ఞానాన్ని బోధించే గ్రంథాలే! మరి గ్రంథాలు చదవాలంటే ఎంతమందికి ఉత్సాహం-అవకాశం ఉంటుంది? వినోదంగా ఉండే కథలు చదువుకోవడానికైతే అందరూ ఇష్టపడతారు. ఈ కాశీ మజిలీలు కేవలం వినోదార్థంగా కాలక్షేపం చేసేవారికే. ఇందులో నీతులూ-జ్ఞానబోధా కూడా ఉన్నాయి. అవి కావలసిన వారికి అవీ లభిస్తాయి. అందువల్ల యోగులకీ-జోగులకీ కూడా ఇవి హాయిగా వినదగ్గ రీతిలో రాశాను.

# కాశీమజిలీ కథలు - ప్రథమ సంపుటము

# కాశీ మజిలీ కథలు

## మొదటి భాగము

### కథా ప్రారంభము

క. శ్రీకర శశిశేఖర కరు
ణాకర వారాణసీ పురాకర గౌరీ
శాకర ధృత మృగ గంగా
శీకర విలసజ్జటా విశేష సు వేషా!

### మణిసిద్ధుని కథ

**ఒ**కానొక కాలంలో కొల్లాపురంలో యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు వేదవేదాంగాలను పరిపూర్ణంగా చదివాడు. అందులో చెప్పిన రీతిగా అన్ని ధర్మాలను పాటిస్తూ, సక్రమమైన మార్గంలో చాలా ధనం సంపాదించాడు. అలాగే తాను సంపాదించిన ధనం సద్వినియోగం చేయడానికి ఎన్నెన్నో యజ్ఞయాగాలు చేసి శ్రోత్రియబ్రాహ్మణ విద్వాంసులలో ఉత్తముడని పేరు పొందాడు. చాలాకాలం వరకు సంతానం లేని ఆ బ్రాహ్మణునికి, ఈ యజ్ఞయాగాల ఫలితంగా, అగ్నిహోత్రుని దయవల్ల ఒక కుమారుడు జన్మించాడు.

లేకలేక కలిగిన కొడుకు కావడం వల్ల యజ్ఞశర్మ ఆనందానికి మేరలేకపోయింది. ఆ సంతోష సందర్భాన్ని పురస్కరించుకొని పేదలకు దానధర్మాలెన్నో చేశాడు. ఆ పుత్రునికి గుణనిధి అని పేరు పెట్టాడు. ఆ బాలుడు శుక్లపక్ష చంద్రునిలా వర్ధిల్లి మంచి రూపాన్ని, రూపానికి తగ్గ గుణాన్ని, గుణాలు వికసించేలా ప్రజ్ఞాపాటవాలను కలిగి గుణనిధి అనే పేరు సార్థకం చేసుకున్నాడు.

సకాలంలో ఉపనయనం జరిగింది ఆ బాలునికి. బ్రహ్మచర్య దీక్ష గ్రహించి విద్యాభ్యాసంలో ప్రవేశించాడు. (ఆ కాలంలో ఉపనయనం జరిగిన నాటినుంచే బాలురకు విద్యాభ్యాసం ప్రారంభించేవారు) చదువు మొదలెట్టిన

నాటి నుంచి, అవన్నీ పూర్వజన్మలోనే పరిచయమా అన్నట్లు, అచిరకాలంలోనే విద్యలన్నీ అతనికి కరతలామలకం అయ్యాయి. అతడు అపారమైన జ్ఞానవంతుడయ్యాడు. వేదం, వేదాంగాలైన తర్క వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలు అతని నాలుక మీదనే ఉన్నాయా అన్నట్లు అతడు నిరంతర పరిశ్రమ చేస్తూండేవాడు. పరిశ్రమ వల్ల చదివిన చదువు మరింత పదును తేలుతుంది కదా! గుణనిధి పాండిత్యంలో మేటి అనిపించుకున్నాడు. ఆ యువకునికి యుక్తవయసు రాగానే వివాహం చేద్దామని సంకల్పించిన తండ్రి ఒకరోజు పుత్రుని చేర బిలిచి ఇలా అన్నాడు.....

"నాయనా! నీకు పెళ్లి చేయాలనుకుంటున్నాను. కాని, నువ్వు వివాహం పట్ల విముఖత చూపిస్తున్నావని మీ అమ్మవల్ల తెలిసింది. నిజమేనా?"

ఆ ప్రశ్నకు గుణనిధి "నిజమే! పెళ్లి ఎందుకు చేసుకోవాలి తండ్రీ?" అని తిరిగి ప్రశ్నించాడు. ఈ విషయం మీద ఆ తండ్రీ కొడుకులకు ఈ రీతిగా సంభాషణ జరిగింది.......

"అదేం ప్రశ్న అబ్బాయీ! వివాహం చేసుకోవడం ఆనందంగా సుఖపడటం కోసమే!"

"ఏ సుఖం? ఏ ఆనందం?"

"లోకంలో అందరూ ఎటువంటి సుఖాన్ని ఆనందంగా పొందుతున్నారో అదే అనుకో!"

"తండ్రీ! మన సాంప్రదాయాలకు సంబంధించి నాకు కొన్ని సందేహాలున్నాయి. అడగనా? కోప్పడకుండా తీరుస్తారా?"

(వేద వేదాంగ పారంగతుడైన ఆ తండ్రి, కొడుక్కు కలిగిన సందేహాలు తీర్చలేకపోవడమేమిటి? అడగమన్నాడు. అప్పుడు గుణనిధి)

"నాకు ఉపనయనం చేస్తున్నప్పుడు, నా మెడలో ఈ మూడు పోగుల జంధ్యం వేశారు కదా! దీని సంప్రదాయం ఏమిటి?"

"నాయనా! పాండిత్యంలో నా అంతవాడివి! నీకు తెలియక అడిగావని నేను అనుకోను. అయినప్పటికీ ఉపనిషత్ సారాంశాన్ని మరొక్కసారి మూడు ముక్కలలో చెప్పే ప్రయత్నం చేస్తాను. సాధారణంగా మనకు రెండు

నేత్రాలుంటాయి కదా! నుదిటి మధ్యలో జ్ఞాననేత్రం ఉంటుంది. అది తెరిచే ప్రక్రియనే ఉపనయనం అంటారని నీకు తెలిసిందే! ఉప = అధికంగా ఉండే, నయనం = కన్ను.

ఇది ఎలా తెరవబడుతోంది? యజ్ఞోపవీతం (జంధ్యం) వల్ల ఉచ్ఛ్వాస నిశ్వాసాలను 'యజ్ఞోపవీతా'లంటారని శాస్త్రం! ఈ ఉచ్ఛ్వాస - నిశ్వాసాలు ముక్కు రంధ్రం ద్వారానే కదా జరిగేది. కుడి ముక్కు రంధ్రం గుండా 'ఇడ' అనే పేరుగలది, ఎడమ శ్వాసరంధ్రం నుండి 'పింగళ' అనేది, నుదుటి మధ్య నుండి 'సుషుమ్న' అనేది పేర్లు కలిగివున్నటువంటి 3 నాడులు మెదడుకు నడుస్తుంటాయి. శరీరంలో ఉండే 108 సూక్ష్మనాడులలోను వీటికి చాలా ప్రాముఖ్యత ఉంది. ఇవి రజస్సత్వతమోగుణాలను ప్రేరేపిస్తుంటాయి. అంటే దేహతత్త్వాన్ని ఇవి ప్రభావితం చేస్తున్నాయని అర్థం! ఈ మూడుతత్త్వాలకు ప్రతీకలే మూడు జంధ్యపుపోగులు. వీటిలో 'సుషుమ్న' నాడి 'సత్వ' గుణాన్ని సూచిస్తుంది. నుదుటి మధ్యలో ఉన్న దీన్ని తెరిచిన వాడు సత్వగుణాన్ని అధికంగా కలిగిఉంటాడు. బ్రాహ్మణుడు ఈ గుణాన్ని అధికంగా కలిగిఉంటేనే జ్ఞానం సంపాదించగలుగుతాడు. కనుకనే 'జ్ఞానగ్రంధి' అనే ముడి కలిగివున్న జంధ్యం వేసి, అంతర్గతంగా ఉన్న మూడో నేత్రాన్ని తెరిపిస్తారు. ఆ తరువాతనే విద్యాభ్యాసం, సత్త్వగుణప్రధానమైన ఈ కన్ను తెరవడం ద్వారా శాస్త్రాలు-వాటి అంతరార్థాలు చక్కగా బోధపడతాయి. దీనితో ద్విజులమై, మనకు రెండో జన్మ సిద్ధిస్తుంది. ఇదంతా ఉపనిషత్‌లలో ఉన్నదే!"

"ఉంది. కాని వివరంగా తెలియలేదు. మరి - వివాహ సమయంలో రెండో యజ్ఞోపవీతం వేస్తారు కదా! అది దేనికి?"

"ఇటువంటి సత్త్వగుణ తత్త్వం కలిగిన మరొక దేహధారి యొక్క దేహభారం తనమీద పడబోతూన్నదన్న సూచన అనుక్షణం గుర్తుచేయడానికే! 'భర్త' అంటే 'భరించువాడు' అని కదా అర్థం!"

"తండ్రీ! 'వివాహం' అనే పదానికి నిర్వచనం ఏమిటి?"

"వి'వాహం' అంటే నిరంతరాయంగా పైన చెప్పిన మరొక దేహధారి బరువును మోయడం".

"యజ్ఞాలు చేసిన పుణ్యపురుషులు మీరు. మోక్షదాయకమైన యాగాలనెన్నిటినో చేసిన విద్వాంసులు కూడ! 'మోక్షం' అంటే బంధాలను విడగొట్టేది అని కదా అర్థం! అన్నీ తెలిసిన మీరు, ఈ యజ్ఞోపవీతాల వల్ల బరువు మోయడం భారం వహించమని చెప్పడం-బంధం ఏర్పరచుకోమని బోధించడం వల్ల ప్రయోజనమేమిటి? అదేం న్యాయం?"

"విద్వాంసుడైనవాడికి విచక్షణ ఉంటుంది కదా! ఏది హితమైనదో అది అవలంబిస్తాడు. 'కామిగాని వాడు-మోక్షగామి కాడు' అన్నారు. కామం అంటే శారీరక వాంఛలే కావు, అన్ని రకాల కోరికలను 'కామం' అనే పిలుస్తారు. కనుక ఇహలోక వాంఛలన్నీ 'సకామం'గా నెరవేర్చుకుని, తర్వాతనే మోక్షమార్గం గురించి ఆలోచిస్తారు. ఇది తెలిసే సన్యాసులు జంధ్యం తీసేస్తారు. దీనిని వల్లనే, 'జగమెరిగిన బ్రాహ్మణునకు జంధ్యం ఎందుకు?' అనే సామెత వచ్చింది."

"తండ్రీ! నీవు సర్వజ్ఞుడవు! నీకు తెలీనిది లేదు. అన్నీ తెలిసి నన్ను ఇలా పెళ్లిచేసుకోమని బోధిస్తావు దేనికి?"

"వత్సా! సన్యాసులకు సంబంధించిన సాంప్రదాయములు తెలుసుకొనే సమయం ఇది కాదు. బ్రహ్మచారిగా ఉన్న నువ్వు గృహస్థుడవై, కొడుకుల్ని కని-మనవళ్లు కూడా పుట్టాక అప్పుడు వానప్రస్థాశ్రమం స్వీకరించేటప్పుడు ఇటువంటివి ఆలోచించాలి. ఇది లోకాచారం".

"ఏ పనైనా ప్రారంభానికి ముందే, కారణం తెలుసుకుని చేయడం మంచిది కదా! ' ఈ దేహభారాన్ని వదిలించుకో' అంటూ గుర్తుగా వేయబడ్డ జంధ్యమే ఒక బరువు. దీనికి తోడు రెండో బరువు బాధ్యతగా మోయమని చెప్తూన్నారే!? తండ్రీ! అన్నీ తెలిసీ, మంచి దారి చూపించక ముళ్ల మార్గాన నడవ మంటున్నారే!

"లేదు నాయనా! తెలిసే చెప్తున్నాను. ఇప్పుడు ఇవి నువ్వు అనదగ్గ మాటలు కావు. గృహస్థాశ్రమం ముఖ్యమైంది. ఎందుకంటే.....మనవంటి గృహస్థులు చల్లగా ఉంటేనే బ్రహ్మచారులకైనా - యతిపుంగవుల కైనా

తపస్సు చేసుకొనే వారికైనా భిక్ష లభిస్తుంది. మన మాదిరిగా గృహస్థులు లేకుండా ఉంటే, ఆ పరిస్థితి ఒక్కసారి చూపించు! ఎవరికైనా భిక్ష పెట్టేవారు ఎవరుంటారు? అందువల్ల గృహస్థుడు అందరికంటే అధికుడు".

"తండ్రీ! మీరు ఎన్ని చెప్పినా, సముద్రం లాంటి సంసారంలో నేను పడదల్చుకోలేదు. ఆ వలలో చిక్కుకున్న వారికి ధనార్జన చెయ్యాల్సిన పరిస్థితీ ఆసక్తీ ఉండక తప్పవు. ఏదో ఒక కడుపు అంటే నింపుకోవచ్చు! కాని, భార్య పుత్రులు...ఇలా కుటుంబం పెరిగినప్పుడు వారిని పోషించడానికి గృహస్థుడెలాంటి కష్టాలు పడాలో తల్చుకుంటేనే భయం వేస్తోంది. అనుక్షణం భార్య జలగలా రక్తాన్ని పీల్చేస్తూంటే, ఆమె మీది మమకారం చేత ఆమె మాటలూ- చేతలూ మోహం పుట్టిస్తున్నాయే అనుకుంటూ, మూర్ఖుడు అది మరచి సుఖం అనుకొని ఆనందిస్తున్నాడు.

భోగాలమీద ఆసక్తి వల్ల వీర్యం, ధనం కోల్పోయే పురుషుడ్ని- స్త్రీ తన కుటిల సంభాషణతో మరింతగా హరించేస్తుంటుంది. ఈ నయగారపు మాటల మత్తులో పడి, పురుషుడు ఒక్కటొక్కటే క్రమంగా కోల్పోతూంటాడు. తాను ఏమేమి పోగొట్టుకుంటున్నాడో తెలియరానంత నేర్పుగా మాయచెయ్యగల రూపం, మాట, వర్తనం స్త్రీ సొత్తు. నిరంతరం డబ్బు సంపాదించవలసిన అవసరం వల్ల నిద్రాసుఖం ఉండదు పురుషునికి. ఇన్ని మాటలేల? పురుషుడన్ని విధాలా మోసపోవడానికే బ్రహ్మ ఈ 'పెళ్లి' అనేది కల్పించాడు.

తండ్రీ! జనక మహర్షి అంతటివారే అందరూ కాలేరు. (దేవీభాగవతములో ఈ వృత్తాంతం ఉంది. శుకమహర్షి అంతటివాడికే జ్ఞానబోధ చేయగలిగిన మహారాజు జనకుడు) ఒకవైపు గృహస్థధర్మాలు నిర్వర్తిస్తూనే జ్ఞానం ఆర్జించడం (ఇక్కడ - 'జ్ఞానం' అంటే పారమార్థిక చింతనం అనే అర్థం) అందరికీ సాధ్యం కానిది. నీ వంటి జనకుని ముందు నేను అహంకరించి ప్రవర్తించాననుకోకు! మహాత్మా! సన్మార్గం ఉపదేశించకుండా, నరకప్రాయమైన సంసార కూపంలో పడమని ఎందుకు చెప్తావు? నాకు పెళ్లి అక్కర్లేదు" అని స్పష్టంగానూ- సుదీర్ఘంగానూ చెప్పాడు గుణనిధి.

పెళ్లి చేసుకోనని కొడుకు భీష్మించుకొనేసరికి, ఆ తండ్రికి దేహం కంపించింది. దుఃఖంతో కన్నీళ్లు ధారాపాతంగా వర్షించాయి. వంశం అభివృద్ధి చెందడానికి ముఖ్యమైన వివాహాన్నే వద్దంటున్నాడు కొడుకు. సన్యసిస్తే పుత్ర పౌత్ర పరంపరగా వంశం ఎలా విస్తరిస్తుంది? అతడి శోకం సమంజసమే!

తండ్రి ఆ విధంగా పరితపించడం చూసి గుణనిధి తనలో తాను ఇలా అనుకోసాగాడు....

"ఆహా! మాయా మోహబలం ఎంతటిదో కదా!? ఇది 'అన్నీ తెలిసిన వాళ్లని' సైతం వశపరచుకుంటున్నది. ఒక్కొక్కరోజు గడిచేకొద్దీ తమ ఆయుష్షు తరిగిపోతూన్నదని లోకులు గ్రహించడం లేదు. తమ కళ్ల కెదురుగానే ఎందరో పుట్టడం-మృతి చెందడం- ఆపదల బారిన పడుతూండటం ఈ మనుషులు గమనించడం లేదా? ఇవన్నీ చూస్తూ కూడా భయపడటం లేదేం? దీనిక్కారణం- బహుశా అందరూ ఒకే తీరుగా ఆలోచించడమే అయి ఉంటుంది. 'మోహం' అనే మద్యాన్ని ప్రతివారూ తాగుతూనే, లోకానికి వెర్రి ఎత్తిందని అనుకుంటున్నారు. మాయాబలం అంటే ఇదే! దీన్ని అతిక్రమించడం కష్టం!" – ఇలా అనుకుంటూనే, "జనకా! ఇక ఆ విషయమై నన్ను నిర్బంధించకండి! వదిలిపెట్టెయ్యండి! నేను వెళ్తాను. ఇంకా సంధ్యావందనం, ఆ తర్వాత శాస్త్ర పఠనం చాలా చెయ్యాల్సి ఉంది" అంటూ అక్కడనుంచి కదిలాడు.

యజ్ఞశర్మకు బాగా దిగులు ఆవహించింది. 'కొడుకు ఇలా తయారయ్యాడేం? ఇంత మనః సన్యాసిత్వం ఎక్కడ్నుంచి వచ్చింది? ఇది ఈ వయసులో రాదగినది కూడా కాదే!? అనుకొని, ఆ మాటనే అవకాశం ఉన్నప్పుడల్లా తాను చెప్తూ, ఇతరుల చేతా చెప్పిస్తూన్నాడు.

అయినప్పటికీ – అతడి మనస్సు మరల్చలేక, కులాభివృద్ధికిక యోగం లేదేమో అనే చింత అతడ్ని పీడిస్తూంటే ఆ దిగులుతోనే యజ్ఞశర్మ కన్నుమూశాడు. పతివ్రత – మహాఇల్లాలు అయిన అతని భార్య, భర్తలేని బతుకిక వ్యర్థం-దుర్భరం అనుకొని సహగమనం చేసింది.

సన్యాసి మనస్తత్వాన్ని చదువుతున్న రోజుల్లోనే అలవర్చుకుని, తామరాకు మీద నీటి బొట్టు చందంగా ప్రవర్తిస్తున్న గుణనిధి తల్లిదండ్రుల మరణానికి కించిత్ అయినా విచారించలేదు. పైగా 'బంధనాలు ఏ బెడదా లేక వాటంతట అవే సడలాయి' అని సంతోషించసాగాడు. అతడి అసాధారణ వైరాగ్యానికి లోకులు ఆశ్చర్యపోయారు. దైవ సమానులు - ఈ లోకానికి రావడానికి జన్మనిచ్చి, ఇన్నాళ్లు పెంచి పోషించి, విద్యాబుద్ధులు చెప్పించి, ఇంతవాడిని చేసినవారు అయిన తల్లిదండ్రుల మరణం లోకులందర్నీ సహజంగా కృంగదీస్తుంది. కాని ఇతడు అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడే! జననీ జనకుల మృతికి విచారమైన ప్రకటించక పోగా, పైగా ఆనందిస్తున్నాడే! ఇంతకంటే 'సన్నాసి' ఇంకొకడు ఉండడు...అని కూడా లోకులు అనుకో సాగారు.

గుణనిధి గురువును అన్వేషించి, సన్యాసదీక్ష స్వీకరించాలన్న పట్టుదలతో ఉన్నాడు. జ్ఞానమార్గాన ముక్తిసోపానాలను అధిరోహింప చెయ్యగల ఉత్తమ గురువుకోసం సాగుతోంది అతని అన్వేషణ. పొట్టకూటి కోసం సన్యాసి మార్గం అవలంబించే గురువేషధారులు కోకొల్లలుగా కనిపించారు. వారి వల్ల జ్ఞాన సాధనకు దారి దొరకడం మాట ఏమోగాని, గంజాయి దమ్ము పీల్చడం వంటి వ్యసనాల బారిన పడటం ఖాయమని తెలిసి అట్టివారికి దూరంగా జరగసాగాడు. 'అసలైన గురువు' నె వెతికి పట్టుకొనే నిమిత్తం అతడలా తిరుగుతూండగా- ఆ వూరి దేవాలయానికి 'అపరశివుడా' అన్పించే విధంగా కనిపిస్తూన్న సన్యాసి ఒకడు వచ్చి నివశించసాగాడు. అతడ్ని చాలా శ్రద్ధగా పరిశీలించాడు గుణనిధి. ఇతడు వేషధారి మాత్రమేనా? వ్యసనపరుడా? డాంబిక జీవనుడా? పారమార్థిక చింతనాసక్తుడా? యోగమహిమ వల్ల ఆకలిదప్పులకు అతీతంగా ఉండగలిగిన వాడా? బోధించడానికి అన్ని అర్హతలు ఉన్నవాడా?..ఇలా ఎన్నో అంశాలు పరీక్షించాడు.

రుద్రాక్షలు, భస్మం ధరించిన వాడు, పులి చర్మం కట్టుకున్న వాడు, జడధారి, దైవత్వం తొణికిసలాడుతున్న వాడు అయిన ఆ సిద్ధుడే తనకు సన్యాసదీక్ష ఇవ్వడానికి అన్ని విధాలా తగినవాడని నిర్ణయించుకున్నాడు.

ఒకరోజు సాయంత్రం గుణనిధి దేవుని దర్శించడానికి ఆ దేవాలయంలోకి వెళ్లి, రెండో శంకరునిలా కన్పిస్తున్న ఆ సిద్ధుని చూసి నమస్కరించాడు. ఒక ప్రక్కగా కూర్చొని అతడి 'త్రికరణ శుద్ధి'ని పరికించాడు. (మనస్సు..వాక్కు...కర్మ ఈ మూడు ఒకే రీతిగా ప్రవర్తించడమ త్రికరణశుద్ధి అంటే.) అలా పదిరోజుల పాటు ఉదయం నుంచి సాయంత్రం వరకు తన దగ్గరకొచ్చి కూర్చొని, ఏదీ అడగకుండానే వెళ్లిపోతున్న గుణనిధిని ఆ సిద్ధుడూ పరికించాడు. తనను అంత దీక్షగా పరిశీలిస్తున్న ఆ యువకుని చూసి, యతీంద్రునికి ముచ్చట కలిగింది. ఆ వయసులో అటువంటి నిర్మలమైన మనస్సు కలిగి ఉండటం అరుదైన సంగతి కనుక, గుణనిధిలోని ఉన్న ఈ గుణము ఆ యతీంద్రుణ్ణి ఆకర్షించింది.

ఓ రోజు "నాయనా! బుద్ధిమంతుడవు. ఎవరి పుత్రుడివి? నీ అభిలాష ఏమిటి? ఏదీ అడగవు. రోజూ క్రమం తప్పకుండా వచ్చి వెళ్లిపోతావు. ఇలా రావడం వల్ల ప్రయోజనం ఏమిటి? నీ మనసులో మాట దాచకుండా చెప్పు!" అంటూ చిర్నవ్వుతో అడిగాడు.

అప్పుడా గుణనిధి వినయంగా శిరస్సు వంచి "స్వామీ! నేను యజ్ఞశర్మ అనే బ్రాహ్మణుని కుమారుడిని, నా తల్లిదండ్రులు స్వర్గస్తులైనారు. ఇప్పుడు నా అన్నవాళ్లెవరూ నాకు లేరు. నాకు ఏ కోరికా లేదు. సంసార ఝంఝాటంలో పడే ఉద్దేశం అసలే లేదు. ఉన్న కోరికల్లా ఒక్కటే! అదీ కైవల్యానికి సులభమైన మార్గం ఏదో తెలుసుకోవాలన్న అభిలాష మాత్రమే!

నా పురాకృత పుణ్యవిశేషం కాబోలు–నా కోరిక తీర్చగల మీవంటి మహనీయులు ఇక్కడకు వచ్చారు. మీ వంటి సాధువులే నాకు బంధువులు. మీ వంటి వారు పామరులను ఉద్ధరించడానికి లోకయాత్ర చేస్తుంటారు. మిమ్మల్ని సేవించుకోవాలని–ముక్తి మార్గం పొంది కృతార్థుడిని కావాలని నా అభీష్టం! ఇంతకు మించి ఇంకేం లేదు" అని ఆయన పాదాలపై పడ్డాడు.

అప్పుడా సిద్ధుడు గుణనిధిని లేవనెత్తి "వత్సా! నీవు బుద్ధిమంతుడివనే విషయం నేను తొలిరోజే గుర్తించాను. నీ పూర్వజన్మ పుణ్యం వల్ల నీకు అన్ని శాస్త్రాలు, కళలు ఎక్కువ శ్రమించనక్కర్లేకుండానే లభించాయి. నువ్వ

కారణజన్ముడివి! ఆ విషయం కూడా నేను గ్రహించాను. నీకు మా ఉపదేశంతో పనిలేదు. నువ్వు మానసికంగా ఇప్పటికే సన్యాసివి......"అని ప్రశంసించాడు.

ఆ సిద్ధుడు కళ్లు మూసుకుని "నాయనా! నీకు దేహరీత్యా సన్యాసదీక్ష ఇస్తాను. నీ వల్ల కొన్ని పురాతన గాథలు భూలోకంలో ప్రజలకు తెలియవలసి ఉంది. నువ్వు ఎవరినైనా తోడు తీసుకుని కాశీ పురానికి వెళ్లు! అక్కడ పరమహంసలతో నీకు సహవాసం కలుగుతుంది. దానితో నీకు ముక్తి మార్గ సాధన సులభసాధ్యం! నీకిదే మా ఉపదేశం. ఇంతకంటే నీకు చెప్పడానికేమి లేదు" అని కళ్లు తెరచి, తన మూటలోంచి కాంతులు విరజిమ్మే రత్నాన్ని ఒకటి తీసి, అది గుణనిధి చేతిలో పెట్టాడు.

"ఇంత విలువైన రత్నం నాకు దేనికీ? ఇప్పుడే గద - తమరు నాకు సన్యాస దీక్ష ఇప్పించారు. సన్యాసికి రత్నాలతో ఏం పని?" అని గుణనిధి అడగ్గా, చిరునవ్వు నవ్వాడు సిద్ధుడు.

"నిజమైన సన్యాసిని గుర్తించాను నేను. నీ లోపలి సన్యాసికి ఇంతకంటే వేరే పరీక్ష అక్కర్లేదు. పైపైకి డాంబికంగా సన్యాసం స్వీకరించి, ఏమీ అక్కర్లేని వాడిలా నటిస్తూ బంగారం-రత్నాలమీద వ్యామోహం కొద్దీ అవి చేతికి చిక్కినపుడు ప్రలోభపడేవారు కొందరుంటారు. నీవు నిజమైన సన్యాసివి గనుకనే, నేనిది ఇవ్వజూపినప్పుడు దీనిపట్ల తిరస్కార భావంతో చూడగలిగావు. కనుక నీకు దీన్నే నేను పురస్కారంగా ఇవ్వదల్చుకున్నాను. ఎందుకో తెలుసా? ఇది మామూలు రంగురాయి కాదు. మహిమాన్వితమైన శక్తులు కలిగినది. దీన్ని ఎదుటపెట్టుకొని, ధ్యానించి, పూజించి కళ్లు మూసుకొని, నిమేషమాత్రం భగవంతుని మీద దృష్టి నిల్పితే-భూత భవిష్యద్వర్తమాన కాలాల్లోని కథలన్నీ నీకు కరతలామలకంగా బోధపడతాయి. దీన్ని సాలగ్రామ శిలను పూజించినట్లుగా పూజిస్తుండు! ఈ మణి నీకు సిద్ధించినందువల్ల ఇకపై నీవు మణిసిద్ధుడు అనే పేరిట ప్రఖ్యాతి వహిస్తావు. నీ పాత పేరు గుణనిధి క్రమంగా చెరిగిపోగలదు" అని శిరస్సు మీద చేతిని ఉంచి 'సిద్ధుడవగుదువు గాక!' అంటూ నిండుగా దీవించి గుణనిధిని

పంపేశాడు. ఆ తర్వాత ఆలయంలో కొద్దికాలం నిలిచి, అక్కడ్నుంచి ఆ యతీంద్రుడూ ఎటో వెళ్లిపోయాడు.

గురుదేవుడు చెప్పిన మంత్రాన్ని స్మరించుకుంటూ, గోవింద తీర్థులనే స్వాములవారిని దర్శించి విధివిధాన సహితంగా సన్యాసం స్వీకరించి, నాటి నుంచి మణిసిద్ధయతీంద్రుడని పిలువబడుతూ సంచరించసాగాడా గుణనిధి. గురువు చెప్పిన కాశీయాత్రం చేసి, కాశీలోని పరమహంసలను సందర్శించాలనే అభిలాష నానాటికీ అధికం కాగా, ఒకరోజు – బాల్యంలో తనతోపాటు కొంతకాలం సహాధ్యాయిగా ఉన్న లౌల్యమతి అనే వాడి దగ్గరకు వెళ్లాడు.

మణి సిద్ధ యతీంద్రునికి ఆ మిత్రుడి వద్ద గల చనువు చేత, చేరబిల్చి "మిత్రమా! నాకు బాల్యం నుంచి కాశీపురి సందర్శించాలనే అభిలాష ఉన్నదని నీవెరిగినదే కదా! గుడిలో గురుదేవుల ఉపదేశం కూడ దీన్నే బలపరిచింది. నేను కాశీ వెళ్లదల్చుకున్నాను. అయితే – ఆ యాత్రకు ఒంటరిగా వెళ్లకూడదని పెద్దలు చెబుతారు. నాకు తోచిన ఉపకారమేదో ఒకటి నీకు చేస్తాను. నా ప్రయాణానికి తోడు రాగలుగుతావా?" అని చాలా శాంతవదనంతో అడిగాడు.

దానికా లౌల్యమతి నవ్వుతూ పరిహాసంగా "తండ్రి ఎన్ని విధాల బతిమాలినా, పెళ్లి చేసుకోక ఆయనకు మనశ్శాంతిలేకనే పరలోకానికి పంపేశావు. ఇప్పుడీ కాశీప్రయాణం పెట్టుకున్నావన్నమాట! బాగుందయ్యా బాగుంది. దార్లో తోడుకోసం మేం రావాలా? ఇక మమ్మల్ని చంపుతావు కాబోలు! వేదాంతమంతా ఏమైంది? అసలు వేదాంతులకు తీర్థయాత్రలతో పనేముంది? నేను రాలేను బాబూ!" అన్నాడు. ఇంకొక మిత్రుడి దగ్గర కెళ్లి ఇదే ప్రస్తావన తీసుకురాగా, అతడు కూడ "ఆలుబిడ్డలున్నారు నాకు. నేను నీలా సన్యాసిని కాను గదా! ఇటువంటి యవ్వనం అనుభవించే కాలంలో అన్నీ విడిచి అష్టకష్టాలు పడుతూ నేను కాశీ రాలేను" అంటూ నిర్మొహమాటంగా తెగేసి చెప్పేశాడు.

మణిసిద్ధ యతీంద్రుడు నిరాశ చెందకుండా ఇంకొక పరిచయస్తుని దగ్గరకు వెళ్లి "ఆర్యా! ఈ భూమ్మీద కాశీని మించిన ప్రసిద్ధ పుణ్య క్షేత్రం

లేదని నువ్వూ విన్న విషయమే! అక్కడ గంగాభవాని, విశ్వనాధుడు ముఖ్య దేవతలనీ; ఇహ పర సాధనకు అనువైన తీర్థమనీ అందరూ చెప్పుకోడం కూడా నీకు తెలిసే ఉంటుంది. ఆ కాశీపుర విశేషాలు ఎన్నెన్నో ఉన్నాయి. ఆ విశేషాలన్నీ దారిలో నీకు వివరిస్తాను. ఆ పట్టణం చూడాలనే వేడుక నీకు లేదా? జన్మసాఫల్యం చెందేలా నాతోపాటు కాశీకి తోడుగా రా! ఈ భార్యాపుత్రుల మీది మోహం-మమతానురాగాలు విడిచిపెట్టు! పరలోక సౌఖ్యానికి వారు పరమశత్రువులని గ్రహించు! దేహం శాశ్వతం కాదు. కాశీపురదర్శనం మాత్రం చేతనే ఈ యాతనలు - అత్రాలు-తాపత్రయాలు అన్నీ నశిస్తాయి" అని చెప్పగా, ఆ బ్రాహ్మణుడు, వాటి పట్ల అంత ఆసక్తి చూపించకుండా, తన తాతలనాటి ఉదంతం ఒకటి చెప్పి మణిసిద్ధుని ఆసక్తి మీదనే చన్నీళ్లు జల్లడానికి ప్రయత్నించాడు.

ఆ బ్రాహ్మణుడే మన్నాడంటే.......

"అయ్యా! కాశీపురం అంతటి ప్రభావ సంపన్నమైన పుణ్యక్షేత్రమే! కాదనను! కాని, అక్కడికి చేరడానికి దారి సరైనది లేకపోవడం- ఉన్నటువంటి దారి ఎంతో కష్టదాయకమని ప్రజలు చెప్పుకోవడం మీరూ వినే వుంటారు. అదీగాక మీలాంటి వాళ్లకి తీర్థయాత్రలతో పనేమిటి? మార్గాయాసం చెంది, నానా కష్టాలు పడి భగవంతుని దర్శిస్తే, అజ్ఞానులకు దాని వల్ల జ్ఞానం లభిస్తుందంటారు. తీర్థయాత్రలు సామాన్యుల కోసమే విధించారు. 'మనస్సు' అనే తీర్థంలో మునిగితేలే వారికీ - ఆడవారికీ తీర్థయాత్రల వల్ల లాభం లేదంటారు. పామరుల కోసం కల్పించబడినట్టి ఈ తీర్థయాత్రా సన్నాహం, తమ బోటి యతీశ్వరులు చేయదగింది కాదు. నా మాటలు విని ఆ పని మానేయండి" అని ఎదురు ఉచిత సలహా కూడా ఇచ్చాడు.

అటువంటి వాడితో మాటలు దేనికని, ఆ యతిశ్రేష్ఠుడు మరొక్క మిత్రుని చేరి, కాశీ విశ్వనాధుని మీద కమ్మని పద్యం ఒకటి ఇలా చదివాడు......

గీ. విశ్వనాధుండు దేవతా వృక్ష మమర
గంగ దుర్వార పాప ప్రభంగ యన్న

**పూర్ణ గీర్వాణ సురభి యపూర్వపుణ్య**
**ఫలదములు తీర్థములు శుభాస్పదముకాశి.**

ఆ వెంటనే - ఇలా అన్నాడు...."మిత్రుడా! అలాంటి కాశీపుణ్యక్షేత్రానికి పోతూన్నాను. తోడుగా వస్తావా?" అని అడిగాడు.

ఇతడు పై చెప్పబడిన వారిలా పరిహాసాలూ - ఉచిత సలహాలూ మానేసి, "స్వామీ! రా నంటున్నానని నా మీద కోపం వహించకండి! కాశీ మార్గంలో రోగ బాధ-చోర బాధ ఎక్కువట కదా! పరలోక ప్రయాణంలో సమానమైన కాశీకి వెళ్లి తిరిగివచ్చిన వాళ్లు ఒక్కరైనా ఉన్నారా? అలాటి ప్రమాదకరమైన యాత్రకు నేను ఎలా తోడు రాగలను?" అంటూ ఆ ప్రయాణం తల్చుకుంటూనే తత్తరపడిపోయాడు. ఇటువంటి వారి వల్ల కాదని కొంత ధైర్యస్థుడైనవాడ్ని చేరి, మణిసిద్ధయతీంద్రుడు ఇలా అన్నాడు.

"వత్సా! తీర్థయాత్రల వల్ల కలిగే పుణ్యం ఇంతా-అంతా కాదు. దానివల్ల కలిగేటంత పుణ్యం మరి దేనివల్లనూ కలగదు. గంగ-భైరవుడు, అన్నపూర్ణ -మణికర్ణికా ఘట్టం.....ఇలా కాశీలో ప్రతీదీ చూడదగ్గ విశేషమే! తోడు రాగలవా?" అనడంతో, అతడు అదోలా ముఖం పెట్టి "స్వామీ! ఈ కాశీప్రయాణం మాకు అచ్చిరాలేదు. వెనుకటికి మా తాత, ఎంతో వృద్ధుడు, ఎవరి ప్రేరణ వల్లనో గాని కాశీ ప్రయాణం పెట్టుకుని నానాపాట్లు పడ్డాడు. అప్పుడు తాను పడిన కష్టాలన్నీ నాతో చెప్పాడు. ఆ కథ వింటే ఈ ప్రయాణానికి ఎవరూ సాహసించరు. ఆ కథ వినండి....

ఎవరో ప్రోత్సహించిన మీదట, మా తాత ఇంటి పట్టున సుఖంగా ఉండలేక కాబోలు కాశీ అనే రాకాశి పురానికి ఉత్సాహంగా కొందర్ని తోడు తీసుకుని బయల్దేరాడట! బయల్దేరేటప్పుడే దారిలో స్వయంగా వంటచేసుకోవడానికి కావలసిన సంభారాలు, బట్టలు, కొంత సొమ్ము తీసుకుని పూటకు రెండు యోజనాల నడకచొప్పున ప్రయాణమై వెళ్తున్నారట! ఆయన మహానియమాలున్న మనిషి లెండి! సత్రాల్లో ఎక్కడా తినడు. రాత్రి సాధారణంగా అభోజనమే! మధ్యాహ్నం వేళకు ఏ ఊరైనా చేరుకుంటే అక్కడ అన్నం వండుకొని తిని, ఎండ తగ్గేవరకు విశ్రమించి మళ్లీ ప్రయాణమయ్యేవాడు.

సరే! ఇలా నడుస్తూన్న వాళ్లు కాస్తా ఆయాసం వల్ల నడకలో వేగం తగ్గి, పదిరోజులయ్యేసరికి పూటకో యోజనం మేరకు పడిపోయిందా వేగం. (యోజనం

అంటే ఈనాటి దూరమానం ప్రకారం దాదాపు 10 కి.మీ) అయినా పట్టుదల కొద్దీ ముందుకు సాగుతూంటే, ఓనాటి తెల్లవారు ఝామున వచ్చిన అసాధారణమైన గాలివాన జల్లు వాళ్లందర్నీ తడిపి ముద్ద చేసేసింది. ఎలాగో తడిగుడ్డల్ని పిండుకొని-గాలివాన అణిగేదాకా దట్టమైన చెట్టు నీడన ఆగి, తిరిగి నడక మొదలెట్టగా నాలుగడుగులు నడిచారో - యమకింకరుల్ని తలదన్నేలాటి దొంగలు "దుడ్డుకర్రల్తో బాదమంటారా? మీ దగ్గరున్న మూటలు ఇస్తారా?' అని బెదిరించేసరికి, వాళ్లు కిక్కురుమనకుండా మూటలు వాళ్ల పరం చేసి, కట్టుగుడ్డల్తో మిగిలారు. ప్రయాణంలో భారంగా ఉండే మూటల్లేకపోవడంతో, ఆ రోజు ప్రయాణం చాలా తేలిగ్గా సాగిందట! సాయంత్రానికి ఒక ఊరు చేరి, అక్కడ గ్రామస్తులకు తమ ప్రయాస అంతా చెప్పి కావలసిన పాత్రలూ - వంటక్కావలసిన సంభారాలు సేకరించి అర్ధరాత్రికి ఎలాగో భుజించారు.

వేళతప్పి ఆహారం తీసుకోవడం, వర్షంలో కొంత తడిసినందువల్ల కలిగిన గాలి మార్పు ప్రభావం, ఇతర కారణాలు అన్నీ కలిసి వాళ్లలో కొందరికి అతిసార రోగం (విరేచనాలు) పట్టుకొనేసరికి, సత్రం వాళ్లు వారిని వెళ్లగొట్టారు. అందుక్కారణం- ఆ సత్రంలో రోగం-రొష్టూ ఉన్న వాళ్లని ఉండనివ్వకపోవడమే! వెళ్లగొట్టిన తర్వాత వీళ్లు ఎక్కువ దూరం పోలేక, మసీదు చేరుకున్నారు. అది తెలిసి తురకలు త్వరగా అక్కడికొచ్చి, ఆ రోగుల్ని నడివీధిలో ఈడ్చి చావగొట్టారు. తెలీక - కొంతమంది అక్కడున్న ఊరిచెరువులో బట్టలు ఉతుక్కోవడం వల్ల అధికార ధిక్కారం చేశారని రాజభటులొచ్చి శిక్షించారు. ఇట్లా ఆ వూళ్ళో పదిరోజులు ఉండవలసి వచ్చింది. మా తాత వెంట వెళ్లిన వారిలో కొంతమంది దెబ్బలబాధ, మరికొందరికి రాజభటుల శిక్ష బాధ కలగడంతో కాశీయాత్రంటే విరక్తి కలిగింది. ఎలాగో కొద్దిగా జవసత్త్వాలు సమకూరిన తర్వాత మా తాత "ఛీ! కాశి అంటే అదో రాకాశి అని తెలిపి బుద్ధి మాలి ఇలా బయల్దేరాం! జ్ఞానం ఉన్నవాళ్లకి మోక్షం ఇంటి దగ్గరున్నా కలగకపోదు. కాశీ వెళ్లే మోక్షం పొందక్కర్లేదు. జ్ఞానం లేనప్పుడు-నీటి కాకులు మునిగినట్లు ఎన్ని తీర్థాల్లో మునిగినా ఒకటే! అపరాధుల్లాగ కారాగారంలో పడ్డాం! మహ్మదీయుల చేత దెబ్బలు తిన్నాం! కడజాతి వాళ్ల చేత ఈడ్పించుకోబడ్డాం! అయ్యయ్యో! ఈ కష్టాలు తల్చుకుంటూంటే గుండె పగిలిపోతోంది. బ్రతికుంటే పుణ్యం సంపాదించుకోడానికి చాలా మార్గాలే ఉన్నాయి. ఇంటికి పోదాం పదండి"

అని మా తాతగారు అనగా, ఆయన బోధ తలకెక్కిన వాళ్లు ఆపై ప్రయాణం విరమించుకుని వెనక్కు వచ్చారు. కొందరు ఆయన మాట పాటించక, ముందుకు సాగిపోయారు.

మా తాతగారు, మరికొందరు ఆరుమాసాలకు ఇల్లు చేరుకుని, ఆ తర్వాత ఇంకో మూడు నెలలకు గాని తిరిగి మామూలుగా తిరగలేకపోయారు. కాశీకి పోయిన పదిమందిలోను ఎనిమిది మంది దార్లోనే మరణిస్తే, ఇద్దరు అతి కష్టం మీద కాశీ చేరారట! తిరిగొస్తూ దార్లో వారు కూడా మృతి చెందారని ఇతరుల ద్వారా చాలాకాలానికి తెలిసిందట!

ఈ కథ మా తాతగారెప్పుడూ మాకు చెప్తూండేవారు" అని ముగించాడు అతడు. "అద్దిరా! బుద్ధిమంతుడివే! రానని ఒక్కమాట చెప్తే సరిపోయేదానికి ఇంత కథ చెప్పావు" అని పలికి, అతడ్ని వదిలి ఇంకొక వ్యక్తి దగ్గరకు వెళ్లి, తన ఆలోచన చెప్పగా ఆ వ్యక్తి కూడా కాశీప్రయాణం పట్ల నిరుత్సాహాన్నే ప్రకటించాడు.

ఇట్లా అడిగినవాళ్లందరి చేతా అనంగీకారం ఎదురయ్యేసరికి - ఎవరి దగ్గర కాశీ ప్రయాణం ఊసెత్తితే వారంతా మందలిస్తూండేసరికి మణిసిద్ధునికి పరితాపం అధికమైంది. "అయ్యో దైవమా! నేనేం పాపం చేసుకున్నాను. కాశీ విశ్వనాథుని దర్శనం; గంగాస్నానం ఫలితం, అన్నపూర్ణాదేవి ప్రసాదం పూర్వపుణ్యవశాన గాని లభించవంటారే! ఈశ్వరానుగ్రహం ఎలా ఉందో? సాటి బ్రాహ్మణులెందరో కాదంటే కాదనవచ్చు గాక! ఇతర జాతుల వారినీ అడిగి చూస్తాను!" అనుకుని, ఈశ్వరానుగ్రహం ఉంటే ఎవరో ఒకరు ఒప్పుకోకపోతారా అని ఆశపడి కనబడ్డ వాళ్లందర్నీ "కాశీ వస్తారా?" అంటూ అడుగుతూ వెర్రివాడిలా తిరగసాగాడు. తమ ఊళ్లోనే కాక, చుట్టు ప్రక్కల ఊళ్లన్నీ కూడా యాత్రా సహాయకుడి కోసం అన్వేషిస్తూ శ్రీరంగపురం అనే ఊరికి దగ్గరగా ఉన్న చిట్టడవిని చేరుకున్నాడు. అక్కడ ఒక చోట 'తలకు, చెవులకు అడవిపూలు అలంకారంగా ధరించి, పొగరెక్కిన ఆబోతు మీద ఎక్కి దాన్ని విచిత్రగతులతో నడిపిస్తూ పశువులను అదిలిస్తూ, పిల్లనగ్రోవి ఊది పొదల్లో దూరిన పశువుల్ని మళ్లీ మందలో చేరేలా చేస్తూ, భుజం మీద ఓ పొడుగాటి కఱ్ఱ ధరించిన

పశువుల కాపరిని చూశాడు. వాడ్ని "ఓరీ! ఎవడవురా? ఇటు రారా!" అని పిల్చేసరికి వాడికి తిక్కరేగి "ఏందయ్యో? ఓరి-ఓరి అంటున్నావు. నీకు నోరేమైనా తీటగా ఉందా? మాల-మాదిగననుకుంటున్నావా ఏం? మా పెద్దకాపు సైతం నన్ను అలా పిలవడు. తెలుసా?" అంటూ దగ్గరకొచ్చి మరీ అడిగాడు.

"ఓరీ అన్నంత మాత్రాన నీకు కోపం వస్తే ఎలాగరా?" అన్నాడా మణిసిద్ధుడు మళ్ళీ.

"అదిగో! రా-అంటే గాని నీకు నోటి కొవ్వు తీరదా ఏం?" అన్నాడతడు మళ్ళీ కస్సుమంటూ.

"సరే! అబ్బాయీ! నీ పేరేమిటో, కులమేమిటో చెప్పు! అలాగే పిలుస్తాను" అన్నాడు.

"ఔరా! అలాగ మొదటే చెప్పుకోవచ్చు కదా! గొల్లోళ్లు అంత లోకువా బాబూ! నా సంగతి తర్వాత నీ పేరూ-కులమూ ముందుగా చెప్పు మరి!" అన్నాడు. (ఇక్కడ నుంచి గొల్లవాని మాటలు గ్రామ్యభాషలో ఉంటాయి)

"నా పేరు మణిసిద్ధుడు. నా కాపురం కొల్లాపురం. బ్రాహ్మణుడిని".

"నీవు భేమ్మడవైతే బోడిగుండేమి? మా భేమ్మడి లాగున లేవేమి?" అన్నాడు పరిశీలనగా చూస్తూ.

"మీ బ్రాహ్మణుడు ఎలా ఉన్నాడో చెప్పు!"

"మా భేమ్మన గురువులోడికి ఈతరుప్పలా జుట్టు-పొలిమేర రాతిమీద వేసిన కొంగరెట్ట లాటి బొట్టు - మెడమీద చేపమీసాల వంటి దారాలు వేసుకుని, వొంకర బూరాలతో యేటి కొకమారు వచ్చి ఎవర్నో ఒకర్ని తెగకాల్చి మరీ వెళ్తాడు. వాడి లాగున నీవే లేవేమి?"

"ఓహో!వారా? వారు వైష్ణవులు. మేము వైదికులము."

"వ(అ)యిదికులకు బుజమ్మీద దారాలు ఉండవా?"

"అవి దారాలు కాదు. యజ్ఞోపవీతాలు. బ్రాహ్మణుల్లో నేను సన్యాసిని గనుక ఉండవు."

"సన్యాసి అంటే తప్పు మాట కాదండీ?"

ఆశ్చర్యపోయి "తప్పా? అలా అని నీకెవరు చెప్పారు?" అన్నాడు మణిసిద్ధుడు.

"నేనేదైనా తప్పు  చేసినపుడు మా పెదకాపు నన్ను 'సన్నాసి వెధవ-సన్నాసి వెధవ' అని తిట్టేవాడు. అందుకని తప్పు కాబోలు అనుకున్నాను".

"సన్యాసి అంటే - పెళ్లాం బిడ్డలు లేనివాడు. ఒంటరిగా తిరిగేవాడు అని అర్థం! అన్ని సంగమాలు విడిచినవాడు సన్యాసి"

వాడు పళ్లికిలిస్తూ ''అన్ని సంగాలు అంటున్నారు. స్త్రీ సంగమం.....అదే ఆడదాని పొందు కూడానంబడీ?" అన్నాడు.

"మేము అసలు పెళ్లే చేసుకోలేదు" అన్నాడు మణిసిద్ధుడు దర్పంగా.

"అయితే బోగం పిల్లని ఉంచుకున్నారా ఏమిటి?"

''వాళ్లని వేంము చూడనైనా చూడము. కామమును జయించినవాళ్లమురా!"

''అదిగో! 'నీ' - 'రా' మాత్రం వదలవు'' గొల్లవాడు చిన్నబుచ్చుకున్నాడు.

''అబ్బబ్బ! పొరపాటున వచ్చిందిలే! పోనీ! ఈ మాటలతో సరిపోయింది. నీదే ఊరు? ఏం పేరు? ఏ కులం?

" నా పేరు కోటప్ప. ఇదిగో - ఈ అడవి దాపునే ఉన్న శ్రీరంగపురం మా వూరు. గోపకులం. అంటే గొల్లోళ్ల చిన్నవాణ్ణి అన్నమాట!

"మరి- నీకు తల్లిదండ్రులున్నారా?"

"లేరు! చిన్నప్పుడే పోయారట!

"మరెవరి దగ్గర ఉంటున్నావు?"

"శ్రీరంగం పెదకాపు గారి దగ్గర"

"ఏమి పెడుతున్నాడు? ఏం ఇస్తున్నాడు?"

"అన్నం - బట్ట ఇస్తూ నన్ను చూస్తున్నది ఆయనే! ఇదంతా వాళ్ల పొలమే!" అని చిట్టడవి దాపున ఉన్న పొలం చూపించాడు. అది చాలా విశాలంగా ఉంది.

"వాళ్లింటికి వెళ్లండి! మీకు మంచి స్వయంపాకం ఇస్తారు" అని అడక్కుండానే చెప్పాడు. ( ఈ మాటను బట్టి ఆ కోటప్ప అనే గొల్లవాడు అమాయకుడనీ, పరోపకార బుద్ధి కలిగినవాడనీ అర్థం చేసుకున్నాడు. తోడు రమ్మంటే- రావచ్చేమో! అనిపించింది- మణిసిద్ధుడికి.)

"నీకు పెళ్లైందా?"

"కాలేదు"

"కోటప్పా! నిన్నొకటి కోరతాను. అది చేస్తే నాకు ఉపకారం అవుతుంది".

"నేను మీకు చేసే ఉపకార మేమిటండోయ్?"

"నేను కాశీ వెళ్తున్నాను. అది మహాపుణ్యభూమి. అక్కడకు పోయి గంగలో స్నానం చేసి, విశ్వనాధుని దర్శించి ఒక్కరాత్రి అక్కడ నివశించినా, మళ్లీ జన్మంలో మహారాజై పుడతారట! మనుషులు, పక్షులు, మృగాలు, చివరికి పురుగులు సైతం గంగలో మునిగితే ముక్తి ఖాయం."

"అలాగా!"

"అంతటి మహాత్మ్యం ఉన్న కాశీ దర్శించాలని నాకు కుతూహలం! ఒంటరిగా వెళ్లకూడదు కనుక, నాకు తోడు వచ్చావంటే - మీ పెదకాపు ఇచ్చినట్లే నీకు అన్నవస్త్రాలిచ్చి, ఏం అడిగితే అది ఇచ్చి చిత్రమైన కథలు కూడా చెబుతాను!" అది సరేగాని, నువ్వు ఇదివరకు ఏమైనా కథలు విన్నావా?"

కథలంటే ఎంతో ఇష్టం గోపకునికి. కోటప్ప అంతకు ముందు పల్లెటూళ్లో

చెప్పుకొనే ఒకటి రెండు కథలు వినడమే తప్ప, విశేషం - అత్యద్భుతం అయిన కథలను విన్నవాడు కాదు. అందుకే మణిసిద్ధుని ప్రశ్నకు "ఏమిటో పాండవ కథలంటే, పంది (వరహావతార) కథంటే, కాంవమ్మ కథంటే.....ఇలాటివే కాని, మరి వినలేదు" అని నిజాయితీగా చెప్పేశాడు.

"అలాగా! మరి - నేను చెప్పినది నీవు జ్ఞాపకం ఉంచుకోగలవా?" అడిగాడు మణిసిద్ధుడు.

"నాకు కథలంటే మహాఇష్టం! తెలిసేలాగ చెప్తే జ్ఞాపకం ఉంచుకోగలను. కాని గొడవ గొడవగాను, పెద్ద పెద్ద మాటలతోను చెప్తే జ్ఞాపకం మాట అట్లా ఉంచి, అర్థమే కాదు నాకు",

"ఓహో! అలాగా!" అని, ఇకముందు వీడికి నేను చెప్పబోయే కథ లేవైనా వీడు మర్చిపోకుండా - అర్థం చేసుకోగలిగేలా ఉండుగాక!" అని వాడి శిరస్సు మీద కుడిచెయ్యి ఆన్చి గ్రహణ శక్తి సంపూర్ణంగా కలిగించి కాశీమహాత్మ్యపు కథను ఇలా చెప్పసాగాడు....

## కాశీ మహిమ తెలుపు కథ

గోపా! వినుము-

పూర్వం త్రిలోక సంచారి అయిన నారదుడు తీర్థయాత్రలు చేస్తూ ఎన్నో పుణ్యక్షేత్రాలలో వున్న నదుల్లో స్నానం చేస్తూ ఒకసారి వింధ్య పర్వతప్రాంతాల్లో ఉన్న అడవి దగ్గరకు వచ్చాడు. అక్కడ కోకిలలు-చిలుకల పలుకులకు, పాటలకు, మధుర ఫలాలతో నిండి వున్న చెట్ల నుంచి వీచే చల్లని గాలులకు ఆహ్లాదం చెందుతూండగా వింధ్యాచలరాజు జంగం రూపంలో ఎదురేగి, ఆ దేవమునికి స్వాగతం పలికి, అర్ఘ్యపాద్యాదులు సమర్పించాడు. సత్కారాలైన తరువాత విశ్రమించి ఉండగా "మునీంద్రా! నాకో సందేహం! లోకంలో లెక్కకే రాని కొండలెన్నో ఉన్నాయి. అవి వదిలేయండి! ఇప్పటికి అన్నిట్లోను నాకు సాటి వస్తూ మేటి అనిపించుకున్న వాటిలో హటకాచలం ఒక్కటే! తాము పక్షపాతం లేకుండా ఆ మేరు పర్వతం

గొప్పదో – నేను గొప్పవాడినో మీరు సమర్థులు కనుక చెప్పి తీరాలి” అని కోరాడు.

అప్పుడు నారదుడు కొద్దిసేపు మౌనం వహించి, ఉస్సురని నిట్టూర్చి “అడిగావూ? ఆ మధ్య నేను మేరు పర్వతాన్ని సందర్శించాను. అప్పుడా పర్వతం తన కెవరూ సాటి లేరని చెప్పింది. మీ ఇద్దరికీ గల తేడా ఎవరికైనా చెప్ప తరమా?” అని ఆ కలహాల మారి వెళ్లిపోయాడక్కడ్నుంచి.

ఆ మాటకు వింధ్యాచలం కలత చెంది “మేరువు కింత గర్వమా?! దాని గర్వం ఇప్పుడే అణగద్రొక్కుతాను” అని అసాధారణంగా పైకి పెరిగింది. దాంతో సూర్య–చంద్ర గతులకు ఆటంకం కలిగింది. ఫలితంగా కొన్ని దేశాల్లో చీకటి, కొన్ని దేశాల్లో ఎండ, కొంత భూభాగం మంచు, కొన్ని ప్రాంతాల్లో చీడపీడల బాధ అధికం అయ్యాయి.

ఒక భూలోక పర్వతం వలన ఈ విధంగా సమతుల్యత దెబ్బతీయడంతో, ముల్లోకాలకు అధిపతి అయిన ఇంద్రుడు ఆలోచనలో పడ్డాడు. ఇంతలో దేవతలు కూడా అక్కడకొచ్చి వింధ్యపర్వతరాజు ఆగడాన్ని విన్నవించుకున్నారు. “ఈ విపరీతం చక్కబడాలంటే, అది అగస్త్యునికే సాధ్యం! అతడు తన భార్య అయిన లోపాముద్రతో సహా కాశీలో కాపురం చేస్తున్నాడు. గొప్ప ద్రవిడ భాషాభిమాని. మహాశివ భక్తుడు. వింధ్యుణ్ణి వంచడం ఆ మహర్షికి మాత్రమే సాధ్యం” అన్నాడు.

అప్పుడు దేవతలంతా కాశీ చేరుకున్నారు.” అని మణిసిద్ధుడు కాస్త ఆగి “గోపాలా! ఇంతవరకు కథ అర్థం అయిందా?” అని ప్రశ్నించాడు.

గోపుడు ఆనందంగా తలూపుతూ “బాగానే బోధపడింది. కానీ నాకొక సందేహం! కొండలూ–బండలూ ఎక్కడైనా మనుషుల్లా మాట్లాడడం, వాటి ఇష్టం వచ్చినట్లు అవి పెరిగిపోవడం ఏమిటి? వింతగా ఉంది” అన్నాడు.

“మంచి ప్రశ్నే వేశావు. దీన్ని బట్టి కథ నువ్వు శ్రద్ధగా విని, అర్థం చేసుకుంటున్నావనిపిస్తోంది. చెప్తాను – విను! భూలోకంలోని కొన్ని గొప్ప పర్వతాలకు రూపధారణశక్తి ఉంది. అవి భార్యాపుత్రులతో కాపురాలు

చేస్తూవున్నట్లుగా కూడ గ్రంథాల్లో రాయబడి ఉంది. హిమాచలం సంగతి నీకు తెలిసే ఉంటుంది. శివుడ్ని పెళ్లాడిన పార్వతి ఆ హిమవత్పర్వతరాజు కూతురే అని ఆ కథ నువ్వు వినే ఉంటావు. వింధ్యపర్వతం కూడ ఆ కోవలోనిదే!" అని వివరించాడు.

"ఓహో! అట్లా అన్నమాట! తెలిసింది" అన్నాడు గోపాలుడు.

"తర్వాత కథ విను! ఇంద్రాది దేవతలంతా కాశీ వెళ్లారు. వింధ్యరాజు కారణంగా కాశీ చూసే భాగ్యం కలిగిందనుకుంటూ సంతోషంగా గంగాస్నానం విశ్వనాథుని దర్శనం చేసుకుని, అన్నపూర్ణను అర్చించి, భైరవాదుల పాదాలకు మొక్కులిడి, కాశీలో వెలసిన సకల శివలింగాలనూ ఆరాధించి, అగస్త్యుని ఆశ్రమాన్ని వెతుక్కుంటూ – దేవతా గణాలు ఆయన ఆశ్రమాన్ని చేరుకున్నారు.

దేవలోక వాసులు తన కోసం వెతుక్కుంటూ రావడం ఆ మహర్షికి మహదానందాన్ని కలిగించింది. అగస్త్యుడు వాళ్లందరికీ స్వాగత సత్కారాలు చేశాడు. వారికి దర్భాసనాలు అమర్చాడు. అందరూ స్థిరంగా కూర్చున్నాక చేతులు జోడించి, వారి రాకకు కారణం అడిగాడు. అప్పుడు దేవతలంతా విషయం చెప్పమన్నట్లుగా బృహస్పతి వైపు చూశారు. అప్పుడాయన వింధ్యరాజు వల్ల ఏర్పడిన ఉపద్రవాన్ని చెప్పి కాపాడవలసిందిగా ప్రార్థించారు. అగస్త్యుడు సరేనని వాళ్లను పంపించేశాడు.

కాశీ నివాసానికి అంతరాయం కలిగినందుకు చింతిస్తూ "మనం ఈ పురంలో కాపురం ఉంటూ ఎంతో సుఖంగా గడుపుతూన్నాం! నా ఉనికిని దేవతలెలా గ్రహించారో గాని, నన్ను మొహమాటపెట్టారు. మన సుఖానికి అంతరాయం కలిగించారు. నా గొప్పదనమే నాకు ఇంత ముప్పు తెచ్చింది. ఇదంతా నా కర్మఫలం. దేవతల ప్రతిపాదనకు ఒప్పుకోవద్దని నువ్వయినా చెప్పావు కావు..." అని భార్యతో సహా ప్రయాణసన్నాహాలు చేసుకున్నాడు అగస్త్యుడు.

కాశీపురానికి ముమ్మారు ప్రదక్షిణలు చేసి "గంగా భవానీ! నీ చల్లని నీడ విడిచి; పై దేశం పోతున్నాను. అనుజ్ఞ ఇప్పించు! అన్నపూర్ణా! నీ చేతి భిక్ష వదులుకుని ఇంకో చోటుకు పోతున్నాను. దయచూడు! తల్లీ!" అంటూ అక్కడి దేవతలనందరినీ పేరు పేరునా ప్రార్థించాడు. కానీ అతడికి కాశీని వదిలి వెళ్లడానికి కాళ్లు రావడం లేదు. అయినా తప్పదు".

ఇలా మణిసిద్ధుడు చెప్తూండగానే, గోపాలుడు "అయ్యా! ఆ వూరు వదలడానికి ఆయనకు అంత బాధ దేనికి? పని పూర్తయ్యాక తిరిగి రాకుండా అక్కడే ఉండిపోతాడా ఏం?" అని అడిగాడు. "నీ ప్రశ్నకు జవాబు ముందరి కథయే చెప్తుందిలే! విను" అంటూ మళ్లీ చెప్పసాగాడు మణిసిద్ధుడు.

"అట్లా భార్యా సమేతుడై, అగస్త్యుడు వింధ్యరాజు దగ్గరకు వెళ్లేసరికి, ఆ వింధ్యుడు గర్వం విడిచి గురుభక్తితో వంగి వినయంగా అగస్త్యునికి పాదాభివందనం చేశాడు. వింధ్యపర్వతరాజు అలా తగ్గేసరికి సూర్యచంద్రుల గమనానికి అవరోధం తొలగింది. లోకోపద్రవాలన్నీ అణిగిపోయాయి. అంతట ఆ మునివరేణ్యుడు కూడ "వత్సా! మేము దక్షిణదేశ యాత్ర నిమిత్తం వెళ్తున్నవాళ్లం! మేం వచ్చేదాకా నువ్వు ఈ తీరుగానే వంగి ఉండు! అలాక్కాక నువ్వు నిక్కి నిగిడితే, నీ పని చెప్తా! నా తపఃప్రభావానికి గురి కావలసి వుంటుంది" అన్నాడు. లోపాముద్రా సహితుడై దక్షిణ దేశాభిముఖంగా వెళ్లిపోయాడు. అందువల్లనే అతడు తిరిగి కాశీ వెళ్లలేకపోయాడు. వింధ్యుణ్ణి యధాతథరీతిలోనే ప్రతిష్ఠించినవాడైనాడు అగస్త్యుడు". -

"తర్వాత ఏం చేశాడు?" అని కుతూహలంగా అడిగాడు గోపాలుడు. తిరిగి చెప్పసాగాడు.

"భద్రాచలం, పుష్పాచలం, ధవళాచలం మొదలైన పర్వతక్షేత్రాలన్నీ తిరిగి శ్రీశైలం చేరాడు. ఆ శ్రీశైల క్షేత్రం యొక్క గొప్పదనాన్ని లోపాముద్రకు వివరిస్తూ "మల్లికార్జునుడిక్కడ భ్రమరాంబాదేవితో ఏకాంతంగా విహరిస్తుంటాడు. ఈ పర్వతం నుంచే పాతాళగంగ పేరిట కృష్ణానది ప్రవహిస్తూంటుంది. ఈ శ్రీశైల శిఖరాల మీద రకరకాల ఓషధులు, నిధులు, పుణ్యతీర్థాలు, మహాలింగాలు, మృగాలు ఎన్నెన్నో కనిపిస్తాయి. ఇక్కడున్న

రాళ్లన్నీ శివలింగాలే! అక్కడుండే చెంచులందరూ మహర్షులే!" అన్నాడు అగస్త్యుడు.

లోపాముద్ర భర్తకు నమస్కరించి "స్వామీ!...దర్శన మాత్రం చేతనే ముక్తి ప్రదమైన ఈ క్షేత్రం ఉండగా, మరణించాక గాని మోక్షం ఇవ్వని కాశీకి వెళ్లి కష్టాలు పడటం దేనికి? మీరు పాతాళగంగా స్నానంతో కాశీవియోగ సంతాపాన్ని చల్లార్చుకుంటూ ఇక్కడే సుఖంగా ఉండొచ్చుకదా!" అని సందేహం వెలిబుచ్చగా, అగస్త్యుడు ఆమెను మెచ్చుకుంటూ, ఒక ఇతిహాసం ద్వారా నీ సందేహానికి సమాధానం వివరిస్తాను" అంటూ శివశర్మ అనే బ్రాహ్మణుని కథను సందర్భానుసారం చెప్పాడు.

## శివశర్మ కథ

మధుర అనే పట్నంలో శివశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. సమస్త విద్యల్లోను ప్రవీణుడైన అతడు పండితరాజు అనే బిరుదు పొందాడు. ఎంతో మంది పుత్రుల్ని కన్నాడు. యవ్వనం గతించి వృద్ధాప్యం చేరువవుతూ ఉండగా "ఇంతవరకూ ఐహిక సుఖాల కోసం కాలాన్ని వ్యయం చేసుకున్నాను. కొద్దిగానైనా ఆముష్మికం సంపాదించుకోలేకపోయాను. సిరిసంపదలు అశాశ్వతాలు. ఈ శరీరం చంచలమైంది. అన్నీ తెలిసి కూడా అజ్ఞానంలో ఉండిపోయాను. ఇప్పటికైనా తెలుసుకున్నాను గనుక, పుణ్య తీర్థాలు సందర్శించి జ్ఞానం సంపాదించుకుంటాను" అని నిశ్చయించుకుని, తాను సంపాదించిన సొత్తంతా కొడుకులకు పంచి ఇచ్చి, ఒక శుభముహూర్తాన ఇంటిలోనుంచి బయటపడి ఎన్నెన్నో కష్టాలతో కూడిన ప్రయాణం చేసి, కాశీ చేరుకున్నాడు.

కాశీ మహిమ గురించి అంతకు ముందే చదువుకున్న వాడవడం వల్ల, అక్కడ గంగాస్నానం – విశ్వనాథ దర్శనం మొదలైనవన్నీ చేసుకున్నాక ప్రయాగ వెళ్లాడు. ఎంతటివారనైనా ప్రయాగక్షేత్రం మూడురోజులకు మించి ఉండనీయదు. అక్కడ నుంచి గయ, ఉజ్జయిని, అయోధ్య, ద్వారవతి, హరి ద్వారాలు దర్శించాడు. హరిద్వారాన్నే మాయాపురం అని ముక్తి ద్వారం అని కూడా అంటారు.

హరిద్వారంలో గల తీర్థ దేవతల్ని – చంద్ర శేఖరుని మహానిష్ఠతో మూడురోజులు అర్చించాక, ఒక రోజు వండుకున్న ఆహారాన్ని భుజించేలోగానే అనాయాసంగా మరణించాడు. అతనికి ఊర్ధ్వలోకాలు – ముఖ్యంగా విష్ణుసాయుజ్య ప్రాప్తి లభించింది. అయితే బ్రహ్మలోకం సమీపిస్తుంటే, శివశర్మ గురించి దైవభటులు ఎంతో గొప్పగా చెప్పగా, అతడ్ని బ్రహ్మ ఈసడించినందుకు కారణం అడగ్గా, విష్ణుకింకరులు "అయ్యా! నువ్వు ఎంతో పుణ్యాత్ముడివని మేం చెప్పినప్పటికీ, నువ్వు కాశీలో ప్రాణం విడువనందుకు ఆయన పెదవి విరిచాడు. దీన్ని బట్టి కాశీలో ప్రాణం విడవని వారు ఎంత పుణ్యాత్ములైనప్పటికీ పునర్జన్మలేని ముక్తిని పొందలేరు" అని వివరించారు.

ఆ తర్వాత, శివశర్మ చాలాకాలం పాటు విష్ణులోకంలో సుఖభోగాలు అనుభవించి, రాజుగా జన్మించి, పుణ్యం ఆర్జించి, చివరకు కాశీలో దేహాన్ని విడిచిన కారణంగా, శివ సాయుజ్యం పొందాడు. అతడికిక పునర్జన్మ అన్నదే లేదు. ఇతరక్షేత్రాలకు – కాశీకి ఉన్న తేడా ఇది.

లోపాముద్రా! విన్నావు కదా! నీ సందేహం తీరిందనుకుంటాను" అని భార్యకు కాశీవాసిగా కాశీయొక్క వాసి గురించి వివరించి, తాను అక్కడ చివరిదశ గడపలేకపోయిన తన దురదృష్టానికి దుఃఖిస్తున్నానన్నాడా ఋషి.

"గోపా! కాశీ మహిమ విన్నావు కదా! ఐదు క్రోసుల వైశాల్యం గల ఈ క్షేత్రానికి గంగ ఉత్తర వాహినిగా ఉంది. అన్నపూర్ణా – విశ్వేశ్వరులు ప్రధాన దైవతాలు. బిందుమాధవస్వామి ముఖ్య క్షేత్రపాలకుడు. మనికర్ణిక ముఖ్య తీర్థ ఘట్టం. ఈ పుర మహాత్మ్యాన్ని సంక్షిప్తంగా చెప్పినా సంవత్సర కాలం చెప్పవచ్చు! ఇప్పటికే చాలా పొద్దెక్కింది. నాకు తోడుగా వచ్చేదీ రానిదీ చెప్పు!" అని అడిగాడు మణిసిద్ధుడు.

అంతవరకు ఉన్న అతిశయం, పొగరు తగ్గి ఆ గొల్లవారి చిన్నవాడు వినయవిధేయతలు ఉట్టిపడగా, మణిసిద్ధునికి వందనం చేశాడు. ఆయన వల్ల ఆ గోపకుడికి అసాధారణమైన గ్రహణశక్తి అనాయాసంగా లభించింది.

అందుకా గోపుడే ఆశ్చర్యపోయాడు. కాశీ ప్రయాణం చేసి తీరాలని ఉత్సాహంగా కూడా ఉన్నాడు. మణిసిద్ధుడు తనకు కరవుతీరా కమ్మని కథలు వినిపించగల సమర్థత ఉన్నవాడు. అది అన్నిటికంటె ముఖ్యంగా వాడ్ని కాశీప్రయాణానికి పురికొల్పింది. అదే మాటను వాడు స్పష్టంగా వ్యక్తపరిచాడు.

"అయ్యవారూ! నాకు తాము చెప్పే కథావిశేషాలు ఎంతో ఉత్సాహం కలిగిస్తున్నాయి. కాని ఒక్కటి వినండి! మొదట్నుంచీ నాకు కథలంటే ఎంతో ఇష్టం! నేను మీతో వచ్చేటప్పుడు - మధ్య దారిలో ఏదైనా ఒక వింత కనబడితే, నేను దాని గురించి ఏవైనా ప్రశ్నలడిగితే కోపగించుకోరాదు. ఆ వింత వెనుక ఉండే కథ అంతా నాకు చెప్పాలి. అలా చెప్తానంటే - ఇప్పుడే మీ మాట మీద నేను ఈ క్షణాన కాశీకి రావడానికి సిద్ధం. తీరా వచ్చాక, మీరు కథలు చెప్పనంటే అక్కడ్నుంచి అటే వెనక్కు తిరిగొచ్చేస్తా! ఇదీ నా కోరిక. దీనికి మీరు ఒప్పుకోండి. నేను మాట తప్పకుండా వస్తాను" అని వేడుకున్నాడు.

దానికా యతీంద్రుడు సంతోషంగా సమ్మతించాడు.

"గోపా! ఇదే కదా నీ కోరిక! అలాటి ప్రశ్నలు వంద వేసినా సరే! ఆ నూరింటికీ విచిత్రమైన కథలు నీకు జవాబుగా చెప్తాను. సరేనా? సందేహాలేమి పెట్టుకోకు. మీ యజమానితో కూడ ఒక మాటగా చెప్పేసి త్వరగా రా!" అనగానే, గోపాలుడా సంగతి తన కాపు యజమానికి చెప్పి ఒప్పించి, కావలసిన సామాగ్రి అంతా కావడిగా కట్టి మణిసిద్ధ యతీంద్రుని వెంట ఒక శుభముహూర్తాన కాశీకి ప్రయాణమైనాడు. . వారు త్వరగా నడుస్తూ మొదటి మజిలీ చేరుకున్నారు.



# కాశీమజిలీ కథలు

## మొదటి మజిలీ

ఆ యతిచంద్రుడు నియమంగా కాశీయాత్ర చేయదలచినవాడు కావడం వల్ల, దార్లో నడుస్తున్నప్పుడు ప్రణవ (ఓంకార) జపం చేసుకుంటాననీ - మధ్యలోన మాట్లాడకూడదనీ ముందుగానే చెప్పాడు. గొల్లవాడు ఎప్పుడైనా మర్చిపోయి ఏదో అడగబోతే, చేత్తో సైగ చేసి మాట్లాడకూడదని సూచిస్తూన్నాడు.

మొదటి మజిలీలో ఒక సత్రాన్ని చేరాకగాని అతడు మౌనం వీడలేదు. అప్పుడా గొల్లవాడితో "మనం స్వయంగా పాకం చేసుకుని భుజించగలం! అదే అన్ని విధాలా మంచిది. పాత్ర సామాగ్రి అంతా ఉంది. అరణ్యప్రాంతం గనుక ఆకులు కట్టెలకు లోటు లేదు. అవి ఈ ఊరి బయటే దొరుకుతాయి. అంగట్లో దొరకని సరుకులుండవు. కనుక వాటి గురించి చింత లేదు. వచ్చేటప్పుడే కొంతకాలానికి సరిపోయే సరుకులు కావడితో తెచ్చుకున్నందు వల్ల, వాటి అవసరం ప్రస్తుతానికి లేదు. అందుచేత - ఆకులు, కట్టెలు తీసుకురా!" అని చెప్పాడా యతి.

అడవుల్లో తిరగడం ఆ గొల్లవాడికి కొత్తేమి కాదు. గనుక వాడేమీ భయపడక ఒక్కడే వెళ్లి, కొన్ని కట్టెలు కొట్టి - కొన్ని ఆకులు కోసి మోపు కట్టి తలమీదికి ఎత్తుకుందామని పైకి చూసేసరికి, కళ్లకు కనిపించేంత దూరంలో ఒక కీలురథం వెళ్తూండడం వాడి కళ్లపడింది.

అది చూసి ఆశ్చర్యపోతూ, "ఓహో ఇదేం వింత? ఈ బండి భూమిని అంటకుండానే వెళ్తోందే! దీని సంగతేమిటో మన అయ్యవారినే అడిగి తెలుసుకోవాలి" అనుకుంటూ వడివడిగా సత్రానికి వచ్చి "అయ్యగారూ!

అంటూ కేకవేశాడు. అయ్యగారు మడికట్టుకుంటే, ఇతర జాతులవారితో మాట్లాడరు అది తెలీక వాడు ఎంత గట్టిగా అరిచినా, స్వామి మాట్లాడక పోవడంతో వాడికి అలకవచ్చింది. "ఈ కేకకు మాట్లాడకపోతే, నేనిప్పుడే ఇటే ఇట్నుంచిటే మా ఇంటికి పోతూన్నా" అంటూ నెత్తిమీద కట్టెలమోపు దభీమని అక్కడ ఎత్తేశాడు.

అప్పుడా తపస్వి ఇవతలకు వచ్చి - భోజనం చేశాక మాట్లాడతానంటూ చేత్తో సైగ చేసి, తాను త్వరగా వంట ముగించి భోజనం చేసి - గోపాలునికింత పెట్టి, ఒక చక్కని జాగా చూసుకుని విశ్రమిస్తూ - వాడ్ని పిలిచి "గోపా! నువ్వు చూసిన విశేషం ఏమిటో చెప్పు!" అనగా, వాడు ఇలా అన్నాడు.

"అయ్యా! నేను ఆకులకు వెళ్లినవుడు ఒక బండీ ఆకాశమార్గానపోతూన్నది. అందులో కొందరు స్త్రీ - పురుషులు వినోదంగా మాట్లాడుకుంటూన్నట్లు నాకు వినిపించింది. ఇది చాలా చిత్రంగా ఉంది. దాని వృత్తాంతమేమిటో చెప్పండి" అన్నాడు.

అప్పుడాయతి, తనకు సిద్ధుడిచ్చిన మాణిక్యం ముందు పెట్టుకుని ధ్యానించి, దాని ప్రభావం వల్ల ఆ వృత్తాంతమంతా తేటతెల్లంగా తెలుసు కున్నవాడై "గోపా! శౌనక మహర్షిలాగ నువ్వు కథలు బాగా వినాలని కుతూహలపడే వ్యక్తివి! కాబట్టి నీకు ఆ పేరు తగిందే! నిన్నిప్పట్నుంచీ శౌనకుడని పిలుస్తాను. సరేనా! నువ్వు చూసింది ఒక కీలురథం. కథారూపంలో చెప్తేగాని దాని విచిత్ర వృత్తాంతం నీకు అర్థం కాదు." అనేసరికి 'కథ' అనేమాట వాడికి చాలా వేడుకగా తోచింది.

అయితే - వాడు ఒకే ఒక్క మనవి చేసుకున్నాడు. "అయ్యా! మీరు ఆ కథ చెప్పేటప్పుడు గూడార్థాలున్నవీ - పెద్ద పెద్ద సంస్కృత పదాలూ - నోరు తిరగనంత కఠినమైన మాటలూ వాడారంటే నాకు గ్రహించడానికి చాలా కష్టం! మీ దయవల్ల అర్థం చేసుకోగలిగినంత గ్రహణశక్తి అలవడింది. కాని నేను ఎన్నడూ ఎరగని పదాలు వాడితే నాకు తికమకగా ఉంటుంది. కనుక అర్థమయ్యే భాషలో చెప్పి, నా ఈ చిన్న కోరిక మన్నించండి" అనడంతో సరేనని తల ఊపి, ఆ యతీంద్రుడిలా చెప్పసాగాడు.....

# శూరసేన మహారాజు కథ

కాశ్మీరదేశంలో మధుర అనే పట్టణంలో ఉంది. దాన్ని ధార్మికుడు, నీతిమంతుడు, వివేక వినయశీలుడు అయిన శూరసేనుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి వినయనిధి అనే మంత్రి, కళానిధి అనే పురోహితుడు రాచకార్యాలలోను - ప్రజల సంక్షేమ వ్యవహారాల్లోను సహకరిస్తూన్నారు. ఆ రాజు దేవబ్రాహ్మణ భక్తిపరుడు. కనుకనే పురోహితుని రాజ్యవ్యవహారాల్లో సంప్రదిస్తూ, ప్రజాపాలనలో మంత్రాలకు కూడా ప్రాముఖ్యత ఉందని నమ్మేవాడు. వర్తకుడు, యంత్రరచనా నిపుణుడైన ఒక కళాకారుడు కూడ శూరసేనుని రాజ్యవ్యవహారాల్లో సహకరించేవారు. రాజు - మంత్రి - పురోహితుడు - వర్తకుడు - కళాకారుడు ఈ ఐదుగురు రాజ్యం అనే దేహానికి పంచప్రాణాల్లా ఏ కొరతాలేని రీతిలో పరిపాలిస్తున్నారు.

ఒక వసంతకాలంలో సాయంకాలం రాజ భవన పైభాగాన మేడమీద చల్లని పిల్ల వాయువులు సుగంధాలు మోసుకొస్తూండగా ఆ ఆహ్లాదకరమైన వాతావరణంలో ఈ నలుగురితోను శూరసేనుడు కొలువుతీరాడు. వినయనిధికి రాజు ఆంతర్యం గ్రహించడం వెన్నతో పెట్టిన విద్య. ప్రభువు మనస్సులో ఏదో విచారం ఉందని వినయనిధి ఇట్టే గ్రహించేశాడా రోజు. ఆ విషయమే రాజుని అడుగుతూ "ప్రభూ! మీరెందుకో ఈ రోజు విచారంగా ఉన్నారు. ఏ పనినైనా సాధించగల మేముండగా కూడా మీకు చింత దేనికి?" అని అడిగేశాడు.

అందుకు రాజు ఒక నిట్టూర్పు విడిచి " నాకు విచారం దేనికి? ఉన్నలోటల్లా ఒక్కటే ! అయితే, నేడు మన ఆస్థానానికి వచ్చిన ఒక వార్తాపత్రిక వల్ల, నాకు ఇంతకుముందు లేని విచారం ఒకటి ఆవరించింది. ఒక కోటీశ్వరుడు అకాల మరణం చెందాడు. అతడికి సంతానం గాని - బంధువర్గం అని చెప్పుకోదగ్గ దగ్గరి రక్త సంబంధీకులు గాని లేరు. మరణశాసనం రాయకపోవడంతో ఆస్తి అంతా ప్రభుత్వ పరమైందంటూ ఆ గ్రామాధికారి పంపిన పత్రిక మీకూ తెలిసిందే!

అది చూశాక నాకు అన్పించిందేమిటంటే - సంతానం లేని వారికి ఇంతే గతి కదా! మనకీ ఇటువంటి దురవస్థ తప్పదేమో ! మన ఐదుగురిలో ఏ ఒక్కరికీ పుత్రుడు లేకపోయాడు. మన అనంతరం ఇంత రాజ్యం ఎవరి ఆధీనం అవుతుందో అని చింతిస్తున్నాను. ఇంతేకాని నా విచారానికి మరే కారణం లేదు" అని చెప్పేసరికి, మిగతా నలుగురూ కూడ ఆ విషయమే ఆలోచించసాగారు.

కొంతసేపటికి - మంత్రి వినయనిధి "ప్రభూ! ఈ విషయమై మీరు చింతించనక్కరలేదు. పుత్రోత్పత్తికి ఎన్నో మార్గాలున్నాయి. గతంలో దశరథుడు మొదలైన ధరణీపతులు బాగా వృద్ధులైన తర్వాత కూడ పుత్రకామేష్ఠి వంటి యాగాలు చేసి సంతానం పొందారు కదా! హోమ - జప - దాన విధుల వల్ల అది అసాధ్యం కాదని నా నమ్మకం. అటువంటి సత్క్రియల గురించి మన పురోహితులు కళానిధి చెప్పగల సమర్థులు" అని ఆయనవైపు దృష్టి సారించాడు.

అప్పుడా కళానిధి "రాజా! సంతానం కోసం హోమాలు - దానాలు - తీర్థసేవ మొదలైన వెన్నో సులభమార్గాలున్నాయి. నేను అటువంటి వాటిలో మనకు అనుకూలమైనదేదో చూసి చెప్పగలను. ఒకనాడు ఇటువంటి పరిస్థితీ ఏర్పడితే - వృద్ధుడైన సాళ్వ నరసింహరాయలు బ్రాహ్మణ ప్రసాదంతోనే కదా శ్రీకృష్ణదేవరాయలను కన్నాడు" అని ఉదాహరణ చూపించగా "ఆ వృత్తాంతాన్ని మాకు తెలుపగలరు" అని శూరసేనుడు అడగ్గా, కళానిధి ఈ విధంగా చెప్పసాగాడు.....

## కృష్ణ దేవరాయల జనన కథ

ప్రసిద్ధుడైన నరసింహదేవ మహారాజుగా, ఆంధ్రదేశాన్ని పాలించి కవీంద్రుల చేత ఎన్నెన్నో కావ్యాల్ని అంకితం పుచ్చుకున్న సాళ్వ నరసింహరాయల గురించి మీరందరూ వినే ఉంటారు. ఆ వృద్ధ ప్రభువుకు ఎంతకాలానికీ సంతానం కలుగలేదు.

అప్పుడే వారి మంత్రి చాలా ఆలోచన చేసి, జ్యోతిష్యశాస్త్రంలో నిష్ణాతుల్ని రప్పించి "దైవజ్ఞ శబ్దానికి సార్థకత కలిగించగలిగిన మీవంటి

మహనీయులతో ఒక పని పడింది. మీకు భూత భవిష్యత్ వర్తమానకాలాలు మూడూ తెలిసినవే కనుక - ప్రాచీన జ్యోతిష్యగ్రంథాన్ని పరిశీలించి, రాజుగారి జాతకానికి అనుగుణంగా ఉండే కాలగమనం అనుసరించి వారికి సంతానయోగం కలిగే మార్గం చెప్పండి" అన్నాడు.

అప్పుడా సిద్ధాంతులంతా ఆరుమాసాల వ్యవధి కోరారు. ఇళ్లకు వెళ్లి అంతవరకు తాము ఎన్నడూ తిరగేయని శాస్త్ర గ్రంథాలు సైతం తిరగేశారు. ఒక పురాతన జ్యోతిష్య గ్రంథంలో సంతాన జనన సూచక విషయం కనిపించింది.

దాని ప్రకారం - ఆ సంవత్సరం మాఘ, బహుళ చతుర్ధశీ భానువారం నాటి రాత్రి తులాలగ్నం రెండు ఘడియలు భుక్తి జరిగిన వెనుక ఆ గ్రామానికి ఉత్తరదిశగా రెండుక్రోసుల దూరంలో ఆకాశం నుండి ఒక నక్షత్రం భూమ్మీద పడుతుందని సిద్ధాంతులు గ్రహించారు. దానిని పుత్రోత్పత్తి కారణంగా తెలుసుకుని, ఆ నక్షత్రాన్ని ఒక కలశంలోని నీటిలోనికి పట్టి, ఆ జలాన్ని తీసుకుంటే పుత్రుడు జన్మిస్తాడని మంత్రిగారికి తెలిపారు.

మంత్రి ఆ స్థలంలో ఎత్తుగా ఒక మంచె కట్టించి, దానికి తగ్గ మెట్లు ఏర్పాటు చేసి, మహాశివరాత్రి పర్వదినాన ఉపవాసం చేసే శక్తి గల్గిన వృద్ధ పండితుని దానిమీదకు చేర్చడంతోపాటు పవిత్రోదకంతో నింపిన బంగారు కలశాన్ని అతని చేతికిచ్చారు. రాజు, మంత్రులు, సామంతులు, పౌరులు, గ్రామగ్రామాలవారు ఎందరో నక్షత్ర దర్శనానికి విచ్చేసి, రెప్పవాల్చకుండా ఆకాశం కేసి చూడసాగారు. ఆ సిద్ధాంతులు చెప్పిన వేళకు మిరుమిట్లు గొల్పుతూ ఒక నక్షత్రం బ్రాహ్మణుని చేతిలో ఉన్న కలశంలోనికి తళుకుమంటూ జారింది. మంత్రి ఎంతో సంతోషించి వారి ప్రతిభను రాజుగారికి విన్నవించగా, నరసింహరాయలు ఆ దైవజ్ఞ సమితికి చాలా అగ్రహారాలు బహుమతిగా ఇచ్చాడు.

తర్వాత ఆ కలశంలోని నీటిని రాజు గ్రహించి, తన చిన్న భార్యను పడక సుఖం అందించవలసిందిగా కోరగా - ఆమె కాన్పు వల్ల యవ్వనం

జారిపోతుందని భయం చేత తనకు బదులుగా తన దాసిని తనలాగానే అలంకరించి ఆ ముసలి రాజును వంచించింది.

పవిత్రకలశోదకం ఆమెక్కూడా కొంత పోసి, నరసింహరాయలు ఆమెతో రతి సుఖం అనుభవించాడు. ఆ తర్వాత కొంతసేపటికెప్పుడో, ఆమె దాసీ అని తెలుసుకుని, ఆమెను చంపబోతూ, ఎందుకైనా మంచిదని మంత్రికి కబురు చేశాడు.

అంత అర్ధరాత్రి ప్రభువు కబురు పెట్టాడంటే ఏదో అవాంతరం వచ్చి ఉంటుందని, ఆదరా బాదరాగా వచ్చిన మంత్రి రాజు కోపం చూసి – అతని చేతిలో కత్తి లాగి పారేసి "దేవా! ఆగు! ఎందుకింత సాహసం తలపెట్టావు? ఈమె చేసిన తప్పేమిటి?" అని అడిగాడు.

నరసింహరాయలు జరిగిందంతా చెప్పి "నీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు.

అప్పుడా బుద్ధి కుశలుడైన మంత్రి "ప్రభూ! ఈ నేరాన్ని ఈమె కావాలని చేసిందా? ముసలిభర్తతో కులకడానికి వైముఖ్యం చూపిన చిన్నరాణి దగ్గరే ఉంది తప్పు! బాల్యచాపల్యం వల్ల ఆమె అలా ప్రవర్తించిందేమో! ఇక జరిగిపోయినదానికి విచారించి ప్రయోజనం లేదు. ఎంతో ప్రయత్నించి సాధించిన దాన్ని ఊరకే చెడగొట్టుకోవడం వివేకవంతుల లక్షణం కాదు! క్షేత్రం ఏదయినా బీజం ప్రధానం అన్నారు. దైవసంకల్పం ఇలా ఉంటే మార్చడం మన తరమా? పుత్రులలో ఔరసుడు – క్షేత్రజ్ఞుడు ముఖ్యులు. దీనికి పుట్టేవాడు ఔరసుడనబడతాడు. ధర్మశాస్త్రరీత్యా అతడ్ని మీరు పుత్రుడిగా పరిగ్రహించవచ్చు! కనుక, ఈ సంగతి రెండో కంటికి తెలీకుండా, అంతఃపుర సరిహద్దులు దాటకుండా, ఈమెక్కూడా రాణి హోదా కల్పించండి! అది అన్ని విధాలా శ్రేయస్కరం" అని బోధపరిచేసరికి, స్త్రీ హత్య మహాపాతకమనీ – అందునా తనకు రతి సుఖం కలిగించిన స్త్రీని వధించడం ఇంకా పాపం అనీ నరసింహరాయలు ఆ ప్రయత్నాన్ని అంతటితో విరమించుకున్నాడు.

మంత్రి ఇంటికెళ్లేసరికి తెల్లతెల్లవారుతోంది. అప్పటికే అంతఃపుర జనులు రాచనగరి వీధుల్లో గుసగుసలాడుకుంటున్నారు. అయినా అదేమీ

పట్టించుకోకుండానే ఇల్లు చేరుకున్నాడు. భార్య ఎదురొచ్చి "రాజుగారు అర్ధరాత్రి పూట కబురు చేశారేం? విశేషమేమిటి?" అని ప్రశ్నించింది.

"రాచకార్యపు తొందర" అన్నాడు మంత్రి పూర్తి నిజం చెప్పడం ఇష్టంలేక. అందుకామె నర్మగర్భంగా నవ్వి "మీరు చెప్పకపోయినా నాకు కొంతవరకూ తెలుసులెండి! చిన్నరాణీగారు ప్రభువులను వంచించి, దాసీ దాన్ని అలంకరించి రాజుగారికి పడకసుఖం అందించి రమ్మని పంపిందట కదా! ఇక ఈ రాజ్యానికి దాసీపుత్రుడు వారసుడు కాబోతున్నాడన్నమాట!" అంది.

మంత్రి చాలా ఆశ్చర్యపోయి "ఆహా! లోకం ఎంతటిది? నాకంటే ముందే ఈ వార్త రాణివాసమంతటికీ తెలిసిపోయిందే!" అనుకున్నాడు. ఐతే ఈ విషయం మాత్రం ప్రభువులవారికి చేరకుండా జాగ్రత్తపడ్డాడు.

కాలక్రమంలో - ఆ దాసికి పుట్టిన శ్రీకృష్ణదేవరాయలే హంపీవిజయనగరాన్ని పరిపాలించాడు. అష్టదిగ్గజాలనే ఘనకీర్తి పొందిన మహాకవుల కృతులు అంకితం పుచ్చుకోగలిగిన ఘనుడా ప్రభువు. ఇదీ శ్రీకృష్ణదేవరాయల యొక్క జన్మరహస్యం" అని ముగించాడు కళానిధి.

ఆ ప్రకారం ఐదుగురు మిత్రులూ వెన్నెల్లో బల్లచుట్టూ వలయాకారంగా కూర్చొని సంతానం విషయం మాట్లాడుకుంటూండగా అంతరిక్షం నుంచి ఒక మామిడిపండు బల్లమీద పడింది. వాళ్లు ఆశ్చర్యంతో ఆకాశం వైపు చూశారు. దూరంగా ఒక గరుడపక్షి గిరికీలు కొడుతూ కనిపించింది.

ఆ పండుమీద పక్షిముక్కుతో గీరిన చిహ్నాలు కనిపించేసరికి, ఆ ఫలాన్ని పక్షి ఎటో తీసుకుపోతూండగా, జారిపడిందని గ్రహించారు. అప్పుడు మంత్రి ప్రశ్నశాస్త్రం ఆధారంగా ఆ ఫలం యొక్క ఫలితం చెప్పమని కళానిధిని అడిగాడు. ఆ పురోహితుడు అప్పటి లగ్నాన్ని బట్టి చూడగా, అది సంతాన దాయక ఫలం అని తేలింది. అది దైవానుగ్రహం తప్ప మరొకటి కాదని, ఆ ఫలాన్ని అప్పటికప్పుడే దాన్ని ఐదుభాగాలుగా విభజించి, ఇంటికి తీసుకుపోయి భార్యలకిచ్చి, వారితో రతికేళి సల్పారు. కాలక్రమంలో

ఐదుగురూ, ఐదుగురు పుత్రులకు జన్మనిచ్చారు....." అని మణిసిద్ధుడు చెప్పి, గోపాలుని వైపు చూశాడు.

"స్వామీ! మామిడిపండు తిన్నంత మాత్రాన వాళ్ల భార్యలు గర్భందాల్చి పుత్రులను కన్నారంటే, అది సామాన్యమైనదై ఉండదు. ఆ పండు వెనుక ఏదో విశేషం ఉండి ఉండక పోదు! అదేమిటో చెప్పండి!" అని అడిగాడు.

గోపాలుని గ్రహణశక్తికి ఆ యతిపుంగవుడు ఆనందించి, మామిడి పండు వెనుక మహిమ నిలా చెప్పసాగాడు.....

## మామిడిపండు కథ

కర్ణాటక దేశంలో శుద్ధమతి అనే బ్రాహ్మణుడుండేవాడు. బాల్యంలోనే అతడి తల్లిదండ్రులు మరణించడం వల్ల, కాశీపట్నం చేరుకుని, విద్యాభిలాషలేకపోయినా భోజనం నిమిత్తం ఒక విద్యామందిరంలో చేరి – దానికి అనుబంధంగా గల భోజనశాలలో ముప్పూటలా భోజనం గడిచిపోయేలా చూసుకున్నాడు.

కాని, చిత్రంగా అందరికంటే అతనికే సులభంగా విద్య అలవడసాగింది. సాధారణంగా చాలా మంది యవ్వనదశలో ఆ విద్యాలయాన్ని విడిచిపెట్టి, కాపురానికొచ్చే భార్యలతో సుఖించడానికి ఇళ్లకు వెళ్లిపోయేవారు. ఏ బాదరబందీ లేని శుద్ధమతికి తనవారంటూ ఎవరూ లేకపోయేసరికి, ముప్ఫయ్యేళ్లు దాటినా ఆ విద్యాలయాన్ని వదల్లేదు అతడు. అన్ని శాస్త్రాలూ అయిపోయాయి.

సహనం అధికంగా గల శుద్ధమతి, వేద – శాస్త్ర – పురాణ – ఇతిహాసాలను మరింతగా శోధించి అధ్యయనం చేస్తూ ఇంకో పదేళ్లు అక్కడే వెళ్లించేశాడు. కష్టించకుండా భోజనం దొరుకుతుంది. తెలుసుకున్న శాస్త్రజ్ఞానం ఇంకా పదునుదేరుతోంది. కాశీలో సాధారణంగా ఎవరికైనా విద్యార్థిగానే పేరొస్తుంది గానీ, గురువుగా పేరు రావడం ఎంతో కష్టం. తాను అధ్యయనం చేస్తూనే ఇతరులకూ నేర్పే బుద్ధిగల శుద్ధమతికి గొప్ప

పండితుడనీ - అధ్యాపకుడనీ కూడ ప్రఖ్యాతి లభించింది. అప్పుడతనికి తన గ్రామం వెళ్లాలని కోరిక కలిగింది.

కొంతమంది శిష్యుల్ని వెంటబెట్టుకుని తన ఊరు వెళ్లాడు. అతడినెవరైనా గుర్తుపట్టడం కష్టం గనుక, తన తండ్రి - తాతల పేర్లు చెప్పి వృద్ధతరానికి తనను పరిచయం చేసుకున్నాడు శుద్ధమతి. ఆ గుర్తుల్ని బట్టి వారు శుద్ధమతిని "ఓరోరి- ఎంత వాడవైనావురా!" అని మిక్కిలి గౌరవం చేసి, ప్రతివారూ తాము ఆతిథ్యం ఇవ్వాలని పోటీపడసాగారు.

క్రమంగా అతని కీర్తి ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో కూడా ప్రాకింది. కాశీపండితుని దగ్గర విద్య నేర్వాలని ఎంతోమంది ఆయనకు శిష్యులు కాసాగారు. బోధనాశక్తి - సహనం అధికంగా ఉన్న అతని దగ్గర చేరిన విద్యార్థి ఇంకో చోటుకెళ్లడానికి ఇష్టపడేవాడు కాదు. విద్యార్థుల పట్ల అతనికున్న శ్రద్ధ అలాంటిది.

శుద్ధమతి ప్రఖ్యాతి విన్న శ్రోత్రియబ్రాహ్మణుడొకడు అతనితో చుట్టరికాన్ని కలుపుకోడానికి ఉత్సాహపడి, వయస్సును సైతం పరిగణించకనే తన పదహారేళ్ల కుమార్తెనిచ్చి పెళ్లి చేశాడు. ఆమె ఇరవయ్యేళ్లకు కాపురానికొచ్చింది. ఆడతోడు లేనందువల్ల కొన్నాళ్లు లజ్జగా మెసిలి, అనంతరం ప్రౌఢ స్త్రీ వలె సంచరించసాగింది. విద్యార్థుల్ని తన పుత్రులుగానే భావించి చనువు ప్రదర్శించేసరికి, ఆ నడివయసు శుద్ధమతిని అనుమానం పిశాచం పీడించసాగింది. అది క్రమంగా ముదిరి, విద్యార్థులకు సరిగ్గా పాఠాలు చెప్పక, ఎప్పుడూ భార్య జారత్వం చేస్తోంది కాబోలు అనుకుంటూ నిఘా పెట్టి అన్యమనస్కంగా ఉండసాగాడతను.

చివరికి అది ఎంతగా పరిణమించిందంటే - భార్యని ఒంటరిగా వదిలేసి, తాను దేశాంతరాలకు పోవాలనుకునేంత వరకూ వెళ్లింది.

ఒకనాడు అంత పనీ చేశాడు కూడా! అయితే - రాత్రివేళ తమ గురువుగారు అందర్నీ వదిలిపెట్టేసి ఇల్లు దాటడం పసిగట్టిన కొందరు విద్యార్థులు, ఆయన్ను వెంబడించి తెల్లారేలోగా ఆయన్ను కలుసుకున్నారు. తమను అలా నట్టేట వదిలేసి పోవడం భావ్యం కాదన్నారు.

చివరికి గురువుగార్ని ఒప్పించి ఇంటికి తీసుకెళ్లడానికి సిద్ధమయ్యారు. వస్తూంటే దారిలో ఒక ఇల్లాలు వారిని తమ ఇంట స్వయంపాకానికాహ్వానించింది. ఆమె భర్త కూడా అనుమానం పిశాచం పట్టి పీడిస్తున్న వాడే! అతడు రాజుగారి పురోహితుడు కూడ.

అతడీ గురుశిష్యుల్ని 'విటులు'గా భావించి, రాజుగారికి ఫిర్యాదు చేయడమే గాక, భార్యనొక గదిలో బంధించి స్వయంగా ఆయన్నే వచ్చి చూడమన్నాడా పురోహితుడు.

రాజు స్వయంగా వచ్చి విచారించేసరికి, గురువు సంగతీ–అతని అనుమానం భూతం సంగతీ విద్యార్థుల వల్ల తెలిసింది. పురోహితుడికీ ఉన్న రోగం అలాంటిదేననీ – వృద్ధుడికి పడుచుపెళ్లాం విషయం లాంటిదనీ రాజు తెలుసుకున్నవాడై వీళ్లిద్దరి బుద్ధీ చక్కబరుస్తాననుకొని, పురోహితుడు తన భార్యను బంధించిన గది చూపించగా, ఆమెను బయటకు రప్పించాడు.

రాజు ఆమెకు నమస్కరించి, "సాధ్వీ! ఇది ఏమి?" అని అడిగాడు. "అయ్యా! బ్రాహ్మణులు అతిథులుగా దొరకడం కష్టం. ఒక్కరు కాదు– ఇంత మంది సద్బ్రాహ్మణులను అర్చించగలిగిన అవకాశం మళ్లీ రాదని నేనే వార్ని ఆహ్వానించాను" అని చెప్పి ఊరుకోకుండా, మూర్ఖుల్లో మొదటివాడు - అనుమాన పిశాచం ఆవరించిన తన పెనిమిటి అనీ; ఆయన మాటలను పట్టుకొని, విచారణ కొచ్చిన మీరు (రాజు) రెండో మూర్ఖులు అనీ" నిర్భయంగా చెప్పిందామె.

రాజు కోపగించుకోకుండా, "స్త్రీలందరూ జారిణులు కారని - ఉత్త అనుమానంతో ఉత్తమురాలిని అవమానించినందున పురోహితుడ్ని దండించినా దోషం లేదనీ – అదే మాట శుద్ధమతికీ వర్తిస్తుందని " చెప్పడంతో శుద్ధమతి ప్రత్యక్ష నిదర్శనం ద్వారా తాను ఉత్తమురాలిని చూసినందువల్ల బుద్ధికలిగి తనభార్యను కూడా ఇటుపై అనుమానించనని – నిరాధారంగా ఆరోపించననీ – సామరస్యంగా సంసారం చేసుకుంటానని రాజు దగ్గర అంగీకరించాడు. అతనికి గల ప్రతిభాపాటవాలు విన్న రాజు శుద్ధమతిని ఆస్థానపండితుడిగా చేసుకుని గౌరవించాడు.

ఆ తర్వాత రాజుకిచ్చిన మాట ప్రకారం అనురాగంతో తన భార్యను చూసుకుంటూ కాలం గడపసాగాడు.

సంతానం నిమిత్తం ఆర్నెల్లపాటు శ్రీశైల మల్లికార్జునుని ఆరాధించి ఒక మామిడిపండు వరంగా పొంది, దాన్నెక్కడా కిందపెట్టకుండా ఇంటికి తీసుకెళ్లి భార్య కివ్వాలనే ఆరాటంతో వెళ్తూ - వెళ్తూ దారిలో ఒక చెరువు దగ్గర సంధ్యావందన నిమిత్తం స్నానం చేయబోయి, పండుకింద పెట్టకూడదు కనుక చెట్టుకొమ్మల్లో ఇరికించి స్నానానికి వెళ్లాడు.

ఆ చెట్టుమీదున్న గరుడపక్షి ఆ ఫలాన్ని కాళ్లతో పట్టుకొని అక్కడ్నుంచి ఎగిరిపోయింది. ఆ ఫలమే కాశ్మీర దేశపు శూరసేనుడు అతని మిత్రులు దక్కించుకున్నారు. జరగవలసింది అలా వుంటే - ఆ శుద్ధమతికి మామిడిపండు దక్కుతుందా? అతడు జీవితాంతం తన దురదృష్టానికి చింతిస్తూనే ఉన్నాడు. ఇదీ ఆ మామిడిపండు కథ" అని చెప్పాడు సిద్ధుడు.

## వరప్రసాదుల కథ

శూరసేనుడితో పాటు, మంత్రికీ - పురోహితుడికీ - కోమటికీ - కళాదుడికీ పుత్రులు కలిగేసరికి, వారికి కలిగిన ఆనందం ఇంకెప్పుడూ కలగలేదు. ఆ సంతోషంలో వారు పేదలకు దానధర్మాలు, బంధుమిత్రులకు విందులు భారీగా చేశారు.

రాజకుమారుడికి వసంతుడనీ - మంత్రి కుమారుడికి రాముడనీ - పురోహితుని పుత్రునికి ప్రవరుడనీ - వైశ్య పుత్రునికి సాంబుడనీ - కళాదుని పుత్రునికి దండుడని, వారి పేర్ల మొదటి అక్షరాల ప్రకారం కలిపి చదివిలే వరప్రసాదులని వచ్చేలా పేర్లు పెట్టారు. పిల్లలయిదుగురూ చక్కగా పెరగసాగారు. చిన్న వయస్సునుంచీ విద్యాభ్యాసం ప్రారంభించి ఐదుగురూ తండ్రులననుసరిస్తూ ఒకే ప్రాణంలా మెలిగి యుక్తవయసొచ్చేసరికి అరవైనాలుగు కళల్లోనూ ఆరితేరారు. రాజుకి వీరందరి పట్ల ప్రేమాభిమానాలు మెండుగా ఉండేవి.

ఉదయం నుంచి సాయంత్రం వరకు యుద్ధ విద్యలు మర్చిపోకుండా మెరుగుపెట్టుకోడానికి అభ్యసిస్తూనే, వివాహం చెయ్యాలనుకుంటూన్న

తల్లిదండ్రుల వైఖరి పసిగట్టి, దాన్ని కొంతకాలం వాయిదా వేయించదలచారు. అందుకు వారు ఎన్నుకొన్న మార్గం - దేశాటనం. అంతేగాక తమ పర్యటనల్లో ఎక్కడైనా చక్కని కన్యలు లభిస్తే స్వయంగా పెళ్లి చేసుకోవాలని వారి ఊహ.

అందరూ తగినంత ధనం - వెలకట్టలేనన్ని రత్నాలతో ఊరి బయట మామిడితోపు నుంచి ఒకనాటి రాత్రి ఒకే సమయానికి బయలుదేరారు. పడమటి దిక్కుగా నరసంచారం లేని అరణ్యంలోంచి గుర్రాల మీద వెళ్లసాగారు.

ఆ అరణ్యం మహా దుర్గమంగా ఉంది. ఎలాగో వారు త్రోవచేసుకుని పోసాగారు. అందరికంటే వెనుకగా వస్తున్న దండుడు యంత్ర నిర్మాణ కుశలుడూ....వైద్యం తెలిసిన వాడూ కావడంతో మూలికలను - యంత్రాలకు పనికొచ్చే కర్రలను పరుచుకుంటూ రాసాగాడు.

సూర్యోదయ వేళకు అంతూ - దరీ లేని ఆ మహారణ్యంలో ఓచోట ఆగి, కాలకృత్యాలు తీర్చుకొని, దక్షిణదిశగా వెళ్తే కొన్ని నగరాలు తగులుతాయని, ఆ దిశగా ప్రయాణించసాగారు.

మర్నాటి మధ్యాహ్నం వరకూ అలా సాగేక, బంగారు శిఖరం గల ఒక గోపురం కనిపించింది వాళ్లకి. దగ్గర్లో ఏదో పట్నం ఉండి ఉంటుందని భావించినా కొంతదూరం వెళ్లేసరికి వాళ్ల ఊహనిజమైందే గాని నరసంచారం మాత్రం లేదు.

ఇంతలో రక్షకభటులు "పౌరులారా! భద్రంగా నిద్రించండి! మీ సొత్తు మేము భద్రంగా కాపాడుతున్నాం!" అని చాటింపు వంటిది వేయడం విని, వాళ్ల దగ్గరకు వెళ్లగా "మీరు పరదేశస్తుల్లా ఉన్నారే! ఇక్కడ అర్ధరాత్రి నిర్భయంగా సంచరిస్తున్నారా! త్వరగా పోయి ఎక్కడైనా నిద్రించండి" అన్నారు.

"మీ మాటలు వింతగా ఉన్నాయి. ఇది అర్ధరాత్రేమిటి? పట్టపగలైతే" అన్నారు వరప్రసాదులు.

"ఇది పగలు అని ఎరక్కపోయి ఎవరు అన్నా శిక్షార్హులు. అది రాజశాసనం. మీది మొదటి తప్పు కనుక మన్నించాం! రెండోమారు అలా

అంటే శిక్షించబడతారు" అని చెప్పి త్వరగా ఎక్కడైనా పడుకోమన్నారు.

"మేము విదేశీయులం అని తెలిసీ మీరిలా అనడం ఏం న్యాయం? నిజం పలికితే దండించే రాజులుంటారా!" అంటూ సత్రం చూపించమన్నారు. అది తమ విధి కాదని ఆ పురరక్షకులు అనడంతో, ఒక ఇంటి అరుగు మీద ఆ సాయంత్రం వరకు విశ్రమించారు. చీకటిపడుతూండగా ఆ పట్టణపు ప్రజలు లేచి వారి పనులు చూసుకోసాగారు.

తాము పడుకొన్న ఇల్లు గల ఆసామిని "అందుకు కారణమేమి?" అని అడగ్గా, వారిని లోనికి తీసుకువెళ్లి భోజనం పెట్టి, రహస్యంగా ఇలా చెప్పసాగాడు.

## కానీనుని కథ

"ఆర్యులారా! ఇది లాట దేశం. ఈ దేశాధిపతి కానీనుడు. ఇతడికి సుబుద్ధి – కుబుద్ధి అని ఇద్దరు మంత్రులు. వాళ్లల్లోనూ కుబుద్ధి ఆలోచనల ప్రకారమే ఇక్కడి రాజ్యం నడుస్తోంది. సుమారు పదిసంవత్సరాల క్రితం వచ్చిన ఆలోచన ఇది. నిద్రాహారాలను బట్టి కదా పగలూ – రాత్రీ అంటున్నారు. నేను వీటినిప్పుడు తారుమారు చేయదలచాను. కనుక రాత్రి పనులు పగటిపూట . పగటి పనులు రాత్రిపూట చేయడం మొదలెట్టండి! అప్పుడు వాటికి ఆ పేర్లే స్థిరపడతాయి...." అని ప్రభువులవారు అనడం – అందుకు కుబుద్ధి అడ్డు చెప్పకుండా సమర్థించడం జరిగిపోయాయి. అయితే సుబుద్ధి మాత్రం దీనికి అడ్డుచెప్పాడు."రాజా! అప్రియమైన హితవు అనుకోకుండా, నేను చెప్పేది వినండి! రాత్రింబవళ్లకు ఆ పేర్లు నిద్రాహారాల్ని బట్టి కాక – చీకటి వెలుగుల్ని బట్టి ఏర్పడ్డాయని ప్రభువుల వారు గుర్తించాలి. భగవంతుని చేత చేయబడిన నియమం . దీన్ని మార్చవద్దు. అలా మార్చాలనుకోవడం మన మూర్ఖత్వం! ప్రజావిరోధం సంభవించిందంటే అపఖ్యాతి తథ్యం" అన్నాడు సుబుద్ధి.

రాజుకు ఆగ్రహం వచ్చింది. "నా ఆజ్ఞకు ఆటంకం కలిగిస్తావా?" అంటూ అప్పటికప్పుడే ఆ మంత్రిని ఉద్యోగంలోంచి తీసేశాడు. దుర్బుద్ధిని పొగుడుతూ, ఆ మర్నాటి నుంచే కొత్తశాసనం ప్రకారం జనులు

నడుచుకోవాలని ఈ లాటదేశదేశమంతటా చాటింపిచ్చాడు. అలా అమలు జరుగుతున్నదీ కఠిన శిక్షలుంటాయనే సరికి, విధి లేక ప్రజలు రాత్రంతా దీపాలు వెలిగించుకోడానికి తగినంత చమురు తెచ్చుకోలేక, నిద్రకు ఆగలేక ఐదారేళ్లు నానా అవస్థలు పడ్డారు. చివరికెలాగో అలవాటైంది.....

"మా రాజు చరిత్ర ఇలాంటిది. మీరు ఇతర దేశస్తులు గనుక ఇంత వివరంగా చెప్పాను. ఇక మీదట పొరపాటుగానైనా దీన్ని రాత్రి అనకండి! అలా అన్నవాళ్లని శిక్షిస్తారు" అని వివరించాడా ఇంటియజమాని.

వరప్రసాదులు అక్కడి ప్రజల ఇక్కట్లకు జాలిపడ్డారు. ఈ రాజు తలతిక్కనెలాగైనా వదిలించాలి" అని భావించి అక్కడో విలాసవంతమైన భవనాన్ని అద్దెకు తీసుకుని నివశించసాగారు.

## దేవతా వస్త్రాల కథ

బుద్ధిమతులైన వరప్రసాదులు, ఒక ఉపాయంతో ఆ రాజుని వంచించాలని ఆలోచించారు. ఒకరోజు - పెందలకడ భోజనాలు చేసి, గౌరవనీయుల్లా వేషాలు ధరించి రాజుగారి ఆస్థానానికి వెళ్లారు. కొన్ని విషయాలు రాసిన చీటిని ద్వారపాలకుని ద్వారా రాజుగారికి పంపారు. ఆ చీటీ చూసుకున్న కానీనుడు తక్షణమే వాళ్లని తోడ్కొని తీసుకురమ్మని ఒక గౌరవప్రదమైన ఉద్యోగిని పంపించాడు. తానే స్వయంగా వాళ్లకు ఎదురేగి స్వాగతం పలికి "మీరెవరు? మీరు చీటీలో చేస్తామని రాసిన వింత పనులు ఏమిటి?" అని అడిగాడు.

అప్పుడు వారిలో రాముడు "అయ్యా! మాది కాశ్మీరం. మేము పట్టుశాలి వారం. విచిత్రమైన వస్త్రాలు నేయడంలో మాకు గొప్పప్రఖ్యాతి ఉంది. మేము మా ప్రభువుల ఆస్థానంలో ఎన్నెన్నో సన్మానాలు పొందినవాళ్లం. ఇతర రాజులను ఆశ్రయించవలసిన అవసరం మాకు లేకపోయేదే ! కానీ, మా ప్రభువుల వారికి, ఒక ఆపద సంభవించడం వల్ల - మమ్మల్ని రక్షించేవాళ్లు ఎవరా అని అన్వేషిస్తూ తిరుగుతూన్నాం! మా ప్రావీణ్యం గుర్తించగల వారికి తప్ప, ఇతరులకు మా పనితనం గురించి

ఏం తెలుస్తుంది? అలా తిరుగుతూ వస్తూన్న మాకు మీ ఖ్యాతి తెలిసింది. కొత్త ఆలోచనలను ప్రోత్సహించే మీ వంటివారిగురించి దేశదేశాల్లో ప్రశంసించుకోవడం మా చెవుల పడింది. ఇక ఆలస్యం చెయ్యకుండా, మిమ్మల్ని దర్శించాలని బయలుదేరాం! మీలాగ కొత్తదనాన్ని ప్రోత్సాహించే వారే మాకొచ్చిన విద్యను పరీక్షించగలరు" అన్నాడు.

"మంత్రీ! మనం ప్రవేశపెట్టిన కొత్త విధానం వల్ల మనకు ఎంత ఖ్యాతి వచ్చిందో చూశావా! ఎంతో దూరదేశాన ఉన్న కాశ్మీరంలో సైతం మన ఘనతను చెప్పుకుంటున్నారట" అని పొంగిపోయాడు. మంత్రి కూడా ఆ రాజు కెంతో నచ్చేలా వంతపాడి మరీ ప్రశంసించాడు.

పరస్పరం పొగుడుకోవడాలు అయ్యాక, రాజు వరప్రసాదులతో "మీ విద్యాపాటవం గురించి చెప్పండి" అన్నాడు.

"మేము నేటినుంచి ఆరునెలల కాలంలో ఒక పంచెలచాపు, ఒక చీర, ఒక తలపాగా నేస్తాం! అందుకు ఏభైవేల బంగారు కాసులు ఖర్చవుతాయి, ముందుగా సగం సొమ్ము ఇవ్వాలి. మేము ఎవరి కోసం నేస్తామో, వారే ఊరేగింపుతో వచ్చి, మా బస దగ్గర మిగతా సొమ్ము - ఇస్తే బహుమతీ ఇవ్వవచ్చు!

ఆ వస్త్రాలు ధరించి దంపతులు ఆ రాత్రి కామకేళిలో తేలినట్లయితే, వారికి అధిక తేజస్వి అయిన పుత్రుడు జన్మిస్తాడు. ఇక గొప్ప విశేషమొకటి ఉంది. మేం నేసే బట్టలుగాని, కనీసం వాటి దారాలు అయినా గాని వ్యభిచార దోషం వల్ల జన్మించిన వాళ్లకి మాత్రం కనిపించవు. అవి దేవతా వస్త్రాలు. ఆ బట్టలు ధరించేటప్పుడు గాని ఆ ఆనందం తెలీదు. అది వర్ణనాతీతం! మీరు మమ్మల్ని ప్రోత్సాహించినా మంచిదే! లేకున్నా ఇంకో ఆస్థానాన్ని సందర్శిస్తే, మా ప్రతిభకు గుర్తింపు దొరక్కపోదు" అన్నారు.

కానీనుడికి ఉబలాటం ఎక్కువైంది. దేవతావస్త్రాలు అంటే మాటలా? అవి నేయగల సామర్థ్యం అందరికీ ఎక్కడుంటుంది? అనుకుని "అసలే కొత్త - కొత్త మార్గాలు అన్వేషించే బుద్ధి కలిగిన మేము, మా సంస్థానానికొచ్చిన

మీ వంటి వాళ్లకు ఊరకే పోనిస్తామా? రాత్రినే పగలుగా - పగలునే రాత్రిగా మార్చగలిగిన, కొత్తదనాన్ని ప్రవేశపెట్టగలిగిన మాకు కొత్తపనులకు ఎంత సొమ్ము వ్యయం అయితేనేం? అదొక లెక్కలోనికి రాబోదు. ఖర్చుకు వెరచి విద్వత్తును ప్రోత్సహించడాన్ని మేం ఎన్నడూ ఆపము. అద్భుత వస్త్రాలు నేయండి! ఖజానా నుంచి తక్షణం మీకు ముందుగా మీరడిగిన సొమ్ము ఇవ్వబడుతుంది." అని ఆ ద్రవ్యం ఇచ్చే ఏర్పాటుచేశాడు కానీనుడు.

వరప్రసాదులు, వేమా దండాలు - రాట్నాలు - మగ్గాలు మొదలైనవన్నీ ఇంట్లో పడేయించి లోపలికి ఎవ్వర్నీ రానివ్వకుండా కాపలా వాళ్లని పెట్టి, విందువినోదాలతో పొద్దుపుచ్చసాగారు. రెండు మాసాలయ్యాక ఆ వస్త్రాల పని ఎంతవరకైందో చూసిరమ్మని గ్రామాధికారుల్ని పంపాడు.

"పని చెయ్యి తీరికలేనంతగా ఉంది. మాట్లాడ్డానికైనా వీలవుతుందో లేదో! అయినా ప్రభుత్వాధికారులు గనుక, పనిచేసుకుంటూనే మేం మాట్లాడతాం! కొద్దిసేపు ఆగి వారిని ప్రవేశపెట్టవలసింది" అని, తాము ఎలా చెప్పారో అలాగే చెప్పమని కావలి వారికి సూచించారు. వాళ్లూ అదే చెప్పారు. నూలు వడికే వారిలా, నూలు చుట్టే వారిలా, మగ్గం మీదికి ఎక్కించే వారిలా, నేతనేసే వారిలా ఒక్కొక్కరొక్కొక్క అభినయం చేస్తూండగా గ్రామాధికారులు లోన ప్రవేశించారు.

"నూలు ఎంత సన్నంగా ఉందో చూశారా?! ఈ మెత్తదనం 'పట్టుకై' తేనేం - రాదు కదా! మృదువు పరీక్షించండి! దీన్ని ఎప్పుడైనా మీరు చూశారా? రెండు మాసాలకు నూలు తయారుకావడమే కష్టం!" అన్నాడు ప్రవరుడు.

నూలు కనిపించడం లేదంటే, తమ తల్లిని వ్యభిచారిణి కాబోలు అని అంతా అనుకునే ప్రమాదం ఉందని ఎవరికి వారే "ఓహో! అద్భుతం!" అనసాగారు. కరణానికి కనిపించి ఉంటుందని కాపు; కాపుకు కనిపించి ఉంటుందని కరణం తలచి తమ గుట్టు బయటపడకుండా మాట్లాడసాగారు.

కానీనుడు గ్రామాధికారుల ద్వారా విచిత్ర వస్త్రాల గురించి విన్నది మొదలు, అతని ఆతృత పెరిగిపోసాగింది. దండనాథులు, మంత్రి మొదలైనట్లి ఉన్నతాధికారుల్ని రాజు పంపించగా, అందరూ అదేమాట!

తమకేమీ కనిపించలేదంటే, తమ తల్లిని వ్యభిచారిణిగా ఎక్కడ ముద్ర వేస్తారో అనే భయం వారిని అసలు నిజం దాచేయడానికే పురిగొల్పింది. దాంతో అందరూ నేతవారినే గొప్పగా పొగిడారు. ఆ వస్త్రాల ఖ్యాతి ఆ నోటా – ఈ నోటా పురప్రముఖులందరికీ తెలిసి, ఎవరికి వారే చూడాలని ఉబలాట పడి, తీరా చూశాక – అదేమీ కనిపించకపోయేసరికి తమ తల్లిని జారిణిగా అంగీకరింపవలసివస్తుందేమో అని ఎవరికి వారే భయపడసాగారు. ఆ కారణం చేత – ఇతరులకు కన్పించినవి, తమకు కన్పించలేదేమో అని ఆందోళన చెంది అదెక్కడా బైటికి తెలీనివ్వకుండా ఉండేందుకు ఆ వస్త్రాల ప్రశంసప్రతివారూ చేయసాగారు.

ఆరునెలలూ పూర్తయ్యాయి. సాంబుడు, దేవతావస్త్రాలు పూర్తయ్యాయంటూ రాజుగారికి కబురు చేయించాడు. రాజు ఎంతో ఆనందించి "మా ప్రధాని – తదితరులంతా మీరు నేస్తున్న వస్త్రాలు చాలా ఆశ్చర్యాన్ని కలిగించే విధంగా ఉన్నాయని చెప్పారు. మీ దేశపురాజు వీటిని ధరించే రోజున ఏం చేసేవాడో చెప్తే మేమూ అలాగే చేస్తాం!" అన్నాడు సమాధానం పంపుతూ.

"ఉత్సవాల్లో భద్రగజం మీద భార్యతో సహా ఎట్లా ఊరేగుతూ వస్తారో అలా ఊరేగుతూ వచ్చి, బ్రాహ్మణులకు గొప్పగా దానాలు చేసి, మా బసకు వచ్చి దివ్యవస్త్రాలు తీసుకోవాలి. అవి ధరించడానికి మా బస ఉపయోగించుకోవచ్చు! ధరించాక, మా వస్త్రాలకు చెల్లించవలసిన మిగతాధనం పూర్తిచేసి ఇవ్వదల్చుకుంటే కానుకలు ఇచ్చి ఊరేగింపుగానే రాజుమహలుకు తిరిగి వెళ్లాలి. ఇవి దేవతా వస్త్రాలు కనుక ఆ రోజు అంతఃపుర స్త్రీలకు పురుషదర్శనం తప్పుకాదు. మహారాజుగా మీరు అందరికంటే కొత్తదారులు అన్వేషించిన వారు కావడం వల్ల, ఇంకా వైభవంగా మీకు నచ్చినట్లు చేసుకోవచ్చు!" అని చెప్పి పంపారు.

రాజు నగరమంతా చాటింపు వేయించాడు. తాను ఊరేగేటప్పుడు అందరూ ఉండాలి అన్నాడు. మంత్రి – సామంత – పురోహిత – సన్నిహితులంతా వెంటరాగా భద్రగజం మీద భార్యతో సహా వరప్రసాదుల

బసకొచ్చాడు. వరప్రసాదులు వారిని ఆహ్వానించి ఉచితాసనాల మీద కూర్చోబెట్టారు. మిగతా సగం సొమ్ము, మణిమాణిక్యాది కానుకలు బంగారుపళ్లెంతో తెప్పించి, నేతగాళ్లుగా పరిచయమైన వరప్రసాదులకు అందజేశాడు కానీనుడు.

వసంతుడు, ప్రవరుడు, దండుడు ఒక్కొక్క పళ్లెం తెచ్చి ప్రభువు ముందుంచారు రాముడు సైగచేయగానే.

"దేవతా వస్త్రాలేవీ?" అని అడిగాడు రాజు.

రాజుకా పళ్లెంలో ఏమీ కనిపించలేదు. దాంతో "అయ్యో! నావంటి రాజును కన్న స్త్రీ జారిణియా? అందువల్లనే కాబోలు - ఇలాంటి వింతవస్త్రాలను చూసే భాగ్యం నాకు లేకపోయింది. ఏడు అంతఃపురాల్లో ఉంచినా స్త్రీలు చెడుపన్లు చేయక మానరు. ఎందరికో కనిపించిన వస్త్రాలు నాకు కన్పించటంలేదంటే ఎంత అవమానం? వారందరి తల్లులకూ ఉన్న నీతినియమాలు నా తల్లికి లేకపోయాయేమో! " అని విచారిస్తూంటే-

వరప్రసాదులు అతణ్ణి రెట్టించి "జరీపూవులెంత చక్కగా అమిరాయో! వీటి మృదుత్వం పుష్పాలకు సాధ్యమా? ఇవి మీకు కన్పించాయీ అంటేనే తెలుస్తోంది - మీ తల్లి దొడ్డ ఇల్లాలని....." అనసాగారు.

వస్త్రాలు కనబడటం లేదంటే, తాను జారిణికి జన్మించినవాడివలె, పదిమంది ఎదుట పల్చనౌతాడని భయం కొద్దీ "అపూర్వం ! అద్భుతం" అని మెచ్చుకోవడమే గాక, రాణిని కూడ " ఎలా వున్నాయి? చాలా బావున్నాయిగా" అన్నాడు.

ఆమె కూడా వస్త్రాలు పరిశీలిస్తున్నట్లుగా నటిస్తూ "అయ్యో! నా తల్లి జారిణియా ఏమి? లేకపోతే వీళ్లందరికీ కనిపిస్తున్న వస్త్రాలు నాకు కనిపించకపోవడమేమిటి? నేను నిజం చెప్పి నా తల్లిని ఎందుకు బైటవేసుకోవడం?" అనుకొని "రాత్రింబవళ్లనే మార్చగలిగిన మీలాంటి వాళ్లు కట్టుకోగల దివ్య పుట్టంబులివి" అని ఊరుకుంది.

అప్పుడు రాముడు, రాజుకు ఆ వస్త్రాలు కట్టడానికి కుచ్చిళ్ళు పెడుతున్నట్లుగా నటించి, రాజు ధరించిన వస్త్రాలను విప్పించాడు. దేవతావస్త్రాలను ధరింపజేశాడు. రాజు అందరికీ దిగంబరంగానే కనిపిస్తూన్నా ఆ మాట అంటే తాను తన తల్లిని జారిణిగా అంగీకరించవలసి వస్తుందని ప్రతివాడూ ఊరకుండిపోయాడు. రాజుక్కూడా తనకు తాను దిగంబరంగా కనిపిస్తూన్నా - ఆ దేవతావస్త్రాలు మహిమగలవి కనుక, తన కొక్కనికే అలా కనిపిస్తోందని - ఇతరులకు వస్త్రాలున్నట్లుగా కనిపిస్తున్నాయని భావించి మిన్నకుండిపోయాడు.

అంతకుముందే రాణిగారికి చీరకట్టించడానికి నియమితురాలైన స్త్రీ, రాణిగార్ని చాటుకు తీసుకుపోయి, అంతవరకూ కట్టుకున్న చీర విప్పి, దేవతా వస్త్రాన్ని కడుతున్నట్లు నాలుగైదుసార్లు కిందా - మీదా - చుట్టూ సవరించి, ఆమెను సభలోకి తెచ్చింది. మునుపటిలాగే ఎవరికి వారు తమ తల్లి వ్యభిచారిణి అన్పించుకోవడం ఇష్టంలేక, ఆ రాణీగారి నగ్నత్వం గురించి ఒక్కరైనా ఒక్కముక్క అనలేదు. చివరికి ప్రభువు కానీనుడు కూడ కేవలం మాతృదోషం వల్లనే రాణీనగ్నత్వం తనకు కనిపిస్తోందనీ; దేవతావస్త్రాలు ఆమె ధరించగా ఇతరులు చూడగలిగారనీ ; ఆ పాటి పుణ్యం తనకు లేకపోయిందనీ విచారించాడు.

వాళ్లు భద్రగజాన్నెక్కి ఊరేగింపుగా రాజభవనం వైపు సాగిపోయారు. దేవతావస్త్రాల వింత చూద్దామని మేడకెక్కిన పురకాంతలకు దిశమొలలతో నిస్సిగ్గుగా రాణీ - రాజూ కనిపించేసరికి, వాళ్లంతా ఆ రాచమిధునాన్ని ఆ తీరుగా చూడలేక కళ్లుమూసుకున్నారు. చాటింపు వేయించినందువల్ల, ఎట్లాగో కొంతసేపు ఊరేగి –తన సౌధానికి వచ్చి తల్పం మీద కూర్చొన్నాడు రాజు.

“ఆహా! బరువు బాధలేకుండా ఈ వస్త్రాలు ఎంత తేలిగ్గా ఉన్నాయి? నాలాగే రాణీక్కూడా తేలిగ్గా ఉన్నాయేమో! అవి చూసే అదృష్టానికి ఆమె నోచుకున్నది” అనుకుంటూ రాణీ వైపు తిరిగి నువ్వు కట్టుకున్న చీర నాకు

ఏమాత్రం కనిపించడం లేదు. కనీసం ఏ రంగు – అంచు ఏమిటీ? ఎలాంటి లతలు? అవైనా చెప్పి నాకు సంతోషం కలిగించు! పదిమందిలోనూ నా తల్లి పరువు తియ్యలేక కనిపిస్తోందని చెప్పాను" అన్నాడు.

"అయ్యోరామ! ఇంతవరకు ఇదే పరిస్థితి నాది కూడా! నా తల్లినెక్కడ బైట వేయవలసి వస్తుందోనని, నేను ముందుగా బైటపడలేకపోయాను. మీరు నాకు ఒంటిమీద ఒక్క నూలు పోగైనా లేకుండా చక్కగా కనిపిస్తున్నారు. మీ దగ్గర దాపరికమా?" అని అంటూనే, తాను నగ్నంగా ఉన్నానన్న సంగతి గుర్తొచ్చి, చటుక్కున అక్కడ్నించి తప్పుకొని, తన అంతఃపురంలోకి పరుగు తీసింది.

కానీనుడికి విపరీతమైన ఆగ్రహం – లజ్జ కలిగాయి. ఆ పట్టుశాలీలు పరమ నమ్మక ద్రోహుల్లా ఉన్నారు – అనుకుంటూ, వెంటనే తన మాటలకు తాళం గొట్టే కుబుద్ధిని కబురంపి మరీ రప్పించి "కుబుద్దీ! నిజం చెప్పు! వస్త్రాల్ని తయారీ దశలోనే రెండు సార్లు చూశావు కదా! నీకు ఏమైనా కనిపించిందా? నిజం చెప్పు? భయపడకు, మాకు మాత్రం ఏం కన్పడలేదు" అని రెండు సార్లు వెంట వెంటనే అడిగాడు.

మంత్రి నిజం ఒప్పేసుకున్నాడు. 'మోసం వాళ్లదే' అని తేలేసరికి సిగ్గుతో పదిమంది మధ్యా ఊరేగిన తాను చితికిపోతూ, గబగబా వస్త్రాలు ధరించి, 'తానంటే పురుషుడు! కానీ తన భార్యని కూడా నగ్నంగా ఊరేగేలా సాహసించిన ఆ సాలీల్ని క్షమించకూడదు' అని వాళ్లను పట్టి తెమ్మని భటులను పంపగా, వారు వెళ్లి చూసొచ్చి "అయ్యా! ఆ విడిదింట్లో ఈ పత్రం తప్ప ఇంకేం లేదు. అదెప్పుడో మీ ఊరేగింపు సాగుతూండగానే ఖాళీ అయిపోయిందట. ఆ యింటి యజమాని చెప్పాడు" అని తాము స్వాధీనం చేసుకున్న పత్రాన్ని రాజు పరం చేశారు.

మంత్రి కుబుద్ధి, అదేదో క్షమాపత్రం అయి ఉంటుందని అనుకుని బిగ్గరగా చదవసాగాడు.......

"అపూర్వ దుర్మార్గ చర్యాభిలాషులైన కానీన ప్రభువులకు – కపటపు పట్టుశాలీలు వ్రాసిన ఆజ్ఞ ఏమనగా.........

నీవు లోక విరుద్ధమైనట్టి మార్పులు చేసి, ప్రజలను అనేకవిధాలుగా బాధిస్తున్నావు. కనుక నిన్ను కపటంతోనే లొంగదీసి, నీ బుద్ధి మాన్పడానికి ఇంద్రుని చేత పంపబడిన దూతలుగా మేము నీకు ఇలాంటి అవమానం కలిగించి అదృశ్యులమయ్యాము. ఇకనైనా బుద్ధి కలిగి ఉండు! విపరీతపు చర్యలేవీ చేపట్టి ప్రజల్ని ఇక్కట్లకు గురిచేయకు! సుబుద్ధికి తిరిగి మంత్రిత్వమిచ్చి చక్కగా రాజ్యపాలన చెయ్యి! లేదా మా ఆనతిని నీవు తిరస్కరించినట్లు భావించి, నిన్ను పలుచిక్కుల్లో పెట్టి చివరికి పదవీభ్రష్టత్వం సైతం కలుగచేయగలం! ఇది ముమ్మాటికీ మా ఆజ్ఞ"

అది విని కానీనుడు చాలా భయపడ్డాడు. మన మార్పు వల్ల ఇంద్రునితో వైరం సంభవించేలా ఉందే! దేవతలతో నెయ్యం. ఉండాలి గాని కయ్యం పనికి రాదు. జరిగిందేదో జరిగింది. ఇక ప్రజలంతా రాత్రిని రాత్రి లాగ - పగలును పగలులాగ పాటించవలసిందని ప్రకటనలు చేయించండి...మంత్రి సుబుద్ధిని ఎక్కడున్నా సగౌరవంగా తీసుకురండి" అని ఆజ్ఞ వేశాడు. సుబుద్ధి సలహాలతో ప్రజారంజకంగా పరిపాలించాడు" అంటూ కథ పూర్తి చేశాడు మణిసిద్ధుడు.

"గోపాలా! ఇప్పుడు చల్లబడింది. నడవాల్సిన సమయమైంది. కావడి ఎత్తుకో! తర్వాత కథ పెద్దది, రాత్రి మజిలీలో పూర్తి చేస్తాలే" అంటూ ఓంకారాన్ని జపించుకొంటూ మణిసిద్ధుడు నడక సాగిస్తూంటే, త్వరగా సాయంత్రానికి ఇంకో మజిలీ చేరుకున్నారు. అక్కడ సత్రంలో సాయంసంధ్యాది అనుష్ఠానాలు తీరాక, శ్రద్ధగా వినవేడుకపడుతున్న శిష్యునికి సిద్ధుడు తరువాత కథ చెప్పసాగాడు.



## 2వ మజిలీ

వినుము ! అట్లా మాయ వస్త్రాలు ధరించి, రాజుగారు ఊరేగింపునకు వెళ్లగానే, వరప్రసాదులు అలాంటి చీటీ రాసి గోడ కంటించి, తమ ఉత్తమాశ్వముల మీద తమ సామాగ్రి నంతటినీ సర్దుకొని, చాలా వేగంగా ఉత్తరదిశగా సాగిపోయారు. దట్టమైన ఆ అడవిలో రోజుల తరబడి ప్రయాణించినా, దానికొక అంతూ దరీ కనిపించలేదు.

దాహం వేసి, చుట్టూ పరిశీలించగా ఒకచోట తియ్యని నీటి సరస్సు దాని ఒడ్డున ఒక గొప్ప మర్రి చెట్టు వారి కంటపడ్డాయి. అక్కడ గుర్రాన్ని దిగి, మార్గాయాసం పోయేలా స్నానాలు చేసి వంటచేసుకుని భోజనాలు ముగించారు. ఆ విశాల వటవృక్షాన్ని పరిశీలించారు.

అది నిజంగానే వింత వటవృక్షం. దానిమీద ఎవరూ ఎప్పుడూ చూడనన్ని వింతపక్షులున్నాయి. దాని కొమ్మల మీద నుంచి బళ్లు కూడా అటూ – ఇటూ వెళ్లిపోగలిగినంత పెద్దవిగా – దృఢంగా వున్నాయి. అలాటి కొమ్మలు నాలుగు దిక్కులకూ నాలుగున్నాయి. "ఈ కొమ్మల పొడవెంతో చూద్దామా?" అని రాముడు అనడంతో ఒక్క సాంబుడు తప్ప మిగతా నలుగురూ అందుకు సిద్ధపడ్డారు.

"నలుగురూ నాలుగు కొమ్మలను పట్టుకొని వెళ్లిపోదాం! ఆరుమాసాల గడువు తర్వాత మళ్లీ ఇక్కడికి తిరిగొద్దాం. ఎవరైనా ముందుగా వచ్చేసినా, మిగతా వాళ్లంతా వచ్చేదాకా ఇక్కడుండాలి. గుర్రాలను – సామాగ్రిని కాపలా కాస్తూ సాంబుడు మాత్రం ఇక్కడుంటాడు" అని నిర్ణయించుకుని వసంతుడు తూర్పు వైపు, ప్రవరుడు పడమటివైపు, దండుడు ఉత్తరం వైపు, రాముడు దక్షిణంవైపు కొమ్మలెక్కి వెళ్లిపోయారు.

# వసంతుని కథ

అందులో రాజకుమారుడు తూర్పుదిక్కుగా ఉన్న కొమ్మమీదుగా భూమ్మీద ప్రయాణించినట్లుగానే, రెండురోజుల పాటు ఏకధాటిగా నడిచాడు.

ఆ తర్వాత నడవడానికి వీల్లేక చేతులు మోపి, నాల్రోజులు నడిచాడు. ఆ తరువాత దారి మరీ ఇరుకైపోయేసరికి ప్రాకవలసి వచ్చింది. అలా ఎనిమిది రోజులు ప్రయాణించాక, ఆ మర్రి కొమ్మకు అంతం కనిపించింది. అక్కడ అతనికొక వింత కనిపించింది.

ఆ ప్రాంతమంతా దట్టమైన పొగ ఆవరించి ఉంది. అది మాయమై పెద్దకాంతి కనిపించింది. ఇంకా అలా నిదానించి చూసేసరికి ఎత్తుగా మెరుస్తున్న భవనాలు కనిపించాయి. 'చెట్టుకొమ్మ అంతు చూసేశాం. ఇక వెనక్కు తిరిగి వెళ్లిపోవచ్చు! కాని ఇంకా చాలా గడువు ఉంది కదా!' అనిపించి ఆ మేడలో విశేషాలు చూసి రావాలనుకున్నాడు.

అదొక పట్టణం. కానీ అక్కడో మనిషైనా లేడు. పిట్టల్లాంటి జీవులూ కనిపించలేదు. భవనాల తలుపులన్నీ మూసివేసి ఉన్నాయి. జనుల్లోపలైనాలేరేమో! కానీనుని పట్టణం కంటె చిత్రంగా ఉంది.

అన్ని వీధులూ ఒకేలా ఉండడంతో - అతడు తిరిగిన వీధుల్లోనే మళ్లీ మళ్లీ తిరుగుతూ, చివరికి ఒక కొత్త వీధిని ఎలాగో కనుక్కోగలిగాడు. ఇక అక్కడ కూడా మనుషులెవరూ కనబడకపోతే, వెనక్కు తిరిగి పోదాం అనుకున్నాడు. ఇంతలో ఒక పెద్ద కోట కనిపించేసిరికి, అందులో మనుషులుంటారనిపించింది. దానికి ద్వారం ఎక్కడ ఉందా? అని పరీక్షగా కోట చుట్టూ తిరిగి వచ్చాడు గాని, ద్వారం మాత్రం కనిపించలేదు.

అటువంటి భవనానికి ద్వారం ఉండకుండా ఎలా ఉంటుందని ఆలోచించి, మరింత పట్టుదలగా నేల భాగాన్ని కూడా పరిశీలిస్తూంటే ఒకచోట ఒక గొళ్లెం కనిపించింది. దాన్ని పైకి లాగేసరికి, గుహవంటి గుమ్మం ఒకటి తెరుచుకుంది. చీకటిగా ఉన్నా ముందుకు నడిచాడు వసంతుడు. అతడు ప్రవేశించడంతో - ఆ గుమ్మం దానికదే మూసుకుపోయింది.

మొట్టమొదట అతనికెవరూ కన్పించలేదు. అందులోంచి అలా వెళ్తూండగా ఒక ఉద్యానవనం కనిపించింది. అక్కడ్నుంచి మరికొంత ముందుకు సాగగా - ఒక చక్కని మేడ దానికి మెట్లు, పై అంతస్తు, అంతఃపురం ఒకదాని వెంట ఒకటిగా కనిపించాయి. అతడా అంతఃపురంలో ప్రవేశించాడు.

అక్కడో హంసతూలికా తల్పంమీద, అద్భుత సౌందర్యరాశి అనదగ్గ ఒక కన్య నిద్రిస్తూ కనిపించేసరికి, ఆమె సౌందర్యానికి అబ్బురపడి నిజంగా ఇంత సుందరీమణులు ఎక్కడైనా ఉంటారా? అనుకుంటూనే ఆమెకు నిద్రాభంగం కలిగించడం ఇష్టంలేక, వసంతుడు అక్కడే ఉండి ఆమె సౌందర్యం ఆస్వాదిస్తూ ధన్యుడౌతున్నాడు.

ఈలోగా ఆమె మేలుకొని తదేకంగా తనను కళ్లతోనే తాగేస్తున్న వసంతుడ్ని చూసి, అతడ్ని పురుషుడిగా ధృవీకరించుకుంది. దానిక్కారణం - ఆమె అంతవరకు పురుషుడ్ని చూసి ఎరుగకపోవడమే!

"నువ్వు ఈ రాక్షసభవనానికి ఎలా వచ్చావు? నీదే దేశం? నీకు ఇక్కడికి రావాలని ఎలా అనిపించింది? నీ పేరేమిటి? నా ఆతిథ్యం స్వీకరించు" అంది.

వసంతుడు తన గురించి అంతా చెప్పాడు. తరువాత - అతడు ఆమె వివరాలు అడిగాడు. "నా పేరు కళావతి. ఈ నగరాన్ని ఒక బ్రహ్మరాక్షసి పరిపాలిస్తోంది. అది ఎక్కడెక్కడి దేశాలనుంచో దోచుకొచ్చిన ధనాన్ని అంతటినీ భవనాల్లో పెట్టి తాళం వేస్తుంది. వారానికోసారి వచ్చి ఇక్కడ మేడ కట్టి తాను తెచ్చిన డబ్బును అందులో ఉంచి ముద్రవేసి వెళ్తుంది. ఈ భవనాలన్నీ అలా కట్టినవే!

అదొకరోజున , నా జన్మభూమి అయిన అవంతీదేశం మీద మహమ్మారిలా పడి, నా తల్లిదండ్రుల్ని చంపి, రెండేళ్ల వయస్సున్న నన్ను మాత్రం ఏమీ చెయ్యక ముద్దుచేస్తూ నన్ను ఇక్కడికి నా బంగారు తూగుటుయ్యాలతో సహా తెచ్చేసి నన్ను కన్నకూతురిలా పెంచుతోంది. బాల్యం నుంచీ నన్ను పెంచడం వల్ల దాన్నే నేను తల్లిగా భావిస్తున్నాను.

అది వారానికోసారి వచ్చి నాకు విద్యలు నేర్పుతూ, ఎక్కడెక్కడో

జరిగిన వింతలూ – విశేషాలూ చెప్తూంటుంది. అందువల్ల నేను ఇంతవరకూ పురుషుడ్ని చూడకపోయినా, నిన్ను మర్యాదగల రాచపురుషుడని గ్రహించగలిగాను

"మా కోటలో ఉన్నన్ని వింత వస్తువులు ఇంకెక్కడా ఉండవు. మా రాక్షసి తల్లి నిన్ననే వచ్చి వెళ్లింది. కనుక వారం వరకూ రాదు" అని చెప్పిందామె.

కళావతి సౌందర్యాన్ని మోహించి వసంతుడామెను ముద్దు పెట్టుకుని గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆమె అతడికి తన్ను తాను అర్పించుకుంది. అతనికి చక్కని విందుచేసింది. ఐదురోజులపాటు ఇద్దరూ ఉద్యానవనంలో రాసకేళీ విహారాలు చేశారు. మన్మథ సౌఖ్యాలు అనుభవించారు.

ఆరో రోజున కళావతి "ఈరోజు మా రాక్షసి తల్లి వస్తుంది. అంచేత నిన్ను ఉడుములాగ మార్చి గోడకు అంటిస్తాను. మా రాక్షసి వచ్చి వెళ్లేదాకా అలాగే ఉంటే, ఆమె వెళ్లగానే నీ రూపం నీకు తిరిగొచ్చేలా చేస్తాను. మనం సుఖించవచ్చు!" అంది.

రాక్షసి నేర్పిన విద్య ఉపయోగించి, కళావతి వసంతుడిని ఉడుముగా మార్చేసింది. అంతలో బ్రహ్మరాక్షసి వచ్చింది. ఆమె ఎదురేగి ఆహ్వానించింది. భోజనం కాగానే, అటూ ఇటూ చూసి "అమ్మాయీ! నేడు మన ఇంట నరవాసన వస్తోందే!" అంది.

"ఈ అడవిలోకి మానవులు రాగలరా? వచ్చినా ఈ కోటలోకి రావడం కష్టం కదా! నేను మనిషిని. నా వాసన నీకు పడదు. నరవాసన రాకూడదనుకుంటే మాత్రం రాకపోతుందా? నన్ను చంపేస్తే, ఇక నీకు వాసన బెడద ఉండదు" అని నిష్ఠూరమాడింది కళావతి.

రాక్షసికి పెంచిన ప్రేమ ఒక్కుమ్మడిగా కమ్ముకొచ్చి "అదేం మాట తల్లీ? నిన్ను చంపేయడానికా అంత అల్లారుముద్దుగా పెంచిందీ?" అంటూ కూతుర్ని ఓదార్చి వింతలు చెప్పి నిద్రపోయి, మర్నాడుదయం వెళ్లిపోగానే ఉడుమును వసంతునిగా తిరిగి మార్చేసింది.

చక్కగా స్నానం చేసి అలంకరించుకుని వసంతునికి విందు చేసింది. ఆ తర్వాత ఇద్దరూ శృంగారకేళిలో మునిగిపోయారు. ఇలా కొంతకాలం

గడిచేసరికి, వసంతుని బోధలు తలకెక్కి, ఆ రాక్షసి చెరనుంచి తప్పుకొని స్వేచ్ఛగా సుఖించడానికి ఒక పథకం సిద్ధం చేసుకున్నారిద్దరూ. వసంతుడు బోధించిన ప్రకారం - రాక్షసి మీద అపారమైన ప్రేమ కన్పరుస్తూ, కళావతి ఆ బ్రహ్మరాక్షసి ఆయువుపట్లు తెలుసుకుంది. అది తన ప్రాణానెక్కడ దాచిందీ దాని నోటనే చెప్పించింది. బ్రహ్మరాక్షసి ప్రాణం చాలా గట్టిది.

ఆ కోటకు ఉత్తరంగా నవరత్నాలు తాపడం చేసిన మెట్లు గల్గిన ఒక చెరువున్నది. అందులో స్నానం చేసి ముమ్మారు ప్రదక్షిణ చేస్తే పడమటి వైపు ఓ అరటితోట - ఆ తోటలోని చెట్ల మధ్య వింత ఆకుల్తో ఒక చెట్టు - దానికున్న పళ్లు అన్నీ ఖండిస్తే తాళం వేయబడిన ఇనుపపెట్టె - అది తెరిస్తే రత్నాలగోడల పాతాళగృహం - అందులో మణులు చెక్కిన స్తంభమంటపం - అక్కడో బంగారు పన్నె పంజరంలో ఐదురంగుల రామచిలుక. ఆ చిలుకలో ఉంది ఆ రాక్షసి ప్రాణం.

తెల్లవారి - రాక్షసి వెళ్లిపోయాక, దాని ఆయుర్దాయం రహస్యం పూసగుచ్చినట్లు వసంతుడికి వివరించింది కళావతి. దాని ప్రాణ రహస్యం తెలిశాక వసంతుడిక ఆలస్యం చేయదల్చుకోలేదు. వరుసగా ఒకదాని వెంట ఒకటి ఛేదించుకుంటూ, చివరికి దాని ప్రాణం తీశాడు. అటువంటి దుష్టురాలిని అంతంచేసినందుకు దేవతలు సైతం సంతోషించారు.

ఇన్నాళ్లూ తనను పుత్రికా వాత్సల్యంతో పెంచినందువల్ల, ఆమె మృతకళేబరాన్ని చూస్తానని కళావతి అనగా, ఆమెను తీసుకెళ్లి ఆ రాక్షసి దేహాన్ని చూపించి, అగ్ని సంస్కారం జరిపించాడు. తర్వాత ఇద్దరూ శుచిస్నానం కోసం సముద్రానికి వెళ్లారు. అప్పుడామె కుడిచేతికి ఉండే నవరత్న ఖచిత కంకణం సముద్రంలో జారిపడిపోయింది.

"దానికోసం వెతకడం వ్యర్థమని - తన కంసాలి మిత్రుని చేత అటువంటిది చేయిస్తానని" మాట ఇచ్చాడు వసంతుడు. కాని, అది దివ్య కంకణం అనీ, ఆకాశగంగాస్నానం నిమిత్తం దేవతలు భూలోకానికి వచ్చినపుడు, రాక్షసి ఆ కంకణాల జత ఎత్తుకొచ్చింది. ఒక కంకణం ఇప్పుడు పోగొట్టుకోగా, రెండోది ఆమె ఎడమ చేతికి మిగిలింది.

సముద్రంలో పడ్డ కంకణాన్ని చేప మింగింది. అది వంగదేశ

ప్రాంతంలో ఒక జాలరికి దొరకగా, ఆ చేప బహుమతిగా వంగదేశాధీశుడైన కందర్పకేతుని చెంత చేరింది. అతడు దాన్ని వండించడానికి కోయించినపుడు, ఆ కంకణం బయటపడగా, అలాంటిది భూలోకంలో ఉండడం అసాధ్యమనీ – ఆ దివ్య కంకణాన్ని ధరించిన స్త్రీ మహా అందగత్తె అనీ గ్రహించాడు. అటువంటి సౌందర్యరాశిని తీసుకొచ్చి తనకు అప్పగించిన వారికి అర్ధరాజ్యం ఇస్తానని ప్రకటించాడు. అది ఆధారరహితమైనదని చాలామంది అనుకున్నారు......ఎవరూ ఆ సాహసం చేయలేదు.

కాని, ఒకరోజు ఆ వూళ్లో వున్న వృద్ధవనిత ఒకతె, ఆ రత్న కంకణం రూపురేఖలు పరిశీలించి "దేవరవారు కోరిన కాంతను తీసుకురావడానికి ఒక ఓడ, అందులో సకలసదుపాయాలు ఏర్పాటుచేస్తే అదేమీ అసాధ్యం కాదు" అంది. వృద్ధురాలు అంత నమ్మకంగా చెప్తూంటే కాదనలేక, రాజు ఆమెకు అన్నీ సమకూర్చాడు.

ఆమె చాలా జాగ్రత్తగా పడవను జాలరి చెప్పిన దిక్కుగా నడిపించింది. కొంతకాలానికి ఆమె కళావతీ – వసంతుల కోటగల పట్టణాన్ని చేరుకుంది. కళావతి స్వర్ణకంకణం అల్లంత దూరాన చూస్తూనే, "దొరికింది అర్ధరాజ్యం" అనుకుంటూ లోలోపల సంతోషించి, వాళ్లిద్దరూ తన దగ్గరకొచ్చేలోగా జుట్టు విరబోసుకుని సముద్రతీరాన కూర్చొని ఏడవసాగింది.

ఆ ఉదయం వ్యాహ్యాళికి అటు వచ్చిన కళావతీ – వసంతులు, ఆమె దుస్థితికి విచారించగా, తమతోపాటు వచ్చి, తనకో తల్లి లేనిలోటు తీర్చుమన్నది కళావతి. తన పాచిక పారినందుకు వారి వెంట వెళ్లిందా వృద్ధురాలు.

కొన్నాళ్లపాటు నమ్మకంగా ప్రవర్తించి, వసంతుడు ఆమె చెంతలేని సమయం చూసి, వసంతుని ప్రాణ రహస్యం తెలుసుకోమని నూరిపోసింది. అతడు తన ప్రాణం ఒక కత్తి వొరలో దాచానంటూ అసలు రహస్యం చెప్పేశాడు.

కొన్నాళ్లు గడిచాక – ఆ దంపతులు అలసి – సొలసి గాఢనిద్రలో మునిగి ఉండగా, ఆ నీచ వృద్ధురాలు దూరంగా వెళ్లి ఒక రాతి మీద, రాజుకుమారుడైన వసంతుడి కత్తి ఒరను అరగదీయసాగింది.

వసంతుడు మరణవేదనతో కొట్టుకుంటూంటే - అప్పుడు అనుమానం వచ్చింది కళావతికి. అది ప్రాణరహస్యం తెలుసుకుంది గనుకనే తన భర్తకీ వేదన అని గ్రహించి, ఆ ముసలిదాన్ని వెతికిపట్టుకుని - "ఆయన నీకేం అపకారం చేశాడే - ఆయన్ని పొట్టన బెట్టుకో జూస్తున్నావు" అంటూ ఆ ముసల్దాని చేతిలోంచి ఒర లాక్కుంది.

"అతడు చెప్పింది నిజమో - కాదో పరీక్షిస్తున్నా! మరేం పర్వాలేదులే అపస్మారక స్థితిలో ఉన్న సిద్ధౌషదంతో బ్రతికిస్తాగా! సముద్రజలంతో స్నానం చేసి వద్దాం! పద!" అంటూ ఆమెను దోనె ఎక్కించి సముద్రంలో తన ఓడ లంగరువేయబడిన చోటుకు తీసుకెళ్లి, ఏదో నెపం మీద కళావతి కళ్లు మూసి క్షణంలో ఓడలోకి ఎక్కించింది.

కళావతి కళ్లు తెరచి చూసేసరికి, తాను ఒక ఓడలో ఉన్నట్లు గ్రహించి ఇక ఆ ముసల్దాన్ని నమ్మిక ప్రతిఘటించసాగింది. కాని ఆ వృద్ధురాలు మహాఘటికురాలు కావడంతో, మారు మాట్లాడకుండా కళావతిని ఒక గదిలో పెట్టి తాళం బిగించేసింది.

"నీ భర్త కంటె రూపంలో - ఐశ్వర్యంలో అధికుడైన వాడిని నీకు భర్తగా కూర్చుతాను. ఆ ఒంటరి కోటలో మరణించబోయే భర్తతో నువ్వేం సుఖపడతావు?" అని రోజూ బాధించసాగింది.

ఓడ వంగదేశాన్ని చేరుకుంది. ఫిరంగధ్వని విని, ఆ వృద్ధురాలు కార్యం సాధించుకొచ్చిందని గ్రహించాడు కందర్పకేతుడు.

అప్పటికప్పుడే ఆమెను చేపడతానన్నాడు రాజు. కొన్నిరోజులు మచ్చికైతే గాని, ఆమె నిన్ను వరించదు" అని వారించింది వృద్ధురాలు.

అప్పుడా కందర్పకేతుడు ఆమెను అపూర్వమైన అంతఃపురంలో చేర్చి కొన్ని రోజుల తర్వాత ఆమెను కోరగా, ఏదో ఒక వ్రతం సాకుగా చెప్తూ సంవత్సరం పాటు గడువు విధించింది. ఎప్పటికి ఆమె తనను ఒప్పుకుంటుందా? అని ఎదురుచూడసాగాడతను.

"గోపాలా! ప్రయాణసమయమైంది. పద వెళ్దాం! పై కథ ముందటి మజిలీలో చెప్తా" అని యతీశ్వరుడు అనగా, వాడు తర్వాయి కథ వినవేగిర పడుతూ కావడి ఎత్తుకొని, ఆ సన్యాసితో నడవసాగాడు.

# కాశీమజిలీ కథలు

## 3వ మజిలీ

ఆ యతివరుడు మౌనంగా నడుస్తూంటే, వాడు విన్న కథంతటినీ జ్ఞాపకానికి తెచ్చుకుంటూ, మధ్యలో ఒకసారి "అయ్యా! ఆ వసంతుడు మళ్లీ బతికాడా?" అని ఒకసారి, "ఆ రాజకుమార్తెను కలుసుకున్నాడా?" అని ఇంకొకసారి ; "మిత్రులను కలుసుకున్నాడా? అందరూ కలిసి ఇంటికెళ్లారా?" అని మరొకసారి అడుగుతూంటే, మణిసిద్ధుడు అతడ్ని మౌనంగా ఉండవలసిందని చేతి సంజ్ఞతో వారించి మధ్యాహ్నపు మజిలీ చేరాడు.

అతడు ఎప్పటిలాగానే అనుష్ఠానం అంతా తీరాక వంట చేసుకొని భోంచేసి, అలసట తీరిన కొంతసేపటికి ఒక చల్లని ప్రదేశంలో కూర్చొని భోజనమైనది మొదలు కథ చెప్పమని వేపుతూన్న ఆ గొల్లవానికి ఇలా చెప్పసాగాడు........గోపా! వినుము......

### రాముని కథ

అట్లా ఆ దక్షిణదిశగా మర్రికొమ్మమీద మంత్రికుమారుడు రాముడు ప్రయాణమైన ఆర్రోజులకు ఆ మర్రి కొమ్మ అంతాన్ని చూడగలిగాడు. అది ఒక పర్వతప్రాంత భూమి. అక్కడి విశేషాలు చూద్దామని ఆ చెట్టుకొమ్మ దిగాడు- ఊడపట్టుకొని.

ఒక గొప్ప పర్వతం కనిపిస్తే, దాని ఎత్తు ఎంతో తెలుసుకోవడానికి తిరిగి పైకి ప్రయాణం ప్రారంభించాడు. ఆర్రోజులపాటు ఎక్కినా దాని శిఖరాన్ని చేరుకోలేకపోయాడు.

ఎక్కిన కొద్దీ అంతుదొరకని ఆ పర్వతం ఇక ఎక్కడం వృధా అనుకొని, మరలిపోదామనుకొనేంతలో ఒక గుహ కన్పించేసరికి, అది

రాత్రి గనుక సందేహించి, మరునాటి ఉదయమే ధైర్యసాహసాలు కూడదీసుకుని గుహలో ప్రవేశించాడు.

రాన్రాను మార్గం సన్నబడి ముందుగ్గాని - వెనక్కుగాని వెళ్లలేని స్థితి ఏర్పడేసరికి, 'నా అతిసాహసమే నన్ను ఈ పనికి పురిగొల్పినందున, అదే కొనసాగిస్తాను' అనుకుంటూ అతికష్టంమీద ఇంకో రెండు బారలు ముందుకే ప్రాకేసరికి వెలుగు కనిపించింది. అలాగే మరోపది అడుగుల మేర సాగేసరికి ఒక ద్వారం చేతికి తగిలింది. అది లాగేసరికి పట్టపగటి వెలుగును తలపించే దివ్యతేజస్సుతో ఒక ముని తపస్సు చేసుకుంటూ కనిపించాడు.

రాముడు అతని పాదాలపై వాలిపోయాడు.

ఆ మహర్షి కళ్లు తెరచి "నువ్వెవరు? ఇక్కడికెలా రాగలిగావు? అని అడిగి, రాముడి కథ విని "నేను పన్నెండేళ్లకోసారి బాహ్యప్రపంచాన్ని చూస్తాను. ఆరోజు ఇవాళే కనుక నువ్వు బతికిపోయావు. లేకపోతే నా శాపానికి దగ్ధమైపోయేవాడివి! సరే! ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు.

అక్కడ్నుంచి బయటపడాలన్న ఆత్రంలో ఉన్నందున అదే కోరిక కోరాడు రాముడు. తక్షణం అతడు పర్వతానికి అవతల ఉన్నాడు.

"అయ్యో! ఆ మర్రిమాను మొదలునైనా చేర్చమని అడిగాను కాను. ఇప్పుడా వటవృక్షం ఎటుందో తెలీదు" అనుకుంటూనే నడవసాగాడు.

సాయంత్రం దాకా నడిచినా ఏ గ్రామమూ తగల్లేదు. ఒక మామిడి చెట్టు కన్పిస్తే, దాని నీడన మేను వాల్చాడు. నిద్రపట్టక అలాగే కళ్లు మూసుకున్నాడు. చెట్టు మీది గరుడపక్షుల భాష తెలిసినందున, వాటి మాటల్ని బట్టి అక్కడకు రెండు యోజనాల దూరంలో ఒక పట్నపు రాజుగారి కూతురికి అకారణంగా దృష్టి అంతరించిపోయిందనీ - ఆమెకి చూపు తెప్పించిన వారికి ఆమెనిచ్చి పెళ్లి చేస్తాననీ ఆ రోజు చాటింపువేయించినట్లు తెలిసింది. అందుకు వైద్యం కూడా అవే మాట్లాడుకున్నాయి. వాటి గూట్లోనే ఉన్న పసికాష్టం అరగదీసి, ఆ గంధాన్ని ఆమె కళ్లకు పట్టిస్తే తప్ప ఇంకే వైద్యానికీ ఆమె చూపు సరిగ్గా రాదు. అనే సంగతినీ గ్రహించాడు రాముడు.

మర్నాడు, రాముడు చెట్టెక్కి ఆ పసికాష్టం తీసుకొని, ఆ పట్టణాన్ని చేరుకున్నాడు. రాజకుమార్తె నేత్రదృష్టి సరిచేస్తానని అతడు చెప్పగానే, అతడ్ని రాచనగరుకు తీసుకుపోయారు. అయితే - అప్పటికే చాలామంది రకరకాలుగా ప్రయత్నించినా, ఆమెకు చూపు తెప్పించలేకపోయేసరికి, రాజు నిరాశ చేసుకుని ఉన్నాడు.

అయితే, రాముని వాక్చాతుర్యానికి అబ్బురపడి, "ఏమో! ఇతడి వల్ల తన కుమార్తె చూపు చక్కబడునేమో" అని నమ్మి అంతఃపురానికి భటుల్ని - పరిచారికల్ని తోడుగా పంపాడు. పసికాష్ఠం అరగదీసి - ఆమె కన్నులకు పూసి దృష్టి చక్కబరిచేసరికి, అంతా ఆనందించారు. ఆ పిల్ల రాముడిని వలచి "నువ్వే నా భర్తవు" అంటూ అనురాగపూర్వకంగా పలికింది.

ఓ శుభముహూర్తాన ఇద్దరికీ వివాహం జరిగింది. కొన్నాళ్ల తర్వాత, తానెవరో - తన మిత్రుల కథేమిటో చెప్పి వెళ్లివస్తానని - త్వరలోనే కలుసుకుందామనీ ఆమెని ఒప్పించి అక్కడ్నుంచి బయల్దేరాడు.

రాముడు అరణ్యమార్గాన గుర్రం మీద వెళ్లి, రోజంతా ప్రయాణించి, ఎండ వేడిమికి తాళలేక ఒక చోట విశ్రమించగా - త్రుటిలో అతనికి ప్రాణాపాయం తప్పింది. గుర్రాన్ని మృత్యువు రూపంలో వచ్చిన ఓ సింహం ఈడ్చుకుపోయింది. అప్పుడతడు నిరాయుధుడు కూడ.

ఇంతలో ఉన్నట్టుండి ఆకాశంలో కారు మబ్బులు కమ్ముకొనే సరికి, ఉరుములు - మెరుపులతో దట్టంగా వర్షం పడసాగింది. ఆ మెరుపు వెలుగులో ఒక గుడి కన్పించేసరికి, రాముడు అందులో ప్రవేశించి జల్లు వల్ల తడిసిన తన వస్త్రాలు పిండుకోసాగాడు. అలా ఒకచోట లోపలే నిలబడగా - ఒక స్త్రీ ఆక్రందన, ఇద్దరు పురుషుల మాటలు విన్పించి, గర్భగుడిలోని చండిక విగ్రహం వెనుక దాగాడు రాముడు.

అప్పుడు - ఒక స్త్రీని వెంటబెట్టుకొని ఇద్దరు దొంగలు, ఆ గర్భగుడిలో ప్రవేశించారు. ఆ స్త్రీ మెరుపుతీగలా ఉండడాన్ని రాముడు విగ్రహం చాటునుంచి చూశాడు. దొంగలు మాత్రం కాటుకకొండల్లా నల్లగా

భయంగొలుపుతున్నారు. ఆ దొంగల సంభాషణను బట్టి - అప్పటికి తొంభైతొమ్మిది రాచకన్నెల్ని వాళ్లు బలి ఇచ్చారని - వాళ్లు ఇప్పుడివ్వబోయే కన్య నూరవది అని - బలిచ్చిన కన్యల్లో కెల్లా ఆమె అందమైనదనీ - అందువల్ల వారిలో ఒకడు ఒక్కసారి ఆమెతో సంభోగించి ఆ తర్వాత బలి ఇవ్వాలనుకుంటున్నాడనీ - రెండో వాడు అభ్యంతరం చెప్పగా, ఇంకొకడు మరో రాచకన్యను తెద్దామనీ అనుకొని చివరకు బలివ్వడానికే నిశ్చయించుకున్నారు.

అలా మాట్లాడుకుని, ఇద్దరూ నిద్రపోగా, రాముడు విగ్రహం చాటునుంచి వెలుపలికి వచ్చి, నిద్రపోతున్న వారిని చంపకూడదు గనుక వారి దగ్గర్నుంచి కత్తుల్ని స్వాధీనం చేసుకున్నాడు.

తెల్లారాక, వాళ్లు కత్తులకోసం వెతుక్కొంటూంటే, రాముడు కత్తుల్తో వారి ముందుకు ఉరికి, "చండికకు బలివ్వడానికి తెచ్చిన రాచబిడ్డని చెరపదలచారు. మీ పాపం ఊరకేపోదు! నేను శక్తి సేవకుడిని" అని బెదిరించగా, వాళ్లు నోట మాటరాక కొయ్యల్లా నిలబడ్డారు.

ఇద్దరూ ఒకరికొకరు సైగ చేసుకుని పారిపోబోగా, ఆ ఇద్దరి తలలూ తెగనరికాడు రాముడు. ఆలయ మంటపం మీద స్పృహకోల్పోయి పడి ఉండి - అప్పుడప్పుడే కాస్త తెప్పరిల్లుతూన్న ఆ తేజస్విని, కళ్లు తెరచి చూసి "మహాత్మా! తామెవరో - నన్ను ఉద్ధరించ వచ్చిన వారిలా ఉన్నారు" అంటూ నమస్కరించి, తన వృత్తాంతం చెప్పేముందు, రాముడు వృత్తాంతాన్ని చెప్పమంది. రాముడు తన విషయాలన్నీ చెప్పగా "అయితే మీరు నాకు బావగారౌతారు. ఎందుకంటే నా పినతల్లి కూతురే - మీ భార్య పద్మగంధి. దానికి నేత్రవ్యాధి నయం చేసింది మీరేనన్నమాట! కనుక మీకు మరదలినైన నన్ను పెళ్లాడవచ్చు! దుర్మార్గుల బారిన పడిన నాకు ప్రాణదానం చేసినందుకు నా తనువును మీకు అర్పించుకుంటున్నాను" అనేసరికి రాముడామెను కౌగిలించుకున్నాడు.

ఆ సాయంకాలం వేళకు ఆమెతో కలిసి ఒక కోయపల్లెను చేరుకున్నాడు. ఆ కోయదొరకు మంత్రాలు తెలుసు! కనకప్రభ అందాన్ని

చూసి, ఆమెను ఎలాగైనా పొందాలనుకున్న ఆ కోయదొర, వారికి ఆతిథ్యం ఇచ్చి, ఆ రాత్రి రాముడి మీద మంత్రపు బియ్యపు గింజలు చల్లి కుక్కగా మార్చేసి, తన ప్రతిపాదన కనకప్రభతో చెప్పాడు. ఆమె భర్తని కుక్కగా మార్చేసిన సంగతీ చెప్పాడు.

వివేకవంతురాలైన కనకప్రభ కోయదొరతో విరోధపడి లాభమేమీ లేదని గ్రహించినదై, కోయవాడ్ని మాయతోనే వంచించాలని తలచి "నీకు ఇదివరకు ఉన్న భార్యతో జగడం వస్తే నువ్వు భరించగలవా? కనుక మనం దేశాంతరం పోదాం! అక్కడైతే మన సుఖానికి ఎవరి వల్లా అడ్డుండదు" అని చెప్పేసరికి, వాడు తలూపాడు. అందర్నీ వదిలేసి ఆమె వెనుకపడ్డాడు.

వాళ్లు ఆ కుక్కనూ, కత్తినీ, దారి బత్తేన్నీ తీసుకొని బయల్దేరారు- వంగదేశ రాజధాని హేలాపురికి, అక్కడ సత్రం ప్రాంతంలో ఉన్న ఓ మఠంలో బైరాగికి కుక్కని మనిషిగా మార్చే మంత్రం తెలుసునన్నాడా కోయవాడు. విషయం రాబట్టాక అతడ్ని చంపేసింది కనకప్రభ.

ఊరకే ఒకరికి అపకారం చేయాలని తలపెడితే, అలాంటివాడు భూమ్మీద ఎక్కువకాలం జీవిస్తాడా?" నా రూపమే కదా - నన్ను ఇన్ని పాట్లుపెట్టింది! ఈ రూపాన్ని కప్పిపుచ్చుకోవడమే మార్గం" అనుకొని మసిపూసుకుని, ఆ కోయగుడ్డలతో వికారమైన పురుషవేషాన్ని ధరించింది కనకప్రభ.

ఓ చేతిలో కుక్కమెడకు కట్టినతాడు, ఇంకో చేత్తో ఆత్మరక్షణ నిమిత్తం కత్తిపట్టుకుని ఎన్నెన్నో కష్టాలకోర్చి, ఆ కోయవాడు చెప్పిన హేలానగరం చేరుకున్నది. ఆ వంగదేశపు రాజధాని నగరం పొలిమేరల్లో సత్రం ఎక్కడుందో - మఠం ఎక్కడుందో అనుకుంటూ.

ఇంతవరకు చెప్పాక ప్రయాణ సమయం కావడం వల్ల స్వాములవారు అంతటితో కథ చాలించి, కావడి ఎత్తుకుని గొల్లవాడికి చెప్పి, వానితో సహా క్రమంగా నాల్గవ మజిలీ చేరి, అక్కడ భోజనమైన తర్వాత సుఖాశీనుడై, ఆ గోపాలునకు తరువాత కథను ఇలా చెప్పసాగాడు....

# కాశీ మజిలీ కథలు

## 4వ మజిలీ

### ప్రవరుని కథ

గోపా! అడవిలో మఱ్ఱిమాను యొక్క పడమర కొమ్మనెక్కి బయల్దేరిన ప్రవరుడు, మూడు రోజుల తర్వాత దాని అంతం కనుక్కొన్నాడు . అతడు అంతటితో ఊరుకోక, ఇంకా చాలా వ్యవధి ఉన్నందువల్ల అక్కడేమైనా వింతలుంటే చూద్దామని కొమ్మదిగి, అడవి వలె కనిపిస్తున్న ఆ ప్రాంతంలో ఎదురుగా కనబడిన సన్నటి కాలిబాట వెంట నడవసాగాడు.

కొంతదూరం వెళ్లేసరికి విచ్చుకత్తులు పట్టుకున్న దొంగలెదురై అతని దగ్గరున్న విలువైనవన్నీ దోచేసి కట్టుగుడ్డలు మిగిల్చిపోయారు. ఇక తన దగ్గర దోచుకోడానికేదీ లేదు గనుక, అతడు ఎంతో తేలికపడిన మనసుతో, ఆ దారి వెంట ముందుకు సాగడానికే నిర్ణయించుకుని, సాయంత్రం వేళకు ఒక పట్నం చేరాడు.

అమావాస్య సమీపిస్తున్నందున అంతా చీకటిగా ఉంది. తనకే బ్రాహ్మణుడైనా భోజన సదుపాయం కల్పించకపోతాడా అని, ఆ పట్టణంలో బ్రాహ్మణ గృహం కోసం వెతుక్కుంటూ ముందుకు సాగి, చివరికేదీ దొరక్క గుఱ్ఱాల శాలలో కెళ్లి పడుకొన్నాడు. ఆకలి వల్ల నిద్రపట్టలేదు. ఇంతలో అంతఃపురం గోడమీద నుంచి ఒక ఇనుపగొలుసు – దాన్ననుసరించి పూల తీగలాంటి ఒక పదహారేళ్ల పడుచు కిందకు దిగగానే ప్రవరుడు, తర్వాతేం జరుగుతుందో చూద్దామని నిద్ర నటించి కళ్లు మూసుకున్నాడు.

ఆ పిల్ల ప్రవరుని దగ్గరగా చేరి, అతని వీపు తడిమి, లెమ్మని ఒక గుఱ్ఱం చూపించి ఎక్కమన్నది – ఆమె ఇంకో గుఱ్ఱాన్ని ఎక్కి, దారి తీసేసరికి,

చీకట్లో ఆమె ఎవరో - ఎందుకు తనను గుర్రం ఎక్కమన్నదో - ఎటు తీసుకెళ్లనున్నదో అనే ఆలోచనైనా లేకుండా అతడామెను అనుసరించాడు. పడమటి దిశగా ఇద్దరూ గుర్రాలమీద పోసాగారు.

మణిసిద్ధుని మాటలకు అడ్డం వచ్చిన గోపాలుడు "ఆమె ఎవరు ఎన్నడూ ఎరుగని ప్రవరునితో, కోట గోడ సైతం దిగిన ఆమె ఎందుకు వెళుతోంది" అని ప్రశ్నించాడు.

వాడి కుతూహలానికి సంతోషించాడు మణిసిద్ధుడు.

"ఆమె పేరు కాంచనవల్లి. ఆ నగరాధీశుని కూతురు. యవ్వనం అంకురించేదాకా ఆ పిల్లను సకలశాస్త్రాలూ తెలిసిన ఓ గురువు వద్ద చదవ్వేశాడు. ఆమెతోపాటే మంత్రి కుమారుడు జయంతుడు కూడా అక్కడ చదువుతూండగా వారి మధ్య ఏర్పడిన ప్రగాఢమైన స్నేహం ప్రేమానురాగాలై వృద్ధి చెందింది. వాళ్లిద్దరూ విద్యాభ్యాస వేళల్లోనే గాక, మిగతా సమయాల్లో కూడా ఒకర్ని విడిచి ఒకరు ఉండేవారు కారు. కలిసి ఆ ఇద్దరూ సకల శాస్త్రాలూ అభ్యసించారు.

ఆమె యవ్వనారంభవేళ, ఇద్దరికీ ఎడబాటు కలిగింది. కాని, జ్ఞానం వచ్చినప్పటినుంచి అతడ్నే పెళ్లాడాలని కోరుకున్న కాంచనవల్లి ఏదైనా ఒక ఉపాయం ఆలోచించమన్నది. అతడు దేశం విడిచిపారిపోవడం కంటే గత్యంతరం లేదు' అన్నాడు.

"అయితే ఎల్లుండి అమావాస్యరోజున నేను గుర్రాలశాలకొస్తాను. ఆ రాత్రి అట్నుంచటే మనం వెళ్లిపోదాం!" అని నిర్ణయించుకున్నారు.

మంత్రికొడుకు సాయంత్రం నుంచే ప్రయాణానికి తగినవన్నీ సిద్ధం చేసుకోసాగాడు. అయితే - తలవని తలంపుగా ఆ రోజు అదే సమయానికి, సంగీత విద్యాప్రవీణురాలైన ఒక వేశ్యను రాజసభలో పరీక్షించే భారం ఆ యువకుని పై పడింది. అతడు రాజసభకు వెళ్లక తప్పలేదు. ఆ సంగతి రాజకుమార్తెకు తెలీక - అనుకున్నట్లుగానే అర్ధరాత్రి గుర్రాల శాలకు వచ్చింది. అక్కడ పడుకున్నది జయంతుడే కాబోలు అనుకుని, ఆ యువకుని బయల్దేరదీసింది.

"వెళ్తూ వెళ్తూ ఆమె తన గుర్రాన్ని అతని గుర్రం దగ్గరగా పోనిచ్చి "నేనీ ప్రయాణానికి మొన్నట్నుంచీ ఎంత ప్రయాసపడ్డానో తెలుసా? నిన్న రాత్రి కూడా ఒక అవాంతరం వచ్చింది. సంగీతసాహిత్యాల్లో నిపుణురాలట! ఓ గణిక రాజసభకొచ్చిందట! దాని నైపుణ్యం చూడమంటూ నా తండ్రి నాకు కబురంపగా, నేను తలనొప్పి అన్చెప్పి తప్పించుకున్నాను. నీ కిలాంటి అవాంతరాలేమీ ఎదురుకాలేదు గదా!" అని అడిగింది. ప్రవరుడప్పటికేదో తోచిన సమాధానం ఇచ్చి ఆ విషయాన్ని దాట వేశాడు.

సూర్యోదయం అయ్యాక, కాంచనవల్లి అతడ్ని చూసి జయంతుడనుకొని, చీకట్లో తాను పొరబడినందుకు పరిపరివిధాల పశ్చాత్తాపపడి, అప్పుడిక వెనక్కు వెళ్లలేక, దైవఘటన కెంతో చింతించి, ఎలా జరిగితే అలా జరుగుతుంది లెమ్మని ధైర్యం తెచ్చుకుంది.

ప్రవరుడామెను పలుకరించనైనా లేదు. కాలకృత్యాలు తీర్చుకున్నాక, దారిలో ఒక నది అడ్డం రాగా - కదలడానికి సిద్ధంగా ఉన్న ఒక ఓడని ఎక్కేశారు- గుర్రాలను అక్కడే వదిలేశారు.

కాంచనవల్లి - ప్రవరులు పడవ దిగి నడుస్తూంటే, ఆ పడవలోనే ఎక్కిన ఒక వృద్ధ బ్రాహ్మణి తానొక అనాధనని, వారిద్దరూ దయతలిస్తే - తాను వారికి వంట చేసి పెట్టగలనని ప్రాధేయపడింది. కాంచనవల్లి అంగీకరించింది. అదీగాక తను ప్రవరుణ్ణి వదిలేస్తే తనకు ఇంకా ప్రమాదం. తన సౌందర్యం తనకెక్కడ ముప్పు తెస్తుందోనని ఆమె ఆ వృద్ధ బ్రాహ్మణిని కూడా ఉండమన్నది.

అలా వాళ్లు ముగ్గురూ మధ్యాహ్నం వేళకు హేలానగరాన్ని చేరుకున్నారు. రాజకుమార్తెకు ప్రవరుని మీద ఎటువంటి భావము లేనందుకు ఆమె అతనితో మాట్లాడదు. అతడికీ రాకుమార్తె పట్ల ఏవిధమైన ఉత్సాహమూ లేనందున అతడామె ముఖమైనా చూడడు. వీరితోపాటు కలిసివుంటున్న అవ్వ, తన పని తాను చూసుకోవడమే తప్ప వీళ్ల విషయంలో కల్పించుకోదు. ప్రవరుడు భోజనం వేళకు తప్ప ఇంట్లో ఉండడు.

వారు సత్రానికి దగ్గరగా ఉన్న ఒక ఇంట్లో బసచేశారు. రత్నవ్యాపారి దగ్గర రత్నాలుగా చెలామణీ అయిపోతూ, రత్నాల్లో కలిసిపోయిన గాజు

రాళ్లు ఎన్నో వుండగా – రత్న పరీక్ష మెలకువలు తెలిసిన ప్రవరుడు ఎంతో నేర్పుగా వాటిని వేరుచేసి చూపించేసరికి, ఆ వర్తకుడు ప్రవరుని వదిలిపెట్టకుండా తన దగ్గర రత్న పరీక్షకునిగా చేరమన్నాడు. రోజు గడవడానికేదో ఒక కొలువుండాలి కనుక, సరేనన్నాడు ప్రవరుడు.

ఓ రోజు – దక్షిణాదినుంచి ఓ వర్తకుడు అద్భుతమైన రత్నం అంటూ ఓ రంగులు వెదజల్లుతున్న ఘనపదార్థాన్ని ఆ దేశపు రాజు కందర్పకేతుని దగ్గర ప్రదర్శించగా, అది నిజంగానే వెలలేని రత్నం కాబోలు అని నగరంలోని ప్రముఖ రత్నాల వర్తకులందర్నీ రప్పించి వెలకట్టమన్నాడు.

మహారాజుతో పరాచికాలాడే వారెవరుంటారు? అని నిజంగా అపూర్వ రత్నమే అయి ఉంటుంది అనుకుని, పరీక్షించకుండా ఎవరికి తోచిన వెల వారు నిర్ణయించి, దాని విలువ ముప్ఫయ్ లక్షలని కొందరు, యాభై లక్షలని కొందరు, కోటి చెయ్యకపోదు అని కొందరూ ఎడా – పెడా విలువ పెంచేశారు.

రాజు, ఆ రత్నం యొక్క వెలను సరిగ్గా నిర్ణయించండంటూ – తన భటులచేత పెద్ద వర్తకులను పంపాడు. వాళ్లు కూడా ఏభైలక్షల పైన అని కొంతమందీ, కోటి అని కొంతమందీ అన్నారు. ప్రవరుడు పనిచేస్తూన్న వర్తకుని దగ్గరకు ఆ రత్నం రాగా – అతడా రత్నాన్ని ప్రవరునికి ఇచ్చి వెలకట్టమన్నాడు. అతడు ముమ్మారు అటూ ఇటూ తిప్పి పెదవి విరిచి "అయ్యా! ఇది కృత్రిమ రత్నం ! చిల్లిగవ్వ పాటి విలువైనా చెయ్యదు" అనేసరికి రాజభటులు ఆ విషయాన్నే తమ ప్రభువుకు నివేదించారు.

ప్రభువుకు ఆశ్చర్యం కలిగి, ఆ మాట చెప్పిన ప్రవరుని సగౌరవంగా తీసుకొని రావలసిందిగా చెప్పి, ప్రవరుడక్కడికి చేరుకున్నాక గౌరవించి "ఇది గాజు రాయి అని ఎలా చెప్పగలిగారు బ్రాహ్మణోత్తమా?" అని అడిగాడు.

ప్రవరుడొక ఇనుప పలకను తెప్పించి, దాని మీదకి ఆ రత్నాన్ని బలంగా విసిరేసరికి, అది నువ్వు గింజలంతేసి ముక్కలైంది. దాంతో ఆ వర్తకుడు చిన్నబోయాడు. మిగిలిన వర్తకులు తాము ఆ విషయాన్ని

కనుక్కోలేకపోయినందుకు ఆశ్చర్యపోయారు. రాజు ఆ బ్రాహ్మణుని రత్ననైపుణ్యానికి ఆనందిస్తూ, రత్న పరీక్షకుడిగా తన ఆస్థానంలో పెద్ద పదవికి అధిక పారితోషికం ఇచ్చి నియమించుకున్నాడు.

రాజాస్థానంలో చేరడం వల్ల ప్రవరుడి విలువా - గౌరవాలు పెరిగాయి. కొద్ది రోజులకు కందర్పకేతుని ప్రధాన మంత్రి మరణించడంతో బుద్ధికుశలుడైన ప్రవరుని ఆ పదవి వరించింది. అతడు మంత్రికాగానే ఆ రాజ్యంలో ధర్మసంస్థాపనకు అన్ని చర్యలూ చేపట్టాడు.

ఇంత జరిగినప్పటికీ - అతడా రాజపుత్రిక కాంచనవల్లిని గానీ, ఆమె ప్రవరునిగానీ బలాత్కరించలేదు. అంతటి మనోధైర్యం వాళ్లది.

ఒకరోజు రాజు అతడ్ని పిలిపించి ఏకాంతంలో "నువ్వు బుద్ధికి బృహస్పతివి. నువ్వు చేరినప్పటినుంచీ నేను - ప్రజలు ఎంతో సుఖంగా ఉన్నాం! మన మధ్య రహస్యాలుండవు. ముల్లోకాలలోను సౌందర్యవతి అనదగ్గ ఒక స్త్రీని ద్వీపాంతరం నుంచి రప్పించాను. కాని, ఎన్ని విధాల చెప్పినా నా కోరికను అంగీకరించకుండా ఉంది. అయినప్పటికీ - స్త్రీలు ఒక్కొక్కసారి విముఖంగా, ఒక్కోవేళ అనుకూలంగా ఉండి 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' అనే కవివాక్యానుసారంగా మారుతూంటాయి. అయితే - ఆమె తనంత తానై వచ్చి అంగీకరించేలా చేయగల బుద్ధిశాలివి. నీకు అసాధ్యం లేదు" అని స్తుతించి, ఆ కార్యం చక్కబెట్టమన్నాడు. అధర్మానికి మనస్సు అంగీకరించకపోయినా, మౌనంగా ఒకరోజు ఆమె దగ్గరకు వెళ్లాడు.

"సాధ్వీ! నేను కొత్తగా చేరిన మంత్రిని. నీ వృత్తాంతం మొత్తం విన్నాను. కాని నేను చెయ్యగలిగింది ఏమీ లేదు. సమయం వచ్చినపుడు నేను చెయ్యగలిగినంత ఉపకారం నేను చేస్తాను. రాజు నన్ను ఇప్పుడు నీ మనోభావమేమిటో తెలుసుకోవలసిందని కోరాడు. నీ భర్త వివరాలైనా చెప్పు! నేను ఆయన్ని రప్పించే ప్రయత్నం చేస్తాను" అన్నాడు ప్రవరుడు.

ఆ మాటలకు కళావతి సంతోషించి, వసంతుని తాను కలుసుకున్న దగ్గర్నుంచి, ముసలిది మోసం చేసినంతవరకు జరిగిన సంఘటనలన్నీ విశదంగా చెప్పి, ఆ ఆపద తప్పించవలసిందని కోరింది.

ఆమె చెప్పిన వైనం అంతా విన్నాక, ఆమె భర్త వసంతుడే తన మిత్రుడని గుర్తుచేసుకుని మిగిలిన అందర్నీ తల్చుకుని "మీరంతా నా కోసం ఆ చెట్టు చూస్తున్నారేమో! నేనే కృతఘ్నుడ్ని!" అని విచారించి తన కథ కూడా ఆమెకు వివరంగా చెప్పాడు. "నా జన్మ ధన్యమైంది. కనుకనే మీ దర్శనం జరిగింది. నన్ను రక్షించే భారం మీదే" అని కళావతి, ప్రవరుని తన ఆప్తునిగా భావించింది.

అప్పుడు ప్రవరుడు "సాధ్వీ! చింతించకు! నేను నిన్ను రక్షిస్తానే, నా మిత్రుల్నీ వెతికించి రప్పిస్తాను. మనం కోరకుండానే అతిథుల్లాగ దుఃఖాలెలా వస్తాయో, సుఖాలు కూడా అంతే! అవీ దైవాధీనాలే" అని చెప్పి ఊరడించి, రాజుదగ్గర కెళ్లి "ప్రభూ! ఆమె ఏడాదిపాటు గడువు విధించి ఒక వ్రతం పూని ఉన్నదట కదా! చెప్పినవన్నీ విని మౌనంగా ఉంది. మరో సందర్భంలో ప్రయత్నిద్దాం!" అని చెప్పి చాలా తెలివిగా ఆ విషయాన్ని వాయిదా వేయించాడు.

నగరశివార్లలోని ఒక సత్రం గోడ మీద తన చిత్రాన్ని గీయించాడు ప్రవరుడు. ఆ చిత్రాన్ని ఎవరైనా పట్టి పట్టి చూస్తే తన వద్దకు తీసుకురమ్మని భటుల్ని నియోగించాడు.

అది అలా ఉండగా - ఒకరోజున.....

రాజు కందర్పకేతునికీ, ప్రధాన మంత్రి ప్రవరునికీ బట్టలుతికే చాకలి ఒక్కర్తే కావడం వల్ల – కాంచనవల్లి వేసిన మాసిన బట్టల మూటతో పాటు ఆ చాకలి రాణీగారి అంతఃపురానికి వెళ్లింది. ఆ మూటెవరిదని రాణీ అడగ్గా ఆ చాకలి కాంచనవల్లి అందం గురించి చెప్పింది. సరిగ్గా ఆ సమయానికే అక్కడికొచ్చిన కందర్పకేతుడది విని, స్త్రీలు ఒకరి అందాన్ని చూసి మరొకరు ఈర్ష్య పడతారే గాని, మెచ్చుకోరు. అటువంటిది ఈమె మంత్రి భార్య అందాన్ని పొగడుతోందంటే ఆమె నెలాగైనా చూడాలని నిర్ణయించుకుని భోజనానికి దంపతులిద్దర్నీ విందుకు పిలవగా, మంత్రి ఒక్కడే విందుకొచ్చాడు.

ఆమెని చూడాలన్న కోరిక బలంగా ఉండడం వల్ల, తామే వారింటికి భోజనానికి వస్తానన్నాడు. సూక్ష్మబుద్ధిగల ప్రవరునికి "నా ఇంట ఉన్న కాంత గురించి ఎవరో రాజుకి సమాచారం మోసి ఉంటారు. అందుకే, అతడింత కపటం ఎత్తుతున్నాడు. నిజానికి నేనెన్నడూ ఆమె గురించి పట్టించుకోలేదు. వృద్ధురాలూ మా విషయమై జోక్యం కల్గించుకోలేదు. కాని ఇప్పుడీ రాజు మూలంగా కుటుంబం పరువు రచ్చకెక్కేలాగ వుందే" అనుకుంటూ విచారంగా ఉండగా, అతని మనస్సు కనిపెట్టినదానిలా రాకుమార్తె కాంచనవల్లి అవ్వ ద్వారా విషయం గ్రహించి, తన సహకారం అందజేస్తానంది. తాము ఆయన పోషకవర్గంలో ఉన్నందున, తమకు ఆ విశ్వాసం ఉందన్నది. ఆమె ఈ సందర్భంగా తన విశ్వాసాన్ని రుజువుచేసుకోదలచింది.

రాణీతోపాటు రాజు విందుకు వస్తున్నాడన్న విషయం తెలిసి, ఆమె మంత్రికి భార్యగా మెలగడానికి స్వయంగా అంగీకరించి, అతని ఆపద గట్టెక్కించింది. ఆ తర్వాత మరో సందర్భంలో - కందర్పకేతుడు చిత్త విభ్రమం పొందేలా, ఏడుగురిలాగ తానొక్కతే కన్పించి - అదీ కాదు - ఎనమండుగురని అంతలోనే మరింత సంభ్రమానికి గురిచేసి, ప్రభువుల వారే ఆశ్చర్యపోయేలా చేసింది. ఆమె ఏనాడో బాల్యదశలో స్నేహితునిగా భావించిన జయంతుని కంటె ప్రవరునిలో ఇంకెన్నో బుద్ధివిశేషాలున్నాయని, కాంచనవల్లి అనుభవంలో తెల్సుకోగలిగింది కనుకనే, ప్రవరునికి తన సంపూర్ణ సహకారాన్ని అందించగలిగింది. అన్నిటికంటె ముఖ్యంగా అతని జితేంద్రియత్వం ఆమెను బాగా ఆకట్టుకుంది.

ఇతని సుగుణ సంపదయే ఇతని జితేంద్రియత్వానికీ - ఆ ఇంద్రియనిగ్రహణ శక్తే ఇతని అదృష్టానికీ కారణమేమో' అని ఆమె భావించింది.

ప్రవరుడు ఆ రాత్రి భోజనం చేస్తూండగా, ఆమె అతడ్ని తదేకంగా చూసి ఒక స్థిర నిశ్చయానికి వచ్చింది. అతడు భోజనం చేసి వెళ్లాక ఆమె అంతఃపురాన్ని వింతగా అలంకరించి, పరిమళ ద్రవ్యాల సువాసనలు వెదజల్లుతోంటే, "అవ్వా! నేనోసారి రమ్మన్నానని ఆయన్తో చెప్పవూ?" అంది.

అవ్వ రాయబారిగా అంతవరకు ఒకరి అభిప్రాయాలొకరికి తెలుసుకొన్నారు. ఆమె స్వయంగా పిలవనంపాక ఆ అవసరమేదీ వారికి ఇక లేకపోయింది.

అతడు అంతఃపురంలోకి వెళ్లగా, ఆమె అతడ్ని ఒక ఉచితాసనాశీనుని చేసి, అతడు కూర్చొన్నాక మెల్లగా ఇలా అంది......

"ఆపత్సముద్రంలో నన్ను తోసిన ఆ సర్వేశ్వరుడు, నాకు మీ అండ అనే తెప్పను కూడా, తానే సమకూర్చాడు. మొదట మీరు సాధారణ వ్యక్తే కాబోలు అనుకున్నాను. కాని మెల్లగా మీ గొప్పదనం గురించి తెలుసుకోగలిగాను, మీ అండ దొరికిన ఇన్నాళ్లవరకూ కూడా అనాధలాగానే ఇంకా నా యవ్వనాన్ని వృధా చేసుకుంటున్నాను. గాంధర్వవిధిన నన్ను వివాహం చేసుకోండి! నేను రాజకుమార్తెనేగాని, మనసులేనిదాన్ని కాను. ఏదో బాల్యదశలో ఓ మంత్రికుమారుడైన జయంతుని నా సహాధ్యాయుని కావాలని కోరుకున్నదాన్ని! అంతేగాని విధి మాకు రాసి పెట్టి లేనందున, అనుకున్న స్థలానికి అనుకున్న సంకేతానికి ఏకారణం వల్లనో గాని అతడు రాలేకపోయాడు. చనువరితనం చేతనైనా కాని అతడి వల్ల ఎటువంటి తప్పు చేయలేదు." అని ఆమె దీనంగా వేడుకుంది.

"నీ మనస్సు ఇంకెవరి మీదనో లగ్నమై ఉందని ఇన్నాళ్ళూ నేనూ ఉపేక్షించాను. నాకు అవమానం కలక్కుండా ప్రభువుల వద్ద నా పరువు మర్యాద కాపాడావు. నీ సౌందర్యం అసమానం. నిన్ను వివాహం ఆడటంకన్నా నాకు ఇంకేం భాగ్యం కావాలి? నేడే సుముహూర్తం" అని ఆమెను గాంధర్వపద్ధతిలో అప్పటికప్పుడే పూలమాల వేసి, పెళ్లాడి, ఇద్దరూ ఒకటై ఆ రాత్రంతా మన్మధసుఖాలనుభవించారు.

ప్రయాణానికి సమయం దగ్గరపడటంతో ఆ సన్యాసి కథ చెప్పడం ఆపి, గొల్లపిల్లవాడ్ని కావడి ఎత్తుకోమన్నాడు.

క్రమంగా పై మజిలీ చేరి, అక్కడ కాలకృత్యాలు – నిత్యానుష్ఠానాలు తీర్చుకున్న తర్వాత, ఒక రమణీయ ప్రదేశంలో కూర్చొని శిష్యునికి తర్వాత ఉదంతాన్ని ఇలా చెప్పసాగాడు.......

# కాశీ మజిలీ కథలు

## 5వ మజిలీ

### దండుని కథ

గోపాలా! ఉత్తరదిశకు ఆ మర్రి చెట్టు కొమ్మమీదుగా దండుడు ప్రయాణించేసరికి, నాలుగురోజులకు దాని చివర అతనికి కనిపించినా,అక్కడ ఇంకేవైనా వింతలుంటాయేమోనని కొమ్మ దిగి ఆ చుట్టుప్రక్కల ప్రాంతాన్ని పరిశీలించసాగాడు. అక్కడో తోటా, దానికి దగ్గర్లో ఒక సరస్సూ, అందులో బంగారు పద్మాలూ ఉన్నాయి. ఆ సరస్సుకు మణులతో తాపితమైన మెట్లున్నాయి. వింత వింత పరిమళాలు అక్కడ అలుముకుంటున్నాయి.

ఆ సరస్సు వద్ద కొంతసేపు సేదతీరి, ఒక పొదదగ్గర కూర్చొని ఉండగా, దాని పుష్పం అతని చేతికి అప్రయత్నంగా తగిలి, అది రాలి కిందపడేసరికి, దాన్ని పరీక్షగా చూడ్డానికి దాని వాసన చూశాడు. అంతే! అతడు చిలుకగా మారిపోయాడు. అయినప్పటికీ, ముందటి తెలివితేటలు నశించక, విచారిస్తూ "దైవమా! పక్షిరూపంలోనెలా బతుకుతాను? ఇందుకోసమా ఇంతదూరం నేనొచ్చింది? మళ్లీ నా మానవరూపం నాకు ప్రాప్తించేదెలా?" అని విచారిస్తూ అక్కడి పళ్లు తింటూ కొన్నాళ్లు గడిపాడు.

ఒకరోజు, ఆ ఉద్యానవనానికి సోమప్రభ అనే విద్యాధర అనెడి దేవరాజు యొక్క కూతురు విద్యుత్ప్రభ, స్నేహితురాళ్లతో వచ్చి విహరించసాగింది. శుకరూపుడైన దండుడు ఆమె దగ్గరకెళ్లి మృదుమధురంగా పలికేసరికి, ఆమె ఆ చిలుకను ఇష్టపడి, ఎలాగైనా మాలిమి చేసుకోదలిచింది. ఆమెకు మచ్చిక కావాలనే దండుడూ ఆమె చెంత చేరినందున, కొద్ది క్షణాల్లోనే

ఆ చిలుకను ఆమె స్వాధీనం చేసుకుంది. విద్యుత్ప్రభ ఆ చిలుకపై ఇష్టం పెంచుకుని గారాబంగా చూసుకుంటూ తనతోపాటు విద్యాధరలోకానికి తీసుకుపోయింది. 'విద్యాధరులు' అనే ఆ దేవజాతికి చెందిన లోకంలో ఒకచోట విమానాలు చేసేపని కొందరు విద్యాధరులకు నేర్పుతూండగా చాటుగా ఉండి సూక్ష్మబుద్ధితో ఆ విమానాలు చేయడం నేర్చేసుకున్నాడు దండుడు.

ఒకరోజు విద్యుత్ప్రభ, తన తాతగారైన మయ మహాశయుడ్ని చూడ్డానికి చిలుకతో వెళ్లింది. అతడి మన్ననలు పొంది, ఆ చిలుక ప్రత్యేకతను గురించీ – అది దొరికిన స్థలం తన తాతగారు నిర్మించిన తోటలోనే అనీ చెప్పింది. అప్పుడు మయుడు–

"చిలకంటే జ్ఞాపకం వచ్చింది. నీకు నేను నిర్మించి ఇచ్చిన ఉద్యానవనంలోని సరస్సు దగ్గర గల పొదరింటి పువ్వును ఎన్నడూ వాసన చూడకు! నువ్వు చిలకవైపోతావు. ఎప్పుడైనా తెలియక గాని – మరపున గాని అటువంటి స్థితి ఏర్పడితే, ఆ పొదరింటి వెనుక భాగాన గల పచ్చని పూలగుత్తిని వాసన చూస్తే మళ్లీ పూర్వరూపం వస్తుంది" అని వివరించాడు.

దండుడా మాటలు విని, తన పూర్వపు రూపం తెచ్చుకొను మార్గం లభించినందుకు, దైవానికి నివాళులు అర్పించి, విద్యుత్ప్రభ ఆ ఉద్యానవనానికి ఎప్పుడు వెళ్తుందా అని ఎదురుచూడసాగాడు.

ఒకానొక వసంతకాలంలో సాయంత్రం ఆ విద్యాధర పట్టణపు ఉద్యానవనంలోని మామిడి చెట్టు కొమ్మమీద విద్యాధర స్త్రీల సోయగాలు చూస్తూ దండుడు ఆనందిస్తూండగా, అక్కడ చేరిన ఓ ఇద్దరు స్త్రీల మాటలను బట్టి – "ఒకనాటి ఉదయాన్నే కొందరు విద్యాధర స్త్రీలు భూలోకంలోని ఒక మహామర్రి మాను చేరువలో ఉన్న తటాకంలో స్నానాదులకు వెళ్లారనీ, అందులో రాగమంజరి అనే యువతికి చెందిన వలువలు, ఒక చిన్నవాడు చేజిక్కించుకుని చెట్టుకొమ్మల్లో దాగున్నాడని, ప్రయాణపు తొందరలో మిగతా స్త్రీలంతా వెళ్లిపోగా, ఆ యువతి కొంతాలస్యం చేసి, తన వలువల కోసం వెతుకుతుందనీ, దివ్యదృష్టితో అతడ్ని చెట్టుమీద చూసి, అతడ్ని ఆ దృష్టితో

దింపించి వలువలు దొంగిలించిన అతడ్ని రాయిగా పడి ఉండమని శపించిందనీ, బహుశా అతడామెను వలచినందువల్లనే ఆమె వలువలను దొంగిలించి ఉంటాడనీ, ఆ మర్రిచెట్టు మొదట్లో ఉన్న తీగ యొక్క ఆకు నూరి, జలంలో కలిపి ఆ శిల మీద జల్లితే అతనికి పూర్వరూపం ప్రాప్తిస్తుందనీ" దండునికి అర్థమైంది.

ఇప్పుడా స్త్రీలే అక్కడ జలకాలాడుతూంటే, వారి అందాలు తనివితీరా చూస్తున్నాడు దండుడు. అక్కడ మర్రిచెట్లు దగ్గర వీరిని తిలకించినవాడు సాంబుడై ఉంటాడని గ్రహించాడు. అదృష్టవశాన సాంబుడికి పూర్వపు రూపం వచ్చే మార్గం నాకు తెలిసింది. బాగానే ఉంది. ముందు నాకు ఈ రూపం నుంచి విముక్తి కలిగితే కదా – అతడి గురించి ఆలోచించడం అనుకుంటూ, విద్యుత్ప్రభ మళ్లీ ఉద్యానవనానికి ఎప్పుడు వెళ్తుందా? అని ఎదురుచూడసాగాడు.

విద్యుత్ప్రభ ఒకరోజు మళ్లీ ఆ భూలోకపు తోటలోనికి విహరించడానికి చిలుకతో సహా పయనమైంది. అదే అదనుగా దండుడు, తాను ఆనాడు ఏ పొదరింటి పువ్వును వాసన చూశాడో గుర్తుచేసుకుంటూ, సరిగ్గా దాని వెనుకకు ఎగురుకుంటూ వెళ్లి ఆ పచ్చ పూలగుత్తి వాసన చూసి తిరిగి తన పూర్వరూపాన్ని పొంది పొంగిపోయాడు.

సరిగ్గా విద్యుత్ప్రభ అదంతా చూసి ఆశ్చర్యపోయి "అయ్యా! మీరెవరు? మీకీ చిలుకరూపు ఎలా సంప్రాప్తమైంది?" అని అడగ్గా "నాతీ! నేను మీ తాత మయుని వంశం వాడినే. నన్ను దండుడు అంటారు. ఒక కారణం వల్ల ఈ ఉద్యానవనానికి వచ్చి పొదరింటిపువ్వును వాసన చూసి, ఇలా నీకు చిలుకనై చిక్కాను. అయితే నీ దయవల్ల విద్యాధరలోకంలోని వింతలూ – విశేషాలూ చూడటమే గాక, విమానాలు తయారుచేయడం సైతం నేర్చుకోగలిగాను, నాకు శెలవిస్తే వెళ్తాను" అన్నాడు దండుడు.

అయితే విద్యుత్ప్రభ అతని రూపానికీ – మాటలకూ – శీలానికీ ఎంతో ప్రశంసించి, అతని మీద కామభావం రేకెత్తగా "నన్ను పొగడనవసరం లేదు". విద్య చేతా – రూపం చేతా కూడా నువ్వు అసాధారణుడివే! నీ

అంతటి సుందరాకారుడు మా విద్యాధర జాతిలో కూడ లేడు. నీ మీద నేను మరులుగొన్నాను. నన్ను భార్యగా స్వీకరించు! నాకు మానవుడు భర్తగా లభిస్తాడని మా తాత దీవించాడు. అది నిజం చెయ్యి! నువ్వు ఎటూ మా కులం వాడివే కదా!" అని బతిమాలింది.

దండుడు ఆమెను గాంధర్వవివాహం చేసుకొని, కొన్నాళ్లు ఆ ఉద్యానవనంలో ఆమెతో సుఖించాడు. ఒకరోజు "కాంతా! నా వృత్తాంతమంతా నీకు తెలియజెప్పాను కదా! నా స్నేహితులు మర్రిచెట్టు మొదలు దగ్గర ఎదురుచూస్తుంటారు. నేను వెళ్లాలి. సెలవియ్యి" అన్నాడు.

"వేడుక రుచి చూపి వెళ్లిపోతాననడం ఏం న్యాయం? నా కంటె మిత్రులు ఎక్కువా? వెళ్లవద్దు" అని ఆమె అభ్యంతరం చెప్పింది.

"నువ్వు కామరూపిణివి కదా! నేను ఎక్కడ ఉండి తల్చుకున్నా అక్కడకు నువ్వొచ్చి నీ కోరిక తీర్చుకోగలవు" అని చెప్పి ఆమెను ఒప్పుకొనేలా చేసి, శాపంగా మార్చగల పుష్పాల్నీ - శాపాన్ని మరల్చగల పచ్చపూలగుత్తులనూ కొని కూడా మూటగట్టు దండుడు నాలుగురోజుల తర్వాత మర్రిచెట్టు దిగాడు.

అతడు దిగేసరికి అక్కడెవ్వరూ లేరు. అప్పటికి గడువు మీరిపోయినా, ఇంకా ఎవ్వరూ చేరలేదన్నమాట! ఎవరెక్కడ ఇరుక్కుపోయారో అనుకుంటూ "సాంబుడి పరిస్థితి నాకు ఎటూ తెలుసు! కనీసం ఇతడికైనా నేను పూర్వరూపం తెప్పిస్తాను. అప్పుడు ఇద్దరం కలిసి ఆలోచించవచ్చు" అని, ఆ విద్యాధర కన్య చెప్పిన ఆకును గుర్తుపట్టి, నీట్లో కలిపి రాతిపై చల్లగా సాంబుడు పూర్వరూపుడైనాడు.

ఎదుట ఉన్న దండుని కౌగలించుకొని "సోదరా! నువ్వు వచ్చి ఎంతసేపైంది? మనవాళ్లింకా రాలేదా? ఇక్కడో సుందరి ఉండాలి? ఎక్కడికెళ్లింది. ఇంతవరకూ నాతో మాట్లాడుతూనే ఉందే! ఆమెను చూడకపోతే, నా ప్రాణాలు నిలవవు. ఆమెను తెచ్చి నాకు ప్రాణదానం చెయ్యి" అంటూ బ్రతిమాలాడు.

దండుడు నవ్వుతూ రాగమంజరి అనబడే ఒక విద్యాధరకన్య నిన్ను శిలగా మారమని శపించింది. అదృష్టవశాన నీకు శాపవిముక్తి కలిగే మార్గం నాకు గోచరించింది. లేకపోతే, నీ పరిస్థితి, చాలా దారుణంగా ఉండేది" అని ఆ వైనం అంతా వివరించాడు. అయినప్పటికీ సాంబుడొప్పుకోక "ఆమె లేనిదే నాకు బతుకు వృధా! నీ లాగానే నేనూ విద్యాధర కన్యను పొందితీరాలి" అని పట్టుపట్టాడు.

"అయితే - అందుకు ఒక మార్గం ఉంది. ప్రతి ఆదివారం విద్యాధరకన్యలు ఇక్కడికి జలకేళికి వస్తారు. ఈసారి నువ్వు మళ్లీ రాగమంజరి వస్త్రాలు సంగ్రహించి చెట్టుమీద దాక్కొని ఉండు. ఎంత బ్రతిమిలాడినా దగ్గరకు రానివ్వకు. మిగిలింది నేను చూసుకొంటాను" అనేసరికి సాంబుడు మహాదానంద భరితుడైనాడు.

మరునాడు వాళ్లు రావడం - జలకేళికి వస్త్రాలు విప్పడం సాంబుడా కన్య వస్త్రాలనే గుర్తుపట్టి గుట్టుగా అపహరించడం జరిగాయి. జలక్రీడలు ముగిశాక, తన వస్త్రాలకోసం వెతుకుతూ సాంబుని చూసి రాగమంజరి ఎన్నో విధాల అర్థించినా, అతడీసారి ఆమె మాయలో పడలేదు. ఈలోగా మిగతా కన్యలు వెళ్లిపోయారు. అప్పుడు దండుడు వాళ్ల దగ్గరకు వెళ్లాడు. తనను చూసి సిగ్గుపడుతున్న రాగమంజరికి ఒక వస్త్రాన్నిచ్చి "మీ ఏలిక విద్యాధర కన్య విద్యుత్ప్రభను రప్పించనా?" అని ఆమెను మనస్సులో తల్చుకొని ఆమె అక్కడికి రాగానే, సాంబుడి గురించి చెప్పిన రాగమంజరితో అతనికి వివాహం జరిగేలా చేశాడు. సాంబుడు కూడ ఆమెతో రెండు మూడు రోజులు సుఖించి, తాను తలచినపుడు రాగమంజరి వచ్చేలా అంగీకరింపజేసి, ఆమెను ఇంటికి పంపాడు.

సాంబుడూ - దండుడూ మిత్రుల జాడ తెలుసుకోడానికి, మొట్టమొదట వసంతుడు వెళ్లిన మర్రికొమ్మ మీదుగా ప్రయాణించసాగారు. అతడికి కనిపించిన విశేషాలన్నీ వీరికీ కనిపించాయి. నిర్జనమైన పట్నం, ఒకే తీరుగా ఉండే వీధులూ, ఒక కోట, దాని రహస్య ద్వారం అన్నీ ఒకటొక్కటిగా చూస్తూ, చివరికి వసంతుడు నిస్త్రాణగా పడివున్న గదిని చేరుకున్నారు.

కొనప్రాణంతో పడి ఉన్న వసంతుడిని చూసి, దండుడు బిగ్గరగా అరిచాడు. గది నాలుగు మూలలా వెతికేసరికి అతడి ప్రాణాలు దాచిన కత్తి ఒక చోట కనిపించింది.

"దైవానుగ్రహం వల్ల ఈ వొరని మొదలంతా అరగదియ్యలేదు. ఇతడ్ని బ్రతికిస్తా! చూడు!" అంటూ తన యంత్ర రచనా పాటవంతో వొరని చక్కచేశాడు దండుడు. దాంతో వసంతుడు కళ్లు తెరిచాడు.

కళ్లు తెరుస్తూనే "కళావతీ" అంటూ కేకవేసి, ఆమెకు బదులు మిత్రులు కనిపించేసరికి, "మిత్రులారా! మీరు ఇక్కడికి ఎలా వచ్చారు? నేను స్త్రీలోలత్వంలో పడి, మిమ్మల్ని మర్చిపోయాననుకున్నారా? రాముడూ ప్రవరుడూ ఎక్కడ? వాళ్లిద్దరూ క్షేమమే కద!" అంటూ కుశల ప్రశ్నలు వేశాడు.

వాళ్లు తమ - తమ వృత్తాంతాలను చెప్పారు. అది విని "నన్నెందుకు బతికించారు? కళావతి లేకుండా నేనెలా బతికేది?" అని వసంతుడు రోధించసాగాడు.

అతని దుఃఖం మాన్పించి, జరిగిందంతా వసంతుడి నోట తెలుసుకున్నారు. అప్పుడు దండుడు "ఆర్యా! నువ్వు ధైర్యంగా ఉండు! కార్యమంతా నేను చక్కబరుస్తాను. ప్రాజ్ఞులైన వారు ఆపదలొచ్చినపుడు ధైర్యం విడువరు. శోకించే వాడి సంపదలు నశిస్తాయి. నిన్ను నీ ప్రాణసఖితో శీఘ్రుకాలంలో జత కూర్చగలను. నేను కొత్తగా విమానం చేసే శక్తిని సంపాదించాను. దాని మీద వెళ్తే భూలోకమంతా చాలా వేగంగా చుట్టి రాగల్గుతాం!" అని అక్కడే అడవిలోని కొన్ని చెట్లు నరికి, కొయ్యతో ఒక కీలురథం నిర్మించి దాంట్లో తిరుగుతూ, ఆ ముగ్గురూ భూలోకంలో ప్రసిద్ధి చెందిన పట్టణాలన్నీ తిరుగుతూ కళావతిని వెతకసాగారు...."

అని చెప్పేసరికి, ప్రయాణ సమయం కావడంతో, ఆ యతీంద్రుడు అప్పటికి కథ చాలించి పై మజిలీలో - గోపాలునకు, తదనంతర వృత్తాంతం ఇలా చెప్పసాగాడు.

# కాశీ మజిలీ కథలు

## 6వ మజిలీ

వత్సా ! వినుము.....

అట్లు ఆ ముగ్గురూ తిరుగుతూన్న విమానం వంటి కీలురథం, ఒకనాటి సాయంకాలానికి హేలాపురం మీదుగా వెళ్తూండగా ఆ పట్టణంలోని ఇళ్లవరుస చూసి "అన్నలారా! ఇదేదో పట్టణంలాగానే ఉంది. ఈ రాత్రికి ఇక్కడ విడిది చేసి, కళావతి గురించి ఏమైనా తెలుస్తుందేమో చూద్దాం!" అనుకొని ఆ పట్టణం నడివీధిన రథాన్ని ఆపి, దాన్నొక చోట దాచి, సత్రానికి దారి అడిగి అక్కడ ప్రధాన మంత్రి చిత్రపటం వ్రేలాడదీసిన సత్రానికి చేరుకున్నారు. ఆ రాత్రి భోజనం చేసి విశ్రమించి, మర్నాడు ఉదయం వీధి అరుగు మీద కూర్చోబోతూ, తమ మిత్రుడి చిత్రపటం అక్కడ ఉండడం చూసి ఆశ్చర్యపోయి దండుడు - సాంబులు, వసంతుని పిల్చి "ఈ చిత్రం ప్రవరుని పోలికలో ఉంది కదా" అని అడిగారు.

ఒకసారి పొరబడ్డామేమో అని, తదేకంగా అందరూ పరీక్షగా చూసి, అది ప్రవరుని చిత్రపటమే అని నిర్ధారణకు వచ్చి, అది అక్కడ ఎందుకున్నదీ అర్థంకాక ఆలోచిస్తూంటే, "సోదరులారా! ఈ చిత్రపటాన్ని చూసిన దగ్గర్నుంచీ నాకు కళావతీ వియోగం కంటే - మన సోదరులం అయిదుగురం విడిపోయామన్న వేదన అధికంగా ఉంది. దైవవశాత్తు ముగ్గురం కలిసినా మిగతా ఇద్దరి జాడ తెలియక చాలా ఆందోళనగా ఉంది. మన ప్రవరుడేమైనాడో - రాముడేమైనాడో" అని కన్నీరు పెట్టుకుంటూండగా, ఆ పక్కనే ఉన్న భటులు వారిని అడ్డుకున్నారు.

"అయ్యలారా! తమరెవరు? మీరీ చిత్రఫలకాన్ని చూస్తూ మాట్లాడుకుంటున్నారు గనుక - మిమ్మల్ని ఇంకో చోటుకు పోనివ్వరాదు. అది మా మంత్రి గారి ఆజ్ఞ. పదండి - ఆయన దగ్గరకు" అని వారిని తొందరచేయబోగా, అందుకా ముగ్గురూ ఏమాత్రం తొణక్క "ఓహో! మీ మంత్రిగారెవరో గాని - మహా గొప్ప శాసనకర్తలా ఉన్నాడే? చిత్రఫలకం చూడటమే నేరమా ఏమి? అదే నేరమైతే, దాన్ని నలుగురూ మెసలే చోట వ్రేలాడదీయించడం దేనికీ? వ్రేలాడదీశాక దాని గురించి మాట్లాడుకోకుండా ఉంటారా ఏమి? పదండి - ఆయన్నే అడుగుదాం!" అని ధైర్యంగా ఆ భటుల వెంట నడవసాగారు.

భటులు వారిని తీసుకొచ్చినట్లు ద్వారపాలకునితో లోపలికి కబురుపంపగా, సరిగ్గా ఆ సమయానికే ప్రవరుడు తన భార్యతో మిత్రులను గురించి ముచ్చటిస్తున్నాడు. వార్త వినగానే సంతోషంగా వాళ్లని లోపలకు ప్రవేశపెట్టమన్నాడు.

అప్పుడు భటులు "ఓహో! మంత్రి గారి ఆజ్ఞ అయిందీ. వెంటనే వీర్ని ప్రవేశపెట్టమన్నారంటే ఏదో ఉండే ఉంటుంది. వీళ్లకిప్పుడు సన్మానమైనా జరుగుతుంది.లేదా అవమానం జరిగినా ఆశ్చర్యం లేదు. అంతా వారి చిత్తం! అసలు ఆయన చిత్రఫలకం ఎందుకు వ్రేలాడగట్టినట్లు? ఇంత కాలానికి దాని గురించి మాట్లాడేవాళ్లు ముగ్గురు దొరికారు. ఇంకెంతమంది వున్నారో! మనకీ కొలువు అక్కడ ఎంతకాలమో!? పద! పద!" అని వారిని లోపలకు ప్రవేశింపజేసి భటులు తిరిగి సత్రానికి వెళ్లిపోయారు.

వార్ని చూసి ప్రవరుడు పోల్చుకోగలిగాడు కాని, వారే ప్రవరుని ఏ మాత్రమూ గుర్తించలేకపోయారు.

అంతలో వసంతుడు "అయ్యా! మీరేనా ప్రధాన ప్రవరులు? పరోపకార బుద్ధితో విదేశీయుల కోసం సత్రం కట్టించారు. బావుంది. చిత్రఫలకం ఒకటి మీది అక్కడ వ్రేలాడదీయించనేల? అది చూసి ఎవరైనా

మాట్లాడుకుంటే, వార్ని భటులచేత రప్పించనేల? ఇదేం పరిపాలన?" అని అడిగాడు.

"మీరా చిత్రాన్ని ఎందుకు పరిశీలనగా చూశారో ముందు చెప్పండి!" అన్నాడు ప్రవరుడు బింకంగా.

"అది మా మిత్రుని పోలికలో ఉంది" అని చెప్పాడు వసంతుడు.

"మీ మిత్రుడేమైనట్లు? మిమ్మల్ని మరచి విగ్రహం అయ్యాడనుకున్నారా?" అని ప్రవరుడు అంటూండగానే దండుడు గ్రహించి "వసంతా! మన ప్రవరుడు ఇతడేనయ్యా!" అని ఆనందంగా అరిచాడు.

అప్పుడతకు కూడా సంభ్రమాశ్చర్యాలతో, ఆ ముగ్గుర్నీ ఆనందంగా కౌగలించుకుని "అన్నలారా! ఆ చిత్రపటాన్ని వ్రేలాడదీయించింది మీ కోసమే!" అంటూ తాను మర్రిచెట్టుకొమ్మ ఎక్కింది మొదలు ఎలా ఈ స్థితికి చేరుకున్నదీ వివరించాడు ప్రవరుడు.

తర్వాత ఆ ముగ్గురి వృత్తాంతాలూ వరుసగా విన్నాడు.

"ఇక రాముడొక్కడే మనని కలుసుకోవాలి" అంటూన్నంతలో, ద్వారాపలకుడొకడు వచ్చి "జయ పరాక్! సత్రంలోని చిత్రఫలకాన్ని ఒక జంట చూసిందట! ప్రవేశింపచేయమంటారా?" అని అడిగాడు.

వారి ఆనందానికి మేరలేకపోయింది. "ఆహా! తలుచుకున్నంతలోనే భగవంతుడు, రాముని కూడా మనకు చేరువ చేశాడే!" అనుకుంటూ తక్షణం వారిని ప్రవేశపెట్టమన్నాడు ప్రవరుడు.

వారు లోపలకు రాగానే, వచ్చిన వాళ్లిద్దరూ రాముడు – అతని భార్య (కనకప్రభ) అని గుర్తించి వారికి ఎదురెళ్లి ప్రవరుడూ – కాంచనవల్లీ తోడ్కొని వచ్చి ఉచితాసనాల మీద కూర్చోబెట్టారు.

కాంచనవల్లి, కనకప్రభను సత్కరించి, దగ్గరగా కూర్చొని ఆ అపూర్వ సహోదరుల వృత్తాంతం వినసాగింది – అందర్నీ పరీక్షగానూ, సంతోషంగానూ చూస్తూ.

అప్పుడు వసంతుడు "రాముడూ ! నిన్ను చూసి ఎంతకాలమైనదిరా? మా కన్నులు వాచినట్లే ఉన్నాయి. ఈ చిన్నదెవరు? ఎక్కడెక్కడ తిరిగావు? ఏమేమి వింతలు చూశావు? అని అడగ్గా, రాముడు తాను మఱ్ఱి వృక్షం కొమ్మ విడిచినది మొదలు అంతవరకు జరిగిన వృత్తాంతం అంతా చెప్పి, "శునకరూపాన ఉన్న నన్ను జాగ్రత్తగా తెచ్చి సత్రం ప్రాంతాలలో గల ఒక బైరాగి చేత నాకు పూర్వరూపం పొందేలా చేసింది. ఈమె దయలేకుంటే నేను మిమ్మల్ని చూసే వాడినేకానేమో! ఎన్ని విధాలనైనా ఈమె ఋణాన్ని తీర్చుకోలేను" అని చెప్పగా, ఆ సుందరిని వాళ్లందరూ ప్రశంసించారు.

అందరూ ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చొని, తనివితీరా ఒకర్నొకరు ఆనందంగా చూసుకుంటూంటే, వసంతుడు "తమ్ములారా! దైవయోగం ఎలాంటిదో చూడండి!....

**మ. ఎట నెవ్వారికి నెన్ని రేల్సుఖముగా◇ నీ దుఃఖము న్గాని వి**

**స్ఫుట పూర్వ చరిత్మాత కర్మ వశత ◇ న్నోక్తమై యుండునో**

**ఘటనా చాతురిం(దాళ్ల గట్టుచు బలా త్కారంబుగా వానిన**

**చ్చోటికిం దోడ్కొని వచ్చి దాని గుడిపిం చున్ దైవమన్నాళ్లొగిన్**

ఎక్కడ ఎవరెవరు ఎన్నాళ్లు సుఖంగానీ – దుఃఖంగానీ అనుభవించాలో, అక్కడ అన్నాళ్లు ఆయా సుఖదుఃఖాలు అనుభవించడానికి త్రాళ్లతో, కట్టి తీసుకొచ్చి అయినా పారేస్తాడా దేవుడు.

అంతా మన అధీనంలో ఉంది అనుకుంటే పొరపాటే! మనం ఒక్కొక్కరం ఎంతకాలం ఎన్ని కష్టాలు పడి ఇక్కడ కలుసుకున్నామో ఒక్కసారి మనస్సుల్లోనే గుర్తు చేసుకోండి! దైవఘటన కనుకనే, అన్ని ఆపదల పాలైనా మనకిప్పుడు శుభం జరిగింది.

**ఉ. కోరక దుఃఖముల్ మనుజ ✳ కోటికి నేగతి వచ్చు నా గతిన్**

**ధారుణి సౌఖ్యముల్ గల్గు ✳ దానికి వీరి ప్రయత్న మేమియున్**

**గారణమై దలిర్ప దది ✳ కాలవిశేషము కాలవిశేషము పట్టి వచ్చులో**
**నోరిమ దక్కి కుందుటయు ✳ నుబ్బుయుంజుమీ వీరటధర్మముల్.**

(కోరకుండానే దుఃఖాలెలా కలుగుతాయో - సుఖాలైనా అట్లాగే అప్రయత్నంగానే కలుగుతాయి. పూర్వజన్మకృతము - వేళావిశేషం అలా జరిపిస్తాయి. సుఖాలకు ఉబ్బిపోవడం గాని - దుఃఖాలకు కృంగిపోవడం గాని తగదు).

"సోదరులారా! మనకు ఇంతటి సంతోషం కూర్చిన భగవంతునికి అనేక ప్రణామాలు" అని ప్రశంసించాడు దండుడు, రాముడితో -

"రాముడూ ! మనకి కళావతీ వృత్తాంతం అంతా ప్రవరుని వల్ల తెలిసింది కదా! ఇప్పుడు వసంతుడిక్కడే ఉన్నాడు గనుక - ఆమెను ఇక్కడికి సరాసరి రప్పించేయడమా? లేక ఐదుగురం ఉన్నాం గనుక - ఆ కందర్పకేతుడి పనిపట్టి , అప్పుడు తీసుకొద్దామా?" అని అడిగాడు.

"కళావతిని చెరబట్టి, ఈ కందర్పకేతుడు మనకు శత్రుస్థానంలో ఉన్నా, మన ప్రవరుడు ఆయనకు ప్రధాన మంత్రి స్థానంలో ఉన్నందు వల్ల బలప్రయోగం సమర్థనీయం కాదు. అయినా శత్రువును లొంగదీయడానికి సామదానాది ఉపాయాలున్నాయి కద! అవేవీ కుదరనప్పుడే చివరిదైన దండోపాయం ప్రయోగిద్దాం! ఇంతకూ మన ప్రవరుడేమంటాడో కూడ చూడు" అన్నాడు రాముడు.

"ఈ కందర్పకేతుడు బుద్ధికుశలతలో గాని - పరాక్రమంలో గాని మనల్ని మించిన వాడు కాడు. సమస్త సేనలు నా ఆధీనంలోనే ఉన్నాయి. తృటిలో ఈ కోట స్వాధీనం చేసుకోవచ్చు! అదేమీ అంతకష్టం కాదు. కాని, కృతఘ్నత అనే పాపానికి భయపడుతున్నాను. ఇన్నాళ్లీ ప్రభువు ఉప్పు తిని, అతని మీదకే కత్తి ఎత్తడమా? అనే బాధ అధికంగా ఉంది. కనుక - సామంగానే ఈ కార్యాన్ని రాముడు చెప్పినట్లు చక్కబరుచుకోవచ్చు" అన్నాడు ప్రవరుడు. అందరూ అందుకు సమ్మతించారు.

వాళ్లు అయిదుగురు భయంకరమైన వేషాలు ధరించి, కత్తులు పట్టుకుని, చూచేవారిని భీతి గొలిపేలాగ ఆస్థానానికి చేరుకున్నారు. రాజసింహాసనం మీద వసంతుడు - దగ్గర్లో ఉన్న పీఠాలపై మిగతా నలుగురూ కూర్చుని రాజుకి కబురు పంపారు.

కందర్పకేతునికి దూత ద్వారా అతని సింహాసనం ఆక్రమించుకోబడిందని వార్త తెలియగానే, వినోదకేళిలో మునిగి ఉన్న రాజు 'ప్రవరుడ్ని వెంటనే తీసుకురా!" అన్నాడు.

"వారితోనే అతడు కూడ ఆస్థానంలో కెళ్లి ఒక ఆసనం మీద కూర్చొని, మనలను అక్కడికి రప్పించుకోజూస్తున్నాడు." అన్నాడా దూత.

"మైత్రి అంటూ సింహాసనం ఆక్రమించారే! ఇప్పుడెలా?" అని బెదురుతూ రాణి వైపు చూశాడు. మన ఆస్థానంలోనే కూర్చొని మన మీదనే యుద్ధం ప్రకటిస్తూన్నారంటే, వారి బలం తక్కువగా అంచనా వేయలేమని అతడికి అర్థమైంది.

అధికారాన్ని అడ్డుపెట్టుకొని, అతడు ఇన్నాళ్లు రాజ్యం చేయగల్గుతున్నాడు తప్ప, పౌరుషంతో కాదని రాణికి అర్థమైంది.

ఆమె యుద్ధం చేయమని సలహా ఇవ్వగా, ఆ పిరికి ప్రభువు అది అసాధ్యమనీ - పారిపోదాం" అనీ అన్నాడు. రాణి తానే వెళ్లి సంధిచేసుకొస్తానన్నది. పరిచారకుల అడుగుల సవ్వడి విన్నా, వాళ్లే ఐదుగురూ తన మీదకు యుద్ధానికొస్తున్నారని భయపడుతూ కందర్పకేతుడు ముసుగు పెట్టుకొని మంచం ఎక్కాడు. ఇదంతా చూసి రాణి "మన మంత్రిని, నేను రమ్మన్నానని ఒకసారి చెప్పండి" అంది.

రాజు భయపడి పారిపోబోతూండగా, రాణి అతడ్ని పట్టుకుని ఆపింది. ఇంతలో వ(సంతుడు), ప్ర (వరుడు), సా (ంబుడు), ద(ండుడు) పంచకం అక్కడికి రానే వచ్చేసింది.

"అమాత్యశేఖరా! వీరికి మేము ఏం అపకారం చేశాం? ఈ నలుగురికీ రాజుగారితో ఏం పని?" అని అడిగింది రాణి. ప్రవరుడా ప్రశ్నకు జవాబేమీ ఇవ్వక, రాజు దగ్గరకెళ్లి ముసుగుతీసి చూడగా అతడు కళ్లు తేలవేసి, పళ్లు బిగబట్టి, వణికిపోతూంటే వరప్రసాదులు గట్టిగా నవ్వారు.

"వీని తత్త్వం బాగా తెలిసిన ఒక బ్రాహ్మణ వితంతువు ఉంది! ఆమెను తీసుకురండి" అని భటుల్ని పంపించాడు ప్రవరుడు. వాళ్లు ఎంతో దూరం వెళ్లక్కర్లేకుండా ఆమె ఎదురుపడింది.

"ఇక నన్ను మన్నించే వాళ్లెవరు? నాకింకా అర్ధరాజ్య ప్రాప్తి లేదు కాబోలు! అంటూంటే, "నువ్వు రాజుగారికి చేసిన ఉపకారం ఏమిటి?" అని అడిగాడు సాంబుడు.

"ఈ రోజు కోరిన చిన్నదాన్ని ద్వీపాంతరం నుంచి తీసుకొచ్చాను. ఇతడ్ని వరించడానికి ఆమె సంవత్సరం గడువు విధించింది" అని ఆ కథంతా వివరంగా చెప్పింది.

తమను మోసం చేసిన ఆ వితంతువును నరికేస్తానంటూ వసంతుడు ఆగ్రహంగా కత్తి దూశాడు.

ప్రవరుడు అడ్డుపడి "స్త్రీ వధ మహా పాపం! ఈ శుభతరుణంలో అలాంటి పాపానికి ఒడిగట్టకు! ఇంకోలాగ ఈమెని శిక్షిద్దాం" అంటూ ఆపాడు.

ఇంత జరిగాక, రాజ్యం వారి స్వాధీనం కాక తప్పదని, రాణీకి తోచింది. పతిభిక్ష పెట్టమని అభ్యర్థించింది. కందర్పకేతుడు కూడా చటుక్కున మంచం దిగి, వాళ్లందరి పాదాలూ పట్టుకొని "మీ పాద సేవకుడిగానైనా నన్ను మన్నించి బతుకు ప్రసాదించండి! నేను కళావతిని తాకలేదు. ఆమె నన్ను కన్నెత్తి కూడ చూడలేదు" అని మొరపెట్టుకున్నారు. వరప్రసాదులు రాజును - రాణిని, వదిలి, ఆ వృద్ధ వితంతువును రెక్కలు విరిచి కట్టి

కళావతి ఉన్న అంతఃపురానికి తీసుకెళ్లగా ఆమె క్షమించి వదిలేసి తన పెద్ద మనసు చాటుకుంది. వసంతుడు కళావతిని కౌగలించుకున్నాడు.

మనం త్వరగా వెళ్లిపోదామన్నా, దైవఘటన ఇలా ఉండి ఆలస్యమైంది. దీనికి మన తల్లిదండ్రులెంత చింతిస్తున్నారో ఏమో! త్వరగా వెళ్లి వాళ్లని చూద్దాం!" అన్నాడు వసంతుడు.

సాంబుడు రాగమంజరిని, దండుడు విద్యుత్ప్రభని తలుచుకోగా వాళ్లు వచ్చారు. రాముడు నేత్రదృష్టి ప్రసాదించిన పద్మగంధిని ఆమె పట్నానికి వెళ్లి కీలురథంలో ఎక్కించుకున్నారు. అలా వాళ్లంతా స్వదేశాభిముఖంగా ముచ్చటించుకుంటూ ఆ కీలురథంలో వెళ్తూండగా నువ్వు చూశావు! అదీ గోపాలా ఆ కీలురథం కథ! స్పష్టంగా అర్థమైంది కదా! వారు అలా వెళ్లి, తమ కోసం ఎదురుచూస్తున్న తల్లిదండ్రులకు ఆనందం కలిగించి సుఖంగా ఉన్నారు.

ఈ వృత్తాంతమంతా ఆ గొల్లవాడు ప్రయాణంలో నడుస్తున్నప్పుడు జ్ఞాపకం తెచ్చుకుంటూ, ఆ వరప్రసాదుల అదృష్టానికి మెచ్చుకుంటూ, ఆ యతీంద్రుని వెంట కావడి మోసుకుంటూ వెళ్లి ముందర మజిలీ చేరాడు.



# కాశీమజిలీ కథలు

## 7 వ మజిలీ

అది ఒక పట్టణం కావడంతో, అక్కడొక సత్రంలో బసచేశారు. ఆ సత్రం చాలా కాలం క్రితం ఒక మహారాజు చేత స్థాపించబడింది. అక్కడ రాత్రీ పగలూ అనే తేడా లేకుండా, దారినపోయే బాటసారులకు - విదేశీయులకు నిరంతరాయంగా నిరభ్యంతరంగా అన్నదానం చేయబడుతుంది.

ఆ సత్రపు సింహద్వారం పై భాగాన వ్రేలాడగట్టబడిన చిత్రఫలకమ్మీద ఒక స్త్రీ రూపం చూశాడు గోపాలుడు. ఆమె సౌందర్యాతిశయానికి ఆశ్చర్యపోతూ "ఆ జవ్వని ఎవ్వతె? అక్కడ ఎందుకు ఆమె చిత్రపటం వ్రేలాడుతోంది? ఆ వృత్తాంతం వినిపించవలసింది" అని గోపకుమారుడు మణిసిద్ధుని కోరగా, రత్న ప్రభావం చేత ఆ కథ తెలుసుకొని అతడు చెప్పడం ప్రారంభించాడు.....

### విక్రమసింహుని కథ

చోళ దేశంలో ప్రజావతి అనే పట్టణం ఉంది. దానికి ప్రభువు చిత్రసేనుడు. మంత్రి శ్రుతకీర్తి. అతడి సహాయంతో చిత్రసేనుడు ఎంతో న్యాయంగా రాజ్యపాలన చేస్తున్నాడు. లేకలేక అతనికో కుమారుడు కలుగగా, విక్రమసింహుడని పేరు పెట్టి పెంచుకుంటున్నాడు. అతడు పుట్టిన మూడో రోజునే మంత్రికీ ఒక పుత్రుడు జన్మించగా, అతనికి బహుశ్రుతుడు అనే పేరు పెట్టారు.

ఇద్దరికీ ఐదేళ్లు రాగానే విద్యలనిమిత్తం అన్నిటా నిష్ణాతులైన గురువుల దగ్గరకు పంపారు. పదహారేళ్లు వచ్చేసరికి ఇద్దరూ అన్ని విద్యల్లోనూ

అసమానమైన ప్రజ్ఞ గడించడమే కాక, ధనుర్విద్యలో గొప్ప నిష్ణాతులయ్యారు. సంగీతంలో గాని – కవిత్వంలో గాని వారి ప్రతిభ సరే సరి! వారి తర్వాతనే ఇతరులను ప్రశంసించాలన్నట్టుగా వారికి పాండిత్యము అలవడింది.

ఒకరోజు చిత్రసేనుడు, మంత్రి శ్రుత కీర్తి తమ పుత్రులిద్దర్నీ రప్పించి "నాయనలారా! మేమిద్దరం వృద్ధులమయ్యాం!రాజ్యభారం వహించడం మాకు కష్టంగా ఉంది. ప్రజలు మిమ్మల్ని కోరుకుంటున్నారు....." అని చెప్పారు.

చిత్రసేనుడు తన కొడుకునకు "చిరంజీవీ! పూర్వాచారం ప్రకారమే నేను నిన్ను పట్టాభిషిక్తుడ్ని చేసి, తపోదీక్ష వెళ్లిపోతాను. నువ్వు ఏ వ్యసనం బారిన పడకుండా, దండనీతి అవలంబించి రాజ్యపరిపాలన చెయ్యి! దండనీతి లేకుండా ఉంటే, రాజుకు రాజ్యం దక్కదు. అల్పులు సైతం తోక ఝాడిస్తారు. అసలు అటువంటి వారిని దరిచేరనీయకు!రాజుకు అనుగ్రహం కలిగితే, ధనరూపేణా సంతోషపరిచాలి గాని, చనువు మాత్రం ఇవ్వరాదు. తరచు గూఢచారుల చేత ఎప్పటి వర్తమానాలు అప్పుడే తెలుసుకుంటూ, సందర్భాన్ని బట్టి మెలగాలి. దేవభక్తి – బ్రాహ్మణ భక్తి కలిగి ఉండాలి. బ్రాహ్మణాశీర్వాదంతో సకల కామములు సిద్ధిస్తాయి. వార్ని చూసినంతనే చేతులెత్తి మొక్కాలి...." ఇట్లే ఎన్నెన్నో నీతివాక్యాలు ఉపదేశించి, పట్టాభిషేకం నిశ్చయించి ఆ నాటికి సభ చాలించాడు.

మరునాడు విక్రమసింహుడూ – బహుశ్రుతుడూ విహారార్థం ఉద్యానవనానికి వెళ్లారు. అప్పుడు " మిత్రమా! నిన్న నిండు సభలో నా తండ్రి నాకు చెప్పినవన్నీ నువ్వూ విన్నావు కదా! రాజ్యభారం మీద పడితే, దేశాటన చెయ్యాలన్న కోరిక అలాగే మిగిలిపోతుంది. చిన్ననాటినుంచీ నాకు దేశాటన మీద మక్కువ ఎక్కువన్న విషయం నీకు తెలిసిందే! ఇంతకాలం మనకు విద్యాపరిశ్రమతో సరిపోయింది. ఇప్పుడీ సంకెళ్లు..... ఈ భారం మన మీద పడకముందే, రహస్యంగానైనా దేశాటనం చేద్దామా?" అని విక్రమసింహుడు అడిగేసరికి, మంత్రి కుమారునికీ అటువంటి ఉద్దేశమే ఉండటం చేత, దానికి అతడు కూడా అంగీకరించాడు.

ఆ రోజే వాళ్లిద్దరూ ఎంతో విలువైన రత్నాలు - బంగారం - సంగ్రహించి వాయువేగంతో పయనించగల గుర్రాలెక్కి అర్ధరాత్రిపూట నగరం నుంచి బయలుదేరి అరణ్యమార్గాన ప్రయాణించసాగారు.

తెల్లవారేసరికి వాళ్లు గ్రామం చేరుకున్నారు. ఈ సత్రంలో బసచేశారు. రాజకుమారుడు ఈ చిత్రం చూశాడు. మొదట అది చూడగానే చిత్రపటం అనుకోక, నిజంగా అక్కడ ఆ సుందరి ఉందేమో అని మూర్ఛబోయాడు. తర్వాత తనది భ్రమ అని గ్రహించి "బహుశ్రుతా! లోకంలో ఇంత చక్కని కన్యలుంటారా? ఈమెను తెచ్చి నాకు పెళ్లి చెయ్యగలిగితే సరే! లేదంటే నాకు మరణమే శరణ్యం!" అన్నాడు.

"ఈ చిత్రం వెనుక నిజం తెలుసుకుని అలాటి కన్య ఉంటే తప్పకుండా వివాహం జరిపిస్తాను. కాని ఓర్పు వహించు!" అని చెప్పి బహుశ్రుతుడు రాజకుమారుని ఊరడించాడు.

ఆ చిత్రం గురించి ఆరాతీయగా, ఒక వృద్ధ బ్రాహ్మణుడు చెప్పిన సమాచారం ప్రకారం - మూడేళ్ల క్రిందట మలయాళ దేశ రాజధాని అనంతపురం నుంచి విపుణకుడు అనే చిత్రకారుడు వచ్చి దీన్నిక్కడ కట్టేసి వెళ్లిపోయాడు. కారణం అతడికీ తెలీదట!

విక్రమసింహునితో కలిసి బ్రహ్మశ్రూతుడు ఆ పట్నం వెళ్లాడు. పురజనుల్ని అడిగి తెలుసుకుని ఆ చిత్రకారుని ఇంటికివెళ్లి తాము ఆ చిత్రం చూడటం - రాజకుమారుడు వలచాడని చెప్పడంతో అతడిలా అన్నాడు.

"నేను ఒకప్పుడు కాశీపురికి వెళ్లాను. అప్పుడక్కడికి 'పురుష ద్వేషిణి' అనే రాజపుత్రిక విచ్చేసింది. ఆమె తాను మగవారి ముఖం చూడకపోవడమే కాక, తానెక్కిన పల్లకిని సైతం పురుషులు చూడకూడదన్నది. ఆమె ఎంత చక్కనిదో చూడాలని జలస్తంభన విద్య వచ్చిన నేను, ఆమె స్నానానికి రాకపోతుందా అని యోచించి మణికర్ణికా ఘట్టంలోని నీటి అడుగున దాక్కొని ఉన్నాను. ఆమె మోకాలి లోతు నీట్లో నిలిచి ఉండగా - చెలికత్తెలు కలశాలతో నీళ్లు పోస్తూంటే ఆమె స్నానం చేసింది తప్ప నీట్లో మునగకుండా జాగ్రత్తపడింది.

నాకు ఆ నీటిలో కనిపించింది. బంగారుకమ్ముల్లా మెరుస్తున్న మోకాళ్లు, కాలివ్రేళ్లు, అంతే! అయితే నాకు సాముద్రికశాస్త్రం బాగా తెలిసి ఉన్నందువల్ల, ఆ వివరాలను బట్టి మిగతా దేహమంతా ఎలా ఉంటుందో ఊహించగలిగాను. అలాగే చిత్రించాను. ఆ సుందరి ఆ చిత్రంలో మాదిరిగానే ఉంటుందని చెప్పవచ్చు! ఆ చిత్రం గీసి స్వదేశానికి తిరిగొస్తూ, మీరు చూసిన సత్రంలో నేను దిగాను. పదిమంది వచ్చి పోయే ప్రాంతం గనుక అక్కడ వ్రేలాడ గట్టాను. అంతేకాని, ఆమె దేశ కుల వివరాలేమీ నాకు తెలీవు" అన్నాడు.

అది విన్న మంత్రికుమారుడు "ఈ కార్యం సాధించడం అసాధ్యంలా ఉందే! ఆమె ఎక్కడుందో తెలియలేదు. ఒక ప్రక్క రాజకుమారుడు ఈమెనే మనస్సున నిల్పుకుని , విరహంతో వేగిపోతూన్నాడు. దైవం ఏం చేయనున్నాడో కదా!" అనుకున్నాడు మనసులో.

అంతలో విక్రమసింహుడు "అన్నా! ఈ చిత్రకారుని మాటలు విన్నావు కదా! తనకు సరితూగగల పురుషులు లేకనే, ఆమె పురుషద్వేషిణి అని పేరు పెట్టుకుని ఉంటుంది. మరి నువ్వేం చేయాలనుకుంటున్నావు" అని అడిగాడు.

"ఆమె ఎక్కడున్నా సరే! తొందరగా నీతో వివాహం జరిపించడానికి ప్రయత్నిస్తాను" అని ప్రతిజ్ఞ చేశాడు బహుశ్రుతుడు.

ఆ సుందరిని వెతుకుతూ వాళ్లు చాలా దేశాలు తిరిగారు. ఒకనాడు అడవిలో నడుస్తుండగా "అన్నా! బహుశ్రుతా! ఎండలో నడచి బాగా అలసిపోయాను. నేనీ చెట్టు నీడన విశ్రమిస్తాను. నువ్వు వేగంగా నీళ్లు తీసుకురా!" అని అక్కడే పండుకొన్నాడు విక్రమసింహుడు.

బహుశ్రుతుడు చెట్టెక్కి, చుట్టుప్రక్కల పరికించి, దగ్గర్లో నీటి పక్షులు ఎగరడం చూసి "ఒక్క నిమిషం తాళు!" అంటూ వెళ్లాడు. అక్కడొక సరస్సు కనిపించింది. దగ్గరకు వెళ్లేసరికి ఒక శిలాఫలకం మీద "ఇది పురుషద్వేషిణి అనే రాజపుత్రి క్రీడించే సరోవరం. ఇక్కడకు వచ్చిన పురుషులు ఉరితీయబడతారు" అని రాసి వుంది.

మిత్రుడికి ఆ సంగతి చెబుదామని, నీళ్లు పట్టుకుని చెట్టు దగ్గరకు వచ్చేలోగా –

విక్రమసింహుడికి ఒక భయంకరమైన ధ్వని వినిపించింది. అతడు నిరాయుధుడై ఉండడం వల్ల ఇంకేం ఆలోచించక మర్రి చెట్టు ఎక్కేశాడు. ఒక సింహం వచ్చి, ఆ చెట్టు కింద తిష్ఠ వేసింది. సింహం భయంతో, విక్రమసింహుడు, చెట్టుమీద పడుకొని ఉన్న క్రౌంచ పక్షి రెక్కల్ని కూడ కొమ్మలే అనుకొని, దాని రెక్కల మధ్య దాక్కొన్నాడు.

ఆ అలికిడికి క్రౌంచపక్షి చెట్టు కొమ్మ విరిగేలాగ, రివ్వున లేచి, ఆకాశమార్గంలో క్రౌంచద్వీపం వైపు ఎగరసాగింది.

పక్షి రెక్కల మధ్య చిక్కుబడిన విక్రమసింహుడు "అయ్యో! నేనొకటి తెలిస్తే. దైవం ఇంకొకటి తలచాడు. ఈ పక్షి నన్ను ఎక్కడికి తీసుకుపోతుందో ? ఇంటి దగ్గర సుఖంగా ఉండక నేను దేశాటనం తలపెట్టనేల? మిత్రునికి ఈ సంగతి ఎలా తెలియజెయ్యడం?" అనుకుని ఒక చీటీ రాసి నేలపై పడేశాడు.

## క్రౌంచద్వీపం కథ

ఆ పక్షి కూడా, చాలా దేశాలు, ద్వీపాలు దాటి, క్రౌంచద్వీపం మీదున్న ఒక చెట్టుపైన వాలింది. తరచుగా ఆ పక్షులు ఆ ద్వీపంలో నివశిస్తూ ఎప్పుడైనా జంబూద్వీపానికి మేత కొస్తుంటాయి. వాటిని బట్టే ఆ ద్వీపానికి క్రౌంచద్వీపం అని పేరొచ్చింది.

ఆ క్రౌంచపక్షి అలా వాలడంతోనే విక్రమసింహుడు మెల్లగా దాని రెక్కల సందుల్లోనుంచి తప్పించుకొని, ఆ కొమ్మల మీంచి కిందికి దిగాడు. అతడు తన రెక్కల్లో ఇరుక్కున్నాడన్న సంగతైనా ఆ పక్షికి తెలీదు. ఇక దాని బలం ఎంతో మనం అంచనా వేసుకోవచ్చు!

అలా దిగి, ధైర్యంగా అక్కడ నడుస్తూంటే ఒక పట్టణం అందులో ఒక స్త్రీ ఎదురయ్యాయి. అక్కడి భాష. అతనికి అర్థంకాకపోవడంతో, ఆ స్త్రీ ఏం చెప్పిందీ విక్రమసింహునికి అర్థంకాలేదు.

కాని, ఆ స్త్రీ అతడ్ని మోహించి, తన ఇంటికి రమ్మని చేతిసైగల ద్వారా సూచించింది. అతడికి అప్పుడు ఏం చెయ్యాలో తోచక, సరే వస్తానన్నట్లుగా తానూ సైగ చేశాడు.

ఆ క్రౌంచద్వీపానికి రాజధాని అయిన ఏకశిలానగరం అది. దాన్ని క్రౌంచవతి అనే రాణి పరిపాలిస్తుంది. అందులోని స్త్రీలకు చక్కదనమైతే ఉంది గాని, బుద్ధులు - చేతలు రాక్షసమైనవి - అక్కడి పురుషులకు నల్లని కోతిముఖాలుండి, పొట్టిగా వికారంగా ఉంటారు.

రామరావణ యుద్ధంలో మూర్ఛపోయిన లక్ష్మణుడ్ని బతికించాలని హనుమ సంజీవిని తెచ్చి, తిరిగి తీసుకెళ్తూ అక్కడో నిముషంసేపు విశ్రమించగా - ఎంతో అందగాళ్లయిన అక్కడి పురుషులు ఆంజనేయుణ్ణి పరిహాసం చేసేసరికి హనుమకు కోపం వచ్చి వారిని శపించాడని ఒక ఇతిహాసం. ఆనాటి నుంచి వారికి జన్మించిన సంతానం పురుషులు వికారంగాను - స్త్రీలు రాక్షస కృత్యాలు చేసేవారిగాను ఉంటున్నారు. సాధువులను చూసి పరిహసించిన పాపం ఊరికేపోతుందా?"

అటువంటి దీవిలో ఎంతో అందగాడైన విక్రమసింహుని చూసి ఆనందాన్ని పొందడంలో ఆశ్చర్యమేముంది? పట్టరానంత సంతోషంగా ఆ రాజకుమారుణ్ణి వెంటబెట్టుకుని పోతూ ఆ స్త్రీ, తన ఏలిక అయిన క్రౌంచవతికి ఆ వృత్తాంతం తెలిస్తే అతడ్ని తనకు దక్కనివ్వదని భయంతో, వడివడిగా తన ఇంటికి తీసుకుపోసాగింది.

దారిలో పుష్పవతి అనే ఇంకొకస్త్రీ తారసిల్లి "అక్కా! ఇంత చక్కని పురుషుడు ఎక్కడి నుంచి వచ్చాడే? పురుషుల్లో కూడ ఇంత వింతగలవాళ్లు ఉంటారు కాబోలు! ఇతడి కథేమిటి?" అని అడిగింది.

"సర్లే! మా బాగా అడిగావు. ఇతడి గురించి నాకు మాత్రం తెలుసా ఏమిటి? ఇతడెక్కడ్నుంచి వచ్చాడో నాకూ తెలీదు. నేను ఇప్పుడే చూశాను. మన భాష తెలీదన్న లోపమొక్కటే తప్ప ఇంకేమీ నాకు కనిపించడం లేదు. ఎలాగూ నువ్వూ చూశావు కనుక, మనం ఇతడిని రహస్యంగా మన

ఇంటికి తీసుకుపోయి పెళ్లాడదాం! మన రాణికి తెలిసిందో కామాతురాలు కనుక, మనకు దక్కనివ్వదు సుమీ!" అనడంతో ఆ స్త్రీ కూడ మొదటి దాని వెంట నడకసాగింది.

ఈ లోపున ఇంకొక స్త్రీ అక్కడికొచ్చింది. "ఓహో! గొప్ప సొగసుకాడినే సంపాదించారే! నాక్కూడా ఇతడ్ని పంచండి" అనేసరికి తమ గుట్టు బయట పడుతుందని కాబోలు - వాళ్లిద్దరూ అందుకు ఒప్పుకున్నారు.

ఆ ముగ్గురూ విక్రమసింహుని తీసుకుని వేగంగా పోతూంటే, దారిలో ఇంకో ఇద్దరూ కనిపించారు. ఎలా ప్రాకిందో క్షణాలలో ఊరంతా ఆ విషయం తెలిసేసరికి అక్కడున్న స్త్రీలంతా అతడిని చూడటానికి రాసాగారు. అక్కడ పురుషులకు స్వాతంత్ర్యంలేదు. స్త్రీలకు జారత్వం దోషం కాదు. నచ్చినవాడ్ని ఎంతకాలమైనా ఉంచుకోవచ్చు! వచ్చిన వాళ్లంతా విక్రమసింహుని తమ తమ ఇళ్లకు రావలసిందిగా సూచించసాగారు.

అంతమందీ ఆ విధంగా చెప్తూండేసరికి, ఏం చెయ్యడానికీ పాలుబోక విక్రమసింహుడు మొదట తాను చూసిన పుష్పవతి ఇంటికే వెళ్లాడు. ఆమె అతడ్ని ఎన్నో విధాల సత్కరించింది. కాని వారి ఆహార - విహారాలే అతనికి విపరీతంగా తోచాయి. వాళ్లు పచ్చిమాంసం తింటారు. కోపం వస్తే వాళ్లు మగవాళ్లని చంపి తినేస్తుంటారు. విక్రమసింహుడు అక్కడ పాలు - పండ్లు తప్ప, మాంసం ముట్టక జాగ్రత్తగా ఉండసాగాడు. ఏ మాంసంలో నరమాంసం కలిసిపోయిందో ఎవరికి ఎరుక?

ఒక పక్క పురుషద్వేషిణి మీద విరహం, ఇంకోపక్క మిత్రుడ్ని విడిచి రావడం అతడ్ని తీవ్రంగా బాధిస్తున్నాయి. కాని ఎన్ని వందల - వేల యోజనాల దూరం వచ్చేసినా తాను ఇప్పుడింకేమి చేయగలడు? మనస్సులోనే ఆరాటపడడం తప్ప....

బుద్ధిమంతుడైన విక్రమసింహుడు వారి భాషని కేవలం పరిశీలన మీద పదిరోజుల్లో నేర్చేసుకున్నాడు. కాని వారి భాషామర్మం బోధపడింది కదా అని, సంభాషణ ప్రారంభిస్తే, వాళ్లకు ఇంకా చులకన అయిపోయి, వారిలో

తననూ ఒకడిగా చేసేసుకుంటారని - భాషరాని వాడిలాగే అభినయిస్తూ ఎక్కువ భాగం మౌనంగా గడపసాగాడు విక్రమసింహుడు.

ఇలా ఉండగా ఓరోజు ఆతనికి అతిధ్యమిచ్చిన స్త్రీ ఎంతో ధైర్యంగా మన్మధవికార చేష్టలు చూపి, అతడ్ని రతికి ఆహ్వానించేసరికి - మొదట ఆమెను సంభోగించకూడదనే అనుకున్నా, సిగ్గు విడిచి అడిగేసిన స్త్రీని కాదనడం- సంతృప్తి పరచగలిగీ, రతి సుఖాన్నివ్వలేకపోవడం మర్యాద కాదని భావించి ఆమెకు ఎన్నడూ అనుభవంలోకి రాని చిత్రరతులతో సుఖపెట్టాడు విక్రమసింహుడు.

ఆమె తాను పొందిన సుఖాన్ని ఊరంతా చాటింది కాబోలు! ఆ నగరంలోని ప్రతి స్త్రీకి ఆమె పట్ల ఈర్ష్య కలిగి, మెల్లగా ఆ వృత్తాంతాన్ని ఆ నగరాన్నేలే రాణి చెవిన వేశారు.

అసలే కాముకి. పైగా చపల చిత్తం కలిగినది. అప్పటికెంతమంది పురుషులతో సుఖాన్ని పొందిందో ఆమెకు లెక్కలేదు. అటువంటి రాణి, సౌందర్యవంతుని అంత తేలిగ్గా వదిలేస్తుందా? వెంటనే తన పరిచారికను పంపి, వేగంగా ఆ పురుషుని తీసుకుని రమ్మని పురమాయించేసింది. ఆమె ఆ ఆజ్ఞ తక్షణం పాటించింది.

రాణి, విక్రమసింహునికి ఎదురు వెళ్లి, కౌగిలించుకొని తన అర్థ సింహాసనం ఇచ్చి గౌరవించింది. పరిచారికతో కూడ తన చెంత కొచ్చిన పుష్పవతితో "ఏమే! ఈ సుందరాకారుని ఇంతకాలం నీ ఇంటిలో దాచుకొంటివా? విలువైనవి - వింతయినవి ప్రభువుల పరం చేయాలన్న కనీస జ్ఞానం కూడా లేదా? ఇదే మొదటి తప్పు గనుక వదిలేస్తున్నా! పో పో!" అని ఆమెను పంపించేసింది. ఆ రాణికి తనమీద చాలా వ్యామోహంగా ఉందని, విక్రమసింహునికి మొదట్లోనే అర్థమైంది. తగినంత స్వాతంత్ర్యం లేక గాని - ఉన్నట్లయితే ఎక్కడయినా స్త్రీ స్వభావం స్వైరిణి అనే చెప్పాల్సి వుంటుంది అనుకున్నాడు విక్రమసింహుడు. కాని అతడికామె మీద మనసు లేదు.

ఎన్నెన్నో మర్యాదలు చేసి, ఆ రాణి "ఆర్యా! మా పూర్వ పుణ్యవశాన మేము మిమ్ము పొడగట్టాము. మా దురవస్థ మాపడానికి వచ్చిన భగవంతునిలా తోస్తున్నావు. సుందర పురుష సంయోగం లేక, ఇక్కడి స్త్రీల సంతానం ఏ రీతిగా ఉందో నువ్వు చూసే ఉంటావు. నేను కొత్తగా సింహాసన మెక్కాను. నాకో వికృత పురుషుడు పతిగా ఉన్నాడులే! కాని నేను కన్యనే! ఇంతవరకు వాడి మొహమైనా నేను చూసింది లేదు! నువ్వు నన్ను భార్యగా స్వీకరించి, నాకొక చక్కని పుత్రుని ప్రసాదించు" అని దీనంగా బతిమాలుకున్నది. సాటి రాచపడుచు అలా దీనంగా అడిగేసరికి, ఇంకా బతిమాలించుకోవడం మర్యాదకాదని అంగీకరించాడు విక్రమసింహుడు.

ఆమె అతనికి అనుకూలమైన రీతులలో మెలగి, సురత సుఖం అందించి, తన మదన తాపాన్నంతా అతనితో తీర్చుకుంటూ కామశాస్త్రంలో చెప్పబడిన సుఖబంధనాలన్నీ రోజుకో భంగిమలో అతనితో అభ్యసిస్తూ మన్మథక్రీడల్లో తేలియాడేసరికి, ఓ శుభముహూర్తాన ఆ స్త్రీ గర్భవతి అయింది.

ఆ దేశంలో గర్భిణీస్త్రీలు పురుష సాంగత్యం చెయ్యరు. అది అక్కడికి ఆచారము. అసలు కారణం - వారికి సంతానం ప్రాప్తించడం కోసం ఏదో తప్పదన్నట్లు పురుషునితో రతికార్యానికి ఒప్పుకుంటారే తప్ప, కామసౌఖ్యం పరిపూర్ణంగా అనుభవించడానికి కాదు. వికృత పురుషునితో రతి కేస్త్రీ మాత్రం పదే పదే తహతహలాడుతుంది? అందువల్ల ఆమె "నాథా! నీ దయవల్ల నాకు పుత్ర సంతానేచ్ఛ తీరే సూచనలు కనిపిస్తున్నాయి. అయినప్పటికీ - నీ సురత సౌఖ్యానికి లోటు లేకుండా నా చెల్లెలైన కుసుమగంధిని అనుభవించు!" అని తన సోదరిని అతడికి జత కలిపింది. ఆమె రాణిని మించిన సొగసుకత్తె. పైగా చిన్నది.వయసు మీదున్నది కావడంతో విక్రమసింహునికి నచ్చి, సరే అన్నాడు. ఆమె కూడా అతనితో చెలరేగి మదనసౌఖ్యం అనుభవించి, గర్భవతి కాగానే అతడ్నించి దూరం జరిగింది. రాణి ఆజ్ఞ ప్రకారం - ఆ వూళ్లోని ఒక్కో స్త్రీ అతడ్ని చేరి, తమకు నచ్చిన రీతిలో సుఖించసాగారు.

కొంతకాలానికి ఒక శుభలగ్నాన రాణికి పుత్రోదయం జరిగింది. ఆ బాలుడు అక్కడి పురుషుల్లాగ కాకుండా, అందంగా ఠీవిగా పుట్టేసరికి రాణివాసం వారి ఆనందానికి హద్దుల్లేకపోయాయి. క్రౌంచద్వీప భావి చక్రవర్తి ఉదయించాడని అంతా సంతోషించారు.

వంతులవారీగా విక్రమసింహునితో సుఖించిన ఆ నగరం స్త్రీలలో చాలామందికి అందమైన వారు జన్మించారు. దాంతో వారంతా ఆ ద్వీప దుర్దశను పోగొట్టడానికి వచ్చిన పరమేశ్వరుడే అని భావించసాగారు. అతడు ఏ పని చెప్తే ఆ పని చేయడానికి సిద్ధంగా ఉన్నారు. కాని వారికి ఇతర ద్వీపసంబంధ జ్ఞానం పిసరంతైనా లేదు. ఎలా వుంటుంది? అది పురుషులకు విలువ లేని దేశమాయె! స్త్రీల ఏలుబడిలో బుర్ర పెంచుకోగల అవకాశం అక్కడెవరికీ లేకపోయె! వారి బుద్ధి ఆ ద్వీపానికే పరిమితమైపోయె! విక్రమసింహుడే వారికి సంస్కారం నేర్పడానికి అప్పుడప్పుడు సభలు చేయడం - వారి దురాచారాలను మెత్తగా మందలించడం చేస్తూ కొంతవరకు వారిలో మార్పు తెచ్చాడు.

అయినప్పటికీ ఆ దేశపు మదతులకు, పురుషుల పట్ల గౌరవం చాలా తక్కువ. కేవలం సంగమం కోసం -సౌఖ్యం కోసం వారిని ఆశ్రయించవలసి రావడం వల్ల ఆ మాత్రమైనా గౌరవం ఉంది కాని, పురుష స్పర్శతో పనే లేకుంటే, వారిని బానిసల కన్నా హీనంగా చూడగల వారనడానికి సందేహించనక్కర్లేదు.

అది ఆ దేశపు పురుషులందరికీ కంటకంగా మారింది. వారికి మేలు చేయడానికే విక్రమసింహుడు 'పురుషుల్ని సగౌరవంగా చూడండ'ంటూ సభలు చేసినప్పటికీ అది వాళ్లకేమీ ఆనందం కలిగించలేదు. దాంతో వాళ్లంతా ఒకచోట సమావేశమై "అయ్యో! మన గతి ఏమైందో చూశారా! మన భార్యలంతా మనలని చులకనగా చూస్తూ, ఎక్కడ్నించో వచ్చినవాడ్ని పట్టుకొని మన కళ్లముందే విచ్చలవిడిగా సంచరిస్తూ క్రీడిస్తున్నారు. వాడి సంతానంతోనే ఈ ద్వీపమంతా నిండిపోయేలా ఉంది. ఇలాటి శత్రువు ఎక్కడా ఎప్పుడూ ఎవరికీ దాపురించదేమో! ఎంతటి నీచుడికైనా సరే- తన భార్య ఇంకొకడితో

రతిసర్తాంటే ఈర్ష్య కలుగకుండా ఉంటుందా? వీడ్ని ఎలాగైనా వదిలించుకోకపోతే, మనకు మునుపటి మర్యాదైనా రతి సమయంలో కలగదు. మనలో కొందరికి రాణివాసంలోకి వెళ్లగల అనుమతి ఉంది కదా! అందువల్ల - రాత్రి వాడు నిద్రిస్తున్నప్పుడు మంచంతో కూడా వాణ్ణి మోసుకుపోయి సముద్రంలోన పారేద్దాం!" అని ఆలోచించుకున్నారు.

పథకం ప్రకారము వాళ్లు అతని మంచాన్ని ఎత్తుకుని సముద్రం వైపు ఒకనాటి అర్ధరాత్రి బయలుదేరగా మెలకువ వచ్చిన విక్రమసింహునికి వాళ్ల ప్రయత్నం అర్థమై, మంచం ఒక చెట్టుకొమ్మ క్రిందుగా వెళ్తూన్నప్పుడు చటుక్కున దాని కొమ్మ అందుకుని చెట్టుమీదకు ఎగబ్రాకాడు. వాళ్లు అత్యుత్సాహంగా ఖాళీ మంచాన్ని ఎత్తుకెళ్లి ఆ చీకట్లో పారేశారు. సముద్రంలోన నిద్రలో పడ్డవాడు చచ్చి ఉంటాడని సంతోషించారు.

మర్నాడు - విక్రమసింహుడు కనిపించకపోయేసరికి తమ పురుషులంతా కలిసి అతడ్ని ఏదో చేశారని అర్థం చేసుకుంది రాణి. సుందరాకారుడైన ఆ పురుషునే వంచించనెంచిన వారు రేపెప్పుడైనా ఆ ద్వీపంలో స్త్రీలందరికీ అతడు ప్రసాదించిన సంతానాన్ని చూసి కక్ష పెంచుకొనే అవకాశం ఉంటుంది గనుక - వాళ్లందరికీ ముందు జాగ్రత్త చర్యగా కఠిన శిక్ష విధించింది. ఆ పురుషులతో కేవలం బానిస చర్యలు చేయించుకోదలచి, వారికి ఏ స్త్రీ కూడా రతిసుఖాన్నివ్వరాదని శాసించింది. ఎక్కడైనా ఎవ్వరైనా తన ఆజ్ఞ మీరి ఆ పురుషులతో సుఖిస్తే, వారి మగతనం హరించబడే విధంగా శిక్ష వేసింది" అని మణిసిద్ధుడు చెప్పగా "విక్రమసింహుడేమయ్యాడు?" అని అడిగాడు గోపాలుడు.

అతడు ఏ చెట్టు మీదకి ఎగబ్రాకాడో, ఆ చెట్టు మీదనే అంతకు ముందు అతడ్ని ఆ ద్వీపానికి తెచ్చిన క్రౌంచపక్షి ఉంది. దైవికంగా అతడానాటి వలె తనకు తెలీకుండానే దాని రెక్కల్లో ఇమిడిపోయాడు. అది ఎగిరెగిరి, పూర్వం విక్రమసింహుడు తన మిత్రుని ఎడబాసి ఎక్కడైతే దాని బారిన పడ్డాడో సరిగ్గా అదే చెట్టుమీద వాలింది.

విక్రమసింహుడు ఆ పరిసరాలను గుర్తుపట్టి మెల్లగా ఆ చెట్టుదిగి బహుశ్రుతుని కోసం వెతుకుతూంటే, అతనే ఎదురుపడ్డాడు. ఇద్దరికీ కూడ అది నమ్మలేని కలయిక. తన వృత్తాంతం చెప్పాడు విక్రముడు.

బహుశ్రుతుడు, పురుషద్వేషిణి విహార సరోవరం ఆ పక్కనే ఉందని మిత్రునికి చెప్పాడు. ఆనాడు సింహం అరుపు తానూ విన్నానని – నీళ్లు తెచ్చేలోగా అది తన మిత్రుడ్ని కబళించిందేమో అనుకున్నానని – కాని విక్రమసింహుడు రాసి పడేసిన చీటీ వల్ల బ్రతికే ఉన్నట్లు తెలిసిందని వివరించాడు.

అంతేగాక క్రౌంచపక్షి సమాచారాన్ని ఒక వృద్ధ కిరాతకుని వల్ల తెలుసుకోగలిగాడు. ఆ పక్షి ఆ చెట్టు మీదకు సంవత్సరానికోసారి వస్తుందని – ఆ మర్రి చెట్టు మీద రెండు మూడు రోజులుండి వెళ్లిపోతుందని మనుషుల్ని మోసుకుపోగలిగేటంత శక్తి దానికున్నా, అది క్రూరమైనది కాదని – దాని పేరేమిటో తనకు తెలీదని చెప్పాడా అడవిమనిషి. తన మిత్రుడు బతికే ఉన్నందుకు సంతోషించి, మళ్లీ ఏడాదికి ఆ పక్షి ఇక్కడకు రాకపోతుందా? దాంతో పాటు తన స్నేహితుడూ రాకపోతాడా? అని ఎదురుచూస్తూ అక్కడే కందమూలాలు తింటూ బహుశ్రుతుడు జీవిస్తున్నాడు. దానితోపాటు తన మిత్రుడిని ఆరోజు చూడకపోయినట్లయితే, అతడు చనిపోవడానికి సిద్ధపడ్డాడు. దైవికంగా మిత్రుడ్ని కలిసినందున, ఇక పురుషద్వేషిణికి చెందిన ఆలోచనలు కట్టిపెట్టి ఇంటికి పోదాం – పదమన్నాడు.

అయితే విక్రమసింహుడు గట్టిపట్టు పట్టడంతో ఆమె జలకాలాడే సరోవరాన్ని చూపించడానికి ఒప్పుకున్నాడు బహుశ్రుతుడు.

## పురుషద్వేషిణి కథ

ఇంతలో పురుషద్వేషిణి జలకేళికి వస్తోందనీ – ఆ సమీపంలో ఎవరైనా పురుషులుంటే, వారు దూరంగా పోవాలని, లేకుంటే తెలిసిగాని – తెలీక గాని వారు కంటపడితే శిక్షింపబడతారనీ ఒక చాటింపు వినబడింది.

వాళ్లిద్దరూ ఆ తటాక తీరంలో దట్టంగా అల్లుకోబడిన ఒక చెట్టు నెక్కి, దాని కొమ్మల సందున దాక్కొని ఆ విలాసవతిని చూడాలని

ఉత్సాహపడ్డారు. అయితే ఆమె స్నానం చేస్తుందని తెలిసి కేవలం విక్రమసింహుడొక్కడే చెట్టెక్కాడు. బహుశ్రుతుడు క్రిందనే ఉన్నాడు. కొద్దిసేపట్లోనే అక్కడికి స్త్రీల చేతనే మోయబడే ఒక పల్లకిలో ఎంతోమంది స్త్రీ భటులతో కూడి, చెలికత్తెలతో పాటు ఒక అద్భుత సౌందర్యరాశి, అక్కడి కొచ్చింది. అది అరణ్య మధ్యం కావడం వల్ల – స్త్రీలు తప్ప పురుషులెవరూ లేరని ముందే చాటింపించడం వల్ల ఆమె నిస్సిగ్గుగా తన వలువలన్నీ విడిచి ఒక చోట కుప్పగా పోసి, కులుకుతూ ఈ జల మధ్యాన కలువల్లో కలిసిపోయింది. స్నానం చేస్తూ వింత వింత ఈదులాటలతో చెలులతో జలకేళి సలుపుతోంది. కొంతసేపు నిలువుగా కొంతసేపు ఏటవాలుగా, కొంతసేపు బోర్లా ఈది , చివరికి వెల్లకిలా ఆ సరస్సులోని జలంలో ఈదుతూంటే, ఆమె చన్నులు నీటిపైకి తేలి విచ్చుకోనున్న కలువ మొగ్గలతో పోటీపడసాగాయి. ఆమె చెలికత్తెలు కూడ ఆమెనే అనుసరిస్తూ వెల్లకిలా ఈదసాగారు. లేతకలువ మొగ్గలతోపాటు వారి చన్నులు కూడా కలిసి, ఏవి మొగ్గలో ఏవి స్తనాలో పోల్చుకోలేనంతగా ఆ జలంలో ప్రకాశించడం ప్రారంభించాయి. సూర్య కిరణాలు వాటిపై ప్రతిఫలించి వింతకాంతులతో ఆ రమణీమణుల కుచాగ్రాలు మెరుస్తూంటే – పురుషుడన్న వాడికి నిల్చున్న చోట నిలువతరం కావడం లేదు. స్త్రీలకే వారి సోయగాలు మోహం పుట్టిస్తూండగా పురుషుల సంగతి వేరే చెప్పాలా? ప్రత్యక్షంగా ఆమె అవయవాలన్నీ చూసిన విక్రమసింహుడు జన్మధన్యమైందనుకున్నాడా దృశ్యం చూసి.

అప్పుడు అక్కడకు దగ్గర్లో గల ఒక చెట్టు దగ్గర ఇద్దరు స్త్రీ భటులిలా మాట్లాడుకోవడం విక్రమసింహ – బహుశ్రుతుల చెవిన పడింది. వారిమాటల సారాంశాన్ని బట్టి – సర్వావయవ సౌందర్య సంపన్నురాలైన జవ్వని అడవికాచిన వెన్నెల్లా తన యవ్వనాన్ని వృధాచేసుకుంటోందనీ – ఎన్నిసార్లు అడిగినా చెప్పడం లేదనీ – యుక్తిగా అడిగితే చెప్పవచ్చుననీ అనుకున్నారు.

సరిగ్గా అదే ఊహ ఆమెతోపాటు జలకాలాడుతున్న చెలికత్తులకూ రాగా వాళ్లామెను ఆట పట్టిస్తూ "ఏమిటమ్మా! నీది మరీ చోద్యం! మన ఈ కులుకులూ, విలాసాలు ఎవరికోసం?" లోకపరిపాటి కాదనీ స్త్రీ విరుద్ధమైనట్టి

ద్వేషభావం పురుషులు మీద కలగడానికి కారణం ఏమిటనీ – మన సోదరులు, తండ్రీ పురుషులు కారా? అనీ అడగ్గా, ఆ పురుషద్వేషిణి "నాకు అందరూ ఒక్కటే! నాకు జ్ఞానం వచ్చిన నాటి నుంచీ నా తండ్రిముఖమైనా చూడలేదు" అంది. "ఈ రోజు మాకా కారణం చెప్పి తీరాలి! అంతటి వైముఖం నీకు ఏర్పడ్డానికి గల కారణం మేమైనా వినకపోతే, నువ్వు మమ్మల్నీ దూరం చేసుకున్నంత ఒట్టు" అని గట్టిగా పట్టుపట్టేసరికి, ఆమె ఇలా చెప్పడం ప్రారంభించింది....

## రత్నాంగి కథ

"నాకు పూర్వజన్మ స్మృతి ఉంది. నేను గతజన్మలో ఒక రత్నవర్తకుని కూతుర్ని. నేను నా తండ్రికి లేకలేక కలిగిన సంతానాన్ని. నా పేరు రత్నాంగి. నా తండ్రి నన్ను గారాబంగా పెంచుతూ, యవ్వనం రాగా కాంతివర్మ అనే వైశ్యకుమారునికిచ్చి పెళ్లిచేశాడు. పెళ్లయిన కొద్ది కాలానికే నేను కాపురానికి వెళ్లాను.

నా భర్త కుటుంబం – సంప్రదాయం అన్నీ మంచివే గానీ, సావాస దోషం వల్లనో – మరే కారణం చేతనో అతడు జూదరిగాను, దుష్టసావాసాలతోను కాలం గడుపుతూ పిత్రార్జితం అంతా ఖర్చుపెట్టసాగాడు. నా బోధలన్నీ అతడిపట్ల వ్యర్థమయ్యాయి. ఇంట్లో ఉన్న ధనమంతా అతడి వ్యసనానికే వ్యయం కాగా, జూదంలో అప్పుపడి జూదరులతడ్ని నిర్బంధించినపుడు నా నగలిచ్చి అతడ్ని విడిపించాను.

అయినా అతడికి విశ్వాసం లేదు. అక్కడితో ఆగక మా తండ్రి నాకు అరణంగా ఇచ్చిన ధనమంతా కూడా జూదంలో ఓడిపోయాడు. రుణాలు చేసి మరీ ఆడేవాడు. చివరికి కూటికీ – గుడ్డకీ మొహం వాచవలసిన పరిస్థితి వచ్చింది. అప్పులవాళ్లు నిర్బంధిస్తూంటే చూడలేక, అతన్ని వెంటబెట్టుకుని పుట్టింటికి వెళ్లాను. మా హీనస్థితి తెలీని నా తండ్రి మా ఇద్దర్నీ ఎంతో గౌరవంగా చూశాడు.

"నాన్నగారూ! మీ అల్లుని సిరిసంపదలు మీకు తెలీనివి కావు. కొన్నిరోజుల క్రిందట లక్షల విలువ చేసే సరుకుతో విదేశాలకు ఓడను

పంపించాం! అది ఇంకా తిరిగి రాలేదు. ఇక్కడ కొన్ని సరుకులు కొనవలసి వుంది. కొంత సొమ్ము బదులుగా ఇస్తే వడ్డీతో సహా తీర్చేస్తాము" అని అసత్యం చెప్పాం!

తన సొత్తుకు ఇతరులు ఎవరున్నారు అనుభవించడానికి? అని తిరిగి ఇవ్వవలసిన అవసరం లేదంటూ మా తండ్రి కొంతసొమ్మును ఇచ్చాడు. ఆ మూటతో మేం మళ్లీ అత్తవారింటికి వెళ్లాం! అంతవరకు చేసిన ఋణాలన్నీ తీర్చేసి, మరి జూదం జోలికి పోనని అతనిచేత ప్రమాణం చేయించుకున్నాను. కొంత సొమ్ము నా దగ్గరే ఉంచుకున్నాను. ఆ సొమ్ము నేను అతనికి ఇవ్వనని భావించి, ఒకరోజున మేమిద్దరం విహారానికి వెళ్లి వస్తూండగా – నన్ను ఒక పాడునూతిలో తోసేసి డబ్బు పట్టుకుపోయాడు. దుష్టులు చేయసాహసించగల దుర్మార్గాలకు అదీ –। ఇదీ అనేముంది? బంధాలు సైతం విస్మరిస్తారు.

ఆ అగాధంలో పడుతూంటే దైవనిర్ణయం వల్ల నాకొక మర్రి కొమ్మ ఊతంగా దొరికింది. దాని ఆధారంతో నీట్లో మునిగీ – మునక్కుండా సహాయం కోసం అరవసాగాను. అదృష్టవశాత్తు ఆ దారిన బాటసారులెవరో పోతూ, దీనంగా వినవస్తూన్న నా అరుపులు నూతిలోంచి వస్తున్నాయని గ్రహించి – కర్రలు, తాడు లోపలకు దింపి నన్ను బైటకు లాగారు. నా గురించి తెలుసుకుని నన్ను మా తండ్రికి అప్పగించారు. నా తండ్రి ఎంతో విచారించి కారణాలు అడిగాడు.

ఏమని చెప్తాను? నిజం చెప్తే నా కాపురమే బైటవేసుకున్న దాన్నవుతానని భావించి, దొంగలుసొత్తు అంతా దోచుకుని, మీ అల్లుణ్ణి తరిమేసి – నన్ను నూతిలో తోసిపోయారని అబద్ధమాడాను.

అక్కడ కొన్నాళ్ళున్న తర్వాత – భర్త దగ్గరకు వెళ్తానంటే నా తండ్రి మళ్లీ కొంతధనం ఇచ్చి పంపించాడు. ఇంటిముందు పల్లకీ దిగుతూంటే, నా భర్త నన్ను చూసి అవాక్కయ్యాడు. నేను మారు మాట్లాడకుండా, అంతటి దుర్మార్గుడిలోను పరివర్తన కలుగుతుందేమోనని నమస్కరించి మరీ వెళ్లాను.

లోపల చూస్తే ఏముందీ? సర్వం ఖాళీ! నన్ను వంచించి తీసుకున్న ధనం మొత్తం జూదగాళ్ల పరం చేశాడు.

అతడిలో ఎప్పటికైనా మార్పు రాకపోతుందా అని నేను ఆలోచిస్తూంటే,పుట్టింటినుంచి పూర్వం లాగానే బాగా డబ్బు తెచ్చాననుకొని - అది అతడికి ఇవ్వడం లేదని అనుకొని ఒకనాటి రాత్రి నా గొంతు నొక్కి చంపేశాడు. అదృష్టవశాత్తు పూర్వజన్మ జ్ఞానంతో ఇటువంటి ఉత్కృష్టమైన జన్మమెత్తాను.

మగజాతి అంటేనే దుర్మార్గులూ - దుష్టులూ. ఇంకెప్పుడైనా మీరు నాముందు పురుషుల ప్రస్తావన తెచ్చారో జాగ్రత్త! మిమ్మల్ని తీవ్రంగా శిక్షిస్తాను" అని తన పూర్వజన్మగాథ వివరించింది.

కేవలం బొమ్మను చూసి మోహించిన విక్రమసింహుడు నిజంగా ఈ సౌందర్యరాశిని ఆ జలకాలాటల్లో నగ్నంగా చూసేసరికి ఇక మనస్సు నిలువరించుకోలేకపోయాడు. గబగబా చెట్టు దిగి వచ్చి, కిందనున్న మంత్రికుమారునితో "విన్నావా బహుశ్రుతా! ఆమెకు పురుషులపై ద్వేషం ఉండడానికి కారణం అదీ. అయినా ఆమె నెలాగో నా దాన్నిగా చేసుకు తీరాలి" అన్నాడు.

ఆ సాయంత్రానికి, పురుషద్వేషిణి ఉండే ఊరు చేరుకున్నారు. ఒక పూటకూళ్లమ్మ ఇంట్లో బస చేశారు. ఆమె విశేషాలు అడగ్గా వారికి పురుషద్వేషిణి గురించి చెప్పిందామె.

వాళ్లు తమ దగ్గరున్న మణిమాణిక్యాలను వినియోగించి, ఆ నగరానికి శివారులలో ఒక విశాలమైన ఖాళీ జాగా కొని, అక్కడ ఆ పట్టణానికి దీటైన ఒక నగరాన్నే ఏర్పాటు చేయించారు. అందులో ఒక కోటను నిర్మింపజేసి, నగరంలో నివశించడానికి కొందరికి ఉచితగృహాలను కూడా ఇచ్చారు.

విక్రమసింహునికి వనితాద్వేషి అని పేరు పెట్టబడింది.ఆ పురానికి అతడు రాజు. సైన్యంతో సహా సమస్త రాచ చిహ్నాలతో ఆ పురప్రజలను

అతడు పరిపాలించసాగాడు. ప్రజలకు పన్నుల బెడద లేదు. వర్తక వాణిజ్యాలు యధేచ్ఛగా చేసుకోవచ్చును. క్రమముగా కొందరక్కడ స్థిరపడి, అది కేవలం అలంకార ప్రాయమైన రాజ్యం వలె గాక శోభించే విధంగా నిజమైన పాలన గల రాజ్యంలా చలామణీ కాసాగింది.

ఆ పురాన్ని పరిపాలించే వనితా ద్వేషి ప్రతిరోజూ ఉదయాన్నే కేళీ సరోవరానికి వెళ్తాడనీ - అప్పుడు స్త్రీలు ఎవరూ బైటకు రాకూడదనీ - వచ్చేవారు శిక్షింపబడతారని ప్రకటన పత్రికలు రాయించి పురుషద్వేషిణి ఉండే పట్టణంలో కూడ అంటించారు.

సరిగ్గా ఆమె బయలుదేరే సమయం చూసుకొని వనితా ద్వేషి సేనలు స్త్రీలు దూరంగా వెళ్లాలంటూ హడావుడి చేయసాగారు. ఆ చాటింపు విన్న పురుషద్వేషిణి కొంతకాలం పాటు చుట్టు తిరిగి వేరేదారిన వెళ్లేది. అయినప్పటికీ వనితాద్వేషి విహారసరస్సుకు వెళ్లాలంటే ఏదో ఒక పార్శ్వంలో వనితాద్వేషిపురం తగలకుండా ఉండదు.

ఒకే సమయానికి, ఈ రెండు చోట్లా స్త్రీలు రాకూడదనీ - పురుషులు రాకూడదనీ పోటాపోటీగా చాటింపులు వినిపిస్తూండేసరికి, ప్రజలు తాము ఈ బాధలు పడలేమని, వేరే చోటుకు పోతామనీ మొరపెట్టుకోగా - పురుషద్వేషిణి తండ్రి వారందరినీ పంపించి వేసి, వనితాద్వేషికొక ఉత్తరం పంపాడు.

అందుకు ఆయనకు అందిన సమాధానం ఈ విధంగా ఉంది......

" మా వనితాద్వేషి మహారాజుగారికి, తాము పంపిన ఆహ్వానం అందినది. అందుకు వారు కృతజ్ఞతలు చెప్పమన్నారు. మా ప్రభువుల వారి వృత్తాంతమంతా మీకు ఇదివరకే తెలిసిఉంటుంది. మీరు వచ్చేటప్పుడు స్త్రీలుండరాదు. అలా ఏర్పాటు చేసి తెలియపరచగలరు...." అని మంత్రి జవాబు రాసి పంపాడు. అంతేకాక విక్రమసింహునికి కొన్ని రహస్యాలు బోధించాడు.

ఆ వింత చూద్దామని ఎక్కడెక్కడివారో వచ్చారు. "స్త్రీలను ద్వేషించే

పురుషులూ ఉంటారా? ఎలాంటి వారో చూడాలి" అనుకుంటూ పురుషద్వేషిణి కూడా ఒక రహస్యస్థలంలో వచ్చి కూర్చుంది.

రాజుగారి ఆదేశం ప్రకారం, ఆయన మంత్రి వనితా ద్వేషి మంత్రి అయిన బహుశ్రుతునితో "ఆర్యా! స్త్రీ జాతియందు తమ ప్రభువుల వారేల పగబట్టారో కారణం సెలవియ్యండి!" అని మర్యాదపూర్వకంగా అడిగాడు. విక్రమసింహుడు స్త్రీ ప్రసంగం రాగానే బహుశ్రుతుని బోధ మేరకు చెవులు మూసుకున్నాడు.

అతడ్ని శాంతిపరుస్తున్నట్లు నటించి "మా రాజులు స్త్రీ ప్రసంగం సహించరు. ఇంతకాలంగా మేము ఎన్నిసార్లు అడిగినా మాకు ఆయన చెప్పలేదు. కాని ఇంతమంది అడుగుతూంటే చెప్పకపోవడం భావ్యంకాదు" అని విక్రమసింహునివైపు తిరిగి "దేవా! ఎటువంటి రహస్యమైనా పెద్దలు పదిమందీ అడిగినప్పుడు చెప్పి తీరాలన్నది బృహస్పతి నీతి. వీరు మిమ్మల్ని వ్రతానికి కారణం అడుగుతూన్నారే తప్ప వనితా ద్వేషవ్రతం మానుకోమనడం లేదు. దయచేసి చెప్పగలరు" అన్నాడు భయం నటిస్తూ.

వనితాద్వేషి తప్పదన్నట్లుగా ప్రారంభించి "నేను చెప్పబోయేది వింటే, నా వనితా ద్వేషం సమంజసమైనదనే అంటారు మీరు. పూర్వజన్మంలో నేనొక వర్తకుని పుత్రుడ్ని. నాకు యుక్తవయస్సు రాగానే ఎంతో మంది కన్యలు వరదక్షిణ సహా ఇస్తామని వచ్చారు. కాని రూపానికి ఆశపడి ఒక వర్తకుని కుమార్తె అయిన రత్నాంగిని వివాహం చేసుకున్నాను.

పెళ్లి జరిగిన కొద్దికాలానికే, అది కాపురానికి వచ్చింది. కాని దాని రూపమే నా దుఃఖానికి మూలకారణమైంది. ఎన్ని నీతులు చెప్పినా అది తన దుర్గుణాలను మానుకోలేదు. దానికి ఇంటి పెత్తనం మీద మోజు అధికం! ఏది ముఖ్యమో - ఏది కాదో దానికి తెలిసేది కాదు. అలా అనవసరమైన వాటికి ఖర్చు పెట్టి, అతి తక్కువకాలంలోనే నన్ను అప్పులపాలు చేసింది.

నేను ఎంత చెప్పినా వినక ఒకరోజున అది పుట్టింటికి పోతాననేసరికి, అపకీర్తి భయంతో నేనూ దాని వెంట వెళ్లాను. దార్లో నేనొక నూతిలో తొంగిచూస్తూంటే, అది నన్ను బలాత్కారంగా అందులోనికి తోసేసి పోయింది. ఒక చిన్న మర్రి మొక్క కొమ్మ ఆధారంగా ఆ నూతిలో నేను నీట్లో మునిగిపోకుండా అల్లాడుతూంటే పుణ్యాత్ములెవరో నన్ను రక్షించి, మా అత్తవారింటికి చేర్చారు.

నన్ను చూసి ఆమె విభ్రాంతి చెందినా, నేను ఏమీ జరగనట్లే పలకరించి, మంచి మాటల్తో దాని దిగులు పోగొట్టాను. అయినప్పటికీ విశ్వాసం లేని ఆ కృతఘ్నురాలి దుర్గుణాలు సహించి కొన్నాళ్లున్నాను. ఒకరోజు నేను నిద్రిస్తూండగా, అది నా గొంతు కోసి చంపేసింది. నేను నీతిమార్గాన బతికిన వాణ్ణి గనుక, బలవన్మరణం పొంది కూడా ఈ జన్మలో రాజుగా జన్మించాను. ఆ జన్మలో స్త్రీ వల్ల నానాపాట్లు పడ్డాను కనుకనే వనితాద్వేషిగా మారాను" అని ముగించాడు.

ఆ మాటలన్నీ తెరచాటునుంచి వింటూన్న పురుషద్వేషిణి కుతకుత ఉడికిపోతూ, "ఇది నా కథనే త్రిప్పి చెప్తూన్న ధోరణిలో ఉంది! నువ్వు ఇప్పుడు చెప్తూన్న ఘోరపాపం చేసింది నువ్వే! ఇక చాలించు" అని గద్దించింది.

అప్పుడు విక్రమసింహుడేమీ తొణక్కుండా "ఓహో! రత్నాంగీ! మళ్లీ ఈ జన్మలో కూడా నాకు తటస్థపడ్డావా? నేను ఎట్లాంటి స్త్రీని ద్వేషించానో అదే స్త్రీ నాకు మొట్టమొదటిసారి ఎదురుకావడం పూర్వజన్మ బంధం కాక ఏమిటి? గద్దించినంత మాత్రాన నీవు ఏమీ ఎరుగని ముద్దరాలివైపోతావా? ఎంత దుర్మార్గుడైనా పురుషుడెప్పుడూ అలాంటి పనులు చెయ్యడు. స్త్రీలకే ఇలాంటి సాహసాలని గ్రంథాలు చెబుతున్నాయి." అన్నాడు.

అందుకా పురుషద్వేషిణి "బొంకేవాళ్లకి సాక్ష్యాలు దొరక్కుండా ఉంటాయా? ఏవో కుంటి సాక్ష్యాలు ఉండనే ఉంటాయి. అవి చూపితే సరా? నేరం దాగుతుందా?" అంది.

"గడుసుమాటలు చాల్లే! నీ మాటలకి మోసపోయే వాళ్లు ఇక్కడెవ్వరూ లేరు. నువ్వే నేరం ఒప్పుకో!"

ఆ ప్రకారం ఇద్దరూ ఒకరికొకరు ఎదురుపడి పోట్లాడుకుంటూంటే – "ఓహో! వీరిది జన్మజన్మల బంధంలాగ ఉందే! ఏది ఏమైనా ఆలుమగల తగువిది. ఇందులో మనం కల్పించుకోరాదు. ఎంత పోట్లాడుకున్నా చివరికిద్దరూ ఒక్కటికాకపోరు. మధ్యలో దూరినట్లయితే, మనమే వెర్రివాళ్లమవుతాం!" అని లోకరీతి ఎరిగి వున్న వాళ్లు కావడం చేత సభాసదులంతా వినోదంగా చూడసాగారు.

అప్పుడు బహుశ్రుతుడు నవ్వి తాను కల్పించుకుంటూ "ఓహో! మీ ఇద్దరి వ్రతాలు చాలా చక్కగానే వున్నాయి. ఊరకే ఎందుకు పోట్లాడుకుంటారు? మీ పోట్లాటకు కారణం చెప్పండి" అన్నాడు.

పురుషద్వేషిణి సభను ఉద్దేశించి "పూర్వజన్మలో ఇతడు నా మగడు. తాను చేసిన నేరాలన్నీ నా మీదకు నెట్టి అన్నీ అబద్ధాలే చెప్తున్నాడు. అతడు చెప్పిన రత్నాంగిని నేనే! నిద్రపోతూంటూ నన్ను గొంతు పిసికి చంపిందీ అతడే! అందుకే ఈ జన్మలో నేనీ వ్రతం చేపట్టాను" అన్నది.

"ఆర్యులారా! పూర్వజన్మలో ఈమె నా భార్య. నన్ను బలాత్కారంగా చంపింది ఈమెయే! దీని మాటలు నమ్మకండి" అన్నాడు విక్రమసింహుడు.

ఇద్దరి మాటలూ విన్నాక, వారిద్దరికీ భార్యాభర్తలబంధం గత జన్మనుంచీ ఉందని వారి నోటనే ఒప్పుకున్నాక ఇక తామేం మాట్లాడినా అది వాళ్ల వైరాన్ని మరింత పెంచుతుందని ఒక్కరూ నోరు మెదపలేదు.

అప్పుడు బహుశ్రుతుడు "వీరు గతజన్మదంపతులని వీరే బలవన్మరణం చెందినట్లు చెప్పారు. పాపపుణ్యాలు దైవాధీనాలు. నాకు తెలిసిన నిష్కృతి ఏమిటంటే – భగవంతుడు వీరిని పూర్వజన్మ జ్ఞానంతో సహా ఒకే చోట చేర్చాడు కనుక, గత వైరాన్ని మరచి, భగవంతుడిచ్చిన ఈ

జన్మను సద్వినియోగం చేసుకోవడమే మేలు. అదీ నాకు తోచినది చెప్పాను. ఇందుకు అందరి ఆమోదం లభించగలదనుకుంటున్నాను" అన్నాడు.

"భార్యాభర్తలను కలపాలన్న చక్కని ఆలోచనకు ఆమోదాన్ని తెలుపని మూఢులెవరుంటారు?" అంటూ ఆ రాజుగారి మంత్రి కూడా మద్దతు ప్రకటించేసరికి సభంతా అంగీకారంగా తల ఊపింది.

విక్రమసింహుణ్ణి చూసిన దగ్గర్నుంచీ, అతని మీద అనురాగంతోనే ఉన్న పురుషద్వేషిణి తనకూ అంగీకారమేనని అంతఃపురాని కెళ్లిపోయింది. ఇంతమంది ఇచ్చిన తీర్పును గౌరవించడంలోనే రాజు ప్రవర్తనకు గొప్పదనం నాలోన అది దాగి ఉంది! నాకూ సమ్మతమే!" అన్నాడు విక్రమసింహుడు తానేదో ఘనకార్యానికి అంగీకరిస్తున్నట్లు.

ఆ ప్రకారం వారి వివాహం అంగరంగ వైభవంగా జరిగింది. ఎంతో కాలంగా కూతుర్ని పెళ్లికి ఒప్పించలేకపోయిన ఆ తండ్రికే ఇది సంతోషకారణమైంది. అదీ గోపా! నీవు చూసిన అద్భుతసుందరి చిత్రపటం కథ" అంటూ కథ ముగించాడు మణిసిద్ధుడు.

"చిత్తం" అంటూ శిష్యుడు వెంటరాగా, ఎనిమిదవ మజిలీ చేరాడు ఆ యతివల్లభుడు.



# కాశీమజిలీ కథలు

## 8వ మజిలీ

ఎనిమిదవ మజిలీలో - గోపకుమారుడు భోజన సామగ్రిని తేవడానికి, అంగడికి వెళ్లాడు. దారిలో ఒక ఇంట్లో ఉన్న విగ్రహాన్ని చూసి ఆశ్చర్యపడి, అప్పుడే తిరుగు ముఖం పట్టాడు.

మణిసిద్ధుని వద్దకు వచ్చి "స్వామీ! ఒక ఇంట్లో అసామాన్యమైన శిల్పనైపుణ్యంతో అలరారుతున్న ఒక విగ్రహాన్ని చూశాను. అది శిలచేగాని, కొయ్యచేత గాని, మట్టితో గాని చేసిన శిల్పంలా తోచడం లేదు. యదార్ధంగా ఒక పురుషాకృతి ఉన్నట్లే కనిపిస్తున్నది. ప్రాణం లేదు. పోనీ అంటే దేవతా విగ్రహమూ కాదు. ఉత్సవాలు చేస్తుంటారు. దాని కథ ఎవర్నడిగినా చెప్పలేదు. సర్వజ్ఞులైన మీ వల్ల నాకా వృత్తాంతం వినాలని వేడుకగా ఉంది. చెప్పండి" అని అడగ్గా, దానికి సిద్ధుడు నవ్వుతూ "వత్సా! నీకు కథలంటే మరీ అంత ఇష్టమా?" అంగడికి వెళ్లినవాడివి, ఊరకనే రావడం ఎందుకు? సామాగ్రి తెచ్చాక అడిగితే చెప్పనా? ఈ వృత్తాంతము చాలా చిత్రమైనది. భోజనమైన తర్వాత సావధానంగా చెప్పవలసింది. త్వరగా పోయి సామాగ్రి తీసుకురా! తప్పకుండా చెప్తానని మాట ఇచ్చాను కదా! అని వాడిని బతిమాలుకొని, వాడితో అలా చేయించి, భోజనం అయ్యాక ఒక చల్లని ప్రదేశంలో కూర్చొని ఆ మణి వల్ల కథంతా తెలుసుకొని ఇలా చెప్పసాగాడు.....

## కృష్ణదేవరాయల కథ

పూర్వం ఆంధ్రదేశాధీశ్వరుడైన నరసింహరాయలు ధర్మంగా రాజ్యం చేస్తూండగా హఠాత్తుగా అతని ప్రధాని దుర్మరణం చెందాడు. తగిన మంత్రి లేకుండా రాజ్యం చెయ్యడం దుర్ఘటం అని భావించిన నరసింహరాయలు

సమర్థుడైన మంత్రి కావాలంటూ దేశదేశాల చాటింపు ఇచ్చాడు. ఎక్కడెక్కడినుంచో తెలివైనవారు - బుద్ధి చాతుర్యం గలవారు వచ్చి, ఆ ఉద్యోగం తమకు ఇవ్వమన్నారు. కాని వారి బుద్ధికుశలత అంతంత మాత్రంగానే ఉండడంతో, ఆ పదవి ఎవరినీ వరించలేదు. ఎంతో మంది తమ దీక్షాదక్షతలను ప్రదర్శించడానికి వచ్చి భంగపడ్డారు. అయితే నరసింహరాయల ఆలోచనకు తగినంత బుద్ధి స్థాయి వారికి లేదని తేలిపోయింది. మంత్రి లేక భారం ఎక్కువైనప్పటికీ, భరించడానికే సిద్ధపడ్డాడు గాని, కొద్దిపాటి బుద్ధి కుశలత గలవారి పరం చేసి, ఆ పదవికి గల ఔన్నత్యం తగ్గించడానికి ఆయన ఇష్టపడలేదు.

ఒకరోజు నరసింహదేవరాయలు తీవ్రంగా ఆలోచించి ఒక కాగితం మీద నాలుగంగుళాల గీత గీసి, భటులొక ఇద్దర్ని పిలిచి, ఈ కాగితాన్ని మన రాజధానిలోనే గాక - రాజ్యంలోని గ్రామ గ్రామాన తిప్పండి. ఈ గీతని చెరపకుండానే చిన్నదిగా చేయగలరా?" అని అడగండి. అలా చెయ్యగలిగినవారిని పల్లకి ఎక్కించి నా దగ్గరకు తీసుకురండి?" అని ఆజ్ఞ ఇచ్చాడు.

ఆ భటులు ఆ పత్రాన్ని పట్టుకుని ఎన్నో ఊళ్లు తిరిగి ఎందరెందరికో చూపించారు. ఎవరూ అలా చేయలేకపోవడమే గాక "రాజుకు మతి ఉండే ఇలా అడిగాడా? చెరపకుండా గీత చిన్నదెలా అవుతుందీ?" అని వేళాకోళం చేశారు. లోకంలో వారికి తెలియనివి ఉండవని అనుకుంటే అది పొరపాటే కదా!

రాజభటులు అన్ని గ్రామాలను చూస్తూ అక్కడ ఉన్న ఒక పాఠశాలలోకి వెళ్లి అక్కడ పిల్లలకు విద్యాబోధన చేస్తున్న గురువుగారికి ఆ పత్రాన్ని చూపించారు. ఆ పత్రంలో ఉన్న గీతను చూపిస్తూ "ఈ గీతను చెరపకుండా చిన్నది చేయగలరా?" అని అడగడంతో ఆ గురువుగారు మీరు చెప్పిన విధంగా చేయడానికి నా దగ్గర మాయలూ, మంత్రాలూ లేవు" అన్నారు. భటులు నిరాశతో తిరుగుముఖం పట్టడంతో ఒక బాలుడు లేచి "సమస్య ఏమిటి?" అని గురువుగారిని ప్రశ్నించాడు. శిష్యునికి ఆ

గీత సమస్య చెప్పిన వెంటనే ఆ బాలుడు గురువుగారితో "ఇది ఏమన్నా పెద్ద సమస్యా? దీని కోసం ఇంత దూరం వచ్చారా? ప్రపంచంలో ఎవ్వరికీ ఈపాటి ఆలోచన లేదా?" అని ఈ సమస్యను నేను పూరిస్తానని అనడంతో భటులు ఆ పత్రాన్ని ఆ బాలుడికి అందించారు.

ఈ సమస్యను ఎంతో తెలివిగా మొదట గీసిన గీతను చెరపకుండానే ఆ గీత పక్కనే మరో గీతను గీశాడు. ఈ విధంగా చేయడంతో నరసింహరాయలు గీసిన గీతకంటే ఆ బాలుడు గీసిన గీత పెద్దదై ప్రభువు గీసిన గీత చిన్నది అయ్యింది. ఈ సమస్యకు పరిష్కారం చెప్పిన ఆ బాలుడి వయస్సు పదహారు సంవత్సరాలు. ఇతని పేరే తిమ్మరుసు.

రాజభటులు చాలా సంతోషించి, రాజుగారి ఆజ్ఞ ప్రకారం "పల్లకీ తెప్పిస్తాము. రావాలని" చెప్పారు. తిమ్మరుసు యొక్క అమోఘమైన తెలివితేటలను గురువు గారు మెచ్చుకొని ఈ విధంగా చెప్పారు.

"వత్సా! నీకున్న తెలివితేటలు చాలా గొప్పవి. రాజు చేసే ప్రయత్నం వట్టిదే అనుకున్నాను గాని ఇందులో ఎంతో యుక్తి ఉందని ఊహించలేదు. రాజుగారు నీకు గొప్ప బహుమానం ఇస్తాడని అనుకుంటున్నాను. నువ్వు నాకు శిష్యుడివి కదా? నీ విద్యాపాంటవం అంతా గురువుదే కదా! అందుకని ఈ సమస్యకు పరిష్కారాన్ని నేనే చెప్పానని రాజుగారితో చెబుతాను. ఆయన నాకు మంచి పారితోషికం ఇస్తాడు. రాజభటులకు లంచం ఇచ్చి ఒప్పిస్తాను. మొదటిసారి లభించిన బహుమానాన్ని గురుదక్షిణగా ఇవ్వడం న్యాయం కదా!" అని అనడంతో "ఆర్యా! దీనికోసం మీరు నన్ను ఇంతగా బ్రతిమాలాలా? ఇదంతా కూడా మీ అనుగ్రహమే కదా! నేను చేసిన పని నిజంగా చేసినవారు మీరే కదా!" అని తిమ్మరుసు సమాధానమిచ్చాడు. రాజభటులను ఒప్పించి ఒక శుభముహూర్తాన గురువుగారు తగిన వేషంతో రాజుగారి దగ్గరకు బయలుదేరాడు.

రాజుగారికి ఇంతకాలానికి తగిన మంత్రి దొరికాడని సంతోషించి ఎదురెల్లి పల్లకీలో కూర్చున్న గురువుగారి వేషాన్ని చూసి అతని బుద్ధిమాంద్యం పసిగట్టినా అతని ప్రజ్ఞను పరీక్షించి చూద్దామని తగిన సత్కారాలతో అతని

సభకు ఆహ్వానించి పీఠంపై కూర్చోబెట్టి " అయ్యా! గీతను చెరపకుండా చిన్నది చేసిన వారు మీరేనా?" అని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు ఎప్పుడూ రాజసభను చూడనందువల్ల కొంచెం భయపడుతూనే "నేనే - నేనే" అని సమాధానమివ్వగా, రాజుగారు గురువుగారి కంఠం వణుకును కనిపెట్టి "ఆర్యా! మీ తెలివితేటలకు మరో చిన్న పరీక్ష!....అది మీరు నెగ్గితే ఆ సమస్యను పరిష్కరించిన వారు మీరేనని నమ్ముతాను." అంటూ ఈ రాజభవనం చివర మంత్రి ముద్రికలను ఉంచాము. ఈ పరుపులు తొక్కకుండా ఆ ముద్రికలను తెచ్చుకోమని" అన్నాడు.

గురువుగారి ఏ ఉపాయం తోచక బొంగురుపోయిన కంఠంతో గజ - గజ వణుకుతూ "రాజా! నేను ఒక బ్రాహ్మణుడిని. కుటుంబం కలవాడను. నన్ను శిక్షించక మన్నిస్తానంటే నిజం చెప్తాను" అన్నాడు. అప్పుడు మహారాజువారు నవ్వగా "మహారాజా! ఈ గీతను నేను గీయలేదు. నా శిష్యుడైన తిమ్మరుసు గీశాడు. వాడు మంచి తెలివైనవాడు. ఇప్పుడు వాడిని పిలిపిస్తే మీరు చెప్పిన పనిని చేస్తాడు" అని గురువుగారు యదార్థం చెప్పాడు. వెంటనే కొందరు భటులను పంపి తిమ్మరుసు రాజసభకు రప్పించాడా ప్రభువు.

రాజు, తిమ్మరుసు ముఖ విలాసాన్ని చూస్తూనే, అతడు అసామాన్య ప్రజ్ఞాశాలి అని గ్రహించాడు. అతడ్ని పక్కకు తీసుకెళ్లి "నాయనా! ఈ గీత చిన్నదిగా చేసినది ఎవరు? అని అడగ్గా, గురువుగారేం చెప్పి ఉంటారో తెలీకపోవడం చేత, తిమ్మరుసు శ్లేషగా "అయ్యా! మా గురుదేవుల అనుగ్రహం చేత అది అలా అయింది" అన్నాడు.

ఆ మాటల్లోనే అతడి గడుసుదనాన్ని అర్థం చేసుకున్నాడు నరసింహరాయలు. అప్పుడా రాజు పరుపులు తొక్కకుండా మంత్రి ముద్రికల్ని తెమ్మనగా, పరుపులు చుట్టుకొంటూ వెళ్లి, వాటిని తొక్కకుండా జాగ్రత్తపడ్డాడు తిమ్మరుసు. ఆనాటినుంచీ తిమ్మరుసు వారి ఆస్థానానికి మంత్రి అయ్యాడు.

గోపాలా! ఆ వృద్ధ ప్రభువు మరణించడంతోనే శ్రీకృష్ణదేవరాయలు రాజ్యానికి వచ్చాడు. అతనికి ప్రభువుగా ఎంతకీర్తి ఉన్నా దాసీపుత్రుడనే

కళంకం గూడ ఉంది. కృష్ణదేవరాయల జననగాథ నీకు మొదటి మజిలీలోనే చెప్పాను కదా! అది అంతఃపురం రహస్యంగా మిగిలిపోక, అచిరకాలంలోనే ఆ దేశ సరిహద్దులు కూడా దాటి - దేశదేశాలకూ పాకడం వల్ల ఎవరూ తమ కన్యనిస్తామంటూ రాలేదు. అందువల్ల అతనికి చాలాకాలం వరకూ వివాహం జరుగలేదు.

ఒకరోజు కళానిధి అనే బ్రాహ్మణుడు ఆయన ఆస్థానానికి రాగా, రాయలు అతని పాండిత్యానికి మెచ్చి బహుమానమిస్తూ "బ్రాహ్మణోత్తమా! మీరు అనేక దేశాలు తిరిగిన వారు కదా!..ఎక్కడయినా పాండిత్యం గల స్త్రీలని చూశారా?" అని అడిగాడు.

"ఇందులో విశేషమేమి? కుంతల దేశాధీశుడైన గోపాలుడు గోపాలపురం రాజధానిగా పరిపాలిస్తున్నాడు. అతని పుత్రిక కళానిలయ, కళలకూ - విద్యలకూ నిలయమైన ఆమెకు ఇప్పుడు పదహారేళ్లు. ఏ రాజకుమారుడొచ్చి అడిగినా ఆమె వివాహానికి సమ్మతించడమే లేదు. బ్రాహ్మణ పండితులకు మాత్రమే ఆమె దర్శనమిస్తోంది. ఏ విద్యలో ఎంత ప్రావీణ్యం ఉన్నా, ఆమె ధాటికి నిలువజాలము. 'పండితరాయలు' అని బిరుదుపొందిన నేను సైతం, ఆమెతో వాదించలేక జయపుత్రిక ఇచ్చేసి వచ్చాను" అన్నాడు. కళావతిని గురించి వినడంతోనే కృష్ణదేవరాయలు మనసు పడ్డాడు. మరికొందరు పండితులు కూడా, పండితరాయల మాటలనే బలపరిచేసరికి, ఆమెనెలాగైనా భార్యగా పొందాలనుకున్నాడు శ్రీకృష్ణదేవరాయలు. ఆమె మీది విరహంతో దిగులుగా ఉన్న రాయల అవస్థ తిమ్మరుసు అర్థం చేసుకున్నాడు.

## కళావతితో రాయల వివాహం

అయినప్పటికీ ప్రభువు నోటనే ఆ విషయం విన్నాక, తిమ్మరుసు "వివాహం కాలేదని విచారమా?" అన్నాడు. "వివాహానికేమి? ఏ స్త్రీతో నయినా జరగొచ్చు! ఏదో సామెత చెప్పినట్లు - 'రాజు తల్చుకుంటే' కన్యలే దొరక్కపోతారా? అన్ని విద్యలూ - కళల్లో ప్రావీణ్యం ఉండి, రాచవారి

ఆడపడుచు దొరకడం అంత సులభం కాదు. అందులోనూ కళానిలయ – పండితుల్నే వరుసగా ఓడిస్తున్నదీ అయిన కళావతి వంటిది దొరికితే, ఇక ఆ రాజు జన్మధన్యం కాకపోతుందా? కళావతి నాకు జత కూర్చకపోతే, నేను ప్రాణాలతో ఉండనేమో!" అని దిగులు ప్రకటించాడు రాయలు.

అందుకు తిమ్మరుసు నవ్వుతూ "రాజా! నీ కోరిక అసాధ్యమైనదిగా ఉంది. ఆ గోపాలుడు అధికారంలోగాని – సంపదలో గాని మనకంటే అధికుడు. మీకు దాసీపుత్రుడన్న కళంకం ఉంది. అది తెలిసీ అతడు తన కూతుర్నెలా ఇస్తాడు?" అన్నాడు.

కృష్ణదేవరాయలకు తిమ్మరుసు సమవయస్కుడు కావడం వల్ల ఇష్టసఖుడు – ఆప్తమిత్రుడు కూడ! రాచవ్యవహారాల్లో మన్ననలూ – మర్యాదలు సర్వసామాన్యమే కనుక, ఆయావేళల్లో ఎలా మెలిగినప్పటికీ – స్వంత వ్యవహారాల్లో మాత్రం చనువుగా మైత్రీ పూర్వకంగా తనకేది కావాలో, తన భావాలేమిటో తిమ్మరుసుతో పంచుకొనేవాడు రాయలు. అలాగే తిమ్మరుసు కూడ వ్యక్తిగత వ్యవహారాలతో తనదైన శైలిలో – చాతుర్యంతో ప్రభువుకు పరిష్కారాలు చూపేవాడు.

శ్రీకృష్ణ దేవరాయల మనస్సు తెలిపి కూడా, తిమ్మరుసు ఆ ప్రకారం జవాబిచ్చేసరికి, ఆ ప్రభువు నీరుగారి పోయాడు. నిట్టూరుస్తూ "ఇదా నువ్వు చెప్పేది? లోకాతీతుడైన మిత్రుడన్న నాకు లోటేమిటి? అని ఇంతకాలం భావించాను. ఎలాగైనా ఈ పని నువ్వే చక్కబెట్టగలవనుకుంటే ఇలాంటి పిరికిపలుకులు పలుకుతున్నావే! నేను సామాన్యురాలిని మాత్రం పెండ్లాడేది లేదు. కళావతితో వివాహం జరిపించావా సరేసరి! లేదా సన్యాసినైపోతాను. రాజ్యం నువ్వే చూసుకో! నాకేల ఈ భోగాలు?" అని అడిగాడు రాయలు.

అందుకు జవాబుగా "చిన్నపనికే అంతంత పెద్దమాటలేల? ఒక స్త్రీ కోసం ఎక్కువ ప్రయత్నం దేనికని అలా అన్నాను. కాని నీ కోరిక అంత బలీయమైనదైతే తీర్చకపోతానా? బుద్ధిమంతుడు తక్కువగా మాట్లాడడం – ఎక్కువగా ప్రజ్ఞ చూపడం సహజంగా జరిగేదే! నా సామర్థ్యం అంతా వినియోగిస్తాను. అయినప్పటికీ – దైవం ప్రతికూలించి కార్యసాఫల్యం

కాకపోతే ప్రతిజ్ఞా భంగం అవుతుందేమో అని ఆలోచిస్తున్నాను" అన్నాడు తిమ్మరుసు.

"నువ్వు తల్చుకుంటే, కార్యం సాఫల్యం కాకపోవడం అనేది ఉండదు. ఒక్కసారి ఆమెను కళ్లారా చూసినా చాలు!" అన్నాడు ప్రభువు.

"ఆమె చాలా పండితురాలని విన్నాం! ఆమెని చూడాలంటే బ్రాహ్మణవేషాలు ధరించాలి. నిన్న బ్రాహ్మణ వేషం వేయమనగలనా?"

"అందులో తప్పేముంది? బ్రాహ్మణులు సర్వోత్కృష్టులు. ఇష్ట నారికోసం బైరాగి వేషం వేయమన్నా వేస్తాను" అన్నాడు రాయలు.

ఒక శుభముహూర్తాన వాళ్లు పట్నం వదలి, బ్రాహ్మణవేషాలలో కాంపిల్యం అనే పురాన్ని చేరుకున్నారు. అక్కడ అన్నదాతగా పేరుపొందిన సోమశర్మ ఇంట బసచేశారు. వీరు వెళ్లేసరికి ఆ బ్రాహ్మణుడు ఇంట్లో లేకున్నా అతిథి సత్కారాల్లో ఆమె లోటు జరుగకుండా వారికి కావలసిన రీతిలో శాకపాకాలు చేసి వడ్డించింది. అతడు ఆ రాజుగారికి పురోహితుడు కూడా కావడం వల్ల, తిమ్మరుసు, రాయలకు రాజభోగాలన్నీ అమరాయి.

ఆ సాయంత్రానికి సోమశర్మ విచారంగా ఇంటికి వచ్చాడు. అతిథులొచ్చారని తెలిసినా, వారిని పరామర్శించకనే తన గదిలోకి పోయి పడుకొని విచారించసాగాడు.

ఆ పూట అతిథులతో కలిసి భోంచేయవలసిందిగా, ఆ ఇల్లాలు భర్తను పిలిచింది. " నా స్నేహితుడైన మంత్రి రేపు ఉరితీయబడుతూంటే నాకు నోటికి అన్నం హితవు కావడం కల్ల" అన్నాడతడు విచారంగా.

"ఈ వేళ మంత్రి అయ్యాడు. రేపు ఎవరో చెప్పగలరా? అవివేకపు రాజును కొలవడం కంటె, ముష్టి ఎత్తుకోవడం మేలు. రాజుకు సమాధానం చెప్పగల ధీశాలి తిమ్మరుసులాంటివాడు ఇప్పుడెక్కడ దొరుకుతాడు?" అని నిరాశగా అన్నాడు.

ఆ మాటలు విన్న తిమ్మరుసు, సోమశర్మ దగ్గర కొచ్చి "అయ్యా! మీరు తిమ్మరుసు నెరుగుదురా?" అని అడిగి "యజమాని భుజించకుండా మేము భుజించే వాళ్లం కాము" అని స్పష్టం చేశాడు.

"అయ్యా! నా ఆందోళనలో మీరుంటే, మీకు కూడ నోటికి భోజనం సహించదు. ఇక – తిమ్మరుసు ప్రస్తావన అంటారా! నేను వారిని ఎన్నడూ చూసి ఉండలేదు. కాని ఆయన శ్రీకృష్ణదేవరాయల మంత్రి అనీ – భూమీ్మద వారికి సాటి రాగల తెలివైన మంత్రి ఇంకొకరు లేరనీ – వారి చర్యలను కథలుగా చెప్పుకోవడం నేను విని ఉన్నాను. అసలు విషయమేమిటంటే – మొన్నటిరోజున మా మహారాజు మూడు ప్రశ్నలు ఇచ్చి నాలుగో నాటికి వాటికి జవాబులు కావాలన్నాడు. సమాధానం చెప్పలేక పోతే, ఉరి తీయిస్తా అన్నాడు. ఇటువంటి ప్రశ్నలకు ఆయనైతేనే జవాబు చెప్పగలడని మా నమ్మకం. కాని వారి వద్దకు వెళ్లగల వ్యవధి ఏదీ? రేపే నాలుగవరోజు. మంత్రి నాకు ప్రాణ మిత్రుడు . మీరు భుజించండి. నేను తినలేను" అన్నాడు సోమశర్మ.

అప్పుడు రాయలు "అయ్యా! ఇతడు తిమ్మరుసుకు ప్రాణమిత్రుడు. బుద్ధిలోను అతనితో సాటిరాగలవాడు. మీ పుణ్యం బాగుంది. మీ మంత్రి గారి ప్రాణాలు ఇతడు కాపాడగలడు. ఆ మూడు ప్రశ్నలూ ఏమి ఉన్నవి దయచేసి చెప్పండి" అన్నాడు.

అప్పుడు సోమశర్మ ఆ మూడు ప్రశ్నలూ ఇలా చెప్పాడు. వారికి సంతోషంగా వందనం చేసి,

"అయ్యా! వినండి! మా రాజు పెద్ద సభ చేసి, మంత్రికి ఇచ్చిన ఆ మూడు ప్రశ్నలు ఇవి.

1. భగవంతుడు నిత్యం ఏం చేస్తుంటాడు?
2. నక్షత్రాల సంఖ్య మొత్తం ఎంత?
3. భూమికి నట్టనడి మధ్యభాగం ఎక్కడ?

ఈ మూడింటిలో ఒక్కదానికైనా మంత్రికి జవాబు తెలీదు. భార్యాబిడ్డలు చుట్టూ చేరి ఏడుస్తూంటే, మంత్రి విచారంగా కూర్చొన్నాడు. అది చూడలేక, నేను ఇంటికొచ్చాను. మీరు వీటికి జవాబులు చెప్పి మంత్రిగారి ప్రాణం కాపాడితే, మీ అంత పుణ్యాత్ముడు ఇంకొకడుండడు" అన్నాడు.

"అయ్యా! నేను జవాబులు చెపుతాను. భోజనం చేశాక మీ మంత్రి నొకసారి ఇక్కడకు తీసుకురండి!" అని తిమ్మరుసు చెప్పగా, ఆ బ్రాహ్మణుడెంతో సంతోషించి, అతిథులతో కలిసి భోజనం పూర్తిచేసి, మంత్రిని తీసుకొచ్చాడు.

మంత్రి తన కొచ్చిన ఆపద చెప్పాక, తిమ్మరుసు "రాజు మిమ్ములను అడిగిన ప్రశ్నలకు సమాధానాలు మాటలతో చెప్పదగినవి కావు" అనీ క్రియలో చూపించవలసినవనీ చెప్పి, "మీరు రాజుగారి ఆస్థానానికి రేపు యథావిధిగా వెళ్లండి! వారి ప్రశ్నలకు జవాబులు సామాన్య లౌకికులైన వారెవ్వరూ చెప్పలేరని - అందువల్ల వాటికి జవాబులు చెప్పే నిమిత్తం ఒక విప్రుని నియమించాననీ, అతడు చెప్పగలడని - వారి సెలవయితే పిలిపిస్తాననీ చెప్పి నన్ను పిలవండి మిగతా కథ నేను చూసుకుంటాను" అని బోధ పరిచాడు. అప్పుడా మంత్రి ముఖంలో ఆనందం వర్ణనాతీతం.

ఆ మరునాడు రాజు సభ తీర్చాడు. సరిగ్గా విప్రుడి రూపాన ఉన్న తిమ్మరుసు బోధించినట్లే ఆ మంత్రి నిండుసభలో పలికాడు. "ఏదీ? ఆ విప్రుని రప్పించండి" అన్నాడు - దర్పం ఒలకబోస్తూ.

ఆ మంత్రి సభలోనే ఉన్న తిమ్మరుసును చూపి "వీరే వారు" అని వినయంగా చెప్పాడు.

రాచఠీవితో పాటు బ్రాహ్మణతేజం కూడా మూర్తీభవించినట్లున్న ఆ విప్రవేషధారిని చూసి "నా ప్రశ్నలకు సమాధానాలివ్వగలవా? అని అడిగాడు. "మరోసారి చెప్పండి" అన్నాడు తిమ్మరుసు - తనకు తెల్సినా రాజు ఆ ప్రశ్నలు ఇంకొకసారి వినిపించాడు.

"మీ ప్రశ్నలు సామాన్యమైనవి కావు. ఒకేరోజున మూడింటికీ జవాబులివ్వడం అసాధ్యం! రోజు కొక ప్రశ్నకు జవాబు ఇస్తాను. ఇవాళ ఏ ప్రశ్నకు జవాబివ్వమంటారో మీరే నిర్ణయించండి" అన్నాడు తిమ్మరుసు.

"అదీ బాగానే ఉంది. సరే! ఈరోజు భగవంతుడు నిరంతరం ఏం చేస్తుంటాడు?" అనే ప్రశ్నకు సమాధానం ఇవ్వండి" అన్నాడా రాజు.

"రాజేంద్రా! సకలలోక నిర్మాణ చతురుడు - రక్షకుడు అయిన వాడు - సచ్చిదానంద స్వరూపుడు అయిన భగవంతుని దినచర్య చెప్పడం సామాన్యమైన అంశం కాదని అందరికీ తెలిసిందే ! భగవంతుని అంశతో జన్మించిన మీ అలంకారాలు నాకిచ్చి, నా వస్త్రాలు మీరు ధరించి - మీ సింహాసనమ్మీద నన్ను కూర్చోబెట్టి నా ఎదుట నిలబడండి. అప్పుడా భగవంతుని దినచర్య చెప్పడానికి నాకు అర్హత కలుగుతుంది" అన్నాడు.

రాజు అతడు చెప్పినట్లే చేశాడు. అప్పుడు సింహాసనం మీద కూర్చున్న తిమ్మరుసు "రాజా! ఇంతకుముందు నేను ఎలా ఉన్నాను? నువ్వు ఎలా ఉన్నావు? ఇప్పుడు ఇద్దరం ఎలా ఉన్నాం? ఒక సామాన్య పేద బ్రాహ్మణుడినైన నేను కిరీటం, మందీ మార్బలం, అలంకారాలూ, చీనిచీనాంబరాలు ఉన్న మహారాజుని అయ్యాను. ఒకప్పుడు రాజుగా ఉన్న మీరిపుడు బీద బ్రాహ్మణులయ్యారు. భగవంతుడు నిరంతరం ఇలాగే ఒక్కొక్కర్ని ఒక్కోసమయంలో బీదవారిగా, అట్టివారిని ధనికులుగా చేస్తుంటాడు. ఆ దైవలీల ఫలితమే అల్పులు గొప్పవారిగా - గొప్పవారు తక్కువవారిగా మారడం.

ఇంకా వివరంగా చెప్పాలంటే - సముద్రాన్ని దిబ్బగా, ఇసుక దిబ్బని సముద్రంగా, అణువుని మేరువుగా, మేరువుని అణువుగా, గడ్డిపరకని వజ్రంగా, వజ్రాన్ని గడ్డిపరకగా, మంచును అగ్నిగా, అగ్నిపర్వతాన్ని మంచుఖండంగా మార్చుతూంటాడు. ఆ భగవంతునికి అనేక కోట్ల నమస్కారాలు. ఇదే భగవంతుని దినచర్య" అన్నాడు.

అతడి యుక్తిపూరిత సమాధానానికి ప్రభువు ఎంతో సంతోషించాడు. రాజు తన కిరీటం - వస్త్రాలు అవీ తీసుకున్నాక, తమ మంత్రితో ఆ విప్రవేషధారిని బసకు సగౌరవంగా పంపించాడు.

మరునాడు రాజు, "నక్షత్రముల సంఖ్య ఎంత?" అనే ప్రశ్నకు సమాధానాన్ని కోరగా, ఆ వేషంలోనే ఉన్న తిమ్మరుసు, తన అంగవస్త్రంలో మూటకట్టిన ఇసుకను రాజు ఎదుట రాశిగా పోశాడు. "రాజా! నేను ఎప్పటికైనా అవసరం వస్తుందని ఆలోచించి, నా చిన్నతనం నుంచీ చుక్కల్ని

లెక్కపెట్టడం ఒక దినచర్యగా చేసుకున్నాను. ఒక్కొక్క ఇసుకరేణువు ఒక్కొక్క చుక్క. అంచేత ఈ ఇసుక రేణువులెన్ని ఉంటే చుక్కలు అన్నీ ఉంటాయని ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు.

సమాధానం విన్న సభలోని వాళ్లు "రాజు తిక్క చప్పగా కుదిర్చాడు. ఈ బ్రాహ్మడు అసాధ్యుడే" అనుకున్నారు. రాజు ఏమీ అనలేక ఆ జవాబుకు అందరి ఎదుట అంగీకారం తెలుపవలసి వచ్చింది.

మూడోరోజున మంత్రితో ఒక చోట స్తంభాన్ని పాతించమని తానే ఆ స్థలాన్ని నిర్దేశించి చెప్పి, తాను సభకు ఆలస్యంగా వచ్చాడు. రాజు అతని రాకకు ఎదురుచూస్తూ "ఎందుకింత ఆలస్యమైంది?" నీకు వేళ తెలియదా? భూమికి మధ్యభాగం ఎక్కడ?" అని అడిగాడు.

"భూమి అనంతం కదా! దానిని చూపడానికి మంత్రశక్తి కావలసి వచ్చింది. అందుకు దేవతను ఆరాధించడంలో ఆలస్యమైంది. క్షమించాలి,. భూమి మధ్యభాగం ఎక్కడుందన్నది గుర్తులతో చెప్పడం కంటె స్వయంగా చూసి తెలుసుకోవచ్చు! నాతో దేవరవారు తప్ప ఇంకెవరూ రాకూడదు. నడచి రావలసి ఉంటుంది" అన్నాడు తిమ్మరుసు.

అది ఎక్కడోచూడాలన్న కుతూహలం ఆయనకు కలిగేలా చెప్పడంతో, రాజు సరేనన్నాడు. ఇద్దరూ బయల్దేరారు.

కావాలనే ఇసుకదారులలో, ఆ ఎర్రని ఎండలో నడిపిస్తూంటే, రాజుకు పైన నెత్తిమాడుతూ - కింద కాళ్లు కాలుతూ అలసట ఆయాసం వచ్చేశాయి. మరికొంతదూరం ఎలాగో నడిచాక, వగర్చుతూ - "ఇక నేను నడవలేను. చాలా శ్రమగా ఉంది" అన్నాడు.

"దగ్గర కొచ్చేశాం! కాస్త ఓర్చుకోండి! అంటూ ఎప్పటికప్పుడు "ఇదిగో! ఇంకెంత!" అని ఊరిడిస్తూ మిట్టమధ్యాహ్నం దాటినా అలా నడిపిస్తూనే ఉన్నాడు. కాస్సేపు విశ్రమిద్దామన్న రాజుప్రతిపాదన తిరస్కరిస్తూ, "ఏ మాత్రం ఆగినా మంత్రశక్తికి అంతరాయం కలుగుతుంది" అని బెదిరిస్తూ, అంతతో ఆగక "భూమి నాభి అంత సులువుగా కనిపించునా ఏమి? ఇప్పుడు

మంత్రశక్తి మంచి పట్టుమీద ఉంది. దానికి అంతరాయం కలిగితే దేవత కోపించి మనల్ని తిరిగి ఇంటికి చేరనివ్వదు'' అంటూ మరింత భయపెట్టసాగాడు. మరికొంతదూరం సాగారు.

“నన్ను చంపేయదల్చుకున్నావా ఏం? భూమి నాభి ఏమీ చూడనక్కర్లేదులే గానీ, నీ దేవతని ప్రసన్నం చేసుకొని ఇంటికి చేరే మార్గం చూడు! ఇంటికెళ్లాక నీకు గొప్ప పారితోషికం ఇస్తాను” అంటూ అరచేతుల్తో మోకాళ్లు రుద్దుకోసాగాడు.

ఏళ్ల తరబడి ఎండకన్ను ఎరగక రాజప్రాసాదుల్లో సుఖించిన ఆ రాజుకి, మొదటి సారిగా అలుపూ - ఆయాసం ఎలా ఉంటాయో తెలిసివచ్చింది. అప్పుడు తిమ్మరుసు “ఇంత అశక్తుడివి. ఇలాంటి కోరిక కోరడమేమిటి? ఇల్లు చేరడం సులభం కాదు. పదిరోజులు పడుతుంది. రావడమైతే మంత్రశక్తి వల్ల సులభంగా వచ్చేశాం. మంత్రశక్తిని వదిలేద్దామంటే క్రూరమృగాలు భక్షించేస్తాయి. ఇంకెంతో దూరం లేదు కదా! చూసేసి వద్దాం!” అంటూ అతడు రాజును ఇంకా నడిపించాడు.

పూర్తిగా ఓపిక సన్నగిల్లిపోయాక, రాజు ‘ఇక నావల్ల కాదు.’ అని చతికిలబడ్డాక అప్పుడు తిమ్మరుసు అన్నాడు “రాజా! ఇతరుల ప్రాణాలు కూడ నీ ప్రాణాల్లాంటివి కాదా? అసాధ్యపు ప్రశ్నలను వేయడం - వాటికి జవాబు చెప్పలేదంటూ చంపించబోవడం - ఇది నీ వంటివాళ్లకు తగదు. ఇకమీద ఇటువంటి ప్రశ్నలు వేసి ఎవ్వరినీ బాధించనని ప్రమాణం చేస్తే కొద్దిసేపట్లో ఈ ఆపద తొలగించగలను” అన్నాడు తిమ్మరుసు.

రాజు “నాకు బుద్ధొచ్చింది. ఇక పై ఎవరినీ ఇటువంటి ప్రశ్నలడగను. నీ మంత్ర దేవత సాక్షి.” అని ప్రమాణం చేశాడు.

తిమ్మరుసు ఆ ప్రాంతంలోనే పాతించిన ఒక స్తంభం దగ్గరకు తీసుకెళ్లి ఇదే భూమధ్యభాగం . చూడు!” అన్నాడు ఆ క్షణంలో ఏది చూపించినా, అతడికీ ఏదీ ఎక్కడుందో తెలీని స్థితి. దిక్కులు మర్చిపోయిన స్థితి. ఆకలిదప్పుల బాధ అధికంగా ఉన్న దైన్యస్థితి. “విప్రోత్తమా! దాహం” అన్నాడు చేసైగతో - ఒక్క ముక్క కూడా పలకలేక.

"రాజా! చింతించకు! నా మంత్రశక్తితో ఆహార - పానీయాలిక్కడే సృష్టిస్తా!" అంటూ రహస్యంగా వాటిని ముందే ఒక పొదలోన ఏర్పాటుచేసి ఉన్నందున అవి తెచ్చి అందించాడు. ఆహార పానీయాలను ఆత్రంగా పుచ్చుకున్నాక, ప్రాణం కొంత స్థిమిత పడింది రాజుకు.

"బ్రాహ్మణోత్తమా! నీ దయవల్లనే ఈ ప్రాణం నిల్చింది. కోరదగని కోరికల్లాగే, అడగదగని ప్రశ్నలూ వుంటాయని అనుభవం మీద తెలుసుకున్నాను. సాయంత్రమౌతున్నది. నీ మంత్రశక్తితో క్రూరమృగాల బారిన పడకుండా, చీకటి పడకముందే రాజధానికి చేర్చు" అని ప్రార్థించాడు రాజు.

విప్రవేషధారి, అంతకుముందు రాజును నడిపించిన సుదీర్ఘమైన దారిగుండా కాక, అడ్డదారిన రాజధానికి తీసుకెళ్లాడు. అసాధ్యమైన ప్రశ్నలకు జవాబులు ఇచ్చినందుకు మాత్రమే గాక, ఆ ఎర్రని ఎండలో తనకు సేదతీరేలా ఆహారపానీయాలు సమకూర్చినందుకు సైతం కృతజ్ఞతతో నిండుసభలో గొప్పగా ప్రశంసించి సమ్మానించాడు.

మంత్రికైతే, అతడు సాక్షాత్తు తన ప్రాణాలు తిరిగిచ్చిన దేముడివలె తోచాడు. రాజు అతడ్ని పూజించి "మీకు ఇష్టమైనదేది కోరినా, తప్పక తీరుస్తాం!" అన్నాడు.

"నాకు, మీ ఆనందం కంటె వేరే ఏమీ అక్కర్లేదు. మేము తీర్థయాత్రలకు పోతూన్నాం! సెలవివ్వండి" అని వారి నుంచి ప్రశంసలు తప్ప ఇంకేమీ ఆశించకుండా ముందుకు సాగిపోయారు రాయలు - తిమ్మరుసు.

వారు చేరవలసిన గోపాలపురం చేరాక, అక్కడొక బ్రాహ్మణ గృహంలో బస చేసి, అతనిక ఆతిధ్యం స్వీకరించి 'తాము చాలా పాండిత్యం గలవాళ్లమనీ, ఆ రాజాస్థానంలోని పండితులతో వాదించి ప్రభు సమ్మానం పొంది, కాశీ వెళ్లదల్చుకున్నామనీ- చెప్పారు.

ఆ రాజు కూతురు కళావతి ప్రస్తావన ఆ బ్రాహ్మణుని నోట విని, మరిన్ని వివరాలు తెలుసుకున్నారు. ఆమె విద్వాంసులైన విప్రులకు తప్ప ఇతరులకు దర్శనం ఇవ్వదు. వారైనా శృంగారభావంతో ఆమెని చూశారో ఇట్లే కనిపెట్టేసి తీవ్రంగా దండిస్తుంది. ఆమెతో నేర్పుగా మాట్లాడాల్సి వుంటుంది.

అది విన్నాక ఇద్దరూ పథక రచన చేసుకున్నారు. తిమ్మరుసు రాయలకు చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి మరునాడు గోపాలప్రభువు దర్శనం చేశారు. గోపాలుడు వారిని గౌరవించి, వారి రాకకు కారణం అడగ్గా - తాము కాశీ వెళ్తున్నామనీ, వారి పుత్రికతో పాండిత్య చర్చ కొంత చేయాలని ముచ్చటగా ఉందనీ చెప్పారు. సకల విద్యాప్రవీణులమని చెప్పగానే, రాజకుమారి కళావతి తక్షణమే వారిని ప్రవేశపెట్టమంది.

ఆమె పరిచారకులు, వారిని ఎన్నో గదులు దాటించి, కళానిలయ ఉండే భవనానికి తీసుకెళ్లారు. ఒక విడిదిలో వారికి రత్నకంబళాలుపరచి, వారిని ఆశీనులను చేశారు. ఆ విడిది శాలలో ఎక్కడెక్కడి ప్రసిద్ధుల చిత్రాలు ఉన్నాయి. అందులో రాయలు - తిమ్మరుసుల చిత్ర పటాలు సైతం ఉన్నాయి. అందులో రాయలు - తిమ్మరుసులు చిత్రపటాలు సైతం ఉన్నాయి. ఇంకొకవైపు కళానిలయ చిత్రపటం కూడా ఉంది. అందులోని సౌందర్యానికే రాయలు వివశుడైపోగా "చిత్రపటం చూస్తూనే ఇంతటి వికారం పొందుతున్నావంటే, మరికొద్దిసేపట్లో ప్రత్యక్షంగా ఆమెను చూసి ఇంకెంత వెర్రివాడివవుతావో! జాగ్రత్త! మన గుట్టు బయటపెట్టే పనులు చేయకు సుమీ!" అని హెచ్చరించినట్లుగా గుసగుసలాడాడు.

అంతలో అక్కడికొక సుందరి వచ్చింది. దాదాపు కళానిలయకున్నంత అందం ఉంది. రాయలు ఆమెనే కళావతిగా భ్రమించాడు గాని, తిమ్మరుసు దగ్గరా అటువంటి యుక్తులు? కళానిలయ పంపగా వారి పాండిత్యం పరీక్షించవచ్చిన సుందరి ఆమె. కళానిలయ ఆమె కాదని రాయలకు తిమ్మరుసు సూచించాడు. ఆమె ఎంత అందంగా ఉన్నా కుసుమ కోలమైన

కరములు (చేతులు) కాక కఠినంగా ఉండటమే అందుకు ఆధారం - అని తిమ్మరుసు స్పష్టం చేశాడు.

ఆమె ఒక తాడు లాగేసరికి జరీ అంచుల పట్టు వస్త్రాల జాలరు తెరవంటిది, అలవోకగా వీరి ముందుకు జరిగి వ్రేలాడింది.

ఆమె ఆ తెర వెనుకకు ఉద్దేశిస్తూ "అమ్మా! వీరు ఇతరుల్లా నన్నే నువ్వనుకుని భ్రమపడి గౌరవం ఒలకబొయ్యలేదు. లౌకికంలో దిట్టల్లాగే ఉన్నారు. నేను నీ ఇష్టసఖిని అని కనిపెట్టేశారు. జాగ్రత్త సుమీ!" అంటూ హెచ్చరించింది.

కళావతి ఆ తెరవెనుక ఉన్నట్లు గ్రహించారిద్దరూ. సముఖాన తెర అడ్డు దేనికని తొలగించమని చెప్పింది. ఇప్పుడిక రాయల మోహపారవశ్యం చెప్పనలవిగాకుండా ఉంది. రత్నకంబళం పై పొందిగ్గా కూర్చొన్న ఆమె అందాన్ని కళ్లతోనే తాగేస్తున్నాడు రాయలు.

తిమ్మరుసును ఆమె సంస్కృతంలో ప్రశ్నిస్తే శ్లోకరూపంగాను - పద్యరూపాన ప్రశ్నిస్తే పద్యంలోను జవాబు చెప్పసాగాడు. అంతేకాక ఆమె భాషణలో పునరుక్తి దోషం చూపించాడు. స్త్రీలకు వేదం చదివే అధికారం ఏ గ్రంథంలో ఉన్నదీ నిదర్శనం చూపించమన్నాడు. అందుకు జవాబు చెప్పలేకపోయిన కళావతికి వాళ్లిద్దరూ రాయలు, తిమ్మరుసు అని బోధపడిపోయింది. చిత్ర పటాల్లోని కొన్ని పోలికలను బట్టి ఆమె కావైనం స్ఫురించింది.

వారు మారువేషాల్లో ఉన్న కృష్ణదేవరాయలు - తిమ్మరుసు అని స్ఫురించిన వెంటనే, అదే విషయాన్ని తండ్రికి రాసి వారిని ఉరి తీయించమంది.

అందుకు గోపాలుడు "నువ్వు అనుకుంటున్నది అబద్ధం. మారువేషాలలో వారెందుకు వస్తారు? తగిన నిదర్శనాలు చూపిస్తే తప్ప అటువంటి ఆజ్ఞ ఇవ్వను" అన్నాడు - చీటీలో ఆ విషయం జవాబుగా రాస్తూ.

వాదన జరిగిన వైనం వివరిస్తూ, కృష్ణదేవరాయలు తనను తినేసేలా చూస్తున్నాడనీ – బ్రాహ్మణపండితుడైతే అటువంటి సాహసానికి పూనుకోడనీ; ఇక రెండో వాడు తిమ్మరుసు తప్ప ఇతరులెవరూ చేయనేరని కపటవాదన చేస్తున్నాడనీ ఆమె తిరిగి చీటీపంపింది. ఎంతో విజ్ఞతతోనే తన కూతురు ఆ నిర్ణయం చేసిందని నమ్మాక, గోపాలుడు అందు నిమిత్తం తగిన పరివారాన్ని ఏర్పాటుచేశాడు.

ఆమె తొట్రుబాటు చూసి తనను ఆమె గ్రహించేసిందనీ ఏదో మోసం చేయడానికి ప్రయత్నిస్తోందనీ ఊహించేశాడు తిమ్మరుసు.

"మానినీ! మాకు అనుష్ఠానం వేళ దాటి పోతోంది. మిగతా సభ రేపు చేద్దాం! వెళ్లి వస్తాం" అంటూ లేచారు.

"తొందరపడకండి! ప్రసంగం కొంచెమైనా జరగలేదు. మీకు జవాబు చెప్పాలి కదా!" అంది కళావతి. "రేపటికి ఆలోచించి పెట్టుకో!" అంటూ రాయలకు చెయ్యి ఊతం ఇచ్చి వేగంగా అంతఃపురాన్ని దాటాడు. సింహద్వారం దగ్గర రాజుచే నియుక్తుడైన చాకలి చేతులు అడ్డుగా పెట్టి నిలబడ్డాడు.

సాధారణంగా రాజులు చేతులకింద నించి తలవంచి దూరి వెళ్లరు. అడ్డుగా ఉన్నప్పుడు కొద్దిగా పక్కకు జరిగి నిలువుగా తలూపుతూ వెళ్తారు తప్ప 'వంగడం' అనేది వారి నైజం కాదు. బ్రాహ్మణులకిది తప్పు కాదు. వారిని పరీక్షించాలనే గోపాలుడు కావాలని నీచకులాల వారిని నియోగించాడు. అప్పుడు తిమ్మరుసు మెరుపులాంటి యోచన చేశాడు. "మిత్రమా! చూశావా! ద్వారానికి అడ్డంగా నిలబడిన చాకలితో మనం వాదం పెంచుకొనేలోగా రాజభటులొచ్చి మనని చుట్టుముట్టేస్తారు. నేనో ఉపాయం చేస్తాను. నువ్వు చటుక్కున వాడ్ని దాటేసిపో! " అని సన్నసన్నగా చెప్పి "మడేలు గారూ దండాలండీ! దండాలు" అన్నాడు తిమ్మరుసు కేవలం మాటలతోనే.

వాడికి ఇలా జరగొచ్చునని ముందే ఎంతో నూరిపోశారు. అయినా బ్రాహ్మణ పండితుడంతటివాడు తనకు దండం చెబితే, తాను దండం పెట్టకుండా ఉండడం అమర్యాదకరం అని అప్రయత్నంగానే చాకలి రెండు చేతులూ జోడించి తిమ్మరుసుకు దండం పెట్టాడు. మెరుపువేగాన రాయలు పక్కనుంచి బైటకు జారుకున్నాడు. రెండోవాడినైనా దాటనివ్వరాదనుకుని చేతులు తిరిగి అడ్డుపెట్టగా, బ్రాహ్మణుడే గనుక చేతుల కిందనుంచి దూరి వెళ్లిపోయాడు. అంతకుముందే సిద్ధంగా ఉన్న తమ పంచకల్యాణి గుఱ్ఱాలమీదికి ఛెంగున ఎగిరి తమ బస చేరారు.

త్రుటిలో జరిగినంతా విన్నది కళావతి. ఆమె అహంతో కస్సున తన తండ్రి మీదకి తాడెత్తున విరుచుకుపడింది.

"వాళ్లెంత వంచకులో చూశావా! ఆ దాసీ పుత్రుడు....రాజైతే అగుగాక! చూపుల్తోనే నన్ను మానభంగం చేశాడు. అతడ్ని చంపిస్తే గాని నేను అన్నం తినను" అంటూ ప్రతిజ్ఞ చేసింది.

అప్పటికప్పుడు గోపాలుడు చిత్రకారుల్ని రప్పించి వాళ్ల ఆకారాలు చిత్రింపజేసి రాజభటులకిచ్చి వాళ్లెక్కడ కనిపించినా రెక్కలు విరిచి కట్టి లాక్కురండి" అని ఆజ్ఞాపించాడు.

రాజభటులు వాళ్ల కోసం వెదికి, ఎంతకీ కనబడకపోగా విసిగి మరలివస్తూ – నిజంగానే కాశీ వెళ్తున్న ఇద్దరు బ్రాహ్మణులు వారి కంటపడేసరికి, వాళ్లను పట్టుకొచ్చారు. వారిని అకారణంగా ఎందుకు తెచ్చారని కళావతి భటుల్ని మందలించి, ఆ బ్రాహ్మణుల్ని సత్కరించి పంపేసింది.

ఆ తరువాత మరికొందరు రాజభటులు కళావతి దగ్గర కొచ్చి "అమ్మా! వారు మీరూహించినట్లుగా రాయలు – తిమ్మరుసులే! వారు గుఱ్ఱాలెక్కి ఉడాయిస్తుంటే, మేము అడ్డగించాం! కాని వారు చిత్రవిచిత్ర గతులతో చేసే ఖడ్గ చాలనం ధాటికి ఆగలేకపోయాం!" అని సమాచారం అందించారు.

రాజకుమార్తె అయిన కళావతి "నేను నీచ జాతివారి కంటపడ్డాను. ఒక అధముని కంటపడి, కూడా వేరొకర్ని ఎలా పెళ్ళాడను? ఆ దురాత్మునికి ఏం ఒరిగింది? నేను అతడ్ని పెళ్ళాడతాననుకున్నాడేమో! ఎలాగైనా అతడ్ని సాధించి నేను మరణిస్తాను" అని నిశ్చయించుకుని , తండ్రితో కొన్ని రహస్యమంతనాలు జరిపి, తాను చెప్పిన రీతిగా కృష్ణదేవరాయలకు ఒక లేఖ రాయించింది. దాని ప్రకారం......

"లోక విఖ్యాతి గాంచిన మీకు,మా కుమార్తె అయిన కళానిలయ నిచ్చి వివాహం చేయనిశ్చయించాము కనుక, ఇందు రాసిన శుభముహూర్తా నికి సకల పరిచార సహితంగా రాగోరుచున్నాం" అని ఉంది.

ఆ లేఖను తిమ్మరుసుకు చూపిన రాయలు కళావతీ లగ్నమనస్కుడై ఉన్నందున నిజమే కాబోలు అనుకున్నాడు. అది తిమ్మరుసు చూస్తూనే "మనం ఆమె అంతఃపురంలోనే ఆమె స్వాతిశయంపై దెబ్బ తీశామని, ఆ కోపంతో ఆ రాచపడుచు సాకు దొరికిందని – ఆ వివాహం పేరిట నిన్ను వంచనతో చంపాలని భావిస్తున్నది. దీనికి జవాబు చెప్పలేకపోతే నా బుద్ధి సూక్ష్మత ఇంక దేనికి?'' అని ఇలా ఉత్తరం రాయించాడు. "గోపాలభూపాలుడంపిన శుభలేఖ కెంతయో సంతసించి శ్రీకృష్ణదేవరాయలు వ్రాయునది ఏమనగా, మీ కన్యకను స్వీకరించుటకు సమ్మతమైనది. కాని పెళ్లికి తరలిరావడం మా ఆచారం కాదు. మాకు బదులుగా కత్తిని పంపుతున్నాం! ఆ క్రియలన్నీ కత్తి చూసుకున్నట్లుగా భావించగలరు" అని ఉందా లేఖలో.

అది చూసి, రాజకుమార్తె కళావతి "ఔరా! ఏమి ఈ తిమ్మరుసు చతురత. కానిమ్ము! ఇప్పటికి దాటిపోయారని సంతసిస్తూన్నారేమో! ఇక ముందు దొరకరా! ఎప్పటికైనా పగ సాధించి తీరతాను" అనుకుని, కొన్నాళ్లు పోయాక "మీ అజ్ఞానుసారంగా కత్తికి పెళ్లి జరిపించడమైనది. ఇది వసంతకాలం కనుక, ఆ పై జరగవలసిన కార్యం జరిపించుకోగలరు" అని తండ్రి పేరుతో మళ్లీ లేఖ పంపింది.

అది చదివిన రాయలు మొదట ఉత్సాహపడినా, తిమ్మరుసును సంప్రదించి గాని ఏ పనీ చేయనివాడు కావడంతో, ఆ ఉత్తరం తిమ్మరుసు దృష్టికి తెచ్చాడు. "మిత్రమా! నువ్వింత స్త్రీ వ్యామోహపీడితునివయ్యావేమి? వారు నిజంగా పెళ్లిచేశారనుకుంటున్నావేమో! అది ఉత్తమాట! కనుక ఏం రాయాలో అదే రాస్తాను. నువ్వు చూస్తుండు! అయినప్పటికీ - నీకు కళానిలయతో వివాహం జరిపిస్తాను......." అంటూ ఇలా రాయించాడు "మీ శుభవర్తమానం చేరినది. అయితే వాటికంటె మిక్కిలిగా, తక్షణం తీర్చవలసిన రాచకార్యములు కొన్ని ఉన్నందువల్ల మేము రాగల తీరిక ప్రస్తుతమునకు లేదు. వీలు చూసుకొని జాబు రాయగలము" ఇదీ గోపాలునికి అందని సమాధానం.

ఎప్పుడు గోపాలపురం నుంచి ఉత్తరం వచ్చినా, కొద్ది పదాల మార్పుతో ఇదే లేఖ వారికి అందుతూ వచ్చింది. ఇట్లా రెండేళ్లు ఉత్తర ప్రత్యుత్తరాలతోనే గడిచింది. ఇక ఎంతకాలమైనా ఇదే తంతు కొనసాగుతూనే వచ్చింది. లోకందృష్టిలో - రాయలు కళావతిని పెళ్లాడినట్లుగా బాగా ప్రచారంలోనికొచ్చింది. ఎలాగూ వచ్చిన పేరు రానే వచ్చింది గనుక నేనే అక్కడికి వెళ్తే ఎలా ఉంటుంది? అనుకుంది కళానిలయ.

"లోకులు నిందిస్తున్నారు. మీకు రావడానికి కుదరని పక్షంలో మా చిన్నదానినే పంపుతాం! మీకు వీలైన శుభముహూర్తానికి కార్యం జరిపించుకోగలరు" అని ఉత్తరం పంపింది.

"ఈడు వచ్చిన ఆడపిల్ల అత్తవారింట కదా ఉండాలి" అని లోకులనుకోవడం సహజమే కనుక, అందులో అభ్యంతరం చెప్పడానికేమి ఉండదని ఆలోచించే ఆమె అలా రాసింది. ఇక తప్పదని "మీరు రాసిన విషయాలకు సమ్మతించాం! ఇక్కడే అన్ని కార్యాలు జరిపించుకుంటాం! ఆమెను పంపండి" అని తిమ్మరుసు జవాబు రాశాడు.

కళావతి తన తండ్రికి చెప్పి కొంత సైన్యాన్నీ దాసీ జనాన్ని వెంట బెట్టుకుని అత్తవారింటికి వెళ్తున్నట్లే బయలుదేరింది.

ఆమె వస్తున్న విషయం తెలియగానే, తిమ్మరుసు తన బాల్యస్నేహితుడు, విచిత్రమైన వస్తువులు చేయడంలో నేర్పరీ అయిన ఒక చిత్రకారుడిని పిలిపించి రాయలవంటి విగ్రహాన్ని చెయ్యమని బోధించి, అది ఎలా ఉండాలో కూడా నిర్దేశించాడు ఆ చిత్ర/శిల్పకారుడు అటువంటి ప్రతిమను రూపొందించగా, దాన్నొక గదిలో మంచంపై ఉంచారు. దాన్ని చూసిన వారికి కృష్ణదేవరాయలే నిద్రపోతున్నాడనుకోవడం చాలా సహజమైన విషయం. అదేగదిలో ఒక మూల ఒక సొరంగం ఏర్పర్చారు. అందులో ఉన్న వాళ్లెవరికీ కనబడదు గాని, ఆ గదిలో ఎవరు కాలుపెట్టినా ఏమేమి చేసినా కనిపిస్తుంది. అది ఇతరులకు తెలీదు.

కళానిలయ, విజయనగరంలో అడుగుపెట్టాక కూడా రెండు నెలలు ఆలస్యం చేసి, చివరికో రోజు ముహూర్తం పెట్టారు. ముహూర్త సమయానికి ముందుగా, రాజభటులు ఆమెను నివాసం నుంచి తీసుకొచ్చారు.

ఎట్టకేలకు కళావతి ఈ గదిలోకి పోయి, ఒక తలుపువార్న నిలబడింది. కృష్ణదేవరాయలు - తిమ్మరుసు సొరంగంలోనే ఉండి, ఆ గదిలో ఏంచేస్తున్నది చూడసాగారు. గాజుదీపాలతో ఆ గది పట్టపగల్లా ఉంది.

కృష్ణదేవరాయలు ఆ గదిలో మంచంపై పడుకొని, అరమోడ్పు కళ్లతో ఏదో ఆలోచిస్తున్నాడనుకొని, అతడెంతకూ పిలవకపోవడంతో, తానే ఆ మంచం దగ్గరకు వెళ్లింది. కళ్లు మూసుకుని ఉండడంతో గాఢంగా నిద్రిస్తూన్నాడనుకొంది. తన రవిక మడతల్లో దాచిన కత్తి తీసి, ఆ విగ్రహం మీద వేటు వేసింది. విగ్రహం లోపల నింపి పెట్టిన వసంతం ఆమె కళ్లల్లోకి చిందింది. అది ఎర్రని రంగులో ఉండడంతో, రక్తమేచిందింది కాబోలు అనుకుని ఆత్మ సంతృప్తి పడింది. కళ్లు తుడుచుకుంటూ కత్తిని పడేసేటంతలో తిమ్మరుసు, రాయలు ఆమె వద్దకు వచ్చారు. తిమ్మరుసు ఆ కత్తిని పరీక్షించసాగాడు.

రాయలు తిమ్మరుసు చేతినుంచి కత్తిని తీసుకొని ఆమె మీదకెత్తి "విశ్వాస ఘాతకురాలా! మేం నీకు ఏం అపకారం చేశాం? నీ కొచ్చిన అల్పపాండిత్యానికే నువ్వు విర్రవీగుతూంటే, నీ మదం అణచడానికి పండితుల వేషంలో వచ్చాం! అదీ నీవు బ్రాహ్మణులకు తప్ప ఇతరులకు మొహం చూపించని దానివని తెలియడంవల్లనే అట్లా చేయవలసి వచ్చింది. ఇక నువ్వు సాటి రాచరిక వ్యవస్థను ఏమాత్రం గౌరవించకుండా, అక్కడికి నువ్వేదో దేవజాతి నుంచి ఊడిపడ్డదానిలా అతిశయంగా మాతో ఆడుకోచూశావు. నిన్ను నిలువునా నరికినా పాపం లేదు. నన్ను చంపాలని నువ్వు తెచ్చిన కత్తితోనే నీ ప్రాణం తీస్తాను. నీకిప్పుడు అడ్డం రాగల వారెవరో చూస్తాను! దేవుడ్ని ప్రార్థించుకో!" అన్నాడు కోపంగా.

అప్పటికి కళానిలయకి గర్వం మత్తు దిగిపోయింది. తామ అసహాయస్థితిలో ఉన్నప్పుడు - ఎదుటివారి చేతిలో అధికారం ఉన్నప్పుడు మన స్థితి ఎలా వుంటుందన్నది ఆమెకు బాగా అర్థమైంది. ఆ రోజున తాను ఏ విధంగా ప్రవర్తించిందీ గుర్తుకు తెచ్చుకుంది. వారు తన కంటె తెలివైనవారు - కార్యశూరులు కనుక ఆపద తప్పుకున్నారు. మరి తాను ఇప్పుడు ఎలా తప్పుకోగలదు? ఏ విధంగా చూసినా వారు అధికులే! ఇప్పుడు వారేం చేసినా అడిగేవాళ్లుండరు.

ఈ ఊహంతా ఒక్కసారిగా ఆమెను కమ్ముకోగానే, గజ గజ వణికిపోతూ కళానిలయ కాళ్లబేరానికి వచ్చింది. "దేవా! నేనిప్పుడు నీ అధీనంలో ఉన్నాను. స్త్రీ పురుష తారతమ్యం ఎరిగిన వాడవు కనుక నా మాట విన్నంత వరకు నన్ను పరిశీలించదగును. ఎట్లాగూ నీ అధీనంలోనే ఉన్నాను కనుక - నేను విన్నవించుకున్నది విన్నాక నన్ను వధించు" అన్నదామె. రాయలు "సరే! కానిమ్ము!" అన్నాడు, తిమ్మరుసు ముఖం చూసి,

"ప్రభూ! మీరు నిష్పక్షపాతంగా ఆలోచించండి! కపటంతో వ్రతభంగం కలిగించింది మీరే! నా మానాన నేనేదో పండితగోష్ఠిలో

ఉన్నదానిని! మీరొచ్చి కదా – ఈ చిచ్చు పెట్టారు. రాచపుట్టుక పుట్టినందుకు ప్రతీకారాన్ని తీర్చుకోవడం సహజం కాదా? ఇందులో నేను మీకు ద్రోహం చేయడానికి ముందడుగువేశాననీ, అకారణంగా పగబట్టాననీ అనగలరేమో...... అందుకు ఎక్కడన్నా ఆస్కారముందా అనేది ఒక్కసారి ఆలోచించండి! అయితే అప్పుడు మీ మీద ఎంత కోపం వచ్చిందో, ఇప్పుడు నాలో పరివర్తన కలిగి అంతకు రెట్టింపు ప్రేమ మీ మీద జనించింది. దైవసాక్షిగా మిమ్మల్నే భర్తగా సేవించుకుంటాను. కోరి వచ్చిన చిన్నవాడిని కాదనే దుర్మార్గురాలిని కాను. మునుపు నా మీద మోహం మీరు గుర్తుకుతెచ్చుకోండి! నా మనఃస్థితిని మీకంటె తిమ్మరుసు గారే బాగా అంచనా వెయ్యగలరని – ఉద్రేకంలో ఉన్న మీకిపుడు అర్థంకాదని ఆలోచించండి. ఇంతకంటే నేను చెప్పేదేమీ లేదు" అని ఊరుకుంది.

ఆమె యువసహజమైన రాచ స్త్రీ బుద్ధి ప్రదర్శించిందని గ్రహించిన తిమ్మరుసు 'ఆమె క్షమించదగినదే' అని తీర్పు ఇచ్చి, కొన్ని బుద్ధులు, మెలగవలసిన తీరు చెప్పి, రాయలకూ – కళానిలయకూ వైభవంగా వివాహం జరిపించాడు.

ఆ తరువాత కొన్నాళ్లకు రాయలవారి బొమ్మ చేసిన చిత్రకారుడొచ్చి, విగ్రహం తిరిగి అతుకు ఎక్కడుందో కనబడనంత జాగ్రత్తగా బాగుచేసి ఇవ్వగా, రాయలు దాన్నొక మందిరంలో ప్రతిష్ఠించి నిత్యోత్సవాలు జరపమని కొంత అగ్రహారం దానం చేశాడు. అదే నీవు చూసిన విగ్రహం కథ. ఆ విగ్రహ నిర్మాణంలో ఏ ధాతువులు పయోగించిందీ ఎవరికీ తెలీదు. కథ పూర్తయింది. లెమ్ము గోపాలా! పొద్దెక్కింది. మనం మళ్లీ ప్రయాణం సాగించాలి" అన్నాడు మణిసిద్ధుడు.

ప్రణవాక్షరం జపిస్తూ గురువూ – ఆయన్ననుసరించి శిష్యుడు తరువాత మజిలీ చేరుకున్నారు.



# కాశీ మజిలీ కథలు

## 9వ మజిలీ

అందు గోపాలుడు ఒక పొలంలోనికి వెళ్లి, ఒకచోట ఏదో మాంస - చర్మ శూన్యమైన అతిపెద్ద పుర్రె నొకదానిని చూసి, దాని వృత్తాంతం చెప్పమని అడగ్గా, రత్నప్రభావం చేత మణిసిద్ధుడు ఆ కథ తెలుసుకుని, ఇలా చెప్పసాగాడు.

### సింహదమనుని కథ

కళింగదేశానికి అలంకారం అనదగ్గ విజయపురంలో శత్రుంజయుడనే రాజున్నాడు. అతడికి చాలాకాలం వరకు సంతానం లేదు. కేవలము పుత్రసంతానం కోసం - తన తర్వాత రాజ్యానికి వారసుని కోసం ఒకరి వెంట ఒకర్ని వరుసగా ఏడుగుర్ని పెళ్లాడాడు. కాని అదేమి దురదృష్టమో, ఒక్క భార్యకూ పుత్రోదయం జరగలేదు.

ఇలా ఉండగా ఒకరోజు విజ్ఞాన సిద్ధుడనే యోగి ఆ రాజ్యానికి రాగా, అతడ్ని ఆశ్రయించాడు శత్రుంజయుడు. రాజు యొక్క భక్తి విశ్వాసాలకు మెచ్చి, మామిడిపండు ఒక్కటిచ్చి, దీన్ని నీకు నచ్చిన భార్యకిస్తే, దీని మహిమ వల్ల దివ్యప్రభావం గల కొడుకు పుడతాడని దీవించాడు. శత్రుంజయుడు అంతఃపురానికి వచ్చి - ఏడుగురు భార్యలపైన ఒకేరీతిగా ప్రేమ ఉన్నవాడు కావడం వల్ల, దాన్ని అందరికీ సమానంగా పంచి ఇవ్వగా, అది తిని వారంతా గర్భం ధరించారు.

శత్రుంజయుడు ఒకనాడు వేటకు వెళ్లి అనేక క్రూరమృగాలను వధించి, తనకు దొరక్కుండా పారిపోయిన అడవిపందిని తరుముతూ ఒంటరిగా అడవిలో చాలాదూరం వెళ్లిపోయాడు. ఉన్నట్టుండి ఆ పంది

ఎటో తప్పించుకొనిపోయింది. అక్కడికి చేరువగా, ఆ నట్టడవిలో ఒక ఉద్యానవనం కనిపించింది.

ఈ అరణ్యమధ్యాన ఇంత చక్కని తోట ఎలా వెలిసింది...? అనుకుంటూనే, సేదతీరుతూ అందులో విహరిస్తూండగా వనకిన్నెరలాంటి ఓ అందాల జవ్వని కనిపించింది. శత్రుంజయుడామెతో మెల్లగా మాటలు కలిపాడు. ఆమెకు అనుకూలంగా తాను మెలగగలనని ప్రమాణం చేయగా ఆమె తన వృత్తాంతం ఇట్లా చెప్పింది.....

"నా పేరు సూర్యప్రభ. నేను అమరావతీ రాకుమార్తెను. మగవాళ్ల ద్రోహబుద్ధి నాకు బాగా తెలుసు! మునుపు అడివిలో ఏకాంతంగా ఉన్న శకుంతలని దుష్యంతుడు ఇలాగే మోసం చేయలేదా? వలచి వరించి, తన కోరిక తీర్చుకుని రాజధానికి పోయాక ఆమె ఎవరో తెలీదన్నట్లు నటించలేదా? అందువల్ల నాకు 'పెళ్లి' అంటేనే విముఖత్వం ఏర్పడింది. మా తండ్రి ఎంత చెప్పినా నేనే వివాహం చేసుకోలేదు. కన్యాత్వవ్రతం పూని జీవితాంతం కన్యగానే ఉండిపోదామని నిర్ణయించుకున్నాను. సిద్ధవ్రతుడనే ఒక యోగి రాకతో, మా తండ్రి నన్ను ఆయన సేవలకు వినియోగించాడు. నేను భక్తి వినయాలతో ఆయనకు శుశ్రూషలు చేయగా, ఆయన వెళ్తూన్నప్పుడు నన్ను మెచ్చుకొని నన్నొక వరం కోరుకోమన్నాడు. "మనోహరమైన ఉద్యానవనంలో ఏకాంతంగానే విహరిస్తాను. నాకెవ్వరి తోడు అవసరం లేని విధంగా ఆ ఉద్యానవనం ఉండాలి" అని కోరుకోగా, ఆయన తన యోగబలం చేత దీన్ని సృష్టించాడు. నాకు కానుకగా వచ్చిన ఈ తోటంటే నాకు మక్కువ అధికమై, మాతండ్రి అనుమతితో నేను ఇక్కడే ఉంటున్నాను. ఇంతవరకు ఇందులో ప్రవేశించిన ఏకైక పురుషులు మీరే! మిమ్మల్ని చూస్తుంటే నాలో కోరిక రేగుతోంది. కాని, మగవారి ద్వేషం తల్చుకుంటే అంతలోనే వైరాగ్యం కల్గుతోంది. అంతా నాకు అనుకూలంగా జరుపుతానని మీరు మాట ఇచ్చినందున మీ వెంట వస్తానన్నాను. కాని, నా మనస్సు ఊగిసలాడుతోంది. నా వల్ల మీకు ఇంతవరకు ఉన్న భార్యలతో చిక్కులు రాగలవేమో" అంది.

"నువ్వు లేనిపోని అపోహలు పెంచుకుంటున్నావు. నీకు సాటిరాగలిగిన వాళ్లు, వాళ్లలో ఎవరూ లేరు. నువ్వొస్తే చాలు! నిజానిజాలు నీకే తెలుస్తాయి" అంటూ ఆమె మీది మోహంతో ఇన్నాళ్లుగా తాను ప్రేమించిన భార్య లేడుగుర్నీ తక్కువ చేసి మాట్లాడాడు. రాజు అలా చెప్పగానే ఆమె, అతడి ఊపిరి ఆగిపోయేంతలా కౌగిలించుకుంది. అదంతా తన మీద ప్రేమే కాబోలుననుకున్న శత్రుంజయుడు, ఆమెను వెంటబెట్టుకుని, తన నగరానికి తీసుకువెళ్లాడు.

నిజానికి అదొక బ్రహ్మరాక్షసి. రాజును మోసంచేద్దామని బుద్ధి పుట్టి, అది అలా నాటక మాడింది. విషయం తెలీని రాజు ఆమెని భార్యగా చేసుకునేసరికి, దాని పంట పండినట్లైంది. ప్రతిరోజూ అంతఃపురంలో అద్భుతమైన వంటకాలెన్నో అమర్చి పెడుతూన్నా అవి దాని పంటికిందికైనా చాలడం లేదు. రాత్రివేళ రహస్యంగా రాచనగరులోని అశ్వశాలలోనో - ఏనుగుల శాలలోనో ఒక జంతువుని స్వాహా చేసేస్తోంది.

వారంరోజుల్లోనే కావలి వారికీ సంగతి తెలిసింది కాని, ఆ బ్రహ్మరాక్షసి ఎవరో - ఎక్కడ్నుంచి వస్తోందో అంతు బట్టక, ఎంత నిఘావేసినా రాక్షస మాయవల్ల అదొచ్చే సమయానికి మత్తులోపడి, తెల్లారాక ఎముకల గుట్ట చూసి గుండెలు బాదుకోసాగారు. ఇక దాన్ని కనిపెట్టడం తమ వల్ల కాక, రాజుకు చెప్పారు.

"బ్రహ్మరాక్షసి ఎన్నడూ లేనిది ఇప్పుడెలా వస్తోంది" అని ఏమాత్రం ఆలోచించకుండా, కొత్త ప్రియురాలి మోజులో పడిన శత్రుంజయుడు ఆమెను ఏం చెప్తే అదే నిజమని నమ్మి యుక్తాయుక్త విచక్షణ కోల్పోయి ఆమె చెప్పినట్లల్లా ఆడసాగాడు.

ఒక రాత్రి ఆ రక్కసి పట్టపుటేనుగునే చంపేసి, దాని మాంసం ముక్కలు కొన్ని ఆ ఏడుగురు రాణుల అంతఃపురాలకు చెందిన వంటశాలలో ఉంచి, భటుల చేత రాజు పరీక్షింపచేసేలా చూసి అసలు వాళ్లే రక్కసులని బోధించింది. 'గర్భవతులు కనుక చంపించడం తగదని, కనుగ్రుడ్లు పెరికి వదిలేయవలసింది అరణ్యంలోనే' అని కూడా చెప్పేసరికి, తప్పని సరై

రాజభటులు ఆ పని చేయవలసి వచ్చింది. ఆనవాలుగా ఆ కనుగుడ్లు ఆ రాక్షసి తీసుకుంది.

అడవిలో ఆ రాజపత్నుల పాట్లు వర్ణనాతీతంగా ఉండి జాలిగొల్పేలా ఉన్నాయి. దృష్టిపోయింది. ఎప్పుడే జంతువు వచ్చి మీద పడుతుందో తెలీదు. పిలిస్తే పలికే దిక్కులేదు. భగవంతుడి కరుణ వల్లనే ఆ అన్నెం - పున్నెం ఎరుగని ఆడవాళ్ల ప్రాణాలు నిలిచాయి తప్ప, ఏ విధంగానూ వారికి రక్షణలేదు. ఇంకా హృదయవిదారకమైన స్థితి అందరూ కడుపుతో ఉండి నట్టడవిలో శిశువుల్ని ప్రసవించవలసి రావడమే! ఇంత బాధపడి కన్న శిశువులు వాళ్లకు దక్కారా అంటే అదీలేదు. ఒకరివెంట ఒకరుగా ఆరుగురు తల్లుల కన్న శిశువుల్ని జంతువులు ఎత్తుకుపోయాయి. చివరిదానికి పురిటినొప్పులు ప్రారంభం కాగా, కనీసం ఒక్క శిశువైనా దక్కించు కుందామని, ఆరుగురూ ఆమె చుట్టూ వలయంలా ఏర్పడి రక్షణ ఇచ్చారు - ప్రసవించగానే ఎత్తుకొని, దించకుండా నిద్రించకుండా అహర్నిశలు వంతుల వారీగా కాపాడుతూ ఆ శిశువుని ఐదేళ్ల వాడిగా చేశారు. ఆహా! స్త్రీలకు భూదేవి కున్నంత ఓర్పుంటుందనడంలో ఆశ్చర్యం లేదు గదా!

ఆ పిల్లవాడు చాలా చురుకైనవాడు కావడంతో, ఐదో ఏట నుంచే తన తల్లుల పరిస్థితిని ఆకళింపు చేసుకుని తానే ఫలాలు ఏరి ఇవ్వటం, నిద్రించడానికి సరైన ప్రదేశాలు వెతకడం వంటి బాధ్యతలు మోయసాగాడు. అలా వెతుకుతూ అడవి చివరన గల ఒక మునిపల్లె చేరుకున్నారా కొడుకు-తల్లులూ. వారి జాలి గాథ తెలిశాక ఆ తాపసుల రక్షణ లభించింది వారికి.

పదకొండేళ్లకే అరణ్యంలోని కిరాతకులను మంచిచేసుకుని విలువిద్యలో ప్రావీణ్యం సంపాదించి, వేటలో ఆరి తేరాడు. చక్కని రూపం తేజం ఉన్న ఆ బాలుని వాక్కులకు ముచ్చటపడి, కిరాతకులు అతడ్ని తమ ఏలికగా మన్నించారు. వారి దగ్గర నాయకత్వంలో మెలకువలను - తల్లుల దగ్గర లోకజ్ఞానాన్ని నేర్చుకుని, పదహారేళ్లకు ఆ బాలుడు రాచనగరుల్లోని చిన్నవాడికి ఏమీ తీసిపోని విధంగా తయారయ్యాడు.

ఒకరోజు అతిసాధారణ ఆయుధాలతో ఒక సింహాన్ని చంపేసరికి, ఆటవికులే భయపడే ఆ రకం వేటను సునాయాసంగా నిర్వర్తించినందున

అతడికి సింహదమనుడని పేరు పెట్టారు తాపసులు. బాల్యం నుంచే ఆటవికులు అతడ్ని ఏలికగా మన్నించడంతో అతడు అరణ్యరాజ్యం చేయసాగాడు.

ఒకరోజు అతడు, తమ దుర్భరస్థితికి కారణమేమిటని తల్లుల్ని అడిగాడు. వారు శత్రుంజయుడ్ని వివాహం చేసుకున్నది మొదలు అంతవరకు జరిగినది దుఃఖిస్తూ చెప్పారు.

అది విన్న ఆ యువకునికి ఎంతో దుఃఖం కలిగి, దాంతోపాటే ఆగ్రహం చెలరేగింది. తండ్రి అని సంకోచించాడు తప్ప, అటువంటి విచక్షణా రహితుడ్ని నరికినా పాపం లేదనుకున్నాడు. అయినప్పటికీ నిగ్రహించుకున్నాడు.

విషయం తెలిసినందువల్ల, ఇక ఈ ఆటవికుల మధ్య ఉండడం ఇష్టంలేక, నాగరికుల మధ్య మెలగదలచి, వారిని అవసరమైనపుడు సాయానికి పిలుస్తానని చెప్పి, తల్లులతో రాజధానీ నగరానికి చేరుకుని, ఒక ఇల్లు తీసుకొని అందులో ఉండసాగాడు.

ఒకనాడా నగరంలో ఒక కత్తీ - ఒక గుర్రమూ అమ్మకానికి వచ్చాయి. గుర్రం ముఖాన్ని కప్పుతూ ఒక వస్త్రం మీద "ఈ గుర్రం కత్తితో పాటు ఇవ్వబడుతుంది. రెండిటి వెల పదివేల వరహాలు. కాని కత్తిని సులభంగా ఎత్తగల వారు తప్ప గుర్రాన్ని ఎక్కలేరు. గుర్రం నేల మీదనే కాక, ఆకాశంలో కూడా ఎగరగలదు. అసమర్థులు ఎవరైనా గుర్రాన్ని కొంటే పరాభవం తప్పదు" అని రాసి ఉంది.

శత్రుంజయుడితో సహా అది దక్కించుకోవాలని ఎంతోమంది ప్రయత్నించారు. కానీ, ఎవరికీ అది సాధ్యం కాలేదు. అయితే సింహదమనుడు ఆ కత్తిని చాలా సునాయాసంగా ఎత్తి గుర్రం మీద క్షణాల్లో స్వారీచేస్తూ ఎంతో దూరాన్ని తిరిగి వచ్చాడు.

ఈ విషయాన్ని తెలుసుకున్న రాజు, సింహదమనుడి దగ్గరకు వచ్చి, నువ్వెవరు? దేశం ఏది? తల్లిదండ్రులు ఎవరు?" వంటి వివరాలు అడగ్గా ఎదుట వున్నది తన తండ్రే అని తెలిసి కూడా, ఏ ప్రశ్నకూ జవాబివ్వకుండా ఊరుకున్నాడు.

అటువంటి ధీరుడ్ని తన కొలువులో నియమించుకోవాలనుకున్న శత్రుంజయుడు, మీకు తగిన పారితోషికం ఇస్తే మా కొలువులో ఉండటానికి ఏమన్నా అభ్యంతరమా?" అని అడిగాడు

గుర్రాన్ని స్వారీ చెయ్యగలిగినా అది కొనేంత ధనం తన దగ్గర లేక పోవడంతో, ఆ కత్తినీ - గుర్రాన్నీ తన స్వాధీనమయ్యేలా చేసి, నెలకు నూరు మాడల జీతం ఇస్తే ఉంటానన్నాడు.

రాజు అతడికా గుర్రాన్ని కొనిచ్చి, తన కొలువులో సింహదమనుని పెట్టుకున్నాడు. ఆ యువకుడు గుర్రానెక్కి వెళ్తుంటే , ఎంత వారికైనా భయం పుట్టక మానదు.

శత్రుంజయుని మోసగించి, అతని భార్యలను అడవుల పాల్జేసిన ఆ రాక్షసి, రాజుకు నమ్మకం పుట్టించడానికి జీవహింస మానేసినా కొన్నాళ్లలోనే మళ్లీ మొదలెట్టింది. ఎన్ని ప్రయత్నాలు చేసినా అతడా దుష్టశక్తిని ఆపలేకపోయాడు. సింహదమనునకీ విషయం చెప్పి "ఎన్నో ఏళ్లుగా ఒక రక్కసి, ఏ మాయవల్లనో అర్ధరాత్రి కావలి వారి కన్ను గప్పి, అప్పుడప్పుడు ఏనుగుల్నీ - గుర్రాల్నీ తినేస్తోంది. దాని పీడ నీవంటివాళ్లే తొలగించాలి" అని కోరాడు.

ఆకాశగమనం గల గుర్రం మీద గాల్లో స్వారీ చేస్తున్న సింహద మనుడి ధాటికి, రక్కసి 'తన మాయోపాయాలేమీ పని చేయవు' అని గ్రహించుకుని కొన్నాళ్లు మళ్లీ జంతువుల జోలికెళ్లడం మానేసింది.

కాని, అలవాటైన ప్రాణం ఎన్నాళ్లాగగలదు? వీడ్ని ఎలాగైనా ఊర్నించి వెళ్లగొట్టాలని అనుకుని, రాజు తనను చేరరాగా, అతడ్ని దరికి రానివ్వక అలిగి పడుకుంది. విషయం చెప్పమని శత్రుంజయుడు బతిమాలగా "నా భ్రమరవాణి అనే సోదరి ఉంది. నాకు అదంటే ప్రాణం. అది రోగంతో బాధపడుతూన్నట్లుగా నాకు కలవచ్చింది. దాని క్షేమం చూసి వచ్చి నాకు చెప్పడానికి, సింహదమనుణ్ని పంపించే ఏర్పాటు చెయ్యండి" అంది. "ఇంతచిన్నవిషయానికి అలుకదేనికి? నువ్వు ఆజ్ఞాపిస్తే, అతడు కాదంటాడా?" అని శత్రుంజయుడనగానే, సంతోషించి అతడ్ని పిలువనంపిందా రక్కసి.

సింహదమనుడు రాగానే "నీ పరాక్రమం సంగతి విన్నాను. ఇక్కడ్నుంచి దక్షిణం వైపు మళయాళ దేశం ఉంది. అక్కడ సముద్రం దాటి నూరు యోజనాలు వెళ్తే ఒక లంక. అందులో ఒక నూరు యోజనాలు, రాజమార్గాన పోగా ఆవల మూడు పర్వతాలు. వాటిలో మధ్య దాని శిఖరం మీదకెక్కితే ఒక చోట పెద్దరాయి ఉంటుంది. నేను నీకొక పొడి ఇస్తాను. ఆ రాతిపై మండే అగ్నిలో ఆ పొడి జల్లగానే రాయి పగిలి దారి ఇస్తుంది. ఆ దారిలో వెళ్తే మా సోదరి మందిరం కనిపిస్తుంది. దాన్ని చూసి, నేనిచ్చిన ఉత్తరం దానికిచ్చి, అదిచ్చే ఉత్తరం తీసుకురావాలి" అని ఉత్తరం, కొంత పొడి ఇచ్చింది.

తాను ఇంటికెళ్లి తల్లులకు ఈ విషయం చెప్పగా, వాళ్లు "అమ్మో! అదీ అసలు రాక్షసి. నువ్వు వెళ్లవద్దు" అన్నారు. రాజుగారి కొలువు చేస్తున్నందుకు ఆయన ఆజ్ఞ పాటించకపోతే, విశ్వాసఘాతకుడని చెడ్డపేరొస్తుంది. వెళ్లి తీరాలి. మీ ఆశీర్వాదబలం ఉంటే చాలు. నన్నే దుష్టశక్తీ ఏమీ చెయ్యదు" అంటూ వారిని ఒప్పించి, కత్తి పట్టి అశ్వం అధిరోహించాడు. ఆ దేవతాశ్వం మీద దక్షిణదిశగా ఆకాశమార్గాన పోతూండగా, చల్లగాలికి మేడపై సఖురాళ్లతో విహరిస్తున్న మణిమంజరి చూసింది.

## మణిమంజరి కథ

ఆ మేడమీదున్న చిన్నది, ఆకాశమార్గాన పోతూన్న సింహదమనుణ్ని రూపం చూసి వరించి చెయ్యూపుతూ తన దగ్గరకు రమ్మని పిల్చింది. అతడు ఆమెకు దగ్గరగా దిగాడు. ఆమె చెలికత్తెలతో సహా అతడ్ని చేరింది. తన పేరు సింహదమనుడనీ, తండ్రిగారు పంపగా ద్వీపాంతరం వెళ్తున్నాననీ తియ్యని పానకం ఇస్తే తాగి వెళ్తాననీ అన్నాడు నర్మగర్భంగా. ఆమె అతనికంటె చతుర కావడంతో తన అధరామృతం అందుకోడానికి ఏం చేయాలో కూడ చెప్పింది. అందుకు అతడు తన అంగీకారాన్ని తెలిపాడు. వారి సంభాషణలోని మర్మాన్ని గ్రహించిన చెలికత్తెలు, వాళ్లను ఏకాంతానికి వదిలేశారు.

అప్పుడా యువతి, అతడి దాహాన్ని తీర్చేలా మన్మథసుఖం అందించింది. అలిసిపోయిన రాజకుమారుడు నిద్రలోకి జారగా ఆమె అతడి పాదాలను ఒత్తసాగింది...అప్పుడతని అంగీజేబులోనుంచి జారిపడిన ఉత్తరం చూసి, అది పైశాచిక భాషలో ఉండడంతో, ఆ భాష తెలిసినందున ఆమె కుతూహలం కొద్దీ అది చదివింది . దాంతో ఆ రాజకుమారుని చరిత్ర కొంత వరకు ఆమెకు అర్థమైంది.

"రాజును వంచించి, అతడి భార్యల్ని అడవికి తోలించి, అందుకు గుర్తుగా కనుగ్రుడ్లు పెకలించి, యథేచ్ఛగా ఏనుగులను – గుర్రాలను తింటూ సుఖంగా ఉన్నానని నీకు ఇంతకుముందే తెలిపి ఉన్నాను. నాలుగు నెలల క్రిందట శత్రుంజయుడి దగ్గర చేరిన ఈ వీరుడు ప్రతిరాత్రీ గస్తీతిరుగుతూ నా ఆహారానికి ఆటంకం కలిగిస్తున్నాడు. వీడు సామాన్యుడు కాడు. వీడిని చంపడం నావల్ల కాదు. అందుకే వీడిని ఒక నెపం మీద నీ దగ్గరకు పంపుతున్నాను. వీడ్ని చంపి ఆ శుభవార్త నాకు తెలియజెయ్యి" అని ఉందా ఉత్తరంలో.

రాజకుమారుడు ఎంతో అమాయకంగా నిద్రపోతున్నాడు. ఇదే అదనని అతడికి మేలు చెయ్యడానికి, ఆ భాష తెలిసిన ఆ రాజకుమార్తె అందులోని విషయానికి పూర్తి వ్యతిరేకంగా ఇలా రాసింది.

"ఇతడు నాకు పుత్రతుల్యుడూ. అత్యంత ప్రాణమిత్రుడునూ. ఇతడికి మన ఇంటిలోని వింతలన్నీ చూపి, మన గుట్టు మట్లు అన్నీ నిస్సందేహంగా చెప్పు! ఇతన్ని సంతోషపరచు! నీ క్షేమం తెలుసుకుందామనే ఈ ఉత్తరం పంపుతున్నాను" అని రాసి, ఆ ఉత్తరం అతని జేబులో భద్రంగా దాచి, మొదటి ఉత్తరాన్ని జాగ్రత్త చేసింది.

మెలకువ వచ్చిన సింహదమనుడు, తన గురించి కొన్నివివరాలు మాత్రం చెప్పి, ఆనవాలుగా తన ఉంగరం ఇచ్చి, గుర్రమెక్కి ఆకాశమార్గాన వెళ్ళిపోయాడు. అంతా ఆ రాక్షసి చెప్పిన రీతిగానే ఉండడంతో ఆమె ఇచ్చిన పొడిని రాతి మీద అగ్ని గుండంలో వేసేసరికి, లోపల మనిషి పుర్రెలతో చేసిన ఒక మూలిక కనిపించింది. అతన్నీ ఆ రాక్షస అక్క చెల్లెళ్లు ఇద్దరూ

వంచించి చంపిన రాజకుమారుల పుర్రెలు. ఆ గుహలో నివశిస్తున్న దాని పేరు కంకాళి. రాజు దగ్గర భార్య రూపంలో ఉన్న రాక్షసి - కంకాళ.

సింహదమనుడు ప్రవేశించగానే, నరవాసన అంటూ అప్పటికప్పుడే అతడ్ని మింగడానికి వచ్చింది కంకాళి. అతడు ఉత్తరం ఇవ్వగా, ఆ ఉత్తరం చదువుకుని, అతడ్ని ఆనందంగా అక్కున చేర్చుకుని "ఓహో! మా సోదరి పెంచుకున్నవాడివనీ, దానికెన్నో ఉపకారాలు చేశావనీ నాకు తెలీక నిన్ను చంపబోయాను. కోపం తెచ్చుకోకు. ఇలా అని మా అక్కతో అనకు. నీకు రాచమర్యాదలన్నీ చేస్తాను. దానికి పుత్రుడివైతే నాకూ పుత్రుడివే!" అని చెప్తూ ఆ పుర్రెల మాలగురించీ - అందులోని ఒక్కొక్క పుర్రె ఏ రాజుదో అతనికెన్ని ఏనుగులు - గుర్రాలు ఉండేవో, వాటిని ఆ అక్కచెల్లెళ్ళిద్దరూ వంచనతో ఎలా ఆరగించేవారో కథలు కథలుగా చెప్పేసరికి, రాచవారి చిన్న వాడే అయినా మాంసం తినడం మీద విరక్తి కలిగింది అతడికి.

అప్పుడా సూక్ష్మబుద్ధికి, జరిగిందేమిటో అర్థమైంది. ఈ రాక్షసి అక్కచెల్లెళ్ళిద్దరూ ఇలాగే ఎంతోమందిని పొట్టన పెట్టుకున్నారనీ అర్థమైంది. అసలు రాక్షసి తన తండ్రి దగ్గర చేరి ఆడిస్తూంటే మూఢుడై పోయిన తన తండ్రి ఆమె చెప్పినట్లల్లా ఆడుతూండడం వల్ల, ఇంత అనర్థం జరిగి, తన తల్లులకూ కళ్లు పోయి, తాను అడవుల పాల్బడి, చివరికీ చోట తాను తేలాడనీ - దారిలో తన పుణ్యం బాగుండి మణిమంజరి ఆ లేఖ చూసి ఉంటుందనీ - ఆమెకీ భాష తెలిసి విషయం మార్చి రాసేసి వుంటూందనీ చిటికెలో గ్రహించుకున్నాడు.

అందుకు తగ్గట్లే నాటకం ఆడటానికి నిర్ణయించుకుని "అమ్మా! పిన్నమ్మా! మా అమ్మ నిన్ను చాలా చాలా అడిగినట్లు చెప్పమంది. ఆవిడకు ఏమీ లోటు లేదట! ఏదో సందర్భంలో నీ గురించీ - ఈ పాతాళ గృహం గురించీ చాలా చెప్తూంటే ముచ్చటవేసి పిన్నమ్మను చూస్తా! పంపవూ' అంటే నన్ను ఇక్కడికి పంపింది. నా కింకా నరభోజనం అలవాటు కాలేదు" అని ముందుగానే సింహదమనుడు జాగ్రత్త పడ్డాడు.

అతడికి యుక్తమైన భోజనం అమర్చాక, ఇక్కడి వింతలూ విశేషాలూ చూపమన్నాడు. మా అమ్మ అడిగితే ఏమేమి చూసిందీ చెప్పాలి కదా! అని

సమర్థించుకున్నాడు. వివిధ రాజ్యాల రాజుల గురించి స్వాధీనం చేసుకుని అక్కడికి తరలించిన నగలూ – రత్నాలూ – మణిమాణిక్యాలూ – బంగారం రాశులుగా పోసిన వందలాది గదులు చూసేసరికి అతడికి కళ్లు తిరిగాయి. ఆ గదుల్లో ఒకచోట కొందరి అవయవాలున్నాయి. వాటిపైన ఒక ప్రత్యేకమైన పొడి జల్లి ఉంచడంతో అవి ఇంకా పాడైపోకుండా అలా ఉన్నాయి. వాటి మధ్య ఏడు జతల కనుగ్రుడ్లు కూడా ఉండడంతో, సింహదమనుడి కళ్లు ఆనందంగా మెరిశాయి. “ఇవి ఎవరివో తెలుసా?” అని అడిగింది. కంకాళి. కావాలనే సింహదమనుడు తెలీదన్నాడు. ఇవి నువ్వే దేశం నుంచి వచ్చావో ఆ దేశానికి చెందిన రాజు యొక్క ఏడుగురి భార్యలవి. వారి కర్మ అలా ఉండి, కళ్లు లేక గ్రుడ్డి వాళ్లై అడవుల పాలబడ్డారు. ఇంతకాలం బతికి ఉంటారనుకోను” అని నవ్వుతూ ఊగిపోయి చెప్పేసరికి, దాన్ని అక్కడికక్కడే నరికి పోగులుపెట్టాలనిపించిందా వీరపుత్రుడికి......కాని ఇలాంటి రక్కసి ముండల ప్రాణం ఎందులోనో దాస్తారని, ఆ రహస్యం తెలిసేదాకా ఆగాలని నిదానించాడు సింహదమనుడు.

“వీటికి సజీవత్వం కల్పించావు. బాగానే ఉంది. నిజంగా ఇవి ఎవరికైనా అంధులకు ఉపయోగించవచ్చా? అలా చేస్తే వాళ్లకి తిరిగి చూపు వస్తుందా?” అని అడిగాడు యధాలాపంగా.

తమ గొప్పదనం చెప్పుకోవాలన్న ఆతృతలోఉన్న కంకాళి “ఎందుకురావూ? నిక్షేపంగా చూపుతిరిగి వస్తుంది. తులసి ఆకు పసరులో ముంచి నేత్రాలుండే ప్రదేశంలో గాని అంటిస్తే, చూపు తప్పకుండా వస్తుంది. అయినా ఇప్పుడా అవయవాలెవరిక్కావాలి ? ఏదో మేమిద్దరం, గుర్తుగా పడి ఉంటాయి లెమ్మని అట్లే పెట్టుకున్నాం! అంతే” అనేసి అక్కడ్నుంచి తీసుకెళ్లి కుందనపు బొమ్మలా తాను అపురూపంగా పెంచుకుంటున్న ఒక చక్కని రాకుమార్తెను చిత్రశాలలో చూపించేసరికి, “పిన్నమ్మా! ఇది నీకు ఎక్కడ దొరికిందంటూ ప్రశ్నించాడు. ఆమెను ఎత్తుకొచ్చిన వైనం అంతా చెప్పాక “ఛీ! ఇంత దుష్టురాళ్లు, ముచ్చట కోసం ఏమైనా చెయ్యగలరు ! ఎప్పుడైనా వారికి అలవాటైన నరమాంసం దొరక్కపోతే, పెంచిన వాళ్లనీ తినెయ్యగలరు. రాచపుట్టుక పుట్టి, ఇక్కడ మగ్గుతున్న ఈ చిన్నదాన్ని

కాపాడకపోతే, తన జాత్యాభిమానం - పౌరుషం దేనికి? నాకిచ్చి పెళ్ళి చెయ్యవా?" అని ముద్దుగా అడిగాడు. "ఈడూ - జోడూ బాగున్నారు" అంటూ వాళ్ల చేత దండలు మార్పించి, ఇద్దర్నీ ఏకాంతంగా ఆ మందిరంలో వదిలి అవతలికిపోయింది కంకాళి.

మూడురాత్రులు - మూడు పగళ్లు ఏకధాటిగా ఆమెని రతిసుఖంలో ఓలలాడించాక, రాక్షసి రాకతో సింహదమనుడు "పిన్నమ్మా! ఇంత మారుమూల ఒకదానివే ఇక్కడ దేనికీ? మీ అక్కదగ్గరకు వచ్చెయ్యరాదూ" అని అడిగాడు. మా ప్రాణాలు ఇక్కడే ఈ చిలకా - గోరింకల్లో ఉండగా మాకేం దిగులు? అని "అది అక్కడా - నేను ఇక్కడా ఉండి తీరాలి. ఈ అపారధనరాశులకు కాపలా ఉండొద్దూ?" అని తనకు తెలీకుండానే తామిద్దరి ప్రాణరహస్యాన్ని వెల్లడిచేసేసింది. ఆ తర్వాత.....

మరో మూడు రాత్రులు ఆమెకు రతిలో ఆనందాన్ని చవిచూపి, ఆ రాజకుమార్తె వృత్తాంతాన్ని తెలుసుకున్నాడు సింహదమనుడు. వాటి ప్రకారం ఆమెకు అంతవరకు పురుషుడెలా ఉంటాడో కూడ తెలీదు. ఏడాది పసిపాపగా ఆ రాక్షసికి చిక్కాక, నరుడ్ని చూడటం కూడా అదే తొలిసారి. దానికి మోహిని అనే పేరు పెట్టిందట కంకాళి. పూర్తి అమాయకురాలు. ఆ గుహ తప్ప బయటిప్రపంచం ఎలా వుంటుందో తెలీని ఆమెను చూసి అతడికి చాలా జాలి కలిగింది. పదహారేళ్లొచ్చేంతవరకూ తనకూ అరణ్యం తప్ప ఇంకొకటి తెలీని తన స్థితిని తల్చుకున్నాడు. ఆ దుర్మార్గురాళ్ల బారిన పడి ఎన్ని పచ్చని జీవితాలు నాశనమైపోయాయో తల్చుకొనేసరికి, ఎక్కడలేని ఆగ్రహం అతడ్ని కమ్ముకుంది. నేర్పుగా వాళ్లని తుదముట్టించాలని నిశ్చయించుకున్నాడు కూడా! సింహదమనుడు తన వృత్తాంతమంతా మోహినికి చెప్తుంటే, ఆమె కళ్లు అంతంత చేసుకుని ఆశ్చర్యంగా వినసాగింది. ఆమెని మరో రోజు సుఖపెట్టి "పద! మనం ఇక్కడ్నుంచి తప్పించుకోవాలి. నువ్వు అవయవాల గదిలోంచి ఏడు జతల కనుగుడ్లున్న పెట్టె తీసుకురా! నేను పంజరంతో సహా గుహబయట గుర్రాన్ని సిద్ధం చేసి ఉంచుతాను" అని చెప్పాడు.

కంకాళికి పెళ్లి విందుమత్తు వల్ల గొప్ప నిద్ర పట్టిన సమయాన్ని

చూసి, మోహినీ – సింహదమనులు కనుగ్రుడ్ల పేటికతోను, రాక్షసి అక్కచెల్లెళ్ల ప్రాణాలున్న చిలకపంజరంతోను గుహ బైటికొచ్చారు. సిద్ధంగా ఉన్న గుర్రం ఎక్కి ఆకాశమార్గాన ప్రయాణించసాగారు.

దారిలో ఒక చోట మజిలీ చేయగా, ఆ అడవిలో ఒక సింహం వాధి మీదకు దూకేసరికి, మోహినిని అక్కడే వదిలి దాన్ని తరుముతూ వేరే రాజ్యపు సరిహద్దుల వరకూ వెళ్లాడు గాని సింహం మాయమైపోయింది.

ఆ రాజ్యంలో రాజకుమార్తె కాంచనమాలను ఆమె తండ్రి ప్రతాపరుద్రుడనే రాజుకు ఇవ్వగా, పెండ్లాడాడు సింహదమనుడు. ఆ రాజుకు పుత్ర సంతానం లేకపోవడంతో, అల్లుడికే రాజ్యభారం అప్పగించగా, ఆ ధ్యాసలో పడి గతం విస్మరించాడు అతడు.

## మోహిని కథ

"గోపా! ఆ కథ అలా ఉండనీ! అక్కడ చెట్టు క్రింద సేదతీరుతూ ఉండగా హఠాత్తుగా దాడి చేసిన సింహాన్ని తరుముతూ వెళ్లిన తన భర్త ఎంతసేపటికి తిరిగి రాకపోవడంతో, అతడి కోసం ఎదురుచూస్తూ, అన్ని దిక్కులు పరికిస్తూ, ఎలాగో ఆ రాత్రి తెల్లవారించింది.

అతడు వెళ్లిన దారిలోనే కొంతదూరం నడిచి, అతడొచ్చి మళ్లీ తనని వెతుక్కుంటాడేమో అనుకుని, ఆ చెట్టు కిందకే తిరిగి చేరింది. ఇంతలో కొందరు దొంగలు అటువైపుగా వచ్చి, ఆమె దగ్గరున్న బంగారం – ఆభరణాలు దోచుకుని, తాము కొల్చే అమ్మవారికి బలివ్వడానికి ఆమెను కట్టేసి తమతో తీసుకుపోయారు.

ఆమెను బలివ్వబోతూండగా, వారిలో ఒకడు ఆమెను పెళ్లాడతానంటూ వాదం ప్రారంభించేసరికి, అది విన్న మరొకడు "నాకు మాత్రం దీనిపై వలపులేదనుకున్నావా?" అంటూ ప్రతివాదానికి దిగాడు.

అది చిలికి చిలికి గాలివానలా పెద్ద వివాదంగా మారింది. ఎవరికి వారే, ఆమె 'తనదంటే – తనదని' చివరికి ఒకర్నొకరు చంపుకున్నారు.

అందరూ అలా మరణించగానే, ఆమెకేం చెయ్యడానికీ పాలుపోక, అక్కడకు దగ్గర్లో ఉన్న గుడిలో ఆ రాత్రి తలదాచుకోగా, మర్నాడు ఉదయం

అక్కడికొచ్చిన ఆలయపూజారి ఆమె కథ విని జాలిపడి, తన ఇంట ఆశ్రయమివ్వడానికి సిద్ధపడ్డాడు.

ఆమెను తన వెంట తీసుకెళ్లగా, పరమ గయ్యాళి అయిన అతని భార్య "ఓహో! అందంగా ఉందని దీన్ని పట్టావన్నమాట! ఏవేవో కట్టుకథలు చెప్పకు. ఇప్పటికిది ఎందర్ని మార్చిందో!" అంటూ అనరాని వినరాని మాటలంటూంటే సభ్యత గలిగిన మోహినీ - పూజారీ చెవులు మూసుకున్నారు.

"అమ్మా! నువ్వేమీ అనుకోకు. అది గయ్యాళిది. నువ్వు నాకు కూతురితో సమానం! నా భార్య మాటలు పట్టించుకోక, నీవీ ఇంట్లో యథేచ్ఛగా సంచరించు!" అనడంతో అక్కడ అవసరమైన పనులు చేస్తూ, నిరంతరం సింహదమనుడినే తల్చుకుంటూ కాలక్షేపం చెయ్యసాగింది.

నిజానికి ఆ పూజారి భార్యకే జారత్వం ఉంది. ఆమెకో ఇద్దరు విటులున్నారు. ఒకనాటి అర్ధరాత్రి మోహిని, వాకిట్లో అనుమానాస్పదంగా సంచరిస్తున్న కంసాలి విటుడ్ని చూసి 'దొంగ-దొంగ' అంటూ అరిచింది. పూజారి దీపం పట్టుకొచ్చివాడ్ని గుర్తించి, తన భార్య కోసం వచ్చిన వాడని అర్థమయ్యేసరికి - ఆనాటి నుంచీ ఏదో ఒక నెపం మీద భార్యని దండించసాగాడు.

మోహిని వల్లనే తన గుట్టు రట్టయిందని, ఆమెను చంపడానికి పూజారి భార్య ప్రయత్నించసాగింది. పూజారిని వంచించి విటుడు ఒకనాటి రాత్రి వారి పడకటింట్లో మంచం కింద దూరాడు. ఆ విటుని ఉనికి తెలీకుండా దీపం వత్తిని బాగా తగ్గించేసింది పూజారి భార్య.

ఆ రోజు సాయంత్రమే ఆమె చేసిన లడ్డుండల్లోని కొన్నిట్లో విషంని కలిపింది. అవి గుర్తుగా ఒక గిన్నెలో ఉంచింది. మోహినికి ఇవ్వాలనుకుని వంటింట్లో పనిసాయం చేస్తూ ఆ ఉండలను విషంలేని ఉండల మీద పడేసి, గిన్నె కడిగి మరోపని నిమిత్తం తీసుకువెళ్లింది మోహిని. ఆ సంగతి పూజారి భార్యకు తెలీదు. భర్త నిద్రపోయేంతవరకు విటుడ్ని మెలకువగా ఉంచడానికి,

ఆ కొద్ది చీకట్లో చేతికందిన లడ్లు చెంగుచాటున తీసుకొచ్చి మంచం కింద ఉన్న విటుడికి అందించింది. అతడు అవి తిని మరణించాడు.

తెల్లారుఝామున పూజారి ఆలయానికి పోగానే, కంసాలి విటుడ్ని లేపబోగా అతనిలో చలనం లేకపోయేసరికి పొరబాటు ఎక్కడ జరిగిందో అర్థంకాక పూజారి భార్య దుఃఖం చేత - భయం చేత ఏడవసాగింది. అంతలో రెండో విటుడైన కోమటి రాగా, అతడికి ఈ సంగతి చెప్పి, యుక్తి చేత రక్షించమన్నది. అతడు పిరికితనం కొద్దీ ఒక కుయుక్తి పన్నాడు. మోహిని మంచం కిందకి సాయం పట్టి కంసాలి శవాన్ని ఈడ్చేశాడు. బాగా తెల్లారాక, పూజారిభార్య వీధుల్లో నానా రభసా చేసి, తన ఇంట దాపురించిన ఆ టక్కులాడి విటుడ్ని తెచ్చి రోజూ కులుకుతోందని - గుట్టు బైటపడుతుందనుకొని ఆ పూట చంపేసిందని గోల చేసేసరికి రాజభటులొచ్చి, ఆమెను "నేరం చేశావా?" అని అడగ్గా ఆమె ఎలాగూ చావాలని నిర్ణయించుకుని ఉండడంతో, నేరం అంగీకరిస్తున్నట్లుగా మౌనంగా ఉండిపోయింది. నేరస్తురాలిగా ముద్రపడ్డ మోహినీ ఒప్పుదలను బట్టి న్యాయాధికారి ఇంకేమి విచారించక, ఆమెను ఉరితీసేయవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఒకింతసేపు ఆగిన మణిసిద్ధుడు, "గోపాలా! ఆనాడు సింహ దమనుడు ఆకాశమార్గాన వస్తూ - వస్తూ క్రీడించిన మణిమంజరి గుర్తుంది కదా! ఆమె గర్భం దాల్చి యజ్ఞదత్తుడనే కుమారుని కన్నది. ఆ రాజ్యం అతడికి తాత వల్ల సంక్రమించింది. అతడు యుక్తాయుక్త విచక్షణ నిపుణుడైనందున, న్యాయాధికారి తీర్పులో లోపం ఉందని పసిగట్టాడు. "స్త్రీకి సాధారణంగా విటుడి మీద ప్రేమ, భర్తమీద కన్న అధికంగా ఉంటుంది. అటువంటి స్థితిలో తాను మోసపోవడమో - భర్తను మోసం చేయడమో జరగాలి కాని, అందుకు భిన్నంగా విటుడు మరణించడం జరగదు" అని ఆలోచించి అనునయంగా, మోహిని చెంత చేరి విషయం రాబట్టగా, ఆమె తన వృత్తాంతమంతా చెప్పింది.

అంతా వినేసరికి, తనకు పినతల్లి అవుతుందని అతడికి అర్థమై, తన వృత్తాంతమంతా వివరించి "అమ్మా! నేను నీకు పుత్రసమానుడిని.

మణిమంజరి నా తల్లి. నీ భర్త అయిన సింహదమనుడే నాకు తండ్రి. తండ్రిగార్ని వెతికిస్తాను. నీ కర్మ పరిపక్వమైనట్లే నాకు తోస్తోంది. కనుకనే నీ పుత్రుడి వంటి నన్ను చేరుకున్నావు. నిశ్చింతగా ఉండు" అని ఆమెను సకల రాజలాంఛనాలతోను అంతఃపురానికి తీసుకువెళ్లి సేవలు చేశాడు. పూజారి భార్యను నిగ్గదీసి అడిగేసరికి నిజం తేలింది. ఆమెను శిక్షించబోగా "నాయనా! బ్రాహ్మణుల్ని శిక్షించడానికి మన మెంత వాళ్లం? ఆ శిక్షేదో పైవాడే చూసుకుంటాడు" అని వదిలిపెట్టేయమన్నది. తల్లులిద్దరూ ఒకరికొకరు కష్టసుఖాలు చెప్పుకుంటూండగా, వారి దుఃఖ భారం చూడలేక - వారిద్దరి చిత్రపటాలను రాయించి వాటిని దేశ దేశాలకు పంపించి ఎవరైతే ఆ చిత్రపటాల్ని తదేకంగా చూసి ఏదైనా గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తారో అటువంటి వారిని తన దగ్గరకు తీసుకురమ్మన్నాడు - యజ్ఞదత్తుడు.

అది అలా ఉండగా.......

అక్కడ సింహదమనుడు కాంచనమాలతో సుఖిస్తూ, సర్వం మర్చిపోయాడు. చివరికి తాను ఎక్కడ్నుంచి వచ్చాడో - ఎందుకు ఎటు వెళ్తున్నాడో కూడా రాజ్యభారంలో విస్మరించాడు.

ఒకరోజు, అడవిలో దొరికాయంటూ, కొందరు చెంచులు చిలుకల పంజరాన్నీ, పెట్టెను సింహదమనుని పరం చేయగా, అప్పుడు గుర్తొంచ్చిందతడికి - తానెందుకు బయల్దేరిందీ, ఇప్పుడెక్కడ తేలిందీ.

దాంతో సింహదమనుడు, రాజ్యాన్ని ప్రధానికి అప్పగించి, కాంచనమాలను ఒప్పించి, దేశాటనకు బయలుదేరి బైరాగిలా తిరుగుతూంటే, ఒకచోట చిత్రపటాలతో ఎదురైన యజ్ఞదత్త భటులు అతడికి కనిపించారు. వారిని గుర్తుపట్టి, సింహదమనుడు శోకిస్తుండగా, రాజభటులు అతడ్ని బలాత్కారంగా పట్టుకుపోయి యజ్ఞదత్తుని ఎదుట హాజరుపరచారు.

యజ్ఞదత్తుడాతనిని గుర్తించి, తన వృత్తాంతం చెప్పి మోహిని మణిమంజరులను చూపించగా, సింహదమనుడు ఆనందం పట్టలేక పోయాడు. ఆనాడు తాను అతని అంగీజేబునుంచి తీసిన అసలు ఉత్తరాన్ని రాక్షసి ఏం రాసిందో చదివి వినిపించి, ఆ ఉత్తరం అతని చేత బెట్టేసరికి "నాకు ఇంత ఉపకారం చేసిన నిన్ను నానా కష్టాలు పాలు చేశాను మంజరీ!" అంటూ శోకించాడు సింహదమనుడు.

అంతేగాక, అంధులై తనను పదహారేళ్లు సాకి అష్టకష్టాలకు ఓర్చి పెంచిన తన ఏడుగురు తల్లులనూ గుర్తుకు తెచ్చుకుని, శీఘ్రంగా విజయపురానికి పయనమయ్యాడు. తన భార్యలతో పాటు తల్లుల వద్దకు చేరి పెట్టెలోని కనుగ్రుడ్లు తులసిరసంలో ముంచి, అంటించి వారికి దృష్టి భాగ్యాన్ని ప్రసాదించాడు.

అప్పటికే శత్రుంజయుడికి, సింహదమనుడికి వార్తలన్నీ చేరాయి. రాజొక బుద్ధిమంతుడ్ని సింహదమనుడి చెంతకు రాయబారం పంపగా, "శత్రుంజయుడ్ని ఇక్కడకు తీసుకురండి...కొన్ని విషయాలు మాట్లాడాలి" అని వారిచేతనే కబురుచేశాడు.సింహదమనుడేదో వ్యూహం పన్నుతున్నాడని భయపడ్డ శత్రుంజయుడు, ఎట్టకేలకు ధైర్యంచేసి సంధిమాటలు మాట్లాడాలని అతడ్ని ప్రసన్నం చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

శత్రుంజయుడు, కొంతసేనను వెంటబెట్టుకు వెళ్లగా సింహదమనుడు సాదరంగా ఆహ్వానించి, అతని దుష్కృత్యాలను అతని నోటనే చెప్పించాడు. గర్భవతులైన ఏడుగురు భార్యల్నీ కనుగ్రుడ్లు పీకించి నిర్దాక్షిణ్యంగా అడవిలో వదిలేసిన తన పాపానికి నిష్కృతి లేదని అతడు వాపోతూంటే, వారందరినీ తన తల్లులుగా రాజు ఎదుటకు రప్పించాడు. వారికి కళ్లు ఎలా తెప్పించిందీ చెప్పేసరికి, దైవఘటనకు ఆశ్చర్యపోయి, కొడుకు - కోడళ్ల మన్ననలకు ముగ్ధుడై ఎంతో పశ్చాత్తాపంతో కుమిలిపోసాగాడు. అప్పుడు అసలు విషయం తెలిసినందున, శత్రుంజయుడు తాను ఇంతకాలం భార్యగా భావిస్తున్నది రాక్షసి అని గ్రహించాడు.

సింహదమనుడు చిలక పీక నులిమేసరికి ఆ రాక్షసి చచ్చిపడింది. దాని శరీరాన్ని మూడు రోజుల పాటు ముక్కలుగా నరికి దహనం చేసినా తలమాత్రం ఏం చెయ్యాలో తోచక, అడవుల్లోకి బండ దొర్లించినట్లుగా దొర్లించారు. తర్వాత కాంచనమాలను రప్పించి ముగ్గురు భార్యలతో సుఖంగా రాజ్యం చేశాడు సింహదమనుడు.

"గోపాలా! అదీ నువ్వు చూసిన పర్వతాకారపు పుర్రెకథ" అని కథ ముగించాడు మణిసిద్ధుడు. వారిద్దరూ ప్రయాణమై తదుపరి మజిలీ చేరుకున్నారు.

# కాశీ మజిలీ కథలు

## 10వ మజిలీ

పదవ మజిలీ ఒక రాజధాని వలె ఉంది. గోపాలుడు, మణిసిద్ధుడు నడుస్తున్నారు. వాళ్లిద్దరూ అలా విశాలమైన ఓ వీధిలోంచి పోతూండగా నడివీధిలో ఇనుపస్తంభం మీద ఒక బ్రాహ్మణుడు నిలబడినట్లుగా కనబడింది. అతడ్ని చూసి గోపాలుడు, ఆపైన సిద్ధుడ్ని నడవనివ్వకుండా అడ్డుపడి "స్వామీ! దీన్ని మీరు చూశారా! ఇంత పొడవైన ఉక్కు స్తంభం మీద నిలబడిన ఆ బ్రాహ్మణుడు కదలకుండా ఈ పట్టణం వింతల్ని చూస్తున్నాడా ఏమి? ఇతడి వృత్తాంతం వివరించండి" అని కోరగా, మణిసిద్ధుడు తలపైకెత్తి చూసి "ఓరీ! దీనిమీద ఉన్నవాడు నిజంగా మనిషి అనుకుంటున్నావా ఏమి? అదొక పోతపోసిన విగ్రహం! దాని కథ భోజనమయ్యాక చెప్తానులే" అని నడవబోయాడు.

అప్పుడా గోపాలుడు, మణిసిద్ధుని పాదాలమీద పడి, "అయ్యా! నడిచిన కాళ్ల నొప్పులు తీరేదాకా, మీ పాదాలు వొత్తగలను గాని, ఇక్కడే కూర్చొని నాకు దీని వృత్తాంతం చెప్పండి. వినాలన్న కుతూహలం మా చెడ్డ వేడుకగా ఉంది" అని నిర్బంధించాడు. వాడి ఆసక్తికి మెచ్చుకుని అక్కడనే కూర్చొని మణి ప్రభావం వల్ల ఆ వృత్తాంతం అంతా తెలుసుకుని, వాడికి ఇలా చెప్పసాగాడు మణిసిద్ధుడు....

### సోమశర్మ కథ

కొండపల్లి అనే అగ్రహారంలో సోమశర్మ అనే అతి బీదబ్రాహ్మణుడుండేవాడు. అతడికి ఎన్ని పాట్లుపడినా, ఏ వ్యాపారమూ లాభించలేదు. ఒక్కకాసైనా సంపాదించలేకపోయాడు. ఇరుగు పొరుగుల వారి ఐశ్వర్యం చూసి ఈర్ష్యపడుతూ, ఎంతో ఖేదం అనుభవించసాగాడు.

పురుషుడి ఐశ్వర్యానికైనా - దరిద్రానికైనా స్త్రీయే మూలం అని గొప్ప నమ్మకం ఉన్న ఆ బ్రాహ్మణుడు, కొన్నాళ్లు భార్యకు దూరంగా ఉంటూ దేశాంతరం వెళ్లి ధనం సంపాదిస్తానని - దారిలో తినడానికి ఎక్కువకాలం నిలవ వుండే అరిసెలు చేసి ఇమ్మని - అందుకు అవసరమైన సరుకులను కోమటి దగ్గర మంగళసూత్రం అమ్మేసి తెమ్మని చెప్పాడు.

భర్త ఆజ్ఞ తు.చ. తప్పక పాటించే ఆ పతివ్రత, భర్త ఎలా చెప్పాడో ఇప్పుడు అలాగే చేసింది. ఒక్క అరిసే అయినా రుచి చూడక వాటిని అలాగే మూటకట్టి ఇంట్లోంచి బైటకు నడిచాడు సోమశర్మ. నిజానికి, అరిసెల్లో సువాసన కోసం జాజికాయ, జాపత్రి ఇవ్వడానికి బదులు తొందరలోను - కనుచీకట్లు పడే సమయం కావడం వల్లనో కోమటి వసనాభిదుంప ఇచ్చేయగా, అది తెలీని ఇల్లాలు సువాసన ద్రవ్యంగా దానినే భావించి నూరి, పిండివంటలు చేసి ఇచ్చింది.

జాము పొద్దెక్కేసరికి, ఒక చెరువు కనిపించింది. స్నానం చేసి అరిసెలు తిందామని ఆ మూటను చెట్టుకొమ్మకు తగిలించి స్నానం చేయసాగాడు. అంతలో ఇరవై నాలుగుమంది దొంగలు గాడిదల మీద చాలా ధన కనక ఆభరణాలు మూటలుగా కట్టి పట్టుకొచ్చి, చెట్టుకింద రాశిగా పోసి, ఎంతో ఆకలిగా ఉందని, కనీసం మంచినీళ్లు అయినా తాగాలని భావించి చెరువులోకి దిగగా, సోమశర్మ సంధ్యావందనం చేసుకుంటూ కనిపించాడు. తమ రహస్యం అతడెక్కడ బయటపెడతాడోననే భయం చేత, వాళ్లు అతడ్ని చంపబోగా, మొండిధైర్యంతోనైనా వాళ్లను ఎదుర్కొందామని అనుకున్నాడు. ఎంతటి వాడినైనా ఆహారపదార్థాలతో మంచి చేసుకోవచ్చునన్న ఒక నీతి సూత్రం అతనికా క్షణంలో గుర్తొచ్చింది.

"ఏమయ్యా! నేను పండితుడ్ని. జ్యోతిష్యుడ్ని! నన్ను అనవసరంగా చంపితే, మీకేం వస్తుంది? మీరు ఇక్కడికి వస్తారనీ - ఆకలిమీద ఉంటారని, నా జ్యోతిష్యం ప్రభావంతో గ్రహించి, సరిగ్గా మనిషి కొక అరిసె ఉండేలా జాగ్రత్త పర్చి తెచ్చి, అదుగో! ఆ చెట్టుకొమ్మకు తగిలించి ఉంచాను. ఈ బీద బ్రాహ్మణుడు అంతకంటె మీకేమి ఇవ్వగలడు" అనేసరికి, ఒక దొంగ

చెట్టుకొమ్మకు తగిలించి ఉన్న మూట విప్పి చూడగా - అందులో సరిగ్గా ఇరవైనాలుగు అరిసెలే ఉన్నాయి.

అతని దివ్యజ్ఞానానికి ఆశ్చర్యపోయి, సోమశర్మనే తమ గురువుగా ఉండమని కోరారు. సరే! అన్నాడతడు. వారు ఆ చెరువులో స్నానం చేసి కత్తులన్నీ ఒక చోట కుప్పగా పోసి, ఒక్కొక్కరు ఒక్కొక్క అరిసె తిని, నీళ్లు తాగి పడుకున్నారు. అరిసెల్లో ఉన్న విషం తలకెక్కి నిద్రలోనే ప్రాణాలు వదిలేశారు.

వారి మరణానికి ఆశ్చర్యపోయినా, సోమశర్మ చాలా సంతోషించాడు. దైవమే నాకీ ద్రవ్యం ప్రసాదించాడు. కాని, ఈ ధనాన్ని అంతటినీ ఎలా పట్టుకెళ్లడం? ఎవర్నైనా సాయం పిలుద్దామంటే భాగం అడుగుతారు. చూడబోతే ఇది రాజుగారి ధనంలా ఉంది. వాళ్లకి తెలిస్తే నా పని పట్టేస్తారు. ఏం చెయ్యాలి?" అని ఆలోచిస్తూ ద్రవ్యం చుట్టూ తిరగసాగారు.

అంతలో రాజభటులు వస్తున్నారు. సోమశర్మ ధైర్యం తెచ్చుకుని పహరా కాయసాగాడు. "ఎవరు నువ్వు? ఈ ధనం సంగతేమిటి?" అని అడిగారు వాళ్లు.

"మీరెవరు? ఇక్కడికి దేనికి వచ్చారు?" అని ధైర్యంగా ప్రశ్నించాడు సోమశర్మ.

"మేము భూరిశ్రవుడనే రాజభటులం! ఈ ధనం మా కోట నుంచి దొంగలు దొంగిలించారు" అన్నారు వాళ్లు.

"నేను సోమశర్మ అనే బ్రాహ్మణుడిని. నాకు దైవబలం ఉంది. భూతభవిష్యద్వర్తమానాలు చెప్పగలను. ఈ దొంగతనం గురించి ముందు తెలిసే ఇక్కడికి వచ్చాను. ధనం పంచుకుంటున్న దొంగలను చంపేశాను. మీరంతా అశ్రద్ధగా ఉండబట్టే కదా - ఈ దొంగతనం జరిగింది - నేను రక్షించకపోతే దొంగలే ధనం యావత్తు ఎత్తుకుపోయేవారు. దీన్ని నేను తీసుకెళ్లనివ్వను. మీ రాజుగారికి చెప్పి వారినిక్కడికి తీసుకురండి! " అంటూ అతడు హూంకరించేసరికి, వాళ్లు వెళ్లి రాజుకు చెప్పారు.

అతడు సైన్యంతో సహా వచ్చి, సోమశర్మ ధనరాశి చుట్టూ పహరా కాస్తూండటం చూసి, "అయ్యా! తమరెవరు? ఇక్కడికెలా వచ్చారు? ఇరవై నాలుగుమంది దొంగల్నీ ఏ విధంగా చంపారు? నా పట్ల తమకింత దయ ఏల కలిగింది?" అని అడిగాడు.

సోమశర్మ ఏమాత్రమూ జంకక, "నా మహిమ నేను చెప్పుకోవడం దేనికి? అవిగో దొంగల కళేబరాలు. ఇవి వారి ఖడ్గాలు. ఇదిగో మీ ధనం. మీ భటులిక్కడికి వచ్చారు. ఇంత పనికి మాలిన పరిచారకుల్ని పెట్టుకున్నారేమిటి? క్షణం దాటితే అంతా పోయేది కదా! చూసుకోండి! ఒక్క నల్ల పూస అయినా తరిగిందేమో!" అన్నాడు.

"మీ వద్ద ఆరులక్షల సేన ఉన్నట్టు తెలిసింది. అంతమది వృథా! రెండు లక్షల మందిని తగ్గించి, వారి జీతం మాకు ఇప్పించండి!" అన్నాడు సోమశర్మ.

రాజు అలాగే చేశాడు. సోమశర్మ భార్యని పిలిపించుకుని, ఒకప్పుడు తాను వాగ్దానం చేసినట్లుగా ఆమెకు అన్నీ అమర్చాడు.

రాజుగారి దివాణంలోని ఉద్యోగులందరినీ తీసేయించడంలో వాళ్లందరికీ అతడంటే అసూయ ఏర్పడింది. కాని అతడినేమీ చేయలేకపోయారు. అతని దగ్గర మంత్రశక్తులున్నాయిని ప్రచారం జరిగింది.

ఇక, రాజుగారిచేత తీసేయబడిన రెండు లక్షల మంది సైనికులూ శత్రురాజు శిబిరంలో చేరిపోయారు.

ఇలా ఉండగా......ఒకరోజు కొందరు వచ్చి; మా గ్రామానికి సింహం ఒకటి వచ్చి, మనుషుల్నీ - జంతువుల్నీ తినిపోతోంది. మాకు ప్రాణభయంగా ఉంది" అని మొరపెట్టుకున్నారు.

రాజు సింహాన్ని చంపడానికి యోధుల్ని పంపబోగా, మంత్రి సోమశర్మ మీదున్న పగ తీర్చుకుందామని - అదే తగిన అవకాశం అని "మన దగ్గర సైన్యం అంతంత మాత్రంగానే ఉంది. దొంగల బారి నుంచి మనల్నీ మన ద్రవ్యాల్నీ ఉద్ధరించిన మహానుభావుడు ఉండనే ఉండగా,

మనకి చింతదేనికీ? ఆయన్నే పంపండి" అని సింహాన్ని వధించడానికి అతడ్ని పంపించడానికి పురిగొల్పాడు.

రాజాజ్ఞ అయ్యాక, సోమశర్మ మాత్రం ఏం చెయ్యగలడు? దేవుడి మీద భారం వేసి, ఆ దేవుడి అండ వుండగా జరగనిదేమిటి? అని ధైర్యం వహించి, ఆనాడు దొంగల దగ్గర్నుంచి తాను స్వాధీనం చేసుకున్న 24 కత్తుల్నీ తీసుకుని, సింహం తిరిగే ప్రాంతంలో ఒక తాటి చెట్టు మీదికి చేర్చి తానూ  కూర్చున్నాడు.

సింహం కొన్ని జంతువుల్ని భక్షించి, తోక ఊపుతూ అక్కడకు వచ్చింది. అది చెట్టు పైకి చూసి నోరు తెరిచినపుడల్లా, సోమశర్మ ఒక్కో కత్తిని జారవిడువసాగాడు. సింహం ఆ 24 కత్తి దెబ్బలకు బాగా గాయపడి మరణించేసరికి, దాన్ని నరికి, శరీరమంతా రక్తం పూసుకుని, భీకరంగా తయారై, దానిచుట్టూ తిరుగుతూ రాజుకు కబురుచేశాడు.

రాజు వచ్చి పొంగిపోయి, సోమశర్మను పొగిడి ఏం కావాలో కోరుకోమనగా "రాజా! మీకు నష్టం వచ్చేలా ఏమీ కోరను. మన సంస్థానంలో పనిపాట్లు లేని సైన్యం నాలుగు లక్షలుంది. వారిలో రెండు లక్షల మందిని తగ్గించండి. ఆ జీతాలు నాకు ఇవ్వండి! చాలు!" అన్నాడు.

రాజు అందుకు అంగీకరించాడు. సోమశర్మ మీద ఆరాధన పూర్వం కంటే అధికమైంది అతడికి.

సోమశర్మ సింహం చర్మాన్ని , కత్తులని భద్రపరిచాడు.

ఆ తర్వాత రాజాస్థానానికి సంబంధించిన సర్వకార్యాలూ అతని చేతిమీదుగానే జరగసాగాయి. మంత్రి అసూయ ఇంకా పెరిగిపోయింది. రాజుచేత తీసివేయబడిన ఈ సైనిక బృందం కూడా శత్రుపక్షం చేరింది. అప్పుడు శత్రురాజు భూరిశ్రవుడి దగ్గరకు యుద్ధపత్రిక పంపాడు. శత్రురాజు కయ్యానికి కాలు దువ్వుతున్నాడన్న వార్త భూరిశ్రవుడ్ని వణికించి, మంత్రికి కబురంపగా, ఒక దినం వ్యవధికోరి, అతడొచ్చాడు.

"రాజా! యుక్తాయుక్తాలు తెలుసుకోకుండా ఉద్యోగాలిచ్చే రాజుకి ఆపదలు కాక ఇంకేం వస్తాయి? మంగలి మంత్రి కథలా ఉందిప్పుడు నీ పరిస్థితి." అన్నాడు మంత్రి. ఆ కథ ఏమిటో చెప్పమన్నాడు భూరిశ్రవుడు. మంత్రి చెప్పసాగాడు.....

## మంగలి మంత్రి కథ

పూర్వం ఒక రాజుకు ఒకానొక మంగలి మీద గొప్ప వాత్సల్యం కలిగింది. అందుక్కారణం – ఆ రాజుకు నిద్రాభంగం కలగకుండానే అతడు నున్నగా క్షవరం చేసి వెళ్తూండటమే! రాజు లేచి ముఖం కడుక్కోబోతూ, అంత నైపుణ్యంగా – నున్నగా ముఖక్షవరం చేసిన మంగలి ప్రజ్ఞకు ఆశ్చర్యపడి "నీకేం కావాలో కోరుకో" అన్నాడు. చిరకాలంగా తనకు మంత్రి పదవి మీద కన్ను ఉందని అతడు చెప్పడంతో, రాజు పాత మంత్రిని తీసేసి ఆ స్థానంలో మంగలిని మంత్రిగా నియమించాడు.

ఆ వార్త శత్రురాజులకు తెలిసింది. అయితే ఆ తొలిమంత్రి చాకచక్యం వల్ల శత్రురాజులెవరూ కన్నెత్తి చూడలేకపోయే ఆ రాజ్యానికి, ఒక మంగలి మంత్రి కాగానే ముట్టడించేశారు- వరుసగా ఐదారుగురు రాజులు.

ఈ రాజు అలవాటుగా "ఇప్పుడేం చేయాలి మంత్రీ?" అని అడగ్గా, "అయ్యా! నా తల్లికి నేనొక్కడ్నే కొడుకుని, మీరూ అంతే! బతికుంటే బలుసాకు తినొచ్చు! ఈ శత్రురాజుల బెడద పడలేం! నా దగ్గర మాతాత ఇచ్చిన మంగలి పొది ఇంకొకటి నిరుపయోగంగా పడి ఉంది. మీరు అది పుచ్చుకోండి. ఇద్దరం మంగలివేషాల్లో నగరం దాటేద్దాం! ఏ వూరికి పోయి, రోజుకో నలుగురికి క్షవరం చేసినా పొట్ట గడవకపోదు. దీనికింత విచారం దేనికి?" అని తనకు అలవాటైన పనిగురించే అతడు రాజుకు ఉపాయం చెప్పడంతో, రాజు "నీకు మంత్రిత్వం ఇవ్వడం నాది బుద్ధిపొరపాటు' అని పూర్వపు మంత్రినే రప్పించి, క్షమించమని కాళ్లా వేళ్లా పడి రక్షించమన్నాడు.

కృతజ్ఞత గల ఆ మంత్రి రాజుకు అభయం ఇచ్చాడు. "రాజా! మంగలిమీది అసూయతో, నేనూ వారి పక్షం చేరతాననుకుని శత్రురాజులు నాకు పిలుపునిచ్చారు. కోట ముట్టడిలో నా సహాయాన్ని కోరారు. అయితే చూడండి! నా బుద్ధి చాతుర్యంతో ఈ రాజ్యం మీద శత్రువుల్లో ఒక్క ఈగనైనా వాలనివ్వను" అని శపథం చేసి, వారిలో వారికి కలహం పెట్టి ఒకర్నొకరు పొడుచుకుని మరణించే వ్యూహం పన్నాడు. అతడూహించినట్లుగా జరిగింది. ఒకర్నొకరు నరుక్కున్నారు. ఆ రాజ్యానికి ఆరేడు శత్రురాజుల బెడద తప్పింది.

అలాగ నువ్వు ఆ బ్రాహ్మడికి పాత్రతనెరిగి, చక్కని అగ్రహారాలో - మడిమాన్యాలో దానం చెయ్యక సేన తగ్గించుకుంటూ పోయావు. అదీ చాలదన్నట్లు మా అధికారాలు కుదించావు. ఇప్పుడేమో యుద్ధంరాగానే మా సలహా కావలసి వచ్చిందా? రెండు లక్షల సేనతో ఏం యుద్ధం చేస్తాం? అవతలి పక్షంలో మన సేనలే నాలుగు లక్షలు చేరాయి. ఇక వారి స్వంత బలగంతో కలుపుకుంటే సేనావాహిని పదిలక్షలకు పైగా ఉంది. శత్రువుల్ని ఢీకొనడం కష్టం. దీనికంతటికీ కారకుడైన సోమశర్మనే సంప్రదించు! అయితే నేను నా విశ్వాసాన్ని, అతడు మరణించాడనే ప్రకటించదల్చుకున్నాను" అని నిర్మొహమాటంగా చెప్పేశాడు.

రాజు సోమశర్మని పిలిపించాడు. అయితే, మంత్రి చెప్పిన మంగలి మంత్రి కథ ప్రకారంగా ఇక్కడ సోమశర్మ అధైర్యం ప్రకటించలేదు. సరికదా - ధీమాగా " నా వంటి బంటు మీకుండగా మీరు చింతిస్తారేం ప్రభూ? మీరు రాచనగరిలో హాయిగా వినోదిస్తూండండి......నాకు ఒక్కరోజులో శత్రువుల్ని తుదముట్టించి వస్తాను. దొంగల్ని చంపినపుడు, సింహాన్ని ఎదుర్కొన్నప్పుడు నాకు ఎవరి సాయం ఉందో, వారి సహాయం నాకు చాలు!" అంటూ రాజును ఉత్సాహపరిచాడు.

రాజు ఈ మాటలకు ఎంతో సంతోషించి, నిశ్చింతగా ఉన్నాడు. సోమశర్మ, ఆ రాత్రే శత్రువులు పన్నిన చక్రవ్యూహానికి దగ్గర్లో ఒక గొయ్యి త్రవ్వించి, సింహం చర్మం - కత్తులతో, తాను రహస్యంగా ఆ గోతిలోకి ప్రవేశించాడు. అర్ధరాత్రి శత్రుసేనలు నిద్రలో ఉండగా, గోతిలోనుంచి

పైకొచ్చి "పొడు! చూస్తావేం.....పొడిచెయ్" అంటూ గట్టిగా కేకలు వేస్తూ సింహం చర్మాన్ని ఏనుగుల మీదకి విసిరాడు. ఆ చర్మం ఇంకా పచ్చివాసన వదల్లేదు. ఏనుగులకు సింహం కలలో కొచ్చినా జడుసుకుంటాయి. ఇక సరాసరి తమ మీద దూకిందేమో అనుకున్న ఏనుగులు ఆ చీకట్లో కట్లు తెంచుకుని, వారి సేనల గుడారాలనే కలియద్రొక్కసాగాయి. ఏనుగుల కలకలంతో శత్రుసైన్యాలకి జరిగిందేమిటో అర్థంకావడం లేదు. ఇంతలో గోతిలోంచి సోమశర్మ ఒకదాని వెంట ఒకటిగా కత్తులు కొన్ని చెల్లాచెదురుగా పైకి ఎగరేసి యుద్ధ వాతావరణాన్ని సృష్టించేసరికి, ఆ ఆ అల్లకల్లోలం చూస్తూ శత్రురాజు నిశ్చేష్టుడై నిలబడిపోగా, సోమశర్మ చాటుగా వెళ్లి ప్రక్కవాటుగా అతని శిరస్సు ఖండించాడు.

ఏనుగుల బీభత్స కాండలో శత్రుసైన్యం మొత్తం నుగ్గు - నుగ్గు అయిపోయింది. చావగా మిగిలిన వారు పారిపోయారు. రాజు మరణించాడని తెలిసి తెల్లవారేలోగా కొందరు చచ్చినవారినే నరికి, రక్తం పూసుకొని ఆ కళేబరాల మధ్య శివుడిలా రుద్రతాండవం చేస్తున్న సోమశర్మ గురించి ప్రజలు, భూరిశ్రవుడితో చెప్పగా, విజయం తమకే లభించినందున ఆ రాజు మహదానందపడిపోతూ, సోమశర్మ అన్నమాట నిలబెట్టుకున్నందుకు అతడ్ని ఘనంగా పురవీధుల్లో ఊరేగించి తన కృతజ్ఞత ప్రకటించుకున్నాడు. ఏం కావాలో కోరుకోమనగా "రాజా! నేను పనికి మాలిన సేనను తీసేయమన్నాను. అది నిజమే! అయితే కొలువులో మీకు సహకరించేవారినెవ్వరినీ నేను తీసేయమనలేదు కదా! నా పట్ల మీకున్న అపారమైన నమ్మకం వల్ల మీరే స్వయంగా తొలగించారు. ఇక - ఇప్పుడీ మిగతా రెండులక్షల సైన్యం కూడ అనవసరం" అనేసరికి బుద్ధిబలం లేని వాళ్లెందరున్నా ఒకటే అని గ్రహించిన భూరిశ్రువుడు సోమశర్మ మాట అక్షరాలా పాటించాడు. కృతజ్ఞత కొద్దీ చిరకాలం నిల్చేలా ఈ ఉక్కు స్తంభం మీద ప్రతిష్టించాడు. అదీ గోపాలా! మనం చూస్తున్న ఈ శిల్పం కథ. ఈ పట్నం ఇదే! కాలక్రమాన ఆ రాజ్యం అంతరించినా, విగ్రహం కనుక ఇలా మిగిలిపోయింది. అని కథ ముగించాడు మణిసిద్ధుడు.సత్రానికి పోయి, వండుకొని భుజించిన తదుపరి, కొంతసేపు విశ్రమించి, మళ్లీ పయనమై క్రమంగా పదకొండో మజిలీ చేరారు.

# కాశీ మజిలీ కథలు

## 11వ మజిలీ

పదకొండో మజిలీలోన అడవిలో ఒక చోట తలవెంట్రుకలు కలిగి ఉన్న శిలావిగ్రహాన్ని చూసి, ఆ గొల్లవాడు వింతపడిపోయి, ఆ విగ్రహం వృత్తాంతాన్ని చెప్పవలసిందని మణిసిద్ధుని అడగ్గా, మణివిశేషం చేత దాని వైనం అంతా గ్రహించి, ఆశ్చర్యపోతూ, ఆ యతిపతి ఇలా చెప్పసాగాడు......

### బుద్ధిసాగర, కామపాలుర కథ

కాంచీపురంలో విష్ణుచిత్తుడనే రాజుండేవాడు. అతనికి మంత్రి దీర్ఘదర్శి. తనకు తగిన కన్య లేదంటూ, ఆ రాజు చాలాకాలం పాటు అవివాహితుడిగానే ఉండిపోయాడు. ఒకరోజు దీర్ఘదర్శి "రాజా! మీరు పెళ్లి చేసుకోకపోతే, ఈ రాజ్యానికి వారసుడుండకుండా పోయే ప్రమాదం ఉంది. మీరు అతిలోకసుందరిని ఊహిస్తున్నారు. అసలు 'అందం' అనే దానికి హద్దు ఏది? ఎక్కడో ఓచోట సరి పుచ్చుకోవాలి! త్వరగా పెళ్లాడి వంశం నిలపండి" అని చెప్పాడు.

"మనం లోకంలో ఎందరో స్త్రీలని చూస్తున్నాం! అందగత్తె ఉంటే, శీలం ఉండదు. శీలం ఉన్నదానికి ప్రేమ ఉండదు. నాకు నిజంగా పెళ్లి చేయదల్చుకుంటే, శీలం - అందం- అనురాగం అన్నీ ఉన్న కన్యని చూడు! లేదా ఇలాగే ఉంటాను" అని తన మనసులో మాట స్పష్టం చేశాడారాజు. సరేనని మంత్రి, రాజు గారి చిత్రపటాన్ని చిత్రింపజేసి భటులచేత దేశదేశాలకూ పంపించాడు.

పాండ్యదేశ ప్రభువు కూడా, తన కుమార్తె సుశీల చిత్రపటాన్ని రాయించి, ఆమెకు తగ్గ వరుడిని వెతకమంటూ తన దూతలను పంపగా, ఇరు దేశాల భటులూ ఒకచోట కలుసుకున్నారు. ఒకరికొకరు తగిన వారని తలచి, ఆయా పటాలు మార్చుకొని తమ తమ దేశాలకు వెళ్లి, ఆయా చిత్రపటాలు తమ ప్రభువులకు అందజేశారు.

"సుశీల పేరు సార్థకం చేసుకొనేలా ఉన్న ఈ కన్య రూపంలో కూడా చాలా సౌందర్యవతి" అని ఆమె పట్ల అనురాగబద్ధుడయ్యాడు విష్ణుచిత్తుడు. అక్కడ పాండ్యరాజు కూడా విష్ణుచిత్తుని చిత్రపటం చూసి, తమ కుమార్తెకు తగిన వరుడితడే! అని నిర్ణయించుకున్నాడు.

ఇరుదేశాలనుంచీ ఒకర్నొకరు ఇష్టపడుతున్న వార్తలు నేపథ్యంలో అందిన పాండ్యప్రభువు సంతోషంతో తన కుమార్తె వివాహం నిశ్చయించాడు. సుశీల తాను అంతకాలం చదువుకున్న గురువును, గురుదక్షిణ సమర్పిద్దామని వెళ్లేసరికి, అతడామెను నీచబుద్ధితో చూసి, ఆమెనే వాంఛించాడు. "తండ్రి వంటి వాడివి - నాపై నీకు కోరిక తగదు." అని తాను తీసుకుని వెళ్లిన కానుకల పళ్లెం అక్కడ పెట్టేసి వెళ్లింది.

ఆమె తనను తిరస్కరించేసరికి, ఆగ్రహం - అసూయ జనించిన ఆ గురువు "నీ కాపురం సాగనిస్తానేమో చూడు!" అని పంతం పట్టాడు. కత్తితో వివాహం జరిగింది - వారి ఆచారం ప్రకారం.

ఈలోగా విష్ణుచిత్తునికి దగ్గరకు వెళ్లిన ఆ పండితుడు, సుశీల గురించి అనుమానం రేకెత్తేలా వ్యూహం పన్ని "ఆమెకు మూర్ఛరోగం ఉన్నదనీ - పాండ్యరాజు అది దాచిపెట్టి కూతుర్నిచ్చి కట్టబెట్టాడనీ" చాలా నేర్పుగా చెప్పి అతడి మనసు విరిచేశాడు.

నూతన వధువుగా, అత్తవారింట అడుగు పెట్టిన సుశీలకు నిరాదరణే ఎదురైంది. దీర్ఘదర్శి పట్ల ఆమెకు అపారమైన నమ్మకం గల్గినందున, తన భర్త ఏడాది గడిచినా తన ముఖం చూడకపోవడానికి

ఏమి కారణమో తెలుసుకోవలసిందిగా అభ్యర్థించింది. మంత్రికి ఎంత ప్రయత్నించినా రాజు మనసు బోధపడలేదు. వివాహానికి ముందురోజు కూడా ఎంతో ఆనందంగా సుశీల తన భార్య అవుతున్నందుకు మురిసిపోయినవాడు, ఇంతలోనే ఎలా మారిపోయిందీ అతనికే అంతుబట్టలేదు. సుశీల ప్రసంగం తెచ్చి, ఆయన కోపాన్ని సైతం చవి చూశాడు.

ఈ రీతిగా సుశీల కాపురంలో నిప్పులు పోసినప్పటికీ ఆమె గురువు కళ్లు చల్లబడలేదు. మళ్లీ కొంతకాలం తర్వాత, రాజుని దర్శించి "విక్రమసేనుడనే రాజు కూతురు దేవయాని చాలా చక్కనిదనీ - అతడంగీకరిస్తే తానామెను అతనికి కూర్చగలననీ" చెప్పేసరికి స్త్రీ సాంగత్యాన్ని అభిలషిస్తున్న విష్ణుచిత్తుడు అందుకు సరేనన్నాడు. అయితే - మొదటి భార్య సుశీలని అడవిలో వదిలేయాల్సి ఉంటుందని షరతు పెట్టాడు గురువు.

దీర్ఘదర్శికీ పని ఇష్టంలేకపోవడంతో, రాజాజ్ఞకు బద్ధుడై సుశీలకు అడవిలోనే మేడకట్టించే ఏర్పాటు చేశాడు. ప్రభువు తన పట్ల చూపిన నిరాదరణకు ఆమె ఆత్మహత్యకు ప్రయత్నించగా, మంచిరోజులు వస్తాయని " ఊరడించి, ఆమెను ఆ ప్రయత్నం నుంచి విరమింపచేశాడు.

విష్ణుచిత్తుడు దేవయానిని పెళ్లాడినప్పటికీ, ఆమె రూపం అతడికి అంత అపురూపంగా తోచలేదు. ఒకరోజున రాజు వేటకు ఏర్పాట్లు చేయమనగా, తాను సుశీలను ఉంచిన ప్రాంతాల్లోనే వేటకు ఏర్పాట్లు చేసి, బాగా వేటాడి అలసిపోయిన ప్రభువుకు, ఆమె మందిరంలోనే ఆ రాత్రికి విడిది ఏర్పాటు చేయించాడు - దీర్ఘదర్శి.

నట్టడవిలో సేదతీరేలా, అన్ని రాజభోగాలూ అమరేసరికి, విష్ణుచిత్తుడా రాచపడుచు ఎవరని దీర్ఘదర్శిని అడగ్గా నీ వంటి నిర్భాగ్యునికి సుశీల మొహం సైతం గుర్తులేకపోవడం సహజమే! దైవికంగా మీరిద్దరూ

కలిస్తే అంతేచాలు! అని మనస్సులో అనుకొని, ఆమె మళయాళ చక్రవర్తి కూతురనీ – విహారార్థం అక్కడికొచ్చి,గాలి బాగుందని అక్కడ సౌధం ఏర్పాటు చేసుకుని ఉంటూన్నదని" అప్పటికి తోచిన రీతిని చెప్పి, మీ ఇద్దరికీ ఏకాంతం కల్పిస్తాను" అని తాను బయటకు వెళ్లబోతూ, సుశీలకు అన్ని జాగ్రత్తలూ చెప్పి ఆ మంత్రి అక్కడ్నుంచి జారుకున్నాడు. ఆ రాత్రి వారికి శోభన రాత్రి అయి, ఇద్దరూ మన్మథ సుఖాలనుభవించారు. రూపం – గుణం – వినయం– సౌశీల్యం అన్నీ స్వయంగా పరిశీలించిన విష్ణుచిత్తుడు ఆమె పట్ల అనురాగబద్ధుడై, మంత్రికి రాజ్యపాలన వ్యవహారాలు అప్పగించి తాను ఆమెతో స్వర్గసుఖాలనుభవించడానికి కొన్నాళ్లక్కడే ఉండిపోయాడు. కొంతకాలం తర్వాత దేవయాని కబురు పంపడంతో, విష్ణుచిత్తుడామెను వదలి వెళ్లలేక – వెళ్లలేక ఆనవాలుగా వజ్రపుటుంగరాన్నిచ్చి వెళ్లాడు.

సుశీల గర్భవతి అయి, చక్కని బాలుని కన్నది. అదే సమయానికి మంత్రి దీర్ఘదర్శి భార్య కూడా ప్రసవించింది. దీర్ఘదర్శి, రాజపుత్రుడికి కామపాలుడనీ, తన పుత్రునికి బుద్ధిసాగరుడనీ పేర్లు పెట్టి, ఇద్దరినీ ఒకే చోట విద్యాభ్యాసానికి పంపించాడు. ఆ ఇద్దరూ అన్నదమ్ముల్లా ఒకర్ని విడిచి ఒకరు ఉండలేకపోయేవారు. యువకులిద్దరికీ పదహారేళ్లు వచ్చాయి.

అన్ని విద్యలూ అభ్యసించడం పూర్తయ్యాక వాళ్లు లోకజ్ఞానం కోసం దేశాటనం వెళ్లారు. చాలాకాలానికి మళ్లీ సుశీల పట్ల మనసు కలగగా, రాజు అడవికి వెళ్లి ఆమెను కలుసుకున్నాడు. మాటల సందర్భంలో, అతడు తన మొదటి భార్య సుశీల గురించి పట్టించుకొనలేదని చెప్పాడు.

"ఎవరో గురువు వచ్చి, రోగిష్టిదని చెప్పినంత మాత్రాన, భార్యని వదిలేయడమేనా? వివాహం రోజున ఆమె గురుదక్షిణ ఇవ్వాలని కానుకలు తీసుకువెళ్లగా, ఆ దుర్మార్గుడు ఆమెనే వాంఛిస్తే, ఆమె నిరాకరిస్తే, ఆ కక్ష కడుపులో పెట్టుకుని కాపురం కూల్చడానికి శపథం పూనినవాడు, అన్నంత పనీ చెయ్యడంలో ఆశ్చర్యమేముంది?" అని ఆమె చెప్పేసరికి "నీకు ఎలా తెలుసు?" అని అడగ్గా, మలయాళ ప్రభువు కూతురిగా పరిచయమైన

నేను, మీరానాడు నా ముఖమన్నా చూడని సుశీలనే గనుక" అని చెప్పేసరికి, విష్ణుచిత్తుడు ఆమె ముందు చిత్తయిపోయాడు.

దైవప్రాతికూల్యంతోపాటు, తన విచక్షణా జ్ఞానం లోపించడం వల్ల కూడా అలా జరిగినందుకు చింతించిన విష్ణుచిత్తుడు, దీర్ఘదర్శికీ విషయం తెలియజేయగా "ప్రభూ! ఆమె ఏ పాపం ఎరుగదని నాకు ముందే తెలుసు కనుక, ఇన్నాళ్లు సంరక్షించుకుంటూ వస్తున్నదీ నేనే నన్న విషయం మీకు తెలీదు" అని మరింత ఆశ్చర్యపరిచాడు. "అంతేకాదు ప్రభూ! మీకిప్పుడు పదహారేళ్ల పుత్రుడు కూడా ఉన్నాడు. నా కొడుకు బుద్ధిసాగరుని వయస్సు వాడే! ఇద్దరూ దేశాటనకు వెళ్లి ఉంటారని నా ఊహ" అని ఇంకొక ఆశ్చర్యకరమైన అంశం చెప్పి, అతడ్ని ఆనందపరచగా, ఆ ఇద్దర్నీ వెతికించాలని నలువైపులా, దూతలను పంపించాడు విష్ణుచిత్తుడు.

## భేరుండ పక్షి కథ

గోపాలా! బుద్ధిసాగరుడూ, కామపాలుడూ రాచనగరు వదలి, అలా అడవులు దాటి, మధ్యార్జునమనే పట్టణం చేరుకున్నారు. ఒకపూట కూళ్లమ్మ ఇంట్లో బస చేశారు. భోజనంచేశాక, వీధి అరుగు మీద పడుకుంటూ అన్నారు. ఆమె గుండెలు బాదుకుంటూ "అమ్మో! ఇంకేమన్నా ఉందా? బయటపడుకుంటే గండభేరుండ పక్షి వచ్చి చంపెయ్యదూ?" అని భయపడింది.

"అది మమ్మల్నేం చేస్తుంది పెద్దమ్మా! నువ్వు భయపడకు. మేం తెల్లవారేసరికి దాన్ని నరికి పోగులు పెడతాం!" అన్నారు. ఆమె ఎంత చెప్పినప్పటికీ, వారు తమ పంతం వదలక వీధి అరుగుమీదనే పడుకున్నారు.

అర్ధరాత్రి ఆ పక్షి, దొరికిన జీవాలన్నిట్నీ చంపేస్తూ, ఆ ఇద్దరి మీదకు ఉరికింది. బుద్ధిసాగరుడు తటాలున దాని రెక్కలు ఖండించగా, కామపాలుడు దాని ముక్కు చెక్కేసాడు. అది గిలగిల కొట్టుకుంటూ చచ్చింది. ఆ పక్షిని

చంపిన వానికి తన కూతుర్నిచ్చి తన పెళ్లిచేస్తానన్నాడు రాజు. అది తెలీని ఆ ఇద్దరూ, ఉదయాన్నే అక్కడ్నించి వెళ్లిపోయారు.

ఆ దారినపోతున్న చాకలి – భుజానున్న గొడ్డలితో దాన్ని మరికొన్ని ముక్కలునరికి, తానే దాన్ని చంపినంత హడావుడి సృష్టించేసరికి నిజమని నమ్మిన పౌరులు – అతడ్ని పొగుడుతూండగా, రాజైన సింహకేతునికి ఆ వార్త చేరింది. రాజు అది విని "ఆ చాకలికి ఇంత శౌర్యం ఉండద"ని ఊహించి, ఊళ్లోకి కొత్తగా ఎవరైనా వీరులొచ్చారా? అని ఆరాతీసేసరికి పూటకూళ్లమ్మ రాత్రి తన ఇంట బసచేసిన వీరుల ఆనవాళ్లు చెప్పగా వాటి సాయంతో రాజు కామపాల, బుద్ధిసాగరులను ఎక్కువ దూరం వెళ్లకుండానే రప్పించి, బుద్ధిసాగరుడే ఆ భేరుండపక్షిని నేలకూల్చాడని విని తన కుమార్తె అయిన సుగుణవతిని అతడికిచ్చి వివాహం జరిపించాడు.

కొన్నాళ్లామెతో బుద్ధిసాగరుడు సుఖాలనుభవించాక, ఆమెకు మళ్లీ వస్తామని చెప్పి కామపాలునితో కలిసి బుద్ధిసాగరుడు దేశాటనకు బయల్దేరాడు.

కొంతదూరం సాగాక, వారికి పల్లెగానీ – పట్నంగానీ – ఇంకా ముందుకు వెళ్లడానికి దారి గానీ కనిపించలేదు. చీకటి పడటంతో, నివాసయోగ్యమైన ప్రదేశం అక్కడ ఎక్కడైనా ఉంటుందేమో అని అన్నివైపులా చూడసాగారు.

## శరభసాళ్వము కథ

అంతలో ఒకవైపున విశాలమైన మర్రిచెట్టు కనిపించింది. అయితే, అంత నట్టడవిలోను అది బాగా విస్తరించినందున దాని క్రింద నేల చిత్తడిగా ఉండక, శుభ్రంగా బాగుచేయబడి ఉంది. నరసంచారమే లేని చోట ఇలా ఎందుకుంది? అని వారాలోచిస్తూ, "ఎందుకైనా మంచిది. ఈ కారడవిలో దుస్సాహసానికి దిగరాదు" అనుకొని ఇద్దరూ ఆ చెట్టుఎక్కి కొమ్మపైన కూర్చున్నారు.

కనుచీకట్లు పడేవేళకు అక్కడి జంతువులన్నీ వచ్చి, జాతి వైరం సైతం మరచి సభ చేశాయి. అంతలో శరభసాళ్వం అనే అద్భుతమైన మృగం రాగా జంతువులన్నీ లేచి దానికి స్వాగతం పలికాయి.

జంతువులన్నీ రకానికొకటి చొప్పున వచ్చినా, పక్షిజాతిలో అరుదైనదీ, అద్భుతమైనదీ, తనకు మంత్రీ అయిన గండభేరుండం రాకపోయేసరికి దాని గురించి అడిగింది సాళ్వం. మధ్యార్జున పురంలో ఇద్దరు రాజపుత్రుల పాలబడి అది మరణించిందని నక్క చెప్పగా, తాను శ్రీరంగపురంలో జీవహింస చేస్తున్నట్లు - తన ఆయువు తన దగ్గర కాక, ఆ చెట్టు తొర్రలోని ఉన్న ఒక ఎలుకలో ఉంచినట్లు - దాన్ని నొక్కేస్తే తప్ప తాను మరణించినట్లు వివరించింది శరభసాళ్వం. మృగభాష తెలిసిన రాజకుమారుడు కామపాలుడు, ఆ ఎలుకను బోనులో బంధించి, ఊరివాళ్ళ ఆపదను ఒక బ్రాహ్మణుడి వల్ల తెలుసుకుని, ఎలుకను పీకనొక్కి శరభసాళ్వాన్ని ఆ ఊళ్లోనే నేల కూల్చగా, రాజు 'పద్మావతి' అనే తన కుమార్తెను కామపాలునికిచ్చి వివాహం జరిపించాడు. ఇద్దరూ కొన్నాళ్లు సుఖాలనుభవించాక, పద్మావతి అనుమతితో, మళ్లీ వస్తాం అని చెప్పి దేశాటనానికి బయలుదేరారు.

## చిత్రసేన కథ

చంద్ర గుప్తం అనే నగరంలో సంచరిస్తూండగా, కోట ఉన్న ప్రాంతం వద్ద బుద్ధిసాగర - కామపాలురు తలపైకెత్తి చూసేసరికి, ఆ రాజు కూతురు చంద్రసేన కామపాలుని పై మోహపుచూపులు రువ్వింది. ఇతరులకు తెలీకుండా ఆమె అంతఃపురానికి తానే యుక్తిగా స్త్రీ వేషంలో వెళ్లి ఆమెతో క్రీడించసాగాడు. అటువంటిదే ఇంకొక యుక్తి పన్ని ఆమెను, ఆమె తండ్రి అనుమతితో వివాహం చేసుకుని, ఆమెతో నలుగురికీ తెలిసే భార్యాభర్తలై మరికొంతకాలం సుఖాలనుభవించి మరలివస్తాం అని చెప్పి అక్కడినుంచి బయలుదేరాడు. తిరుగు ప్రయాణం ఆరంభించారు మిత్రులిద్దరూ.

ఒకరోజు శ్రీరంగపురం సమీపంలో, చల్లగాలి వీస్తోందని ఒక చెట్టుకిందకు చేరగా కామపాలునికి నిద్ర పట్టేసింది. చెట్టుమీదికి చేరిన

పక్షుల మాటలను విని, బుద్ధిసాగరుడు కామపాలునికి ఏర్పడనున్న మూడు గండాల గురించీ తెలుసుకున్నాడు. అవి దాటినా అతనికి భార్యచేతిలో మరణం ఉందట. వచ్చిన చిక్కేమిటంటే, ఈ మూడు గండాల గురించి తమ మాటల వల్ల తెలుసుకున్నవాళ్లెవరైనా, అది తమ నోటితో బైటకు చెప్పడానికి వీల్లేదు. అలా చెప్తే వారు పాదాల మొదలు పైవరకు క్రమంగా శిల అయిపోతారు.

మొదటి మూడు గండాలూ ఎలా దాటించాలో బుద్ధిసాగరుడు ఆ క్షణం నుంచే ప్రణాళిక రచించుకుని, వాటిని తన చాకచక్యంతో తప్పించగలిగాడు. కాని భార్య చేతిలో మరణాన్ని ఎలా తప్పించడమో అతనికి ఎంత ఆలోచించినా పాలుబోలేదు.

అత్తవారింట్లో అల్లునిగా కామపాలునికి అన్ని మర్యాదలు సలక్షణంగా జరిగాయి. భార్య పద్మావతి కూడ అతనికి అనుకూలంగానే మెలుగుతోంది. అర్ధరాత్రి కామపాలుడు - పద్మావతి నిద్రిస్తున్న గదిలో, ఆమె ఏదైనా అఘాయిత్యం చేస్తుందేమోనని, పక్షి మాటలు గుర్తొచ్చిన బుద్ధిసాగరునికి నిద్ర పట్టలేదు. వారి గదిలోకి తొంగి చూడ్డం తప్పే అయినా, మిత్రుని స్థితి తెలుసుకోవడం కోసం అతడు క్షేమంగా ఉన్నాడో లేడో అని చూశాడు.

## పద్మావతి కథ

భర్త గాఢనిద్రలో ఉన్నాడని నిశ్చయం చేసుకున్న పద్మావతి, గదిలో ఒక మూలనున్న రహస్యపు తలుపు తెరచి నేల సొరంగంలోకి వెళ్లింది. బుద్ధిసాగరుడు ఆమెను అనుసరించసాగాడు. ఆమెకు మేదరివాడితో సంబంధం ఉంది. తన భర్త వచ్చాడనీ రేపోనేడో తనతోపాటు తీసుకుపోతాడని చెప్పడంతో మేదరి కత్తిని ఇచ్చి, దాంతో అతడ్ని చంపెయ్యమన్నాడా విటుడు.

బుద్ధిసాగరుడికిదంతా ఊహకైనా అందనిది. ఎంత రాజకుమారుడు కొన్నాళ్లు లేకుంటే మాత్రం నీచజాతితో సంబంధం, రాకుమార్తెకు తగినదేనా? ఇందుకే కాబోలు - 'కామానికి కళ్లుండవు' అంటారు.... అనుకుంటూనే

ఆమెను అనుసరించాడు. కాని, పక్షి చెప్పినట్లే ఒక్క అడుగు ఆలస్యం అయ్యేసరికి, పద్మావతి కామపాలుడ్ని చంపేసింది. మిత్రుని కోల్పోయి బుద్ధిసాగరుడు దుఃఖిస్తూంటే, పద్మావతి పెద్దగా అరచి, "బుద్ధిసాగరుడు తన మిత్రుని చంపి, నన్ను బలాత్కారం చేయబోయాడు" అంటూ రచ్చచేసింది. ఆమె తండ్రి యుక్తాయుక్తాలు విచారించక రాజు అతడ్ని ఉరితీయమన్నప్పుడు నిజానిజాలు ఎప్పటికైనా రాజు గ్రహించాలని యోచించినా బుద్ధిసాగరుడు, అంతఃపురం నుంచి మేదరి ఇంటికి దారి, తన మిత్రుని చంపడానికి పద్మావతి తెచ్చిన మేదరకత్తి నిదర్శనాలుగా చూపడంతో, రాజు బుద్ధిసాగరుడు నిర్దోషి అని, అతడ్ని వదిలేశాడు. మిత్రుని కళేబరానికి తైలం రాసి, దేహం చెడని ఔషధాలు పూసి ఒక పెట్టెలో పెట్టుకొని, అది మోసుకుంటూ బుద్ధిసాగరుడు తన భార్య చర్యలే రీతిగా ఉన్నాయో చూడదలచాడు. తన అత్తవారింటికెళ్లాడు.

## సుగుణావతి కథ

బుద్ధిసాగరుడు మధ్యార్జున పట్టణానికి చేరుకొనేసరికి, సింహాకతుడు, అల్లుని రాకకు ఆనందించి గొప్పవిందు చేశాడు. ఆ రాత్రి భార్య ప్రవర్తన కనిపెట్టదలచి గాఢంగా నిద్రపోతున్నట్లు నటించాడు. తన మిత్రుని భార్య నీచునితో సంబంధానికైనా వెరవక కులభ్రష్టురాలు కావడంతో అతనికి స్త్రీ జాతి మీదనే చులకన భావం ఏర్పడింది. అయితే తన భార్య అటువంటిది కాదనీ, పైగా జన్మజన్మలకూ తననే భర్తగా కోరుకొంటోందనీ తెలిసి చాలా సంతోషించాడు. కాళీమాత వరప్రసాదం వల్ల ఆమె చేత్తో తాకిన ఒకే ఒక్క వ్యక్తి మాత్రం మరణించిన వాడైనా తిరిగి బతుకుతాడు. కనుక, ఆ వరం ఉపయోగించి, మిత్రుడైన కామపాలుని బతికించుకున్నాడు.

ఆ తర్వాత ఇద్దరూ చంద్రగుప్తుడి రాజ్యానికి వెళ్లి, చిత్రసేనని వెంట బెట్టుకుని, రాజ్యానికి వెళ్తూండగా, రహస్యం వివరిస్తే రాయి అయిపోయినా ఫర్వాలేదు గాని, మిత్రునికి నిజం తెలియాలని, నిజం చెబుతూంటే క్రమంగా పాదాలనుంచి రాయిగా మారడం మొదలైపోయింది.

నిజం తెలుసుకున్న కామపాలునికి స్త్రీ జాతి మీద పూర్తి విరక్తి భావం ఏర్పడి మిత్రుని ఔన్నత్యానికి చలించిపోయాడు. రాయి అయిపోతూ వున్నా అతడు తన నోటితో చెప్పదల్చుకున్నదంతా చెప్పేసరికి, ముఖ భాగం కూడా రాయిగా మారిపోయి, ఆ పైన శిరస్సు, వెంట్రుకలు అలాగే ఉండిపోయాయి. సుగుణవతి భర్తకు కలిగిన ఈ ఆపదకు చలించిపోయి, తన కాళీభక్తిని మళ్లీ ప్రకటించి, యోగినిగా మారి తపస్సులో పడింది. మిత్రుని కోసం కామపాలుడు కూడ తపస్సులో మునిగాడు. భార్య చిత్రసేనను ఇంటికి పంపేసి.గోపాలునికి అంతవరకు కథ చెప్పి, "నీకు ఆనందం కలిగించడానికి అతనికి పూర్వరూపం తెప్పిస్తాను" అని మణిసిద్ధుడు బుద్ధిసాగరునికి పూర్వరూపం తెప్పించడమే గాక, గోపాలునికి కూడ ఈ కథలో ఒక పాత్రగా చేసి, అతని చేత బుద్ధిసాగరుని వృత్తాంతం అతనికి చెప్పించాడు. బుద్ధి సాగరుడు యతి అద్భుతశక్తిని మెచ్చుకున్నాడు.

అతడి నిమిత్తమే తపస్సు చేస్తున్న కామపాలుడినీ- సుగుణవతినీ గోపాలుడు వెతికి తీసుకురాగా సిద్ధుని అనుమతితో వారు ముగ్గురూ ఒకర్నొకరు కలుసుకుని ఆనందంగా తమ దేశం వెళ్లిపోయారు.

గురుశిష్యులిద్దరూ తదుపరి మజిలీ చేరుకున్నారు.



# కాశీ మజిలీ కథలు

## 12వ మజిలీ

### చేప నవ్విన కథ

పన్నెండవ మజిలీ ఒక తోట. అందులో ఒక చోట ఇనుపచిక్కాలకు వ్రేలాడగట్టబడి ఇద్దరు పురుషులు స్త్రీల ఆకారంలో కనిపించారు. వాళ్లు మరణించినా, వారి దేహాలు చెడకుండా అలాగే ఉన్నాయి. గోపాలునికీ వింత వెనుక వృత్తాంతం తెలుసుకోవాలనిపించి "అయ్యా! వారు స్త్రీలో, పురుషులో గాని ఇనుపచిక్కాలకు ఏల వ్రేలాడగట్టబడ్డారు?' ఆ కథ చెప్పండి" అని అడగ్గా, మణి ప్రభావం చేత సిద్ధుడా వృత్తాంతం ఇలా చెప్పసాగాడు....

గోపా! ఇది కళింగ రాజధాని ధర్మాపురం. దీనికి సింహధ్వజుడు రాజు. ప్రభుకీర్తి అనేవాడు మంత్రి. రాజుకు వింత వింత వస్తువులను సేకరించడం ఒక సరదా! ఇలా ఉండగా......

ఒకరోజున కొందరు పల్లెకారులు, ఒక అద్భుతమైన చేపను తీసుకొచ్చి "రాజా! ఇంత పెద్ద చేపను మా జీవితకాలంలో ఎన్నడూ చూసి అయినా ఎరుగము. వింతలేవైనా తాము స్వంతం చేసుకోగలవారు కనుక, దీన్ని మీ పరం చేద్దామని తెచ్చాం!" అని ప్రభువుకు ఇవ్వగా "ఇది ఆడదా? మగదా?" అని అడిగాడు సింహధ్వజుడు. వాళ్లు తెలీదని చెప్పి, రాజిచ్చిన పారితోషికం పుచ్చుకుని వెళ్లిపోయారు.

ఆ రాజుకు చక్కనివారు, యువతులూ అయిన భార్యలు చాలా మంది ఉండడంతో, స్త్రీలను నమ్మని ఆ రాజు అంతఃపురంలోనికి పోతు టీగను కూడ పోనివ్వకుండా కాపలా పెట్టాడు. ఆ చేప మగదైతే దానికి అంతఃపురంలోనికి ప్రవేశం లేదు. ఆ రాజు సంగతి తెలిసినట్లుగా ఆ చేప ఫక్కున నవ్వి, ప్రాణం వదిలింది. దాని నవ్వుకు అంతా ఆశ్చర్యపోయారు.

సింహధ్వజుడికి, ఆ చేప నవ్వుకు కారణం తెలుసుకోవాలని పించింది. "చేప ఎందుకు నవ్విందో చెప్పగలరా?" అని మంత్రిని అడిగాడు. మనుషుల అభిప్రాయమే నవ్వు ద్వారా వ్యక్తమైనప్పుడు ఒక్కోసారి పోల్చడం కష్టం. అటువంటిది చేప నవ్వుకు కారణం ఏమని చెప్తాం? ఇటువంటి ప్రశ్నలతో మంత్రులను చిన్నబుచ్చడం తగదు" అని చెప్పాడా మంత్రి. అది సింహధ్వజునికి కోపం తెప్పించి" ఆర్నెల్లల్లో నువ్వా చేప నవ్వుకు కారణం చెప్పలేకపోతే, నిన్ను శిక్షించడం ఖాయ" మనిఅన్నాడు.

తండ్రి విచారంగా ఉండడంతో, ఆ మంత్రి కొడుకు "దేశాటనకు వెళ్తే ఆ విషయం తెలుసుకోవచ్చు"ననగా, అతని చెల్లెలు లతాంగి తానూ వెంట వస్తానంటూ అన్న వెంట బయలుదేరింది.

దారిలో ఒక చోట, ఒక రాజు కూతురైన ప్రభావతిని చదరంగంలో ఓడించిన వారికి - ఆమె నిచ్చి పెళ్లి చేస్తానని అనడంతో, చదరంగంలో నిపుణుడైనప్పటికీ ఆ మంత్రి పుత్రుడు ప్రద్యుమ్నుడు ప్రయత్నించి ప్రభావతితో ఆడి రెండాటలు ఓడిపోయాడు.

మర్నాడు మూడో ఆట ఆడాలి. శాసనం ప్రకారం మూడు ఆటలు ఓడితేనే ఉరి తీయాల్సి ఉంటుంది. కనుక, ఇంటికొచ్చి చెల్లెలితో చెప్పగా, మరునాటి ఆటకు ఆమె పురుషవేషం ధరించి వెళ్లింది. పురుషవేషంలో ఆమె అన్నకు నకలుగా ఉండడంతో ఆమెను అందరూ ప్రద్యుమ్నుడనే అనుకున్నారు. నిజానికి ప్రద్యుమ్నుడు ఓడిపోవడానికి కారణం ఎదురుగా ప్రభావతి అందం ఊరిస్తున్నట్లుగా కనబడడం. లవంగికి ఎదుట తన లాటి మరో యువతే కనుక ఎటువంటి వికారం కలగలేదు. ఆమె ఆ రోజు సునాయాసంగా మూడు ఆటల్లోనూ ప్రభావతిని జయించేసింది. ప్రకటన ప్రకారం - లవంగికి ప్రభావతితో పెళ్లి జరిగింది. ప్రద్యుమ్నుడితో శోభనం జరిగింది. తర్వాత - కర్తవ్యం గుర్తొచ్చిన ఆ అన్నాచెల్లెళ్ళిద్దరూ, దేశాటన కెళ్లి వస్తామని బయలుదేరారు.

కనీసం గుఱ్ఱాలైనా లేకుండా కాలినడకన ప్రయాణమైన ఆ ఇద్దరికీ అడవిలో ప్రయాణిస్తూండగా - మార్గాయాసం వల్ల నిద్ర వచ్చింది. అయితే ఒకరు నిద్రిస్తున్నపుడు ఒకరు మేల్కొనడం మంచిదని అనుకొని, స్త్రీ కనుక ఆమెను ముందు నిద్రపొమ్మన్నాడు ప్రద్యుమ్నుడు. చెల్లెలికి నిద్ర లేవగానే నీళ్లు అందించాలని ఆలోచించి, నీటి కోసం చెట్టు పైకెక్కి ఏదిక్కున నీళ్లున్నాయో చూడబోగా, ఒక నల్ల తాచు, పైన ఒక కొమ్మ ఎక్కుతూ కనిపించింది. దాన్ని చంపేసి, ఆ కొమ్మ మీదున్న భైరవపక్షులకు ఉపకారాన్ని చేసినవాడయ్యాడు అతడూ అవి ప్రత్యుపకారం చెయ్యదలచాయి.

ఆ పక్షులలో మగపక్షి ప్రద్యుమ్నుడికి పాతాళలోకం వెళ్లే మార్గం చెప్పింది. అతడు చంపిన పాము తలలోని మణి ఎట్టి పరిస్థితుల్లోనూ విడువవద్దన్నది. ఆ ఉత్సాహంలో ప్రద్యుమ్నుడు చెల్లెల్ని మరచాడు.

లవంగి లేచి, అన్నకోసం వెతుక్కొని, గట్టిగా అరవసాగింది. అంతలో కారుమబ్బులు కమ్మి వర్షం కురియసాగింది. మత్స్య దేశాధీశుడైన జయసేనుడనే యువరాజు అటుగా వచ్చి ఆమెను చూశాడు. ఆ రాత్రి ఆ ఇద్దరూ ఒకర్నొకరు చూసుకుని మన్మథ సామ్రాజ్యం ఏలారు.

తెల్లవారాక, అతడామెను తీసుకుని బయలుదేరి, దారితప్పి పోవడంతో ఎంతకూ తమ దేశాన్ని చేరుకోలేకపోయాడు. వాళ్లు అలా మూడు రోజులు ప్రయాణించాక, నాలుగో నాటి రాత్రి వారికి ఒక అత్యద్భుతమైన మేడ కనిపించింది. అందులో వారు మూడు రాత్రులు సుఖించాక, హఠాత్తుగా నాలుగో రోజు లవంగి కన్ను తెరిచేసరికి మేడతో సహా జయసేనుడు మాయమైపోయాడు. లవంగి మహారణ్య మధ్యంలో ఉంది.

అది కలో - నిజమో అర్థంకాక, కలవరపడి చివరికి నిజమన్నది గ్రహించి - దుఃఖించి, వైరాగ్యంతో ఆ అడవిలోనే కొంతకాలం భర్తని వెతుకుతూ తిరిగింది.

అలా తిరుగుతుండగా,ఆమెకా అరణ్యంలో పెద్ద కోట వంటి ఆకృతి గలిగిన దేవాలయం కనిపించింది. అందులో సంయోగినీ దేవి కొలువై

ఉంది. అక్కడ దేవీ నవరాత్రులకు గొప్ప ఉత్సవం జరుగుతుందనీ - అది చాలా రహస్యప్రదేశం అనీ, అక్కడున్న శిలాశాసనం చదివి లవంగి గ్రహించింది. పూజారి తలుపు గడియ సరిగ్గా వేయనందువల్ల తాను అందులో ప్రవేశించగలిగానని కూడ ఆమెకి తెలిసింది. వైరాగ్యం ఆవరించిన తనకు తపస్సుకు అనుకూలమైన ప్రదేశం దొరికినందుకు ఆనందించింది.

ఒకరోజు దేవలోకం నుంచి వచ్చిన రంభ - ఊర్వశి ఆ దేవిని సేవిస్తూండగా, యోగినిగా ఉన్న లవంగిని చూశారు. ఆమె వృత్తాంతం చెబుతూ - మేనక అడిగిన ప్రశ్నకు జవాబుగా ఊర్వశి ఇలా అంది.

"సింహధ్వజుడు తన అంతఃపుర స్త్రీలను పురుషుల కంటపడకుండా రక్షించేస్తున్నాననుకుంటున్నాడు గాని, అతని అంతఃపురంలో వ్యభిచారం యధేచ్ఛగా సాగిపోతోంది. పరిచారికల వేషంలో కొందరు పురుషులా రాజు భార్యలతో ఇష్టానుసారం క్రీడిస్తున్నారు. అదే గ్రహించలేని ఆ మూఢునికి తాను మగదో - ఆడదో తెలుసుకోవాలనిపించడం విడ్డూరంగా అన్పించి చేప నవ్వింది" అని వివరించింది.

ఒక యక్షిణి మాయవల్ల ఈ చిన్నది తన భర్త అయిన జయసేనుడ్ని కోల్పోయింది. ఆ యక్షిణి ఓ రోజు రాత్రి ఇద్దర్నీ చెరో అడవిలోకి విసిరేసింది. కాని త్వరలోనే విడిపోయిన వీరంతా కలుసుకుంటారు. ఈ సంయోగినీ దేవి సార్ధకనామధేయురాలు. అందర్నీ కలుపుతుంది. అటువంటి దేవత అండ లవంగికి దొరికింది" అని రంభాది అప్సరసలు అక్కడ మాట్లాడుకోవడం లవంగి విని ఆనందం పట్టలేకపోయింది. సంయోగినీ దేవికి కృతజ్ఞతలు చెప్పి జపానికి కూర్చోబోయేటంతలో, ఎన్నెన్నో ఆపదలను, గండాలను గడిచిన ప్రద్యుమ్నుడూ ఒక యోగివేషంలోఉన్నవాడు అక్కడికి వచ్చారు. భైరవపక్షి చెప్పిన ప్రకారం, ప్రద్యుమ్నుడు నాగలోకం వెళ్లి, నాగకాంత రత్నాంగిని పెళ్లాడాడు. ఆమెతో కొంతకాలం సుఖాలు అనుభవించాక, ఆమెతో కూడ భూలోకానికొచ్చి చెల్లెలిని వెతకసాగాడు. అలాగే యోగి వేషంలో తిరుగుతూన్న జయసేనుడు, ఒక యోగి సహాయం అంది, "సంయోగినీ దేవి ఆలయంలో నీకు మేలు జరుగుతుంది" అని విని, అతడు చెప్పిన గుర్తుల ప్రకారం

ఆలయం వెతుక్కుంటూ అక్కడకు వచ్చాడు. ఆ ప్రకారం నలుగురూ అక్కడ కలుసుకున్నారు.

ప్రద్యుమ్నుడు పట్టరాని ఆనందంతో, చెల్లెల్ని కౌగలించుకుని, అంతలోనే "మనం మన తండ్రి సంగతి విస్మరించాం! నేటికి ఆరు నెలలు పూర్తి కావడానికి ఒక్కరోజు గడువుంది. ఆయన్నింత త్వరగా ఒక్కరోజులో కలుసుకోవడం దుర్లభం" అని విచారించాడు.

"చేవనవ్వుకు కారణం తెలిసి కూడా మనమేమీ చేయలేకపోతూన్నాం" అని లవంగి దుఃఖించడంతో, ప్రద్యుమ్నుడు – ఒకప్పుడు తనకు మేలు చేసిన భైరవపక్షులను తల్చుకున్నాడు. అవి వచ్చి వాళ్లని తమ వీపుల మీద ఎక్కించుకుని, అతి వేగంగా ఒక్క రాత్రిలో వాళ్లనందరినీ ధర్మాపురం తీసుకువెళ్లాయి.

అప్పటికే గ్రామమంతా అల్లకల్లోలంగా ఉంది. మంత్రిని ఉరి తీసేది ఆ రోజే! కారణం తెలుసుకొస్తామంటూ వెళ్లిన సంతానం జాడలేదు" అనుకుంటూ మంత్రీ – మంత్రి భార్య రోధిస్తున్నా రాజు కనికరించలేదు. ప్రజలంతా సింహధ్వజుడి దుర్మార్గాన్నే తల్చుకుని ఛీత్కరిస్తూంటే వాళ్ల మాటలు విన్న ప్రద్యుమ్నుడు పక్షులను తిన్నగా ఉరితీసే చోటుకే తమను చేర్చమన్నాడు. అవి వారిని అక్కడ దింపి, వెళ్లిపోయాయి.

సరిగ్గా ఉరి తీసే సమయానికి అక్కడకు చేరిన ప్రద్యుమ్నుడు "మా తండ్రిని ఉరితీయకండి! ఈ రోజు సాయంత్రం వరకైనా ఆగాలి కదా! చీకటి పడే వరకూ గడువుంది" అని అరిచాడు.

"ఆర్నెల్లుగా చేప నవ్విన నవ్వుకు కారణం తెలీనిది, ఈ ఒక్కపూటలో ఏం తెలుస్తుంది? సాయంత్రంలోగా అద్భుతాలేం జరగవు"అని ఆక్షేపించాడు అధికారి.

"దైవ సహాయం ఉంటే, అద్భుతాలు జరగగలవురా మూఢా! చేపనవ్విన కారణం చెప్పగల మంత్రి తనయుడు ప్రద్యుమ్నుడు – మంత్రి కూతురు లవంగి సిద్ధంగా ఉన్నారని చెప్పు" అంటూ హుంకరించాడు ప్రద్యుమ్నుడి బావ జయసేనుడు.

సింహధ్వజుడు సభ చేసి, చేప నవ్విన కారణం చెప్పగల ఆ నలుగురికీ ఉచితాసనాలు వేయించాడు. అది చాలా క్లిష్టమైనదని అతడికి తెలుసు! మానవమాత్రులు సాధించలేనిదనీ - దైవకృప వల్లనే అది సాధ్యమనీ, అటువంటి కృప అపారంగా ఉన్నందువల్లనే వారు మర్యాదకు అర్హులనీ గ్రహించలేనంతటి అజ్ఞాని కాడు సింహధ్వజుడు. అయినప్పటికీ - కేవలం పట్టుదల వల్ల పనికిరాని వాటి పట్ల పట్టుపట్టి మూఢుడైనాడు.

లవంగి ఇలా ప్రారంభించింది.....

"రాజా! చేప నవ్విన కారణం చెప్పవలసిందంటూ, మీరు మా తండ్రి గారిని ఆదేశించారు. నేను ఆయన పుత్రికను. ఆ కారణాన్ని వింటే, మీకు కోపం రావచ్చును. అందుకు నన్ను దండించబోతే అది మళ్లీ ఆపదకు దారితీయవచ్చు! కనుక అది ఎలాంటిదైనా నన్ను క్షమిస్తానని ముందుగా అభయపత్రిక ఇవ్వండి" అని కోరింది.

"చేప నవ్విన కారణం నిదర్శనంతో చెప్తే, ఎంత అపరాధమైనా క్షమిస్తాను" అని రాజు అభయం ఇచ్చాడు.

లవంగి " భగవంతుడు పశుపక్ష్యాదులకు ఒక జ్ఞానం మాత్రమే సంపూర్ణంగా ఇస్తాడు. కాని మనుషులకు అన్ని విధాల పరిపూర్ణజ్ఞానం ఇస్తాడు. అందుకే అన్నీ తెలిసిన మనుషులు మూర్ఖంగా ప్రవర్తిస్తే, చేప నవ్వకేం చేస్తుంది. అందుకు మంచి కారణమే ఉంది.

స్త్రీకి పురుషుని కంటే కామం అధికం. సాహసం కూడా ఆరురెట్లు అధికమేనని శాస్త్రం! స్త్రీలు పరపురుష సంగమాభిలాషులు అని కదా- మీరు అంతఃపురాల్లో పోతుటీగనైనా పోనీక కాపు పెట్టారు. రక్షణ ఏర్పరచానను కుంటున్నారు.

**శ్లో ॥ న గృహాణీ న వస్త్రాణి న ప్రాకార స్త్విరస్క్రియాః ।**
**నే దృశా రాజ సత్కారా వృత్త మా భరణం స్త్రీ యాః॥**

(అయినప్పటికి - అంతఃపురాలో, వస్త్రాలో, ప్రాకారాలో, తెరవు రాజసమ్మానమో స్త్రీలకు ఆభరణమై కాపాడజాలదు. మంచి నడవడిక ఒక్కటే ఆమెకు భూషణమై కాపాడుతుంది.)

కాని, దురదృష్టవశాత్తూ మీ అంతఃపుర కాంతలకు లోపించింది. అదే! అక్కడున్న పరిచారికలనందర్నీ ప్రవేశపెట్టించండి! వారిని సన్నని వస్త్రాలు కట్టించి స్నానం చేయించి తీసుకురండి" అని కోరింది.

పరిచారికలు అందుకు ఒప్పుకోలేదు. రాజశాసనంతో తప్పనిసరై వాళ్లు ఆ విధంగా రాగా, వాళ్ళలో అన్నీ పురుషచిహ్నాలే తప్ప మచ్చుకొక్కరిలోనూ స్త్రీత్వం లేదు.

"ఆర్యులారా! వీళ్లని చూశారు గదా! పాపం! సింహధ్వజ ప్రభువులవారు, తన స్త్రీలను అంతఃపురంలో ఉండి స్త్రీ పరిచారకులని నియమించి కాపలా కాయిస్తున్నాననుకున్నారు. కాని నేడు అది బట్టబయలైంది. నిదర్శనంతో సహా మీరే చూశారుగా! చేప ఈ కారణం వల్లనే నవ్వింది. ఇంటి గుట్టునే కనిపెట్టలేని ఈ రాజు, నన్ను మగదా? ఆడదా? అని అడుగుతున్నాడు కదా దానికి నవ్వొచ్చింది" అని వివరించింది లవంగి.

సభ హర్షధ్వానాలతో మార్మోగగా, సింహధ్వజుడికి ముఖం కళ తప్పింది. అంతఃపుర ద్రోహులందర్నీ ఇలా ఇనుపచిక్కాలలో బిగించి ఉద్యానవనంలో వ్రేలాడదీయించాడు.

గోపా! నువ్వు చూసినది అదే!" అని ముగించాడు మణిసిద్ధుడు. అతడు శిష్యునితో ఆనాటి సాయంకాలమే బయలుదేరి, కొంత ప్రయాణం తర్వాత, ఒకనాటి సాయంకాలానికి జగన్నాథక్షేత్రం చేరుకున్నాడు.

## తోటక వృత్తము

క. మంగళ మగుఁ ప్రజలకు నృప
పుంగవు తేలుదురు ధర్మబుద్ధి దనర ధా
త్రిం గోవులకును విప్రుల
కుం గల్గు శుభంబు మనుజకోటి జెలంగన్

**మొదటి భాగం సంపూర్ణం**



# కాశీ మజిలీ కథలు

## రెండవ భాగము

### 13 వ మజిలీ

శ్లో. యాకుందేందు తుషారహార దవళా యా శుభ్రవస్త్రావృతా।
యా వీణా వరదండ మండిత కరా యా శ్వేతపద్మాసనా॥
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి ర్దే వై స్సదాపూజితా।
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥

వ. అలా మణిసిద్ధుడు, శౌనకుడనే మారుపేరు గలిగిన ఆ గోపాలునితో కూడ, జగన్నాథమనే పుణ్యక్షేత్రంలో ప్రవేశించి, అక్కడొక మఠంలో బస చేసి భక్తజనులను సదా కాపాడే సుభద్రానాధుని ఆరాధించాలనే కోరిక హృదయాన్ని తొందర పెడుతూంటే - ఆ గోపాలునితో ఇలా అన్నాడు...

"వత్సా! సకల జగత్తుకూ నాయకుడైన జగన్నాధుడు ఇక్కడ 'సుభద్ర' పేరిట పూజలందుకుంటూన్న లక్ష్మీదేవీ సహితంగా ఇక్కడ నివశిస్తున్నాడు. ఈ మహానుభావుని ప్రభావం చాలా అద్భుతమైంది. తన ప్రసాదాన్ని ఎవరైనా విమర్శించినా -తిరస్కరించినా వారిని ఆ క్షణమే కష్టాలపాలు చేస్తాడు. సరే! వేగంగా నేను స్వామిని అర్చించుకొని రావడానికి స్నానానికి వెళ్లొస్తాను. అంత వరకు ఇక్కడ భద్రంగా ఉండు" అనడంతో, వాడు ఆ యతీంద్రునితో ఇలా అన్నాడు-

"అయ్యా! తమరి బోధనల వల్ల నాకు వెనుకటి కంటే లౌకికజ్ఞానం బాగానే పెరిగింది. 'వినడం' వల్లనే కదా ఎటువంటి వారైనా పండితుల వుతున్నారు. నాక్కూడా దేవతా దర్శనం చెయ్యాలని వేడుకగా ఉంది. మీతో

పాటు స్నానానికి నేనూ వస్తాను. మన సొత్తును అపహరించే వారెవరూ లేరిక్కడ. అనుజ్ఞ ఇవ్వండి" అనడంతో మణిసిద్ధుడు సంతోషంగా వాడూ రావడానికి ఒప్పుకున్నాడు.

అతడితో కూడ, ఇంద్రద్యుమ్న సరస్సుకు వెళ్ళి, యధావిధిగ స్నానం చేసి, పిమ్మట భక్తితో నారాయణ మంత్రం జపిస్తూ ఆలయానికి వెళ్లి ప్రదక్షిణలు చేసి, గర్భగుడిలో ప్రవేశించాడు సిద్ధుడు. సుభద్రా–బలభద్ర సహితుడై ఉన్న ఆ జగన్నాయకునికి మొక్కి స్తోత్రాలు చేశాడు. అలా రకరకాల స్తోత్రాలు చేస్తూ చాలాసేపు ఆయన సన్నిధిలోనే ఉండిపోయాడు కూడా!

కొంతసేపటికి అక్కడ్నుంచి కదిలి, ఆవరణ దేవతల్ని అర్చించడానికి, ఆలయ ప్రాంగణంలోనికి అడుగుపెట్టాడు. అక్కడ అలిగి నిలబడ్డ గోపాలుడు, తన రాకకోసం ఎదురుచూస్తుంటే వాడితో "గోపా! ఇక్కడ ఇంతవరకు ఏం చేస్తున్నావ్? దేవుడిని చూశావా? గర్భగుడిలో స్వామివారిని చూస్తూ, స్తుతులర్పించడంలో నేను నీ మాటనే మర్చిపోయాను సుమీ! కోపంగా ఉందా నా మీద? లోపలి కెళదాం పద! మీ కులదైవం వెన్న దొంగని చూద్దువుగాని" అని ఊరడిస్తున్నట్లుగా అన్నాడు.

"స్వామీ! నేను మీకు కావడి మోసేటప్పుడు జ్ఞాపకం వస్తాను గాని, ఇప్పుడెందుకు గుర్తుంటాను? కానివ్వండి! మీ దయ నా మీద ఇంతమాత్రమే ఉంది. ఏం చేస్తాను? స్నానం చేసింది మొదలు మీకు నా మాటే జ్ఞాపకం లేకుండా పోయింది. నేను మాత్రం మిమ్మల్ని వదలక మీ వెనకాల్నే తిరుగుతున్నాను. మీరు గుళ్లోకి పోతూంటే, నేను కూడా రాబోతూంటే, అక్కడ కాపలా ఉన్న బెత్తాల వారు అడ్డుపెట్టారు. అప్పుడు నేను గట్టిగా "స్వామీ! స్వామీ!" అని అరుస్తూ మిమ్మల్ని పిలిచాను. మీరు నా మొర వినిపించుకోక, లోపలికి వెళ్ళిపోయారు. నా అరుపులకు లోపల్నుంచి ఒక పండా బైటికి వచ్చి నన్ను చూసి "ఓరీ! ఇలా ఊరకే అరుస్తున్నావు–ఎవడ్రా నువ్వు? నీ కెవరు కావాలి?" అని అడిగాడు.

"అయ్యా! నేను గొల్లకుర్రవాడిని. మా అయ్యగారు లోపలున్నారు. ఆయనతో కూడా దేవుడిని చూడ్డానికి లోపలికి వెళ్తుంటే, వీరు అడ్డుకోవడంతో ఆయన్ని పిలుస్తున్నాను" అని చెప్పాను.



2

అప్పుడా స్వామికి నా మీద దయ వచ్చింది. "లోపల చాలా రద్దీగా ఉంది. కొద్దిసేపు ఆగు! పంపిస్తా!" అని చెప్పి, లోపలున్న వాళ్లు బయటికి రాగానే నన్ను పంపించాడు.

నేను లోపలికొచ్చి, మిమ్మల్ని వెతికాను గాని మీరు గర్భగుడిలోన ఎక్కడో ఉండడం వల్ల పలకరించడానికైనా కుదిరింది కాదు. తరువాత దేవుడ్ని చూశాను గాని, నాకేం బోధపడలేదు. కళ్లు ముఖం బాగా స్ఫుటంగా కనిపిస్తూ మూడు మొండి విగ్రహాలు మాత్రం కనిపించాయి. వాటినే దేవతలుగా భావిస్తూ మొక్కుతున్న వాళ్లను చూసి నేను మొక్కాను.

ఇంతలో మళ్లీ ప్రజలు తండోపతండాలుగా తోసుకుని లోపలకు వస్తూంటే, బెత్తాలవారు నన్ను అక్కడ నిలబడనివ్వక బయటకు తోసేయడంతో చేసేది లేక వెలుపల కొచ్చేశాను, ఏమిటీ విపరీతం? అని ఆలోచించుకుంటూ, మీరెప్పుడొస్తారా? అని ఇక్కడ ఎదురుచూస్తున్నాను. మీరు ఇంతసేపటికి బయటికొచ్చారు. ఇదీ సంగతి. నేను లోకంలో చాలా దేవాలయాలు చూశాను గాని, ఎక్కడా ఇలాంటి వింత దేవుళ్లను చూడలేదు. దీనికేదో కారణం ఉండక పోదు. నాయందు దయ ఉంచి ముందు నాకీ సందేహం తీరేలా దీని వృత్తాంతం చెప్పండి. తర్వాత జపం చేసుకుందురు గాని..." అంటూ పట్టు పట్టి కూర్చున్నాడు.

దానికి మణిసిద్ధుడు కూడా ఆనందించి, "పుత్రా! నువ్వీ ప్రశ్న వేస్తావని ఇంతకు ముందే అనుకున్నాను. పుణ్యప్రదమైన ఈ కథ నీకు విన్పించాలని నాకూ కుతూహలంగానే ఉంది. సావధానంగా విను" అంటూ ఆలయ ముఖమంటపం మీదనే కూర్చొని, మణిప్రబోధం వల్ల ఆ వృత్తాంతం ఇలా చెప్పసాగాడు.

## ఇంద్రద్యుమ్నుని కథ

వత్సా! విను! పూర్వకాలంలో నిరావతి అనే పట్టణంలో ఇంద్రద్యుమ్నుడనే రాజు ఉండేవాడు. అతడి భార్య చంద్రసేన. ధర్మబద్ధమైన పరిపాలనతో అతడు అతి తక్కువ కాలంలోనే గొప్పకీర్తిని సంపాదించాడు.

ఒకనాడు ఆ మహారాజు సభలో సింహాసనం మీద కూర్చొని ఉండగా– ద్వారపాలకుడొకడు వచ్చి వినయంగా "అయ్యా! వింధ్యపర్వతాల నుండి కిరాతకులు కొందరొచ్చి దేవరవారి దర్శనం కోసం వేచి వున్నారు" అని చెప్పగా, ఆ బోయవారిని

ప్రవేశపెట్టమన్నాడు ఇంద్రద్యుమ్నుడు.

సభ లోపలికొచ్చిన బోయలు పులిచర్మాలు, నెమలి ఫించాలు, కస్తూరి, చామరాలు మొదలైన అడవి వస్తువుల్ని కానుకలుగా ఇవ్వగా, తనకు మొక్కుతూ నిలబడి వున్న ఆ ఎరుకల వాళ్ళను చూస్తూ వచ్చిన కారణమేమిటని దయతో అడిగాడు.

"ప్రభూ! మేము వింధ్యాటవిలో ఉన్న మీ సేవకులం! మీకు దాసులం. మాకు చిన్నప్పట్నుంచీ అడవుల్లో తిరగడం – జంతువుల మధ్య జీవించడం అలవాటే! అయితే ఈ మధ్యకాలంలో మేమెన్నడూ చూడని వింతమృగం ఒకటి అడవుల్లో సంచరిస్తోంది. దాన్ని చంపాలని మేము రకరకాలుగా ప్రయత్నించకపోలేదు. ఇంతవరకు అది పట్టుబడలేదు. దాని అరుపు కూడా చాలా వింతగా ఉంది. జంతువులే దాని అరుపునకు భయపడుతూన్నాయంటే, మనుషులం మనమెంత? మా కోయపల్లెలో ఎవరికీ కంటిమీద కునుకు లేదు సామీ! తమరే తమ భుజబలదర్పంతో దాన్ని అణచాలి" అని విన్నవించుకున్నారు.

ఇంద్రద్యుమ్నుడు వారికి అభయం ఇచ్చి "శబరులారా! మీకెటువంటి భయం లేకుండా, మీరు మళ్లీ అడవుల్లో హాయిగా సంచారం చెయ్యగలిగేలా ఆ వింత మృగాన్ని అంతరింపజేస్తాను. మాక్కూడా చాలాకాలంగా వేటకు వెళ్లాలనే ఉంది. ఇప్పటికి దైవకృప వల్ల ఈ రీతిగా అది నెరవేరుతున్నది. దారి చూపించడానికో ఇద్దరు మాత్రం ఉండండి! మిగిలిన వారు వెళ్లవచ్చు!" అని ఆ అటవికులకు ఆజ్ఞ ఇచ్చాడు. వేట నిమిత్తం వింధ్యాటవులకు ప్రభువులవారు వెళ్తున్నారన్న విషయం నగరమంతా చాటించి వేటకు కావలసిన సంభారాలన్నీ సిద్ధం చేయించమని మంత్రులతో చెప్పి అంతఃపురానికి వెళ్ళిపోయాడు ఇంద్రద్యుమ్నుడు.

అంతఃపురంలో రాణి చంద్రసేన, తన పతి దేవునికి ఉపచారాలన్నీ చేసి, సరసన కూర్చొని ముచ్చట్లాడుతూ “నాథా! గతరాత్రి తెల్లవారుఝామున నాకో కల వచ్చింది. దాని మంచి చెడ్డల గురించి నా చెలికత్తెల నెవర్ని అడిగినా చెప్పలేకపోతున్నారు. కలలో నేను చూసిందంతా మర్చిపోతానేమోనని, ఇదుగో! ఈ పత్రం మీద రాయించి ఉంచాను” అని ఆ పత్రాన్ని తెప్పించి రాజుకు అందజేసింది. అతడు అది చూసి, తలూపుతూ “రాణీ! ఈ కల ఫలితం పరికించబోతే, ఇది కలత చెందించేదిగానే కనిపిస్తోంది. తప్ప శుభదాయకంగా తోచడం లేదు. అందులోనూ ఇది అత్యంత త్వరలోనే మనకు వియోగాన్ని కలిగించడమే గాక, చాలా కష్టాలను కలిగించేదిగా కూడా కనిపిస్తోంది. అయితే ఆ కష్టాల పరంపర తదుపరి కీర్తి కూడా అబ్బుతుందనుకో! ఏదేమైనా దేవుడేది రాశాడో మనకు తెలీదు. కర్మ సూత్రం ఎలా ఉందో! దాన్ని దాటడం మనకు శక్యం కాదు. సరిగ్గా ఇటువంటి తరుణంలోనే నాకు ‘వేటకు వెళ్లడం’’ అనే వియోగం తటస్థించింది.

ఇది దైవప్రేరితమేనేమో! లేకపోతే నిత్యం ఎన్నెన్నో మృగాల్ని వేటాడ్డంలో గొప్ప నేర్పు కలిగిన ఆ కిరాతులు, ఒక్క వింత మృగమేదో బాధిస్తోందంటూ, నా దగ్గరకు రావడమేమిటి?” అని దీర్ఘంగా నిట్టూర్చి చింతిస్తూంటే, చంద్రసేన ఆశ్చర్యపోతూ “నాథా! నాకొచ్చిన కల అంతటి వియోగాన్ని కలిగిస్తుందా ? ఆ మాటలు వింటూంటేనే నాకు గుండెలు కొట్టుకుంటున్నాయి. ఎలా భరించగలను?” అని భర్త కంఠాన్ని పెనవేసుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

అప్పుడా రాజు “ చంద్రసేనా! భయపడుతున్నావా? కలలేం నిజమవుతాయిలే? ఏదో నిన్ను జడిపించడానికి అలా అన్నాను గానీ.....నేను రేపే వేటకెళ్లి, ఆ వింత మృగాన్ని సంహరించి త్వరగా తిరిగొచ్చేయనా? అంతవరకు భద్రంగా ఉండు!” అని ఊరడించాడు.

అయినప్పటికీ - ఆమెకెందుకో మనస్సు నిలకడ లేకుండా పోయింది. అందువల్ల ఆమె “అయితే, మీరు నన్ను కూడా మీతో తీసుకువెళ్లండి. లేదా ప్రస్తుతానికి వేటైనా మానేసి ఇంకోసారి వెళ్లండి” అని

విచార పడుతూంటే "రాణీ! ఇప్పుడు తప్పని సరిగా వెళ్లితీరాలి. బోయలకు అభయాన్నిచ్చి వెళ్లకపోతే ఎలా? కనుక నువ్వు నాతో రావడానికి అభ్యంతరమేమీ లేదు. " అని పలికి ఆమెకు కొంత చింత తీర్చగలిగాడు.

మరునాడు ఉదయాన్నే వేటకు అన్ని సాధనాలూ సిద్ధపరుచుకొని, యువరాజు విజయుడికి రాజ్యభారం అప్పగించి, తాను భార్యను వెంటబెట్టుకుని వింధ్యాటడవులకు బయల్దేరాడు - ఇంద్రద్యుమ్నుడు.

అరణ్యంలో సంచరిస్తున్నప్పుడు, సేనలను విడిది కుటీరం దగ్గర ఒక వ్యూహంలా నిలబెట్టి, తాను రాణితో కూడా గుర్రంమీద వెళ్తూ వింత వింత పిట్టల్ని చూపిస్తూ, "బ్రహ్మ ఎంత అందంగా సృష్టించాడో కదా" అంటూంటే, చిత్రకారులు చిత్రించిన చిత్రాలను చూస్తున్నట్లు అనుభూతి చెందసాగిందామె.

సాయంత్రం అయింది. "వేటకు ఎప్పుడు వెళదాం దేవరా?" అంటూ వేటగాళ్లు తొందర పెట్టసాగారు. అరణ్యంలోని బోయవారిని చేరి "ఓరీ! మీరు చెప్పిన మృగం ఎక్కడుంది? ఎప్పుడొస్తుంటుంది? దాని గుర్తులేమిటి? చెప్పండి" అని అడగ్గా వాళ్ళు చేతులు జోడించి "దేవరా! తమతో వచ్చి మేం మొరపెట్టుకున్నప్పట్నుంచీ। అది మా కళ్ల పడనేలేదు. లేకుంటే అదిగో! ఆ కనబడే ఇరుకు దారిలో మాటువేసుకుని ఉండేది. మీరాక సంగతి దానికీ తెలిసి, పారిపోయిందేమో! దాంతో మేం పడ్డ పాట్లు ఇన్నీ అన్నీ కావు. అయితే అది ఎక్కడో దాగి ఉన్నదని మా సందేహం! ప్రభువులవారే దాన్ని వెతికి, ఏదో రీతిన సంహరిస్తే మాకు భయం తీరుతుంది. తమ రాకవల్ల మళ్లీ ఇన్నాళ్లకు మేం కంటినిండా నిద్రపోగలిగాం" అని చెప్పుకున్నారు. వాళ్ల మాటలు విని నవ్వుకున్నాడా రాజశేఖరుడు. తనతో వచ్చిన వేటగాళ్లకు, ఆ రాత్రంతా సందడి చెయ్యమనీ - వలలు పన్నమనీ - వాయిద్య శబ్దాలు చేయమనీ - కుక్కల్ని ఉసి గొల్పమనీ రకరకాల అరుపులు అరవవలసిందనీ- ఆ వింతమృగాన్ని బెదరగొట్టి దాని ఉనికి బైటపెట్టే మార్గాలెన్ని ఉన్నాయో అన్నీ అవలంబించమని చెప్పాడు. రాజాజ్ఞ అయిందే తడవుగా వాళ్లందరూ ఒక్కసారిగా చెలరేగి అడవంతా కోలాహలం చెయ్యసాగారు.

అప్పుడు చప్పుళ్ళకు బెదిరిన కొన్ని జంతువులు, కొన్ని గట్టిగా గర్జిస్తూంటే వాటి అరుపులకు భయపడిన చంద్రసేన గుడారంలో ఉన్న తన భర్తని గట్టిగా కౌగిలించుకుని, శయ్య వైపు నడిపించేసరికి స్వయంగా తనకు తానై వలచిన ఆ వనితా సుఖం ఆస్వాదిస్తూ, ఆమెకి భయాన్ని పోగొడుతూ, అపార రతి సౌఖ్య విశేషాలతో ఆమెను తృప్తిపరచి, ఆ రాత్రి తృటిలో గడిపేశాడు.

తెలతెలవారుతూంటే, మందిమాగధ బృందాలు ఆ రాజదంపతులను మేల్కొల్పడంతో లేచి, ప్రాతఃకాల కృత్యాలు తీర్చుకున్నారు. ఆ అడవిలోని ఉషోదయ వేళ వీచే పిల్లగాలులు హాయిగా దేహాన్ని తాకుతూంటే ఆరు బయట ఆసనాలు వేసుకుని కూర్చొని వనసౌందర్యాన్ని చూస్తూ గడపసాగారు.

ఇంతలో ఒక దళవాయి వచ్చి, "దేవా! రాత్రి తమ ఆజ్ఞ మేరకు ఈ అరణ్యంలో చాలా జంతువులు వేటాడాము, కొన్నిటిని పట్టుకున్నాము. కొన్ని క్రూరమృగాల్ని అరణ్యపు గర్భంలోనికి తరిమేశాం! మా ఇష్టంవచ్చినంత సందడి చేసి అసలు వింత మృగం కోసం ఎంతో ఎదురుచూశాం! అయితే – అదొక్కటే మాత్రం మాకు చిక్కలేదు. నిజంగానే అది ఎక్కడికో పోయి ఉండాలి. లేకపోతే దొరక్కుండా ఉంటుందా? మా దృష్టి దాటి వెళ్లిన జంతువు ఒక్కటీ లేదు. కనుక మనం వచ్చిన పని ముగిసిందిగా భావించి, రాచనగరుకు వెళ్లిపోవచ్చు"! అని రాత్రంతా వలలు వేసి పట్టినవీ– బాణాల్తో కొట్టినవీ– కుక్కలద్వారా రాబట్టినవీ ఎన్ని మృగాలైతే ఉన్నాయో, అవన్నీ ఆ ప్రభువు ఎదుట పెట్టించాడు.

అవి చూసి రాజు చాలా వేడుకపడి, అందులో కొన్ని వేటాడినవారికి కానుకలుగా ఇచ్చి, "సరే! మీ మాట ప్రకారం నగరానికే వెళ్దాం! సేనల్ని తిరుగుప్రయాణానికి సన్నాహాలు చేయండి" అని ఆనతిస్తుండగా అక్కడకు కొద్ది దూరంలో " హా ప్రాణనాథా! హా జీవితేశ్వరా! అయ్యో! ఏమైపోయావో గదా! నిన్ను ఊరకే మృత్యుదేవతనై లాక్కొచ్చాను. ఎంత పాపాత్మురాలిని" అని ఏడుస్తున్న ధ్వని ఒకటి వినిపించింది.

ఆ దీనాలాపాలను అందరూ ఆశ్చర్యంగా విన్నారు. మళ్లీ అదే రీతి శోకాలు వినిపించడంతో అందరూ అదిరిపడి, భటుల్లో కాస్త చురుకైన వారిని పిలిచి ఇంద్రద్యుమ్నుడు అదేమిటో తెలుసుకొని రమ్మన్నాడు. వాళ్లు ఇలా వెళ్లిన వారు అలా వచ్చి "ప్రభూ! మేము ఆ రొద వస్తూన్న దిక్కుగా చాలా వేగంగా వెళ్లాం! ఆ దారిన ఒక చెట్టు దగ్గర ఒక స్త్రీ కనిపించింది. తన పైట చెంగునే మెడకు చుట్టుకొని, చెట్టుకొమ్మకు అది తగిలించి తన ప్రాణ నాధునే తల్చుకుంటూ ప్రాణాలు తీసుకోబోతుంది. ఆమె సాహసానికి మేం ఆశ్చర్యపోతూ, గబగబా, ఆమె చీర మెడకు ఉరిలాగ బిగుసుకోకుండా అడ్డుకున్నాం!

"అమ్మా! నువ్వెవరు? ఎందుకింత ఘోరసాహసం? నీకు అంత కష్టం ఏమొచ్చింది? నీ భర్తకు ఏమైంది?" అని మేము ఎంత బ్రతిమాలినా, జవాబు చెప్పింది కాదు. ఆమె చాలా దూరమే ప్రయాణించిందన్నట్లుగా ఆమె ప్రక్క నిలబడి చెమటలు కక్కుతున్న గుర్రాన్ని బట్టి చెప్పవచ్చు! ఆహా! ఆమె అందాన్ని ఏమని వర్ణించడం? చూడబోతే దివ్యస్త్రీ అనిపిస్తోంది. ఆ విషయం తర్వాత ఆలోచించవచ్చు! ఆమె ప్రాణాలు తీసుకోకుండా, తాము త్వరగా వెళ్లి రక్షించాలి" అని అన్నారు భటులు.

దీనజనుల్ని రక్షించడానికి కంకణం కట్టుకున్నట్టి ఆ ప్రభువు వాళ్ల మాట విని – భార్య తనను కూడా తీసుకెళ్లమని బ్రతిమాలుకొంటున్నప్పటికీ పట్టించుకోకుండా, చాలావేగంగా గుర్రమెక్కి ఆ దీనాలాపాలు వచ్చిన దిక్కుగా వెళ్లిపోయాడు. "తనను తన మట్టుక్కు వదిలెయ్యమని – పాపాత్మురాలిన్నేను. నన్ను ముట్టవద్దనీ" ఆమె పెనుగులాడుతుండగా, ఆమెను ఊరడిస్తూనే మెల్లగా ఉరి నుంచి ఆమెను తప్పించి, చల్లని మాటల్తో సేద తీర్చాడు.

"తల్లీ! నువ్వెవరు? నీ తల్లి దండ్రులెవరు? నువ్వెరివి ఇల్లాలివి? నీ పేరేది? ఇంత చక్కని రూపలావణ్యాలున్న నువ్వు అంతఃపురాల్లో చెలికత్తెలు సపర్యలు చేస్తూండగా నివశించవలసినదానివి గాని, ఒంటరికత్తెగా ఈ అడవుల్లోకి రావలసిన కారణం ఏమిటి? నీ కాపురం ఎక్కడ? నీ చందం చూస్తూంటే పతీవియోగంతో దుఃఖిస్తున్నట్లు కనిపిస్తున్నావు. నేను

ఇంద్రద్యుమ్నుడిని. రాజును. వేట కోసం ఈ అడవిలోకి వచ్చాను. నీ శోకం నా చెవులను తాకి, నన్నిక్కడికి రప్పించింది. నన్ను ఇతరులెవ్వరిగానో భావించవద్దు! నీ తండ్రి వంటివాడినే అనుకో! నాకు చేతనైనంత ఉపకారం చేస్తాను. నీ వృత్తాంతం ఆద్యంతం వినిపించగలవు..." అని శాంతంగా అతడు పలికేసరికి, ఆమె అతడి ప్రఖ్యాతిని అంతకు ముందే విని ఉన్నందున, దీనంగా మొక్కి తన వృత్తాంతం చెప్పనారంభించింది.

## విశాలాక్షి కథ

"అయ్యా! మందభాగ్యురాలిని. నా వృత్తాంతం వినడం వల్ల, తమ మనస్సు వికలమవుతుందే తప్ప ప్రయోజనం ఉండదు. అయినప్పటికీ రాజుగా దీనుల మొరలు ఆలించడం ఉత్తమధర్మం కనుక మీరడిగినా - నేను చెప్పడం ఎంతవరకు సమంజసమో అర్థం కావడం లేదు. నాకిప్పుడు మరణం తప్ప వేరే దారి లేకనే, ఈ కఠోర నిర్ణయం తీసుకున్నాను. బలవన్మరణం పాపమని తెలుసు! అయినా తప్పదు. మీ మాటలవల్ల బంధుదర్శనం చేసినంత భావన కలిగి, నా సంతాపం కొంత తగ్గింది. నా కష్టాల పరంపర వినిపిస్తా- వినెదురు గాక! నేను కాశీరాజైన హేమాంగదుని కూతుర్ని. విశాలాక్షీ వరప్రసాదము వల్ల పుట్టినందున నాకు ఆ అమ్మవారి పేరునే "విశాలాక్షి" అని పెట్టారు మా తల్లిదండ్రులు. కాశీపురం అంటే విద్యామందిరమే అని జగత్ప్రసిద్ధి కదా! నా రూపానికి తగ్గ విద్య కూడా ఉంటే, అలంకారంగా ఉంటుందని భావించిన మా తండ్రిగారు, నాకు మాటలొచ్చినా నాటి నుంచే, అక్కడి ప్రసిద్ధ పండితులతో నాకు విద్యాబుద్ధులు చెప్పించడం మొదలెట్టారు. దానితో ఇటు వయస్సుతో పాటు, నాకు విద్య కూడా అభివృద్ధి చెందింది. నా విద్యాగ్రహణ ప్రావీణ్యతకి విద్వాంసులే అబ్బురపడేవారు. పదహారేళ్లు వచ్చేసరికి నాకు విద్యలన్నీ పూర్తయ్యాయి.

అప్పుడు మా తండ్రి ఎంతో ఆనందించి, నాకు తగిన జోడు అన్పించే వరుని కోసం అన్వేషించసాగాడు. ఒక్కొక్క రాజకుమారునిలో ఒక్కొక్క మంచి గుణం కనిపించేది గాని, సర్వ గుణం - లక్షణ సంపన్నులు ఎక్కడా దొరకలేదు. "అమ్మాయీ! నీకు ఎలాంటి వరుడు కావాలి?" అని

నా తండ్రి నన్ను ప్రశ్నించినప్పుడు – "తండ్రీ! వరునిలో విద్యా–రూప–శీల సంపద ముఖ్యంగా చూడాలంటారు కదా! వీటిలో మొదటిది విద్య. శాస్త్ర పరిజ్ఞానం లేనిచోట ఎంతప్రజ్ఞ ఉన్నా, అది పుటం పెట్టని బంగారమే అవుతుంది. ప్రకాశించదు. అలాగే – బుద్ధి హీనుడైన వాడికి ఎంత సంపద ఉన్నా ప్రయోజనం శూన్యం. కనుక విద్యాబలం గలవాడే ఉత్తముడు. రెండోది శీలం. ఇది లేనివాడు ఎంత విద్యావంతుడైనా – పడగ మీద మణి ఉంటే ఎంత ప్రయోజనముంటుందో అదీ అంతే! తర్వాతది రూపం– సాముద్రిక శాస్త్రం ప్రకారం, చక్కని రూపం గలవాడికి అన్ని గుణాలు పువ్వులోని తావిలా అబ్బుతాయి. ఇది నిరూపితమైనది. త్యాగానికీ – భోగానికీ సంపద కావాలి గాని, పై మూడూ ఉంటే సంపద అదే చేరుతుంది. అన్ని నాకు తెలుసునని చెప్పడం – మిమ్మల్ని పెద్దల్ని అవమానించినట్లవుతుంది. కనుక లౌకిక మర్యాదలు నా కంటె బాగా తెలిసిన మీకు నేను చెప్పగలిగేదాన్ని కాను. అన్నీ విచారించి మీరే నిర్ణయించండి" అని చెప్పాను.

ఆయన నాకు తగిన వరుణ్ణి వెతకాలని తీవ్రప్రయత్నం చేసి, నానా దేశాలకూ దూతల్ని పంపించాడు. ఇంతలో – నేనొక రోజు సాయంకాల సమయంలో, నా ఇష్టసఖి వెంటరాగా, పల్లకీ మీద కేదారేశ్వరుని ఆరాధించడానికి వెళ్తున్నాను. దారిలో ఒక స్నాన ఘట్టం వద్ద గంగానదీ మెట్ల దగ్గర కూర్చున్న కొందరు పండితులు, గంగానది పైనుంచి వీచే చల్లనిగాలి తరంగాలు శరీరానికి హాయి కలిగిస్తూంటే శాస్త్ర చర్చలు చేస్తున్నారు. ఆ చర్చలు నా చెవులకు అమృతంలా తోచి, పల్లకి తెరలు కొద్దిగా పక్కకు జరిపి చూశాను. చుక్కల్లో చంద్రుడిలా వారి మధ్యలో ఒక విప్రకుమారుడు నాకు కన్నులపండుగ్గా ఆకర్షించాడు. ఈశ్వరుడిని ప్రసన్నం చేసుకోవడానికై గంగాతీరానికి తపస్సు చేసుకోదలచి వచ్చిన మన్మథుడో– జయంతుడో అయి ఉంటాడనుకున్నాను. అంత అందంగా ఉన్నాడా యువకుడు.

బ్రాహ్మణునికి విద్వత్ ఉండటమే రాజయోగం అంటారు. ఇలాంటి సుందరాకారుడు ఈ ఊళ్లోనే ఉండగా, నా తండ్రి ఎక్కడెక్కడో వెతకడ మేమిటి? భక్త జన సులభుడైన ఆ కేదారేశ్వరుడే ఇతణ్ని నాకోసం తెచ్చాడేమో!

అని ఒక్కక్షణం అనిపించింది. విద్యారూపాలున్నట్లు సంపద ఉన్నదా? అని నేను ఆలోచించలేదు. నేను అతడ్ని వరిస్తే, మా తండ్రిగారి రాజ్యానికి అతడే కాబోయే ఏలిక అవుతాడు. త్రికరణ శుద్ధిగా ఇతడే నాకు భర్త అని నిర్ణయించేసుకున్న తర్వాత, నా ప్రాణసఖిని ఒకదాన్ని అక్కడికి పంపి, అతడి వివరాలు తెలుసుకోమన్నాను. నేను మాత్రం కేదారేశ్వరుని ఆరాధించి అంతఃపురానికి వెళ్లిపోయాను.

మహాప్రభూ! స్త్రీ చిత్తం ఎంత చంచలమైనదో చూశావా?! ఇంత చదివినా, నా వివేకం అంతా ఏమైపోయిందో!? కులం - శీలం తెలికుండానే నేను అతడ్ని వరించేశాను. నా సఖి వివరాలతో నా దగ్గరకు రాగానే నేను ఆత్రపడి "సఖీ! ఆయన్తో మాట్లాడావా? పండితుడేనా?ముఖ విలాసం చూస్తూంటే మరోలా తోస్తోంది త్వరగా చెప్పు" అని తొందర చేశాను.

"అమ్మాయీ! కొత్తవారిని పూర్తిగా తెలుసుకోకుండా, వారి పైన మనస్సారక పారేసుకోవడమేనా? మనం ఎంత తెలిసిన వారమైనా, పెద్దవాళ్ల అనుమతి లేకుండా స్వతంత్రించకూడదు! సరే! అక్కడ జరిగింది చెబుతాను- విను!నేనా పండితుల సమూహం ఉన్నచోటుకు వెళ్లి అందరికీ దండాలు పెట్టి, వారి చర్చ వినాలన్న కుతూహలంతో అక్కడ కొంతసేపు ఉండడానికి అనుమతి వేడాను. నా వినయానికి సంతసించి వారు సరేనన్నారు. నువ్వుకోరిన చిన్నవాడు ఆ ప్రసంగం మధ్యలో ఎక్కడయినా కల్పించుకుంటాడేమో! అప్పుడాతని ప్రజ్ఞ అంచనా వేయవచ్చునని నేనెంత సేపు చూసినా, అతడు నోరు మెదపడే! అతడి నోట్లోంచి ఒక్కమాటైనా వచ్చిందికాదు. దీన్నిబట్టి వారి శాస్త్రవాదాల సంగతి అతడికేమీ అర్థం కాలేదని నా ఊహ! అందరి ప్రసంగం ముగిశాక, ఎవరిళ్లకి వాళ్లు వెళ్లిపోతూంటే నేనాయన వద్దకు వెళ్లి ఆయన ఊరూ-పేరూ అడగ్గా ఆ రెండూతనకు తెలీవన్నాడు. పోనీ ఏం చదివారని అడిగితే "శబ్దాలు చదూతున్నాను. మా గురువుగారు నన్ను కింశుకశాస్త్రి అంటారు" అన్నాడాయన.

అప్పుడు, నేను, నన్నాయన పరిహాసం చేస్తున్నాడు కాబోలు అనుకుని 'నవ్వులాటకు కాదనీ - ఒక పని ఉండి అడిగాననీ' వినయంగా చెప్పాను. ఆయన ఇంకోమాట మారుపల్కక అక్కడ్నుంచి లేచి వెళ్లిపోయాడు.

ఇక-నేను చేసేదేమీలేక, ఆయన చెప్పిన మాటలనే మాటి మాటికీ స్మరించుకుంటూ నీ దగ్గరికొచ్చాను. అతడు నీకు తగడు. వెర్రివాడిలా ఉన్నాడు" అందామె.

నేను నా సఖినే మందలించి "నీ అంచనా తప్పు! ఆయన పూర్తిగా శ్లేషలో మాట్లాడాడు. అతడు మాట్లాడకపోవడానికి కారణం - అతడు శాంతగంభీర హృదయుడై ఉండటమే! విద్వాంసులకు ఒక దేశం అని - ఒక నామం అని ఉండవు. అన్ని దేశాలూ - అన్ని పేర్లూ తనవే అన్నట్లుగా 'నాగ్రామం - నాపేరు నాకు తెలీవు' అన్నాడు. సకలశాస్త్రాలు శబ్దజాలమే కనుక 'శబ్దాలు చదువుతున్నాను' అన్నాడు. కింశుక శాస్త్రి అనడంలో ఒక 'స్వాతిశయశూన్యోక్తి' కనిపిస్తోంది. గొప్పవారు ఆత్మస్తుతి చెయ్యడానికి ఇష్టపడరు" అని నాకు తోచిన అర్థాన్ని తీసుకోవడమేగాక, అతడెంతో గొప్ప విద్వాంసుడని ప్రగాఢంగానమ్మి, ఏంచేసి అయినాసరే! అతడ్ని తప్ప ఇతరుల్ని పెళ్లాడానని భీష్మించుకున్నాను.

ఇంతగట్టిపట్టు నేను పట్టేశాక, నాతండ్రి ఇంకేం అనగలడు? నా అభీష్ట మెట్లాఉంటే అట్లాగే చేయాలని, ఆ పండితునికోసం దూతలను పంపించాడు. మన్మధునికి మారురూపుడా అన్నట్లున్న ఆ మోహనాంగుడిని చూసి, మాతండ్రి కూడ సంతృప్తిచెంది, రూపానికి తగ్గ లక్షణాలతో పాటు విద్యలేనిదే సాటి పండితులతో కూర్చోడని భావించి - పాండిత్య పరీక్ష లేమీ లేకుండానే, అతడికి నన్ను ఇచ్చి కట్టబెట్టాలనుకున్నాడు. అన్నీ త్వరత్వరగా నిర్ణయమైపోయాయి.

వివాహం కూడా జరిగిపోయింది. అతడ్ని కాశీలో 'కింశుక శాస్త్రి'గానైనా గుర్తెరిగినవారు ఒక్కరూలేరు. ఎక్కడివాడో గాని - ఒక చక్కని రాకుమారుడు రాజపుత్రికకు తగినవాడు జోడీగా దొరికాడని మాత్రం అంతా సంతోషించారు. అతడి సౌందర్యాన్ని మాత్రం అందరూ పొగిడేవారే! తండ్రివంటి వాడివి కనుక నీతో చెప్పడానికి సంకోచించ కుండా నిజం చెబుతున్నాను. వివాహం అయింది. తదుపరి కార్యం కూడా కానివ్వడానికి చక-చకా ఏర్పాట్లు జరిగిపోయాయి. నేను సిగ్గుపడుతూ మంచం దగ్గర

నిలబడినా, అతడదేం పట్టనట్లు దుప్పటీ దులుపుకొంటూ పక్కసర్దుకోసాగాడు. నేనే చొరవ చేసి, అతడ్ని పట్టుకున్నాను. అందుకాతడు భయపడ్డాడు. నేను మెల్లగా ఆయన పాదాల దగ్గర కూర్చొని పాదాలు వొత్తబోతే, కాళ్లు ముడుచుకున్నాడు. నేను ఆయనకు గంధం రాస్తే తుడిచేసుకున్నాడు. నా మీద అలిగాడేమో అనుకుని నానా సపర్యలూ చేసి వీణమీద కమ్మని కీర్తన ఒకటి పాడాను. దేనికీ అతడిలో మెప్పుదల లేదు. నా చేత్తో నేను కొన్ని భక్ష్యాలు అందించగా, అవి మాత్రం ఆరగించేసరికి, ఇక కోపం తీరినట్లే అనుకుని, వాటినే వద్దనే దాకా ఇవ్వసాగాను. పాలు కావాలా అని అడిగి అవీ ఇచ్చేసరికి అవన్నీ తాగేశాడు.

ఇక అప్పుడు నేను మంచం మీద కూర్చున్నాను. దాంతో అతడు భయపడ్డవాడిలా ఒక మూలకు జరిగి కూర్చున్నాడు. 'ఇంకా అలుకేనా' అంటూ నేనే తగ్గి, తప్పులుంటే మన్నించమని ఆయన కాళ్లపై పడ్డాను.

అప్పుడా బుద్ధిమంతుని నోట్లోంచి ముత్యాలు రాలినట్లు మొట్టమొదటి సారిగా వచ్చిన మాటలు 'ఆహా! నా దౌర్భాగ్యానికి ప్రతీకల్లా'గ వినవచ్చాయి. ఏం చెప్పమంటావు ప్రభూ! "ఏమమ్మోయ్? కోపం వచ్చిందా అంటావు, అలిగేవా అని అడుగుతావు. నా కోపపు పనులు నీకేం కన్పించాయో చెప్పు! నువ్వు పెట్టిన అప్పాలు తిన్నాను. పాలు తాగాను. ఇంకా ఏం చెయ్యమంటావో చెప్పు! చేస్తాను. నువ్వు గొప్ప దానివి కాబట్టి, నా కాళ్లుపట్టుకోవద్దన్నాను. పెళ్లి చేస్తామంటూ తీసుకొచ్చారని, వచ్చానుగానీ – నువ్విలా నిందిస్తావని తెలిస్తే ముందే రాకపోదును. ఇప్పుడైనా పొమ్మంటే పోతాను" అంటూ అతి మూర్ఖంగా పలికే అతని మాటలు వింటూంటే, కొంతసేపటి వరకూ నాకేం తోచలేదు. ఆ తర్వాత అతడు గుర్రు పెట్టి నిద్రించాడు.

నా ప్రారబ్ధం ఇలా ఉంటే, ఇంకోలా ఎట్లా జరుగుతుంది? ఇతడికీ ప్రపంచపు ధోరణే ఏమీ తెలీదు. అందుకే వీని గురువు కింశుక శాస్త్రి అని తగిన పేరేపెట్టాడు. అయ్యో! కేదారనాథా! నిన్ను సేవించినందుకు ఇదా నాకు ఫలితం? అయ్యయ్యో! విశాలాక్షి! నీవరాన పుట్టిన నాకు ఇటువంటి

వెర్రి మొగుడ్ని కట్టబెట్టావా? విశ్వనాథా! నీవు ప్రేయసికి ఇష్టుడివంటారే! నువ్వయినా దయతల్చకపోతివే!.... ఇలా రకరకాలుగా నన్ను నేనే శాంతింపచేసుకుంటూనే, కన్నీళ్లతో ఇంకా ఆశవదలక "అయ్యో! నీతో పరిహాసానికి అలా రాత్రి అన్నానేగాని, నీమీద నాకు కోపం ఎందుకుంటుంది చెప్పు!? నువ్వెవరు? ఎవరి కుమారుడివి? నీ దేశమేది? ఈ ఊరు ఏ పనిమీద వచ్చావు? ఇంతకు పూర్వం ఏం చదువుకున్నావు. ఇప్పుడేం చదువుతున్నావు?" అంటూ ఒకదాని తర్వాత ఒకటిగా ప్రశ్నలన్నీ సంధించాను. "అమ్మా! అవి ఏవీ నాకు తెలీవు. నువ్వు అడిగిన ప్రశ్నలు ఒకటి గుర్తుంటే ఒకటి గుర్తుండక వెంటనే మర్చి పోయినట్లుగానే, 'రామ' శబ్దం ఆరు మాసాలనుంచీ చదువుతున్నాను. ఇంకా రాలేదు"- అని చెప్పేసరికి నా కర్మమింతే అని మనస్సు రాయిచేసుకున్నాను.

"బ్రాహ్మణుడా! నువ్వు నన్ను అమ్మా అని పిలువకూడదు. నేను నీకు భార్యని. భార్య అంటే ఎలాంటిదో ఎరుగుదువా?" అనగా, తెలీదన్నట్లుగా తల ఊపాడు. అప్పుడు నేను గుండెలు బాదుకుంటూ "భళిరా- దైవమా! నా విలాసాలన్నీ అడవిపాలు చేశావు కదా!' అని నిట్టూర్చి 'బ్రాహ్మణుడా! భార్య అనగా ఎన్నడూ విడువదగనిది - కావున నువ్వు నన్నెన్నడూ విడువవద్దు! అంతేకాదు! నువ్వు చెయ్యవలసిన పనులు కొన్ని ఉన్నాయి. నేను చెప్పినట్లు చేస్తావా?" అని అడగ్గా అందుకు ఒప్పుకున్నాడు.

అప్పుడు నేను పువ్వులు నలుపుకొని, శరీరం మీద నాకు నేనైనఖ, దంతక్షతాలు ("రతి' గుర్తులు) వేసుకుని, మదనుడింత నిర్దయుడైనాడేమని చింతిస్తూ, 'గుట్టు బయటపడితే ప్రయోజనం ఉండదని - నలుగురూ నవ్వడమే కదా అందుకు కలిగే ఫలితం' అని చింతిస్తూ ఆ మూడు నిద్రల ఘట్టం ఏదోలా తెల్లవారించాను. కల్లోకొచ్చిన ఓ ముత్తయిదవ 'నీకు మేలగును' అని దీవిస్తే, నాకు నవ్వొచ్చింది కూడా!

అది మొదలు కింశుక శాస్త్రిని ఎక్కడికీ పోనివ్వక, రోజూ నేనే లోకవ్యవహారాలు నేర్పుతూ వచ్చాను. అయితే ఏరోజుకారోజే అతడికున్న మతిమరుపు వల్ల ప్రతిరోజూ చెప్పినవే చెప్పాల్సి వచ్చేది. ఇలా కొంతకాలం

గడిచేసరికి, నా దురదృష్టం కొద్దీ అంతఃపుర రహస్యం వెల్లడయ్యే రోజులు వచ్చి, నా తల్లిదండ్రులు మరణించడంతో - మంత్రులు నా భర్తకు పట్టాభిషేకం జరిపారు. ఎంతో చాకచక్యం ఉంటే తప్ప, రాజ్య వ్యవహారాలు నిర్వహించడం అంత సులభంకాదని - ప్రభువులు మీకు తెలిసిందే! అసలు లోకవ్యవహారమే తెలీని నా మగని తెలివిహీనతను నేను ఎంత కాలం కాపాడుకొని రాగలను? అతడు వట్టి మూఢమతి అని అందరికీ వెల్లడైపోయింది.

ఒక రాజు ఇంత వివేకశూన్యుడై ఉండగా, అది పొరుగు రాజ్యాలకు ప్రాకకుండా ఉంటుందా? అనాయాసంగా లభించగల దానికి ఆశపడకుండా ఉంటారా? శత్రురాజులంతా ఏకమై దండెత్తి రానున్నట్లు వార్తలొచ్చాయి. మంత్రులంతా ముక్తకంఠంతో నా మగడు రాజుగా ఉండ తగడని బాహాటంగానే చెప్పుకోసాగారు. 'శత్రురాజు లేకమై మన కాశీ నగరాన్ని ముట్టడిస్తున్నారని' వాళ్లంతా నాకు సూచన చేసినా, నేనేం చెయ్యగలను?

ఇక ఆ రాత్రి కోటను కూడా ముట్టడిస్తారని అర్థమైంది. ఉన్న సేనలన్నీ నగరం శివార్లలో శత్రుసేనల్తో పోరుతున్నాయి. కోట రక్షణ అసాధ్యం అని తేలిపోయింది. శత్రుసేనలు అంతఃపురంలోకి వస్తే, నా భర్త అసమర్థత వల్ల నన్ను చెరపట్టకమానరు. అదీగాక - వాళ్లందరూ ఒకప్పుడు నేను వరించలేదని నాపై ఈర్ష్యపెంచుకున్న రాజకుమారులకు చెందిన సేనలే! ఇక - ఎవరిత్రోవ వారుచూసుకోక తప్పదని - రాజ్యం పరహస్తగతం కానున్నదనీ అర్థమైంది.

'ఇటువంటి విపత్కర పరిస్థితుల్లో కోటదాటి వెళ్లిపోవడానికీ - తప్పించుకోవడానికీ రహస్యమార్గాలుంటాయి'... అని గుర్తుకొచ్చింది నాకు వెంటనే తత్సంబంధ గ్రంథాలు వెతికించగా తప్పించుకుపోయే మార్గం గురించి తెలిసింది. అప్పుడు నేను ఎవ్వరికీ తెలీకుండా విలువైన కొన్ని రత్నాలను- నా మగనినీ తీసుకొని పుస్తకంలో ఉన్న ప్రకారం వెళ్లి గుర్రంమీద బైటకు పోయే రహస్యపు మార్గంలో ప్రయాణించసాగాను.

ఆ బిలంలో తగినంత కాంతి ఉంది. నా భర్తకు గుర్రపు స్వారీ తెలీదు. నేనేమాత్రం వేగం పెంచినా, అతడు భయంతో అరవసాగాడు. తొందరగా వెళ్లకపోతే బిలం దాటలేం! గుర్రాన్ని మెల్లగా నడిపిస్తూ – మధ్య మధ్య తెచ్చుకున్నవి తింటూ రాత్రీ – పగలూ తేడా తెలీనంతగా కొన్నాళ్లు ప్రయాణించాం!

నిన్నసాయంత్రానికి ఈ అడవిలోని ఒక కొండ శిఖరానికి వచ్చాం! అక్కడో విచిత్రమైన కవాటం ఉంటే, పుస్తకం చూసి అందులో చెప్పినట్లుగానే దాన్ని తెరిచాను. ఆ పుస్తకాన్ని గుమ్మంచాటున పెట్టాను. ఎందుకంటే – ఆ రహస్య బిల విశేషములు – పరిమాణములు ఎన్నెన్నో ఆ గ్రంథంలో రాయబడిఉన్నాయి. అయితే – ఆపదలో మునిగి ఉన్న నాకు, వాటిని కూడా చూడాలన్న ఆలోచన రాలేదు. నిన్నసాయంకాలానికి ఈ అడవిలో ఉన్నట్లు చెప్పానుకదా! ఒక చేత్తో గుర్రపు కళ్లేన్ని, ఇంకో చేత్తో నా భర్తని పట్టుకొని, మెల్లగా ఆ కొండశిఖరం దిగి, భూమార్గం పట్టినడవడం ప్రారంభించాం! కొండ దిగేసరికే చీకటి పడింది. క్రూరమృగాల భయంతో మేము ఆ గుర్రంమీదనే ఉండిపోయాము.

అంతలో ఏదో జంతువు భయంకరంగా అరవడంతో గుర్రం బెదిరింది. నేనెంత గట్టిగా లాగినా, ఆగకుండా వేగంగా పరుగెత్తింది. అది, మొదటిసారి వేసిన గంతులోనే నా మగడు కింద పడిపోయాడు. ఏంచేసినా నేను గుర్రాన్ని నిలువరించలేకపోయాను.

ఇక్కడి కొచ్చాక గానీ గుర్రం ఆగలేదు. ఆయన పడినచోటు ఇక్కడికి ఎంతదూరంగా ఉన్నదో కూడా నాకు తెలీదు. పాపం! ఆయన నేనేం చెపితే, అది మాత్రమే చేసేవాడు. నా మాటను ఎప్పుడూ అతిక్రమించి ఎరుగడు. దైవంలాంటి భర్తని చంపుకున్న పాపాత్మురాల్ని ఇక ఈ జన్మానికి నాకు సుఖం శూన్యం అని తలచి, ప్రాణం పోగొట్టుకుందామని ఉరిబిగించుకుంటూంటే మీ భటులు వచ్చి ఆటంకపరిచారు. తర్వాత స్వయంగా మీరేవచ్చారు. ఇదీ నా వృత్తాంతం" అని చెప్పిందా యువతి.

ఆ విశాలక్షి వృత్తాంతం విన్న ఇంద్రద్యుమ్నుడు, రకరకాలుగా బాధపడుతూ "అయ్యో తల్లీ! నువ్వా! నీ తండ్రి నాకు పినతల్లి కొడుకే! అతడి మృతివార్తయినా నాకు చేరింది కాదే! అయ్యయ్యో! నీకెన్ని కష్టాలొచ్చాయమ్మా? చింతించకు! అతడు పడింది ఇసుక నేల అయివుండవచ్చు! నీ పెనిమిటి ఎక్కడున్నా త్వరగా వెతికించి, నీకు సంతోషం కలిగిస్తాను. నాతో పద! శిబిరంలో మీ పినతల్లి నాతోనే ఉంది" అని ఓదార్చుతున్నంతలోనే, తన శిబిరం వద్ద ఏదో కోలాహలధ్వని వినిపించింది.

కొందరు భటులు తమవైపే పరుగెత్తుకుంటూ వచ్చి"స్వామీ! వింత సింహం మన సేనలన్నిటినీ చెల్లాచెదరుచేసింది. ఏనుగులు-గుర్రాలు కట్టుతెంచుకుని పరిగెడుతున్నాయి" అని చెప్పడంతోనే ఇంద్రద్యుమ్నుడు ఆ దిశగా గుర్రాన్ని పరుగెత్తించాడు. ఇంతలో మరికొందరొచ్చి "వింత సింగం ఎక్కడా స్థిరంగాలేదు. అది ఈ వైపుగా పోయింది" అని చెప్పారు.

అప్పుడు రాజు గుర్రాన్ని ఆ దిక్కుగా పరుగెత్తించాడు. మర్నాటికి కూడా సింహం కనిపించలేదు. ఆ సింహాన్నెలాగైనా అంతమొందించాలన్న పట్టుదలతో - రోజులుగడుస్తూన్నా లెక్కచెయ్యకుండా అలా గుర్రాన్ని పరిగెత్తిస్తూన్నాడు. ఎట్టకేలకు పదిరోజుల తర్వాత ఓ కోయపల్లె కనిపించింది.

"ఈ అడవిలో తిరుగుతూన్న సింహం మీ వైపుగాని రాలేదుగద" అని అడిగాడు ఇంద్రద్యుమ్నుడు.

అందుకు వాళ్లు "సింహం వచ్చి పదిరోజులైంది. మేముదాని మాంసమే తింటున్నాం! సింహం పీడ విరగడైనందున, హాయిగా పండుకోగలుగుతున్నాం" అన్నారు. ఇంద్రద్యుమ్నుడు ఆశ్చర్యపోతూ" సింహం చచ్చిందా? దాన్ని చంపిందెవరు? మా యోధుడా? మరొకడా?" అడిగాడు.

"అది మాకు తెలీదు దేవరా! పదిరోజుల క్రిందట మా వాళ్లకి పుంతదారిలో ఒకడు పడుండి కనిపించాడు. వాడి మొలలో కత్తిఉంది. స్పృహమాత్రం లేదు. మంచి దుస్తులు ధరించి ఉన్నాడు. మావాళ్లు అతడికి

చికిత్స చేశారు. అతడు మాట్లాడబోతుంటే "సింహం -సింహం" అని అరుస్తూ ఈ పల్లెవాళ్లంతా పారిపోసాగారు.

అతడు ఏమాత్రం జంకు-గొంకు ల్లేకుండా "భయపడకండి" అంటూ ఒరలోంచి కత్తి తీసి సింహానికి ఎదురుగా వెళ్లి చంపేశాడు. దాని మీది కసికొద్దీ, ఈ వెళకీ దాని మాంసమే తింటున్నాం! అవలీలగా దాన్నా వీరుడు చంపేశాడని మేమెంత పొగిడినా అదేం పట్టించుకోకుండా, తన దారిన తానేదో ధ్యానించుకుంటూ వెళ్లిపోయాడు" అని చెప్పారు.

అతడు విశాలాక్షి భర్తేమోనని అనిపించింది రాజుకు ఒక్క క్షణం. అంతలోనే 'ఆమె భర్త నిజంగా అంతటి వీరుడే అయితే, ఆమెకింక దిగులెందుకుంటుంది?' అనుకుంటూ సింహం ధ్యాసలో విశాలాక్షిని వదలి వచ్చినందుకు విచారిస్తూ, ఆ దిక్కుకు వేగంగా వెళ్లాడు.

నాల్రోజుల్లో అక్కడికి చేరగా, శిబిరం ముక్కలై ఉంది. ఏనుగులు, గుర్రాలు, కాల్బలం నగ్గు-నగ్గు అయి ఉన్నాయి. భటుడొక్కడూలేడు. తాను రాణిని అడవిపాలు చేసినందుకు శోకిస్తూ, కొంచెం దూరం వెళ్లగా - ఒక చెట్టుమీంచి అతని పరిచారకుడొకడు" స్వామీ!" అంటూ దిగి వచ్చి" ఆ వింతసింగం ఏమాయో?" అని అడిగాడు.

"అది చచ్చి పదిరోజులైంది. సరేగాని, నా పట్టమహిషి క్షేమంగా ఉందా?" అని ఆత్రంగా అడిగాడు ఇంద్రద్యుమ్నుడు.

"ఆ జంతువు విజృంభించడంతోనే, రాణిగారి చుట్టూ బలగంకమ్ముకుని ఓ కాపు కాశాం ప్రభూ! కొందరు భటుల్ని తోడిచ్చి సేనాపతి, వారిని పట్నం పంపేశాడు. వార్త అందించడానికి నేనిక్కడ మిగిలాను - సింగం వల్ల ప్రమాదం ఉందని చెట్టెక్కాను" అన్నాడు వాడు.

తన భార్యకేమీ ఆపద వాటిల్లనందుకు సంతోషించి, ఆ వింత జంతువు ఎలా చచ్చిందీ వాడికి చెప్పి, వాడి భయం పోగొట్టి, రాజ్యనిర్వ హణభారం వహిస్తున్న యువరాజుకిమ్మని ఒక చీటీ రాసి వాడికిచ్చిపంపాడు.

విశాలాక్షిని వెదుకుతూ బయల్దేరాడు ఇంద్రద్యుమ్నుడు. గుర్రపుడెక్కల జాడల్నిబట్టి కొంతదూరం అడవిలోనికి వెళ్లి "విశాలాక్షీ!" అని కేకవేశాడు. కోయపల్లెలకు వెళ్లి ఆమె గుర్తులు చెప్పి ఆమె గురించి అడిగాడు.

ఆ అరణ్యం చాలా పెద్దది. దానిలో అణువణువు గాలించడానికి అతనికా గుర్రం మీద ప్రయాణమే ఆర్నెల్లు పట్టింది. అప్పటికీ ఆమె కన్పించక విసుగొచ్చి, ఆమె గుర్తులు చెప్పిన కొండ శిఖరాన్ని ఎక్కి చూశాడు. మెల్లగా ఆ బిలం దగ్గరకు చేరుకుని, విశాలాక్షి దాచి పెట్టిన పుస్తకం చూశాడు. ఆ పుస్తకం ఆమె పూర్తిగా చూసి ఉండిఉంటే, ఆమె ఆలోచన తీరు మారిఉండేదనిపించింది. ఇంద్రద్యుమ్నుడికి అందుక్కారణం....ఆ గ్రంథంలో రాసిన దాన్ని బట్టి, ఆ కోటనెవరూ వశం చేసుకోలేరు- అంత కట్టుదిట్టమైన ఆ కోటనొదిలి వచ్చిందంటే ఆమె కంగారుగానైనా గ్రంథం తిరగేసి ఉండాలి. లేదా ధైర్యం సన్నగిల్లి పారిపోదల్చుకోనైనా ఉండాలి. తలుపు తెరవకుండా ఉన్నందున - విశాలాక్షి తిరిగి లోపలకు వెళ్లలేదని గ్రహించాడు.

"వాళ్లిద్దర్నీ కలిపిగాని ఇంటికిపోనని శపథం చేశానుకదా! ఇంకా ఇన్నినెలలైనా అడవిలో ఉంటారా? పల్లెలూ - పట్నాలూ కూడా వెతుకుతాను" అని నిశ్చయించుకుని, ఆ దిశగా ప్రయాణించి ఒక పట్నం చేరుకున్నాడు.

అక్కడ తన కెదురైన ఓ వ్యక్తిని, ఆదేశం పేరు - ఆ పట్నం రాజుపేరు అక్కడి రాజధర్మాలు - అన్నీ వివరం కోరగా, అతడిట్లా చెప్పాడు.....

## మళయాళ దేశం కథ

'అయ్యా! ఇది మళయాళ దేశం. దీన్ని సంవత్సరం నుంచి చండవర్మ అల్లుడు సింహకేతుడు పరిపాలిస్తున్నాడు. ఇక్కడి ప్రజలకు శక్తి ప్రధాన దేవత విదేశీయులు ఎవరైనా వస్తే, వాళ్లని దాచి, నవరాత్రి రోజుల్లో బలి ఇస్తుంటారు. ఇక్కడ స్త్రీల పెత్తనం అధికం. అయితే, సింహకేతుడు మాత్రం ధర్మాత్ముడే ! ఏడాదిగా ఈ దురాచారాన్ని కొంతవరకు తగ్గించగలిగాడు. నిన్ను చూస్తుంటే - నువ్వీ చిక్కులేవీ తెలిసిన వాడిలా కనిపించడం లేదు.

ఇక్కడెవ్వరి ఇంట్లోనూ బస చెయ్యవద్దు. సింహకేతుడే విదేశీయుల కోసం ఏడాది క్రితం కొత్తగా ఒక సత్రం కట్టించాడు. అక్కడ సదుపాయాలన్నీ ఉన్నాయి. రాజభటులు, ఈ గ్రామస్థుల మాయలకు విదేశీయులెవరూ చిక్కకుండా కాపలాకాస్తున్నారు. నేనూ నిన్న ఒక పనిమీద ఇక్కడికొచ్చిన విదేశీయుడినే ! ఇంతకుముందు విదేశీయుల్ని బలాత్కారంగా పట్టుకుపోయేవారు. ఇప్పుడు చాలా భాగం తగ్గినా, ఇక్కడ స్త్రీల దగ్గర చాలా జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే మోసపోతారు" అని అక్కడి విశేషాలన్నీ చెప్పాడు.

ఇంద్రద్యుమ్నుడు పట్నంలో ప్రవేశించాడు. అక్కడ వున్న వన్నీ చాలా భాగం మేడలే! మామూలు ఇల్లు ఒక్కటీ లేదు. స్వర్గంలాగ ఉంది. పట్టణమంతా ఐశ్వర్యవంతుల్లాగానే ఉన్నారనుకుంటూ, ఒక మేడ ముందు ఆగి "ఇక్కడికి విదేశీయుల కోసం కట్టిన సత్రం ఎంత దూరంలో ఉంటుంది?" అని అడిగాడు.

ఆ ఇంట్లోంచి వచ్చిన ఒకామె, ఎంతో వినయంతోనూ - ఆదరంతోనూ "అది చాలా దూరంలో ఉంది. మీరు చూస్తే పరదేశస్తుల్లాగానే ఉన్నారు. ఈ రాత్రికి ఇక్కడ ఉండండి! మీరు కోరిన వసతి సదుపాయాలన్నీ సమకూరుస్తాం ! మా ఇల్లు పవిత్రం చేసి, పొద్దున్నే వెళ్లిపోవచ్చు!" అని కోరింది.

"నేను సత్రానికి వెళ్లాలి" అని అతడు ముందుకు సాగి, ఇంకొక మేడముందు ఆగగా, ఆ ఇంటి స్త్రీ కూడా అతడ్ని ఆ రాత్రి తమ ఇంట ఉండవలసిందిగా కోరింది. "నాకు ఆ సత్రంలో పని ఉంది" అని సాగిపోయాడు. ఇలా అతడు ఏ మేడముందు ఆగినా, అక్కడి వారు తమ ఇంట ఆతిథ్యం తీసుకోవలసిందంటూ కోరుతూనే ఉన్నారు. ఇంద్రద్యుమ్నుడు ఎక్కడా ఆగకుండా వెళ్లిపోతూంటే, ప్రజ్ఞావతి అనే ఒక స్త్రీ ఎంతో గౌరవాదరాలతో అతడ్ని ఆకట్టుకున్నది. ఆమె ఆహ్వానించిన తీరుకు ముగ్ధుడైపోయిన రాజు కాదనలేకపోయాడు. ఒక్కరాత్రిలో వాళ్లేం మోసం చేసేస్తారు - లెమ్మని తేలిగ్గా తీసుకుని, ఆ రాత్రికి ఆమె ఇంట బస చేయడానికే ఒప్పుకున్నాడు.

పరిచారికలు ఆ రాజుకు, కాళ్లు కడుక్కోడానికి నీళ్లిచ్చారు. చావడి గుమ్మంలోని పై అరలో తాను తెచ్చుకున్న పద్మావతి కోటకు సంబంధించిన గ్రంథం - తన మూట ఉంచాడు. కాళ్లు కడుక్కుని లోపలికి వెళ్లాడు.

ప్రజ్ఞావతి ఆ రాజును మేడమీదకి తీసుకెళ్లింది. బంగారపు పీఠం మీద కూర్చోబెట్టి, ఉపచారాలు చేసి పిండివంటల్తో భోజనం పెట్టింది. ఆర్నెల్లుగా అరణ్యాల్లో కాయా - కసరూ తిన్న వాళ్లకి పిండివంటల రుచి జిహ్వా లేచి వచ్చేలా తగిలింది. తరువాత పరిచారికలు అతడ్ని పడగ్గదికి తీసుకువెళ్లి, అక్కడున్న హంసతూలికాతల్పాన్ని చూపి, దానిపై శయనించమన్నారు.

ఇంతలో ప్రజ్ఞావతి అక్కడికొచ్చింది. తాంబూలం అందించి, వీణ మీద పాట మొదలెట్టింది. పాట సాగుతూండగా, పరిచారికలు అక్కడ్నుంచి వెళ్లిపోయారు. పాట ఆపి, ఆమె "చాలా దూరం నుంచి వచ్చి ఉంటారు. అలసట తీరేలా పాదాలు ఒత్తమంటారా?" అని అడిగింది.

"ఆమె ఒంటరిగా తన ముందుండుటమే సమంజసం కాదు. పరపురుషుని పాదాలు ఒత్తడం పతివ్రతకు తగదు కదా! మరి ఈమె ఇట్లా ప్రవర్తిస్తోందేం? మలయాళ దేశంలో జారత్వ సంకోచం లేదని వాడుక కదా!" అని మనసులో అనుకుని,"సాధ్వీ! నాకు శ్రమేమీ లేదు. చేసిన ఉపచారమే చాలు! నా పాదాలు అంటవద్దు!" అన్నాడు ఇంద్రద్యుమ్నుడు.

ఆమె పైట సవరించుకొంటూ "మా దేశాచారం మీకు తెలీదు కాబోలు! అతిధిని దైవంగా భావించి అతనేం కోరినా ఇస్తాం!" అన్నదామె.

ఇంద్రద్యుమ్నుడికి విషయం అర్థమైపోయింది. అతడు తటాలున మంచం దిగబోతోంటే, ఆమె "రండి! మంచం మీద పడుకోండి! మిమ్మల్ని అంటుకోను ఒట్టు" అంటూ నిద్రపోయేవరకు వేచిచూసింది.

ఉదయం లేచేసరికి అతడి కాళ్ళకూ - చేతులకూ సంకెళ్ళు తగిలించబడి ఉన్నాయి. ఇనుపతాళాలు వేయబడిన ఒక బోను వంటి దానిలో

తాను ఉన్నాడు. తననీ కారాగారంలో ఉంచడానికి కారణమేమిటో అతనికి అర్థం కాలేదు. ఆమె కోరినట్లు తాను నడుచుకోలేదనా? మేలు ! మేలు ! పాపం! అతడెవ్వడో కాని, ఈ ఊళ్లో ఆడవారు మోసం చేస్తారని చెప్తూనే ఉన్నాడు. అతని మాటలు నమ్మక ఈమె చేతికి చిక్కాను. ఎంత బలమైన సింహమైనప్పటికీ బోనులో పడ్డాక ఏం చేయగలదు? అయ్యయ్యో! నవరాత్రులు కూడా దగ్గరలోనే ఉన్నాయి. ఇప్పుడు నన్ను శక్తికి బలిఇస్తారు కాబోలు! కానీయ్! అందుకు నాకు భయంలేదు. ఎప్పటికైనా మరణం తప్పదు. శపథం తీర్చుకోలేకోయానే అనే చింత మాత్రం ఉండిపోయింది.

**శ్లో ॥ అభావీన భవత్యర్థో నా భావో భావినః క్వచిత్ ॥**

**ఏ తద్వదంతో విద్వానాః క్లిశ్యంతే దేవ మోహితాః ॥**

కాని ప్రయోజనం ఎన్ని విధాల ప్రయత్నం చేసినా, కానే కాదు. ఏమీ ప్రయత్నించకుండానే కానున్నది కాకమానదు. అని చెప్తూన్న విద్వాంసులే, దేవమోహితులై భ్రాంతి పడుతూంటే నేనెంత? కనుక ఇప్పుడు చింతించనేల? కర్మసూత్రం ఎలా ఉంటే అలా జరగకపోదు.

**శ్లో ॥ వికటోర్వ్యమపర్యటనం శైలా రోహణమపాం నిధేస్త్రతరణం**

**నిగళం గుహాప్రవేశో విధి పరిపాకః కథం ను సంతార్యః ॥**

విదేశీ సంచారం, పర్వతారోహణం, సముద్ర ప్రయాణం, కారాగృహప్రాప్తి, గుహలో ప్రవేశించడం అనేవి దైవవశాన సంప్రాప్తిస్తా యంటారు. ఇటువంటి వాటిని తప్పించుకోడానికి వశమా? నేనెంతవాడిని? అని సరిపుచ్చుకున్నాడు.

ఇది ఇలా ఉండగా......

ఆ వూరిలోని సభాపతులంతా కాకున్నా కొంతమంది మాత్రం రహస్యంగా సభను చేశారు. “మన ప్రభువు సింహకేతుడు, మన దగ్గరున్న మంత్రశాస్త్ర పుస్తకాలన్నీ లాక్కున్నాడు. ఇతడు పూర్వం దండవర్మవంటివాడు

కాదు. నవరాత్రుల్లోనయినా మనం చేసే శక్తి బలులు సాగనిస్తాడో లేదో!? విదేశస్తులు మనకు దొరక్కుండా సత్రం కట్టించాడు. అదీ చాలదన్నట్టు ఏడాదికోసారి గాని రెండుసార్లు గాని మన ఇళ్ళు పరీక్షిస్తున్నాడు. దీనిప్రకారం మన బలులు సాగేదెట్లా? మన ఐశ్వర్యం నిలబడేదెట్లా? నవరాత్రి రోజులు సమీపిస్తున్నాయి. ఇంతకు పూర్వమైతే, ఈ పాటికి మనిళ్ళన్నీ విదేశీయుల్తో నిండి ఉండేవి. మొత్తం మీద లెక్కవేస్తే ఈ నాటికి మన దగ్గర నూటపద ముగ్గురు విదేశీయులున్నారు. వారిలో పదమూడు మంది మాత్రమే స్త్రీలు. ఈ సంవత్సరం ఉత్సవాలు ఎలా జరపాలో అర్థం కావడం లేదు." అని సభాధ్యక్షుడు అన్నాడు.

"నిన్నటి చాటింపు విన్నారు కదా! ఇక నేడో – రేపో మన ఇళ్ళన్నిటీ వెతుకుతారు. ఏం చెయ్యాలన్నది ఆలోచించండి! దొరికామంటే రాజు మనని శిక్షించక పోడు" అన్నారొకరు.

"వీళ్ళందర్నీ రహస్యంగా ఇంకో చోట దాచాలి. అడవిలో ఒక పాతాళగృహం వుంది. అందులో రెండు గదులున్నాయి. ఒక దాంట్లో పురుషుల్ని – రెండో దానిలో ఆడవాళ్లనీ దాచుదాం ! ఈ సోదా ఏదో ముగిశాక మళ్ళీ ఇళ్ళకు తెచ్చుకోవచ్చు!" అన్నాడు సభాధ్యక్షుడు.

"బాగానే ఉంది. కాని, వాళ్ళంతా ఏకమై మన పరిచారకుల్నెదిరించి పారిపోతేనో?" ఒకరు సందేహం వెలిబుచ్చారు.

"సంకెళ్ళతో కాళ్ళు చేతులూ బంధించాం కదా!" అని ఆ ప్రశ్నకు సమాధానం చెప్పారు.

"అవును! అయితే అందరూ ఒక గుంపులాగ బయల్దేరకుండా, ఒక్కొక్కరే తమ ఇళ్ళ నుంచి విదేశీయుల్ని రహస్యంగా పాతాళగృహానికి చేరవేద్దాం! ఇంతకంటే వేరే ఉపాయం లేదు. రేపే ఈ పని ప్రారంభిద్దాం!" అని తీర్మానించుకున్నారు అందరూ.

ఆ ప్రకారమే ఎవరిళ్ల నుంచి వారు, బంధితులందరినీ పాతాళ గృహంలోకి చేర్చారు. తనలాగే అందరూ విదేశస్తులేననీ - వారు ఎలా చిక్కినదీ తెల్సుకోవాలన్న కుతూహలంతో ఇంద్రద్యుమ్నుడు ఒక్కొక్కరినే వారెలా మళయాళ దేశాన ఇరుక్కుపోయిందీ అడగసాగాడు.

వారిలో ఒక యోగి దివ్యతేజంతో ఉన్నవాడు - గడ్డాలూ, మీసాలూ పెంచినవాడు-ఏదో నిరంతరం ఆలోచిస్తూన్నవాడి దగ్గరకు వెళ్లి "అయ్యా! మీ నివాసమేది? తమనెలా ఈ స్త్రీలు వశపరచుకున్నారు? ఈ పురానికి మీరు ఎలా చేరుకున్నారు? మీ వృత్తాంతం వినాలని నాకు కుతూహలంగా ఉంది. నేను ద్రోణపురానికి చెందినవాడిని, ఒక వింతసింహాన్ని చంపాలని అడవిలోకి వచ్చి ఉన్నాను..." అంటూ తన సంగతి చెప్పడం ప్రారంభించి, "నేను ఆ విశాలాక్షిని అలా భర్తతో కలుపుతానని శపథం చేసి ఉండకపోయినట్లయితే, ఈ ప్రాణాలను తృణప్రాయంగా త్యజించేవాడిని" అని ముగించాడు.

అదంతా విన్న ఆ జడధారి " హో - విశాలాక్షీ ! వెర్రిగా ఉన్నప్పుడే, నా పట్ల నీకు అపారమైన భక్తి ఉండేది. ఇప్పుడెంత సంతోషించేదానివో కదా! రాజేంద్రా! నువ్వు చాలా పుణ్యాత్ముడివి. భార్యనైనా సరే వదిలి వచ్చి, పరులకోసం పాటుపడుతున్నావు. నన్ను ఆ విశాలాక్షి భర్తగా తెల్సుకో! ఆ వింత సింహాన్ని చంపింది నేనే!" అని చెప్పాడు.

అది విన్న రాజు చాలా సంతోషించి "ఓహో! మా విశాలాక్షి భర్తవు నీవేనన్నమాట. నీ రూపం చూస్తే ఆమె చెప్పినట్లే ఉంది! కానీ మాటా-తెలివితేటలు చూస్తే ఇంకో విధంగా కనిపిస్తోంది. అదీగాక సింహాన్ని చంపానంటున్నావు. ఆమె తన భర్తకు - గుర్ర మెక్కడమే రాదని చెప్పింది. నాకు ఇదంతా వింతగా అనిపిస్తోంది" అని ఆశ్చర్యం ప్రకటించేసరికి ఆ యోగి ఇలా అన్నాడు....

# మదనుని కథ

"రాజా! విశాలాక్షి చెప్పిన మాట నిజమే! నా పూర్వవృత్తాంతం వింటే, మీ సందేహం తీరుతుంది" అంటూ అతడు తన కథ నిలా చెప్పసాగాడు.

మాది గోదావరీ తీరంలో ఉన్న వీరభద్రపురమనే అగ్రహారం. మా తండ్రి సోమశేఖరుడు. చిన్నతనంలోనే కాశీ వెళ్లి ఎన్నో విద్యలు నేర్చి ఆచార్య బిరుదాన్ని పొంది, ఇంటికొచ్చి గృహస్థానం స్వీకరించాడు. ఎన్నో యజ్ఞయాగాలు కూడా చేశాడు. మా తల్లి కొడుకును కనాలని ముచ్చటపడితే ఒక యజ్ఞం చేసి, ప్రసాదం భార్యకు ఇచ్చాడు.

ఆ మహాప్రసాదంతో ఆమె నన్ను కన్నది. నా రూపం చూసి ప్రజలంతా నన్ను మదనుడు అనడంతో ఆ పేరే నాకు ఖాయమైంది. పదిహేడు సంవత్సరాలకే మా తండ్రి నాకు అన్ని విద్యలూ నేర్పాడు. అధర్వణ వేదం నేర్చుకోడానికి నేను విశ్వనాధ భట్టు గారి దగ్గర చేరాను. ఆయన భార్య సురుచి గొప్ప అందగత్తె. వయస్సు పై బడ్డాక విశ్వనాధభట్టు ఆమెను పెళ్లి చేసుకోవడంతో వారి దాంపత్యం కొంత ఎబ్బెట్టుగా కనిపించేది. ఆమె నన్ను చాలా ప్రేమగానే చూసేది. ఒకనాడు గురువుగారు ఏదో పనిమీద ఊరెళ్లారు. అప్పుడు నేనూ ఆమె ఇంట్లో ఉన్నాం. ఆమె బుద్ధి విపరీతపు కోరికలతో వేగిపోయింది. భోజనం పెడుతూ శ్లేషతో – రెండర్థాలు వచ్చేలా మాట్లాడింది. 'వృద్ధస్య తరుణీ విషం' అని కదా ఆర్యోక్తి. ఈమె చూడబోతే మంచి చతుర. మా గురువు కూడా చతురమతేగాని ఈమెకు తగడు." అని ఆలోచిస్తూనే విద్యాశాలకు వెళ్లి పోయాను. ఆమె చంచలమతి అని నా మనస్సు గట్టిగా హెచ్చరించింది.

రాత్రయ్యింది. ఆమె నన్ను భోజనానికి పిల్చింది. తన భర్త కట్టుకొనే పట్టువస్త్రం ఇవ్వబోయింది. నేను వద్దంటే ఇంకొకటి సిద్ధంగా లేదన్నది. నేను భోజనం చేశాక, ఒంటరిగా ఉంటే తనకు భయం అంటూ తన గదిలోకి తీసుకెళ్లి తాంబూలం అందించింది.

"బ్రహ్మచారిని కదా! తాంబూలం వేసుకోకూడదు" అని నేను అంటే ఏ గ్రంథంలో ఉందో చూపించు. అంతగా అవసరమైతే ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చులే!" అంటూ నవ్వింది.

ఆమె స్పష్టంగా బయటపడితే, నీతులు చెపుదామనుకున్న నాకు ఆమె చర్యలు మదనతాపాన్ని హెచ్చించసాగాయి. నేను ఆమెకు వశ్యమయ్యాను.

తెల్లారకుండానే గురువుగారు వచ్చేశారు. "కళ్లు ఎర్రగా ఉన్నాయేం?" అని అడిగారు. అతికేలాగ అబద్ధం చెప్పాను. ఒకసారి అలవాటైనాక, ఏదైనా అంతత్వరగా పోతుందా? ఆమె ఏదో ఒక సాకుతో నా దగ్గరకి విద్యామందిరానికి వచ్చి పలకరించడం - ఆమె ప్రవర్తన మీద సహవిద్యార్థులకు శంకలు బయల్దేరడం జరిగిపోయాయి.

"లోకులు నిన్ను నిందిస్తున్నారు, గురువుగారికి కూడా తెలిసిపోగలదు జాగ్రత్త" అని హెచ్చరించాను.

ఆ రోజు గురువుగారు మళ్లీ ఊరెళ్లారు. చీకటిపడే వేళకు విద్యార్థులంతా వెళ్లిపోయారు. ఏకాంతం దొరికినందుకు ఆమె సంబరపడింది. ఆ రాత్రి మేం ఒకర్నొకరం పెనవేసుకుని పడుకుని ఉండగా, గురువుగారొచ్చేశారు. తప్పించుకొనేందుకు వీలైంది కాదు. ఉన్న పళాన వారికి దొరికిపోయేసరికి, శిష్యుడ్ని కనుక నన్ను నిందించసాగారు. నన్ను తిట్టడం ఆమె భరించలేకపోయింది. "నాథా! ఈ తప్పు నాది! మదనుడికి ఇందులో ప్రమేయమున్నది - కేవలం నా ప్రోద్బలం మేరకే! కనుక అతడ్ని శిక్షించదలిస్తే - ఆ శిక్ష కూడా నాకు వెయ్యండి" అంది చాలా నిజాయితీగా.

దాంతో గురువుగారు "ఏ రూపం చూసుకొని నువ్వింతగా మిడిసిపడ్డావో, ఆ సౌందర్యమే నీకు లేకుండా నీవు కురూపి వగుదువు గాక!" అని ఆమెని శపించి, నా వైపు తిరిగి, "ఏ విద్యకోసమై నువ్వు నా దగ్గర చేరావో, అది వదలి, గురువు కాపురానికే చేటు తెచ్చావు కనుక నీవు నా దగ్గర చదివిన చదువులే కాక, గతంలో నేర్చిన విద్య కూడా మరిచి, పూర్వస్మృతి పూర్తిగా కోల్పోయి తిరిగెదవు గాక" అని నన్ను శపించారు.

నేను శాపవిమోచనం కోసం పునఃప్రార్థన చేయగా, గురువులు దయతలచి "నీకు చచ్చేంత గండం ఒకటి మీద పడి, అది గడిచేసమయంలో నీకు మళ్లీ నీ విద్యలు గుర్తొస్తాయి" అన్నారు. ఆ శాపం ఫలించే సమయానికి నేను కాశీలో ఉన్నాను. విశాలాక్షితో నా వివాహం కథ తమకు తెలిసింది! గుర్రం మీంచి నేలను పడగానే నాకు శాపవిమోచనం జరిగింది. నాకు పూర్వ విద్య స్మృతి తిరిగి లభించింది.

అయ్యా! విశాలాక్షి నన్ను ఈ రీతిగా చూస్తే ఎంత సంతోషించేదో కదా! అన్నట్లు నేను బాల్యంలో అస్త్ర శస్త్ర విద్యలూ నేర్చుకున్నాను. కనుకనే ఆ వింతసింగాన్ని చంపగలిగాను. విశాలాక్షిని వెదుక్కుంటూ ఎక్కడెక్కడి దేశాలలోనూ సంచరించి, చివరికీ మలయాళ దేశంలో కొచ్చి ఓ స్త్రీ వల్ల మోసగించబడి ఇలా బందీనై నా కర్మానికి విచారిస్తున్నాను" అని పూర్తిగా తన కథ చెప్పాడు మన్మథుడు.

"చింతించకు మదనా! ఆమెను నువ్వు తప్పకుండా కలుసుకుంటావు. దైవమే దారి చూపగలదు" అని ధైర్యం చెప్పాడు ఇంద్రద్యుమ్నుడు.

వారి మాటలు వింటూన్న ఒక వ్యక్తి "దేవా! నేను మీ మాటలు విని మిమ్మల్ని ఇంద్రద్యుమ్న మహారాజుగా గ్రహించాను. నేను తమ భటుల్లో ఒకడిని. మీ వంటి వాళ్లకు ఇలాంటి స్థితి కలగడం విచారకరమే! మీకు మరింత విచారం కలిగించేదే అయినా ఒక విషయం చెప్పక తప్పదు" అన్నాడు.

"త్వరగా చెప్పు" అన్నాడు రాజు.

"అడవిలో సింహం చెల్లాచెదరుచేశాక, శిబిరం వద్ద కలకలం విన్న సేనాపతి, తమ అనుమతితో నిమిత్తం లేకుండానే రాణి చిత్రసేనను పల్లకి ఎక్కించి రాజధానికి పంపేయడానికి సిద్ధపడ్డాడు. ఆమె క్షేమంగా నగరం చేరుతుందనుకుంటే, దారిలో ఒక కోయదండు, మన సేనలు కొద్దిగా ఉండటంతో తరిమేసి రాణిని తీసుకుపోసాగారు. ఆ భటవర్గంలో ఉన్న

నేను, వార్ని వెంటబెట్టాను. ఒక్కడ్ని కావడంతో నలుగురు నన్ను పెడరెక్కలు కట్టి ఎక్కడో దాచి, ఒకనాడిక్కడికి తెచ్చి ఒక గృహస్థునికి అమ్మేశారు. వీళ్లు నాకు ఆహారం పెడుతూ బందీగా ఉంచి, చివరికి రాణీగార్ని ఇక్కడకు తెచ్చినట్లు – త్వరలో అందర్నీ బలి ఇవ్వబోతున్నట్లు అర్థమైంది" అన్నాడు.

అది విన్నాక – రాజుకు ఎక్కడలేని శోకము ఆవరించింది. తెలివి తప్పిపోయారు. చేతులకు – కాళ్లకు బంధనాలు. కొంతసేపటికి స్పృహవచ్చి చూసేసరికి అర్థరాత్రి అయింది. చింతించి లాభమేమిటి – కానున్నది కాక మానదు కదా! అనుకున్నాడు. ఇంతలో కావలివాళ్ల మాటలు విన్పించడంతో చెవులు రిక్కించి విన్నాడు. వాటి సారాంశం ప్రకారం–

'కృష్ణదాసు అనే వాడి పెళ్లాం, ఏ విదేశీ బాటసారినో మోహంలో పడేసిందనడానికి గుర్తుగా, సోదా చేసే భటులకు ఒక పుస్తకం దొరికిందట. అది మంత్ర శాస్త్ర లిపి కాదని తేలాక, దాన్ని ప్రభువు సింహకేతుని వద్దకు తీసుకెళ్లారు. ఆమె పెద్ద జాణ కదా! ఏ విదేశీయుని దాచిందో విచారణకు ఆదేశిస్తారని తెలుస్తోంది . కాని ఆ విచారణ నాల్రోజులు తర్వాత జరిగితే అప్పటిదాకా విదేశస్తుడికి నూకలు

చెల్లిపోతాయి. ఎల్లుండే కృష్ణ దాసునాట నవరాత్రి అర్చన. అలాక్కాక రేపే విచారణ జరిగితే – ఆ వ్యక్తి ఎవరో తెలుస్తుంది"

సోదా జరిగిపోయిన ఇళ్లవారు, తమ తమ విదేశీయుల్ని తమ ఇళ్లకు తిరిగి రహస్యంగా తీసుకుపోయారు. ఇంద్రద్యుమ్నుడ్ని కూడా పూర్వపు గదిలోనే కట్టిపడేశారు. ఎల్లుండి తనకు మరణం తప్పదని వైరాగ్యంతో దేవుని ధ్యానించసాగాడతను. తెల్లారితే నవరాత్రులు ప్రారంభం. ఆ వేళ అతనికి తలస్నానం చేయించారు. వొళ్లంతా పసుపు పూశారు. మెడలో వేపకొమ్మకట్టి ఒక స్థంభానికి అతడ్ని కట్టేశారు.

తన దేహం ఊరకే పోక శక్తి దేవతకు బలి అవుతున్నందుకు ఇంద్రద్యుమ్నుడు సంతోషిస్తూ మరణం కోసం ఎదురుచూస్తుండగా వీధిలో రాజభటుల కోలాహలం వినవచ్చింది.

ఆ సందడంతా కృష్ణదాసు ఇంటి దగ్గరకొచ్చి, తలుపులు దబదబా బాదేసరికి, పూజలో ఉన్న కృష్ణ దాసు పెళ్లాం గాభరా పడుతూ తలుపులు తెరిచారు. తలుపులు తెరచీ తెరవగానే సరాసరి ఆ దేశపు రాజు సింహకేతుడు లోపలికి వచ్చి “కృష్ణ దాసెవడు?” అని అడిగాడు. పూజ దుస్తుల్లో ఉండి గడగడ వణుకుతూ “నేనే” అన్నాడతను.

ముందు రాజు తన దగ్గర హాజరుపెట్టబడిన పుస్తకం గురించి ప్రశ్నిస్తే, కృష్ణదాసు పెళ్లాం అతికీ – అతకని సమాధానలు చెప్పబోయింది. రాజు గద్దించడంతో నోర్మూసుకుంది. భటులకు ఆజ్ఞ ఇచ్చి ఇల్లంతా వెతకమన్నారు. ఒక రహస్యపు గదిలో జరుగుతున్న పూజ తంతు వాళ్ల కంట పడేసరికి, అర్చకులంతా పారిపోయారు. గొలుసుల్తో కట్టబడి ఉన్నదెవరు?” అని ఎంత ప్రశ్నించినా కృష్ణదాసు ఉలకక – పలకక బెల్లం కొట్టిన రాయిలా నిల్చుని గుడ్లేసుకు చూడసాగాడు. అప్పుడా రాజు “ఓయీ! నీవెవ్వరు?” అని బందీని అడిగాడు. ఇంద్రద్యుమ్నుడు తన వివరాలు చెప్పాడు. అంతేగాక – మిగిలిన బందీల సమాచారం కూడా చెప్పి “ఇదేం పాలన? శాసనాలు ఇలాగేనా అమలు జరిగేది?” అని ఆక్షేపించాడు.

సాటి క్షత్రియుడు తనను నిలదీసేసరికి సింహకేతుకు రోషం వచ్చింది. దాంతోపాటే తన పౌరుల దుశ్చర్యల మీద కోపం వచ్చింది. ఊళ్లో అన్ని ఇళ్లూ తిరిగి సోదా చేయించి, ఇంద్రద్యుమ్నుడ్ని వెంటపెట్టుకుని తన కోటలోనికి వెళ్లాడు. సాయంత్రం అయ్యేసరికి రాజభటులు మిగతావారినందరినీ తీసుకురాగా, అపరాధులకు కఠిన శిక్షలు విధించాడు.

బలికాబోయిన వారికందరికీ క్షమాపణలు చెప్పి, వారి – వారి దేశాలకు పంపేశాడు. ఇంద్రద్యుమ్నుడు చిత్రసేనను గుర్తించగా, ఆమెను – మదనునీ ప్రత్యేకంగా గౌరవించి అంతఃపురానికి తీసుకువెళ్లాడు.

తరువాత – వారిని ఒక రహస్యస్థలానికి తీసుకెళ్లి కూర్చోబెట్టాడు. “రాజా! మీరూ – మీ భార్యా విశాలాక్షి కోసం కదా ఇన్ని కష్టాలు భరించారు.

మీ పరోపకార బుద్ధి చాలా గొప్పది. ఈ గ్రంథం మొదట శత్రువుల బారి నుంచి విశాలాక్షిని కాపాడింది. తర్వాత మిమ్మల్ని ఇప్పుడిట్లా రక్షించింది. దీన్ని రాసినవారు చాలా పుణ్యాత్ములు" అన్నాడు.

"నిజమే! సింహకేతూ ! మీరు మమ్మల్ని మృత్యు ముఖం నుంచి వెనక్కు తీసుకొచ్చారు. అందుకు మీకు మేము జీవితాంతం కృతజ్ఞులం" అన్నాడు ఇంద్రద్యుమ్నుడు.

"సరే గాని, విశాలాక్షిని ఈ మదనుడు శాపగ్రస్తుడై ఉన్నప్పుడు వివాహమాడాడు కదా! ఆమె ఇతనికి దూరమై చాలాకాలం గడిచింది కూడా! ఎంతో ప్రయాసపడి మీరామెను వెదకి తెచ్చారే అనుకోండి! ఈతడామెని స్వీకరిస్తాడా?" అని అడిగాడు సింహకేతుడు.

"విశాలాక్షి మహాపతివ్రత. ఆమె మనస్సు నాకు బాగా తెలుసు. అటువంటి ఆమె దొరకాలే కాని, దొరికిందా మీకు కోటి నమస్కారాలు చేస్తా" అన్నాడతను.

సింహకేతుడు నవ్వుతూ "ఆమె మా ఇంట్లోనే ఉంది" అని లోపలికెళ్లి విశాలాక్షిని పంపించాడతను. ప్రేయసిని చూసిన ఆనందంలో పరిసరాలు మరచి మరీ కౌగిలించుకున్నాడు మదనుడు.

ఆమెను గుర్తుపట్టి ఇంద్రద్యుమ్నుడు ఆనందించి, ఆమె వృత్తాంతం అడగ్గా "ఈ వృత్తాంతం భోజనానంతరం చెపుతాను" అని ఆమె నవ్వుతూ అంది.

అప్పటికే చాలా వేళ కావడంతో మణిసిద్ధుడు తదుపరి కథను తర్వాత మజిలీలో చెబుతానని ఇలా మొదలెట్టాడు.....



# కాశీ మజిలీ కథలు

**14వ మజిలీ**

గోపా! విను....

ఆ కాశీరాజపుత్రి తన వృత్తాంతాన్ని, వారికి ఈ విధంగా చెప్ప సాగింది. "తండ్రీ! నువ్వా సింహాన్ని చంపడానికి వెళ్లి ఎంతసేపటికి రాకపోయేసరికి నేను అలాగే పరితపిస్తూ "ఛీ! నేను ఇంకా బ్రతికి ఏం ప్రయోజనం? శోకఘటనలు ఒకదాని వెంట ఒకటి నన్ను ఊరకే బాధిస్తున్నాయి" అనుకుంటూ, ఇక నాకు మరణం తప్ప వేరే దారిలేదని నిర్ణయించుకున్నాను. ఏం చెయ్యాలా? అనుకుంటూన్నంతలో నాకు నిద్ర వచ్చింది. ఆ నిద్రలో ఒక కామిని కలలో కన్పడి "తల్లీ! నువ్వు చింతించకు! నీకు మేలు కలుగుతుంది" అని ఆనతిచ్చింది. నేను దిగ్గున లేచి కూర్చున్నాను. నాకు పదే పదే ఇలాంటి కల వస్తోందేమిటి? అని మరికొంతకాలం ఓపిక పట్టాలనుకున్నాను. తిరిగి గుర్రమెక్కి ఎదురుగా కనిపించిన త్రోవన పడి నడకసాగించాను. ఆ దారి ఎటుపోతుందో నాకు తెలీదు. మిట్టమధ్యాహ్నం వరకు అలాగే గుర్రాన్ని వడిగా తోలసాగాను. ఆ అరణ్యానికి అంతులేదేమో అనిపించింది.

## విశాలాక్షి ప్రవాహం కథ

ఎండతాపం అధికం కావడంతో చెమటలు కమ్మి, దాంతో పాటు నాకు ఆకలిదప్పిక బాధ కూడా అధికం అయింది. రోగికి మందుగాకుండా సరాసరి అమృతమే దొరికినట్లు నాకు అంతలోనే మధురమైన నీరున్న సరోవరం ఒకటి కనిపించేసరికి, నాకు వెంటనే జలకాలాడాలనిపించింది.

హాయిగా స్నానం చేశాను. కడుపునిండా నీరు త్రాగాను. నాకు అక్కడొక పూలతోట కనిపించింది. అక్కడ కొంతసేపు విహరించాను. వటవృక్షం నీడన తలకింద చెయ్యి పెట్టుకుని, ఆ పూలతోట అందాలను వీక్షిస్తూండగా, ఎప్పుడో చిన్న కునుకు పట్టింది. నేను అలా ఎంతసేపు నిద్రపోయానో నాకే తెలీదు. నేను లేచి చూసేసరికి నా గుర్రం గాని, అంతవరకు నేను చూసిన వటవృక్షం గాని కనబడలేదు. నాకు అదంతా కలా – నిజమా అనిపించసాగింది. అక్కడ సూర్యచంద్రులిద్దర్లో ఎవరూ లేరు. కాంతిమాత్రం చక్కగా ప్రసరిస్తోంది.

నేను అక్కడ ఆ తోటలో పడుకొన్నదాన్ని ఇక్కడికెలా వచ్చాను? అని విస్తుబోయి చూడసాగాను. ఇదీ పూలతోటే! కాని అది ఇది కాదు. 'సరే! దీని సోయగాలు చూద్దాం!' అనుకుంటూ ఆ తోటలోనికి అడుగుపెట్టాను. పూల మొక్కల మధ్య చక్కగా తీర్చిదిద్దినట్లున్న మార్గాలు, వాటికి ప్రక్కగా నీళ్ల తుంపర్లు వెదజల్లే జలయంత్రాలు, పూలభారానికి వంగిన కొమ్మలతో నేనెన్నడూ చూడని – భూలోకంలో లభించిన పుష్పజాతులు కన్నుల పండుగ్గా తోచాయి– వాటి పరిమళం ఇలాంటిదని చెప్పడానికి అలవికాదు. ఫలముల్లో కూడా అదే విధమైన పరిమళం. ఇక వాటి సువాసనలను ఆఘ్రాణిస్తూ నన్ను నేనే మర్చిపోయానేమో! వాటిమీద ఎగురుతున్న తుమ్మెదల ఝూంకారాలు విన్న వాళ్లకి – మునులైనా సరే! మదనవికారం కలిగితీరుతుందనే మాట సత్యం.

మొదట లతలు ప్రాకే పందిళ్లు, వాటికి పక్కన పూపొదలు, ఆ పైన ఫలజాతులు. ఒక క్రమపద్ధతిగా నాటి – పెంచబడుతున్నాయి. ఎక్కడా ఒకే జాతి ఫలవృక్షంగాని – పూలతీగె కాని రెండోది నాటబడి లేదు. అన్నీ ఒక్కొక్కటే! ఎంత దూరం వెళ్లినా ఆ వనానికి తుదీ – మొదలూ కనబడదు. చివరికి వచ్చిన దారేదో – నేను వెళ్లిన దారేదో కూడా మర్చిపోయాను. అన్నిటికంటే ముఖ్యంగా ఆ వనవిహారం చేస్తున్నంతసేపూ నాకు పూర్వపు చింత ఇసుమంతైనా లేదు. తిరిగిన కొద్దీ ఆనందమే తప్ప అలసట లేదు.

అలా తిరుగుతూండగా - నాకొక వింత ఫలం కనిపిస్తే, దాన్ని కోసి తిన్నాను- ఆ పండు ఎంత మధురంగా ఉందో చెప్పలేను. దాన్ని తిన్నది మొదలు నాకు ఆకలిదప్పులు రెండూ నశించాయి. ఆ చెట్టును పరిశీలించి చూసేసరికి, అలాటి పండు ఇంకొక్కటే కనిపించింది. దాన్ని కోసి జాగ్రత్తపరచాను. మరికొంత దూరం వెళ్లాను - ఎన్నెన్నో పూలున్నప్పటికీ వింత సువాసనతో నన్ను ఆకట్టుకున్న పుష్పమొకటి గొప్ప ప్రకాశవంతంగా కనిపించింది. అది ఒక్కటే వికసించింది. దానినీ నా దగ్గర భద్రపరచాను, ఇక ఆ వనాన్ని వర్ణించడానికి మాటలు చాలవు.

ఇలా తిరుగుతూన్న నాకు నవరత్నాలతో కట్టబడిన దేవాలయం ఒకటి కనిపించింది. దూరానికి అది కాంతిపుంజంలా వుంది. నిజానికి అంత చక్కని తోటకు ఆ దేవాలయం ఉండటమే ఒక శోభ. అక్కడో యువతి వీణవాయిస్తూంటే, ఆ మంటపం మీద జనులంతా సంతోషంగా వింటున్నారు.

ఆలయంలో కాశీవిశాలాక్షి పోలికతో ఒక మహాదేవి కనిపించేసరికి, నాకు ఆ తల్లి అన్నపూర్ణే జ్ఞాపకం వచ్చింది. నాకు తెలీకుంటేనే నేను ఆ వీణావతికి దగ్గరగా వెళ్లి వినయంగా నిలబడ్డాను. ఆమె కళ్లతోనే నన్ను కూర్చోమన్నట్లుగా సైగ చేసింది. నేను అతిభక్తిపూర్వకంగా ఆ దేవికి మొక్కి అక్కడే కూర్చున్నాను. వీణావతి తాను రచించిన దేవీ స్తవాలు కృతులుగా కలకంఠ నాదమిదేనా అన్పించేలా హాయిగా వీణపై మీటింది. ఆమె తుంబురుని దగ్గర ఆ వీణవిద్య నేర్చుకొన్నదట! తనకు అనుకూలుడైన పతి లభించాలని ఆమె విశాలాక్షిని సేవిస్తున్నదట! భూలోకంలో గానానికీ - దేవలోకపు వీణామాధుర్యానికీ గల తేడా నాకు అప్పుడు స్పష్టంగా అర్థమైంది. అంత అద్భుతంగా పాడిందామె. ఇక నేను ఆమెతో సంభాషించాలనుకుంటూండగా, ఆమె మోహనరాగాన్ని జగన్మోహనంగా ఆలపించింది. దాని విశేషాలు సైతం నేను గ్రహించాలనుకుంటున్నంతలో ఏదో భ్రాంతి ఆవహించినట్లనిపించి, పరవశం వల్ల అక్కడే నేలకొరిగాను. మరికొంతసేపటికి నేను లేచి చూసేసరికి, మునుపటి వటవృక్షం నీడనే పండుకొని ఉన్నాను. నేను ఝామము ప్రొద్దు నిద్రపోయానని నాకు అన్పించింది.

నేను నిద్రించాననడం వాస్తవం కాదు. దానిక్కారణం -స్వప్నంగా నేను భ్రమిస్తున్న పూలతోట......అందులో అద్భుత ఫల, పుష్ప భరితమైన వృక్షాలు ఇవన్నీ నేను ప్రత్యక్షంగా చేత్తో తాకి చూశాను. అంతేనా? నేను నా చేతుల్తో స్వయంగా కోసిన పుష్పం - ఫలం నేను కొంగున మూటకట్టుకున్నాను కదా....! అని కొంగు చివర చూసేసరికి ఆ పుష్పం - ఆ ఫలం అదే సువాసనలు వెదజల్లుతూ నా దగ్గరే వున్నాయి. కనుక అది స్వప్నమనడానికి అవకాశం లేదు. అయితే - నేనీ వటవృక్షచ్ఛాయను విశ్రమించింది స్వప్నమా - సరస్సులో స్నానం చేసి, దాహం తీర్చుకోవడం స్వప్నమా?....కాదే! రెండూ నిజమే! నాకు అంతా విచిత్రమైన అనుభూతి కలిగి ఆ పుష్పాన్నీ - ఆ ఫలాన్నీ ఎదుట పెట్టుకుని వాటి సువాసనలు ఆఘ్రాణిస్తూ, కొంతసేపు ఏమీ తోచక కూర్చున్నాను.

మరికొంతసేపు ఆలోచించగా, నాకు ఆకలిదప్పులు లేకపోవటాన్నీ, విశాలాక్షి వంటి దేవీదర్శనాన్నీ, వీణావతి ప్రదర్శించిన అద్భుతగాన మాధుర్యాన్నీ నేను ప్రత్యక్షంగా చూసి వున్నానని; అది కేవలం విశాలాక్షీ కృపావిశేషం చేత తప్ప ఇంకొకటి కాదని నిశ్చయించుకున్నాను.

అది మొదలు నాకు ఎలాంటి చింత లేదు, నా ప్రియుని నేను కూడ త్వరలోనే చేరగలుగుతానని ధైర్యం చేత మనస్సు కుదుటపడింది. అప్పటికి గాని నాకు పరిపూర్ణమైన ఆనందం కలుగలేదు. ఆ సంతోషంతో లేచి, ఆ పుష్పం - ఆ ఫలం మళ్లీ పైటకొంగున మూటకట్టుకున్నాను. గుర్రాన్ని పశ్చిమాభిముఖంగా నడిపించాను. ఝామూ పొద్దున్నందున, సాయంకాలంలోగా ఏదైనా ఊరు చేరాలని దృఢనిశ్చయంతో ఉన్న నాకు - ఆ దారి నన్ను సాయంకాలం అయ్యేసరికి ఒక అగ్రహారానికి చేర్చింది. కనుచీకట్లు పడుతూండగా....

## భీమశర్మ అను బ్రహ్మాచారి కథ

ఆ అగ్రహారం దాపుల్లో ఒక ఇరవయ్యేళ్ల వయస్సున్న బ్రహ్మాచారి మానుకొమ్మకు తాడు బిగించి, ఉరి పోసుకోవడానికి సిద్ధంగా ఉన్నాడు.

నేను తటాలున దిగి అతడి చెయ్యిపట్టుకొని " వటుడా? నీ వెవరు? ఇలా ఉరిపోసుకుని బలాత్కారంగా దేనికి మరణిద్దామనుకుంటున్నావు? నీకు ఆప్తులెవరు లేరా?" అని అడగ్గా, అతడు నన్ను చీకటిలో పురుషునిగా భావించినట్లున్నాడు.

"అయ్యా! ఇప్పటికి పడ్డ కష్టాలు చాలు! నువ్వు నా చెయ్యి వదులు! నేను బ్రతికి ఉన్నా లాభం ఏమీలేదు. లోకంలో దరిద్రుడూ– విద్యాహీనుడూ బ్రతికి ఉండడం కంటే నీచం ఇంకొకటి ఉండదు...." అన్నాడు నిరాశగా.

"విప్రుడా! నీ జన్మం చాలా ఉత్కృష్టమైనది. దరిద్రం వల్లనే అయితే, నువ్వు చావవలసిన అగత్యం లేదు. నిన్ను భాగ్యవంతుని చేస్తాను" – అంటూ అనునయించాను. అప్పుడా బ్రహ్మచారి "అయ్యా! ఇక్కడకు క్రోసెడు దూరంలో ఉన్న విజయపురి అనే అగ్రహారంలో నేనుంటున్నాను. నా పేరు భీమశర్మ. ఏడుగురు అన్నదమ్ముల్లో నేనే చివరివాడిని. నాకు నా తల్లిదండ్రులు నా చిన్నతనంలోనే కాలం చేశారు. నా అన్నలు చెప్పిన పనులు చేస్తూ – వదినెలు వచ్చాక వారికీ దాసత్వం చేస్తూ ఎవర్నీ నొప్పించక, అందరికీ అనుకూలంగా ప్రవర్తిస్తూ రాసాగాను. రెండు ఝామముల వరకు ఇంట్లో పనులతో సరిపోయేది.

ఒకసారి – ఇలాగే పనుల్లో లోటు రానివ్వక, అన్నీ పూర్తిచేసి బ్రాహ్మణార్థం ఒకరి ఇంటికి వెళ్లాను. అక్కడ అన్నీ సుష్ఠుగా తిని, కొంతసేపు విశ్రమించి ఇంటికి వెళ్లాను. కాని, అప్పటికే మా పెద్ద వదిన నన్ను కోపంగా చూసి "నువ్వు భోంచేశాక వెంటనే ఇంటికి రాకుండా, ఎక్కడో నిద్రపోతే ఎలా అనుకున్నావు? ఈ రోజుకి భోజనం దొరగ్గానే సరా? రేపటి గురించి ఏం ఆలోచించావు? మేమే పెట్టవలసిన వాళ్లం! ఇంట్లో ఇంత పని ఉంటే, హాయిగా ఎక్కడో పవళింపు సేవలో ఉన్నావా?" అంటూ తాను ఉయ్యాల్లో పడుకుని "ఇంట్లో మంచి నీళ్లు లేవు. కావడి తీసుకుని బయల్దేరు" అంటూ ఆజ్ఞాపించింది.

అప్పుడు నాకు మనస్సులో కలిగిన బాధను ఆపుకుంటూ "వదినా! నాకీరోజు భోజనం వల్ల భుక్తాయాసంగా ఉంది. ఇప్పుడే వెళ్లలేను. కొంచెం

ఆగి వెళ్తాను" అన్నాను. ఇందులో తప్పేమన్నా ఉందా? నువ్వే చెప్పు! ఈ మాట వింటూనే, ఆమె అహంకారంతో ఆడిన దుర్భాషలు కటకటా! ఏమని చెప్పను? ఆయాసంగా ఉంది. తర్వాత తెస్తాననడం తప్పా? అది ఎదిరింపా? నా దురదృష్టం కొద్దీ నాదే తప్పని మిగతా వదినెలు కూడ భయస్వభావం వల్లనో - పెద్ద వదిన గయ్యాళితనం వల్లనో ఆమెకే వంత పాడారు. ఆమె మా అన్నకు ఏం చెప్పిందో కాని, అతడు పెళ్లాం మాటలు నమ్మి "నిర్భాగ్యుడా! నీకు ఇంత పోతరమా?" అని నన్నే నిందించడం కాక, దుడ్డు కర్రతో చావమోదేసరికి ఆ దెబ్బల బాధతో ప్రాణాల మీద ఇచ్ఛ చచ్చి, ఎవరికీ తెలీకుండా ఇదిగో! ఇక్కడకు చేరాను. ఇంతలో నువ్వు అడ్డు పడ్డావు" అన్నాడా బ్రాహ్మణుడు.

అప్పుడు నేను ఎంతో జాలిపడి "భీమశర్మా! భయపడకు! నీకు బ్రతుకు మీద ఆశ కలిగించాను- నిన్ను భాగ్యవంతుని చేస్తానన్నాను. ఇదిగో! ఈ అద్భుతఫలం చాలా మహిమ కలిగినది. ఎన్ని రోజులున్నా ఇది వాడిపోకుండా అలాగే ఉంటుంది. ఇది విన్న వాళ్లకు ఆకలీ- దప్పికా ఉండవు. దీన్ని మీ దేశపు రాజుకు ఇచ్చావంటే; అతడు నీకు కావలసినంత ధనాన్నిస్తాడు. దాంతో యధేచ్ఛగా జీవించు! అంతేగాని మరణించకు" అని చెప్పి ఆ పండు అతని చేతిలో పెట్టాను.

నేను ఆ రాత్రి ఆ అగ్రహారంలో ప్రచ్ఛన్నంగా పండుకొని, ఉదయాన్నే లేచి, మళ్లీ దారిన పడి నడవసాగాను. అక్కడనుంచి ఆ దారి తూర్పుదిక్కుగా సాగి, మధ్యాహ్నమయ్యేసరికి ఎదురెండ అధికమై కొంచెం విశ్రమించాలనిపించింది. గుర్రాన్ని ఒక చెట్టుకు కట్టేసి, ఆ నీడన విశ్రమించాను.

ఇంతలో ఒక వృద్ధబ్రాహ్మణుడు తన పదిమంది పిల్లలతోను, ఆ మార్గం గుండా ఎక్కడికో పోతూ ఎండవేడికి తాళలేక ఆ చెట్టునీడకే వచ్చాడు, "మీరు ఎవరు?" అని ప్రశ్నించగా, "నాది విదర్భదేశం. నా పేరు కృష్ణశర్మ. ఈ పిల్లలు నా సంతానమే. నా భార్య ప్రసూతి బాధతో మరణించింది. బీదవాడిని. గంపెడు పిల్లలతో - ఆడదిక్కు లేక నానాబాధలూ పడుతున్న

వాడిని. భిక్షాటనంతో కాలక్షేపం చేస్తూంటే, మా రాజ్యంలో ఏర్పడిన కరువు వల్ల ఎక్కడా గుప్పెడు మెతుకులు పుట్టని పరిస్థితి ఏర్పడింది. ఎక్కడికయినా పోయి బతుకుదామనుకున్నాను. కాని, దురదృష్టదేవత నాకంటే ముందుగానే నడుస్తున్నట్లుంది. ఎక్కడికిపోయినా పట్టెడన్నం దొరకడం లేదు. అన్నం తిని రెండ్రోజులైంది. నిన్ను చూస్తుంటే గొప్పదానిలా ఉన్నావు. నాకు ఏమైనా దయతలచి ఇవ్వగలవా ?" అని దీనంగా అడిగాడు.

ఆ బీదబ్రాహ్మణుని మాటలకు కరిగిపోయాను. నా దగ్గరున్న అద్భుత పుష్పాన్ని తీసి "ఓ బ్రాహ్మణుడా! ఇది పారిజాతం వంటి దివ్యపుష్పం. ఎన్నాళ్లయినా వాడిపోదు. దీన్ని పైన ఉంచితే, ఆమడ దూరందాకా పరిమళం వ్యాపిస్తుంది.....దీన్ని తీసుకుని నీ కుటుంబాన్నంతట్నీ ఎల్లకాలం పోషించేవాడికి ఇవ్వు" అని ఒక మూటలో కట్టి, ఆ పుష్పాన్నిచ్చేశాను.

అక్కడ్నుంచి, నేను మళ్లీ గుర్రం ఎక్కి ప్రయాణించసాగాను. ఆ దారి మళ్లీ ఉత్తరదిక్కుగా మళ్లింది. అటు అంతా అరణ్యమే తప్ప, గ్రామం అనేదే లేదు. దారితప్పినట్లున్నాను. చీకటి పడుతోంది. అరణ్యంలో నేనే క్రూర జంతువుకో ఆహారమైపోవడం ఖాయం అనుకున్నాను. మళ్లీ ఏదో మొండి ధైర్యం.

## కోయపల్లె కథ

మరికొంత దూరం వెళ్లేసరికి, పశువుల అరుపులు వినిపించేసరికి అక్కడేదో పల్లె ఉండి తీరాలని నిశ్చయించుకున్నాను. నా ఊహ నిజమే! కాని అది కోయపల్లె. అక్కడ ఉన్నది రాక్షసుల్లాంటి కోయదొరలు. ఆ వేళ వారి ఉత్సవం ఏదో సాగుతూన్నట్లుగా ఉంది.

విశాలమైన చావడిలాంటి ప్రాంగణంలో ఒకే ఒక దీపం పెట్టి అందరూ తప్పతాగి అడవి వాయిద్యాలు వాయిస్తూ ఆడుతున్నారు. అక్కడ తప్ప ఇంకే ఇంట్లోనూ దీపం లేదు. వాళ్ల ఆకారం చూసి నా గుండె ఆగిపోయినంత పనైంది. వాళ్లంతా ఉత్సవం సందట్లో ఉన్నారు. నేను గుర్రం దిగి – దాన్నొకచోట చెట్టుకు కట్టి ఇంకొక మూలకు వెళ్లాను. ఆ గుడిసెలకు

ఆవరణలు లేవు. నా పుణ్యం వల్ల అక్కడుండే కుక్కలు కూడా సంబరానికే పోయాయి. నేనొక గుడిసె తిన్నెమీద కూర్చున్నాను. కొంతసేపటికి ఒక కోయపడుచు వచ్చి, తన భాషలో ఏదో అడిగింది. నాకు ఏభై ఆరు భాషలొచ్చినా, కోయభాష నాకు రాకపోయేసరికి "పరదేశిని! దారి తప్పి వచ్చాను. ప్రొద్దున్నే లేచి, పోతాను" అన్నాను.

దానికి నా మాటలు అర్థం కాలేదు. కాని అంతలోనే అది పూనకం వచ్చిన దానిలా అరుస్తూ "మన కులదేవత మనింటికొచ్చి అరుగుమీద కూర్చుందర్రోయ్" అంటూ అర్థం వచ్చే మాటలు చెప్పి అందర్నీ ఎలుగెత్తి పిల్చింది.

వాళ్లంతా వచ్చి నన్ను చంపెయ్యడం ఖాయం అనుకున్నాను. కాని అంతలోనే నాకు 'దేవత' అని అరవడం గుర్తొచ్చి నా తల విరబోసుకుని శివ మెత్తిన దానిలా ఊగసాగాను.

వాళ్లు వచ్చి నాతోపాటు చిందులెయ్యసాగారు. కొంతసేపు అయ్యాక "మా గుళ్లోకి రావమ్మో! బలులిస్తాం! పానకాలిస్తాం! మమ్మేలే మా తల్లీ రామ్మో! రా!" అని అర్థం వచ్చే పదాలు పాడగా, నేను వారి వెంట చావడికెళ్లాను. అక్కడ అమర్చబడి ఉన్న వెదురు బద్దల గద్దెమీద కూర్చొని, వారికి ఆజ్ఞలు వేస్తూ, వారిని ఆడీ- పాడమన్నాను.

వాళ్లలోని స్త్రీలు 'కోయదేవత ఈ ఏడు మంచిరూపంలో వచ్చిందనీ - సన్న చీర కట్టిందనీ - తల వెంట్రుకలు ఎంతో పొడుగనీ' పొగడ్డం వాళ్ల సైగల ద్వారా నాకు అర్థమైంది. 'ఈమెకు మగడుంటాడా?' అని ఒకామె సందేహం, దానికి ఇంకో కోయస్త్రీ "లేకేం? ఈమె భర్త పోతురాజు. వీరికి మన కులపోళ్లంతా సంతానం కదా!" అని సందేహం తీర్చింది.

వాళ్ల మాటల్ని బట్టి , ఈ దేవత క్రిందటేడాది పులిరూపంలో వచ్చిందని తెలిసింది. తెల్లవారేసరికి ఏ రూపంలో వచ్చినప్పటికీ మరి ఉండదనీ తెలిసింది.

ఇదీ బాగానే ఉందనుకుంటూ, తెల తెల వారుతూండగా నేను గద్దె దిగాను. "అమ్మోరెళ్లిపోతున్నారంటూ" వారు కేకవేస్తూ నన్ను సాగనంపడానికి వచ్చారు. అప్పటికే నేను చకచకా గుర్రాన్ని సిద్ధం చేసుకుని, దానిపైకి లంఘించి కూర్చున్నాను. అదిలించేసరికి అది వాయువేగ మనోవేగాల్తో పరుగు అందుకుంది. గుర్రంతో పాటు రాలేక వాళ్లు అక్కడే ఆగిపోవడం వల్ల 'బతుకు జీవుడా' అని నేను బయటపడగలిగాను. నేను అప్పుడా దేవతలాగ సమయస్ఫూర్తితో వ్యవహరించకపోయినట్లయితే, నన్ను వాళ్లు బలిచ్చేసేవారే! అద్భుతఫలం ప్రభావం వల్ల నాకు ఆకలిదప్పులు లేవు.

సాయంకాలానికి ఒక ఊరు చేరాను. ఆ ఊరి పేరు కోటీశ్వరమట! మర్నాడు శివరాత్రి కావడంతో - ఆ క్షేత్రానికి చాలా మందే వచ్చారు. ఆలయంలోకి నేనూ వెళ్లాను. అక్కడ నాకు ఒకామె కనిపించింది. ఎక్కడో చూసినట్లు అనిపించింది. నిదానించి చూసి "ఓ! ఈమె ఆనాడు దివ్య ఉద్యానవనంలో విశాలాక్షీ మందిర మంటపం మీద అద్భుత వీణవాదన చేసిన వీణావతి కదూ!" అని గుర్తొచ్చింది. ఆమెతో సంభాషించబోగా, సంగీతం ముచ్చట్లు మా మధ్య ఎన్నో దొర్లాయి. ఆమె మందహాసం చేస్తూ " ఆ దివ్య ఫలాన్ని - దివ్య పుష్పాన్నీ జాగ్రత్తగా దాచుకున్నావా?" అని అడిగింది.

అప్పుడు నాకు నా ఉద్యానవన విహారం కలో - నిజమో అర్థం కాని స్థితిలో గుర్తుకొచ్చింది.

"అయ్యయ్యో! దాచుకోలేదు. వాటి మహిమ పూర్తిగా తెలీక వాటిని ఇద్దరు బ్రాహ్మణులకు ఇచ్చేశాను."

"అయ్యో! అమ్మవారు నీ కోసం ఇచ్చినవి, అట్లా ఇతరులకు ఇవ్వవచ్చా? సర్లే! నేను ఆలయంలోకి వెళ్లి వస్తా" అంటూ లోపలికి వెళ్లింది. ఎంతకూ తిరిగి రాలేదు. ఆలయంలోనూ లేదు.

'ఇంకేం చెయ్యాలా?' అనుకుని, నేను అక్కడి నుంచి బయటకొచ్చి నాపై అమ్మవారి దయ ఉందని సమాధానపడ్డాను. మళ్లీ అక్కడ్నుంచి ప్రయాణం సాగించి, మర్నాటి సాయంత్రానికి ధర్మపురి అనే ఒక పట్టణం చేరుకున్నాను.

ఆ ఊరి సత్రంలో "ధర్మాంగద మహారాజు గారి దివాణానికి అద్భుత ఫలం ఒకటి వచ్చిందనీ - అది ఏ జాతికి చెందిందీ ఎవరూ చెప్పలేకపోయారనీ - దానికి అద్భుత పరిమళం ఉందనీ- అది తింటే ఏం జరుగుతుందన్న సంగతి ఎవరికీ తెలీదనీ- ఆ రాజుకు స్నేహితుడూ మలయాళ దేశపు రాజూ అయిన చంద్రవర్మ అద్భుతపుష్పాన్ని తెచ్చాడట! అది ఎన్నటికీ వాడదట! దాని పరిమళం ఆమడదూరం వరకు వ్యాపిస్తుందట! ఈ రెండిటి గురించీ ఉపన్యాసాలు, తదుపరి మదనమంజరి అనే వేశ్య 'సంగీత సభ ఉంటుంది" అని ప్రజలు చెప్పుకోవడం విని, నేను తటాలున లేచి ఆ ఫల - పుష్పాల గురించి ఏమేమి చెప్పుకుంటారో విందామని అభిలాష కలిగి స్త్రీ వేషంతో సభలోకి పోరాదని నిశ్చయించి పురుషవేషం వేసుకుని ఆ సభకు వెళ్లాను.

సభ మధ్యంలో - ఆనాడు నేను వేర్వేరు చోట్ల ఇద్దరు బ్రాహ్మణులకు ఇవ్వగా, అవి అక్కడకు చేరినవని అర్ధమైంది. వాటి అద్భుత పరిమళం అక్కడి సభాసదులకు ముక్కుపుటాలను అదరగొడుతుంది.

ఆ వూరి ప్రభువైన ధర్మాంగద మహారాజు ' ఆర్యులారా! లోకాతీతమైనట్టి వస్తువేదైనా సంప్రాప్తిస్తే, దాని విశేషం అందరికీ తెలియజేయడమే రాజధర్మం. ఇది ఒక అద్భుతఫలం. ఎన్ని రోజులుగా ఉన్నా వాడిపోకుండానే ఉంది. పదిరోజులుగా నేను చూస్తున్నాను. కొంచెమైనా కాంతి తప్పలేదు. ఇటువంటి మహిమ కల్పవృక్షాల నుంచి పుట్టే పండ్లకు తప్ప మిగిలిన వాటికి కలగదు. ఈ పండు తినడం వల్ల కలిగే లాభం ఏమిటన్నది ఎవరికీ తెలీదు. ఏదో ఒక విశేషం ఉండకపోదు. అయితే - ఇవి మా దగ్గరకు ఎన్నెన్నో చేతులు మారిన తర్వాత చేరాయి. అవి ఎలా వచ్చాయో అన్నది, నా దగ్గరనే ఉన్న ఈ జనుల ద్వారా మీకు తెలియపర్చేలా చేయగలను....." అంటూ ఆ ఫలపుష్పాల సంగతితో సంబంధం ఉన్న మనుషులనందరినీ అంతకు ముందే రప్పించి ఉండడంతో "మీకు తెలిసిన విషయాలన్నీ దాచకుండా సభవారికి చెప్పండి." అని ఆజ్ఞాపించాడు.

అప్పుడు వారిలో భీమశర్మ అను బ్రాహ్మణుడు మొట్టమొదట లేచి సభ్యులకు నమస్కరిస్తూ ఇలా ప్రారంభించాడు....

## అద్భుత ఫలం కథ

"సభ్యులారా! నా పేరు భీమశర్మ. మాది విజయపురి అగ్రహారం. నేనొక రోజున మా అన్నలచే అవమానించబడి, ఇక బ్రతికి లాభం లేదని ఉరిపోసుకోబోతూంటే, పంచకళ్యాణి నెక్కి వచ్చిన ఓ పురుషుడు నా విషాదగాథ విని, మహిమగల ఈ ఫలం నాకు ఇచ్చి – దీన్ని ఏ ప్రభువు కిచ్చినా నా దరిద్రం తీరేంత ధనం లభిస్తుందని– అది తీసుకుని బ్రతకమని చెప్పాడు. అతని వద్ద పుష్పం కూడా చూశాన్నేను. నేను నాకివ్వబడిన ఫలం పట్టుకుని ధర్మపురి చేరాను. నేను దాన్ని ఎన్ని పొరల్లో చుట్టి ఉంచినప్పటికీ – దాని పరమళం వ్యాపిస్తూనే ఉంది.

నేను వీధిలోన పోతూండగా, కుబేరదత్తుడనే వ్యాపారి ఆ పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ నన్ను పిలిచి పండు చూపించమన్నాడు. దీన్ని తింటే సంతానం కలుగుతుందా? అని అడిగాడు. నాకు దాన్నిచ్చిన పురుషుడు నాకు ఆ సంగతి చెప్పనందువల్ల, నాకు తెలీదని నిజాయితీగానే అన్నాను. అదీగాక అతడు సామాన్యులకు ఈ ఫలం ఇవ్వవద్దని సూచించాడు. అయితే ఆ వ్యాపారి కొసరి – కొసరి లక్షరూపాయలు ఇస్తాననేసరికి 'ఏ ప్రభువైతే మాత్రం ఇంతకంటే ఎక్కువ ఇస్తారా?' అని నేను ఆశీర్వదిస్తూ ఆ పండును అతని చేతిలో ఉంచాను.

అతడు దాన్ని పెట్టెలో దాచి, "నా దగ్గర ఇప్పుడు అంత డబ్బు లేదు. రేపు రండి! మీ సొమ్ముకు భయం లేదు" అన్నాడు.

వర్తకుల మాయమాటలు నాకు తెలీవు. నిజమే కదా! ఇప్పటికప్పుడు లక్షరూపాయలంటే అతడెక్కడ నుంచి తీసుకొస్తాడు? అనుకుని మర్నాడు పొద్దున్నే వెళ్లాను. తెల్లారకుండానే వచ్చావే! ఊరికెళ్లినవాడు సొమ్ము తీసుకురావద్దా?సాయంకాలం రండి" అన్నాడు. అలా నాల్రోజులు రేపూ – మాపూ అంటూ తిప్పి, వారం పోయాక రమ్మన్నాడు. అప్పుడు నేను " సరే!

మీ దగ్గర ఉన్న సొమ్ము ఉన్నప్పుడే కొనండి! నా ఫలం నాకు ఇచ్చేయండి" అన్నాను.

"వెర్రి బ్రాహ్మడా! నిజంగా ఆ పండుకు లక్షరూపాయలు ఇస్తాననుకున్నావా? పరిహాసంగా అన్నాను. అంతే! దీంతో సంతోషించు! వెళ్లు!" అంటూ పదిరూపాయలు చేతిలో పెట్టబోయాడు.

"ఇది నాకొద్దు! నా పండు నాకు ఇచ్చేయి" అన్నాను. ఇంకెక్కడుందది – ఇదివరకే తినేశాం! చేదుగా ఉంది. ఏం గుణం కన్పించలేదు" అన్నాడా వర్తకుడు. నేను కేకలు వేసి పెద్దమనుషుల్ని రప్పించాను. వ్యాపారి చేసిన మోసం వెల్లడించాను.

పెద్దమనుషులంతా కలిసి "బ్రాహ్మడ్ని మోసం చేస్తావా?" అంటూ వ్యాపారిని నిలదీశారు. అప్పుడా వ్యాపారి మాట మార్చేసి "భలే పెద్ద మనుషుల్లా ఉన్నారే? ఎక్కడైనా ఒక పండు లక్షరూపాయలు చేస్తుందా? నేనేదో బ్రాహ్మడితో పరిహాసానికి అన్నాను. నేను అది తినేసిన సంగతి తెలిశాక – ఈ బాపనయ్య లక్షరూపాయలు ఇమ్మంటున్నాడు. పోనీ కదా! బ్రాహ్మడని పదిరూపాయలిస్తే ఇలా తగువుపెడుతున్నాడు" అన్నాడా వ్యాపారి.

వాళ్ళంతా, ఆ వ్యాపారి యుక్తి యుక్తంగా చెప్పిన మాటలు నమ్మి "ఎట్టి ఫలమైనా లక్షరూపాయలు చేయదు. ఇదంతా బూటకం. బ్రాహ్మడివై ఉండి, ఇంత అన్యాయం చేస్తావా?'' అంటూ ఎదురు నన్నే మందలించసాగారు. ఇక ఏం చెయ్యాలో తెలీక చింతాక్రాంతుడిన్నై, ఎవరితో చెప్పినా ఎవరూ నమ్మకపోయేసరికి, చివరికిది నా దురదృష్టం అనుకుంటూ కలతపడి, రెండు మూడు రోజుల తర్వాత యావద్విషయమూ దేవరవారికి విన్నవించుకున్నాను.

ధర్మప్రభువైన ఈ మహారాజు నా మొరాలకించి, ఆ క్షణంలోనే కుబేరదత్తుని తీసుకుని రమ్మని భటుల్ని పంపారు. అదేమి కర్మమో గాని – ఆ క్రిందట రాత్రికే దొంగలు ఆ ఇల్లంతా కొల్లగొట్టి, ఇంట్లో ఉన్న ధనమంతా పెట్టెల్తో కూడ ఎత్తుకుపోవడంతో, అతడు గుండెలు బాదుకుంటూ వీధిన పడి రోదిస్తున్నాడు.

## అద్భుత ఫలం కథ

భాగవతంలో చెప్పబడిన నీతి ప్రకారం "విప్రతతి సొమ్ముకంటెను విషము మేలు- గరళానికైనా ప్రతికృతి కలదు కాని, దాని మాన్పంగ భువిని ఔషధాలు లేవు. కాన బ్రహ్మ సొత్తులను గొంట కాదు జగతిన్" అని భూసురుని విత్తం కోసం ఆశపడితే, అది మేలు కలిగించదు.

ఆ తర్వాత భటులు వేగంగా ఆ కుబేరదత్తుని మన ప్రభువుల దగ్గరకు తీసుకొని వచ్చారు. ఇక్కడ కూడా అతడు మొదట ఎన్నెన్నో పోకడలు పోయాడు. అయితే, చివరికి రాజదండన భయం చేత నిజం చెప్పాడు. దురదృష్టమేమోగాని, ఆ ఫలం ఉన్న మందసం కూడా దొంగలెత్తుకుపోయారు.

అయితే మన ప్రభువు ధర్మాంగదులవారు, దాన్ని అంతటితో వదిలి పెట్టలేదు. అదేదో దాని అంతు చూడాలని నిర్ణయించుకున్నారులాగ ఉంది. చాలా ప్రయత్నంతో వెతికించి, దీన్ని పట్టుకున్నారు. ఇదీ నేనెరిగిన సంగతి" అని ఆ బీదబ్రహ్మచారి ఉపన్యసించి కూర్చున్నాడు.

ఆ తర్వాత అది ఎన్నెన్ని చేతులు ఎలా మారిందీ వారి వారి నోట చెప్పించాడు ధర్మాంగదుడు. వాటి సారాంశమిదీ!

విచారణలో కుబేరదత్తుని వల్ల, బ్రాహ్మణుడు భీమశర్మ చెప్పిందంతా నిజమేనని ధృవపడింది. ధనలోభంతో బ్రాహ్మణుని సొత్తుకు ఆశించినందువల్ల నాకు గొప్ప ప్రాయశ్చిత్తమే జరిగింది. ఇకముందెన్నడూ అలా చెయ్యను" అని చెంపలు వేసుకుని కూర్చున్నాడు అతడు.

కుబేరదత్తుని ఇల్లు కొల్లగొట్టిన దొంగలు, ఆ ధనాన్ని ఒక కంసాలి వానింట పంచుకొన్నారు. వాళ్లకు ఆశ్రయం ఇచ్చినందుకు ప్రతిఫలంగా, ఆ అద్భుతఫలాన్ని ఆ కంసాలికి ఇచ్చేసిపోయారు వాళ్లు. ఆ ఫలం యొక్క అద్భుతమైన సువాసనకు అబ్బురపడిన ఆ కంసాలి, తన దగ్గర రెండు మూడు రోజులు ఉంచుకుని ఇటువంటి అరుదైన వస్తువులు స్త్రీలు దగ్గర ఉంటే శోభిస్తాయి అని యోచించి, అతడు వేశ్య దగ్గరకు వెళ్లేవాడు గనుక తారావళి అనే వేశ్యపరం చేశాడు.

ఆ వేశ్య అపురూపంగా ఆ ఫలాన్ని చూసుకుంటూ - దాని సువాసనకు నిత్యం అలవాటైన దానిలా మేడమీద దాన్ని వ్రేలాడ దీసింది.

ఈలోగా రాజభటులు ఆ ఫలంకోసమే వెతుకుతున్నారని విని కంసాలి విటుడు దాన్నెక్కడైనా పారెయ్యకపోతే, విచారణలో తాము చిక్కులెదుర్కోవలసి వస్తుందని తన ప్రియ వేశ్యకు సలహా ఇచ్చాడు.

ఆమె వదల్లేక - వదల్లేక దాన్ని దాసికి ఇచ్చి కందకంలో ఎక్కడైనా పారేయమన్నది. ఆ దాసి అలా చెయ్యక తన విటుడికిచ్చి, తారావళి అడిగితే పారేశానన్నది.

దాసి విటుడు ఆ పండు సువాసనకు అబ్బురపడి, "దీన్ని నేను తినేసే కంటే, అంగడిలో ఉంచి అమ్మితే అధికలాభం వస్తుంది" అని ఆలోచించి అంగడికి తీసుకెళ్తుండగా దాని పరిమళ మహిమవల్ల రాజభటులు వచ్చి పట్టుకున్నారు. అతడ్ని నిజం చెప్పేదాకా చావబాదితే, దీని కథ ఒక్కొక్కరి దగ్గర్నుంచీ ఎలా చేరిందీ రాజుగారికి తెలిసింది.

సభ్యుల కరతాళ ధ్వనుల మధ్య ధర్మాంగదుడు తిరిగి లేచి "ఇక ఇప్పుడు అద్భుత పుష్పం వెనుక కథ కూడా వినండి" అన్నాడు. అప్పుడో వృద్ధ బ్రాహ్మణుడు లేచి ఇలా చెప్పసాగాడు.....

## అద్భుత పుష్పం కథ

"అయ్యా! నాపేరు కృష్ణశర్మ. విదరదేశం మాది. నేనొక మధ్యాహ్నపు వేళ పిల్లలతో అడవిదారిన పడి వెళ్తూండగా ఒక చక్కని రాచవారి చిన్నది చెట్టునీడన సేద తీరుతూ కన్పించింది. దేవకన్య అయినా కావచ్చు! నా దారిద్ర్య బాధ పూర్తిగా ఆమెకు నివేదించేసరికి, ఆమె జాలిపడి ఒక అపురూపమైన పుష్పాన్ని నా చేత బెట్టి "నీ కుటుంబాన్ని కలకాలం పోషించగల వారికే ఈ మహిమగల పుష్పాన్నివ్వు" అని చెప్పింది. నా పాలిట భాగ్యదేవత ఆమేననుకుంటూ ఒకనాటి సాయంకాలానికో ఊరు చేరాను.

ఇద్దరు మనుషులు విహారం కోసం గుర్రాలమీద వెళ్తూ నాకు ఎదురయ్యారు. నా దగ్గర ఉన్న పుష్పపరిమళం వాళ్లను కదలనివ్వకపోయేసరికి

– అపూర్వమైన ఆ సువాసనకు వాళ్లు ఆశ్చర్యపడి, అన్ని వైపులా పరికించి చూసి, అది నా దగ్గర్నుంచే వస్తోందని గ్రహించి, నా దగ్గర కొచ్చారు.

"బ్రాహ్మణుడా! నీ దగ్గర ఏదైనా పరిమళ ద్రవ్యం ఉందా?" అని అడిగారు. నేను నా దారిద్ర్య బాధ వల్ల ఎక్కువకాలం గుట్టు దాచకనే "అవును! ఇదొక అపూర్వపుష్పం!" అని మూట విప్పి దాన్ని చూపాను.

వాళ్లు కూడా ఆ పువ్వునుంచి వచ్చే తావికి ఆశ్చర్యపోయారు. "ఎక్కడిదీ పువ్వు?" అని అడిగారు. నేను సంకోచం ఇంతయినా లేక యదార్థం వారికి వివరించినప్పుడు, వారు "అయ్యా! ఇంతేకదా! మీకూ మీ కుటుంబానికీ జీవితాంతం జరుగుబాటు ఉండేలా మేము చేస్తాం! మా ఇంటికి రండి! ఈ పుష్పాన్ని మాకు ఇవ్వండి!" అని వేడుకున్నారు. వాళ్ల మాటలకు నేను సంతోషించి "త్రికరణ శుద్ధిగా నా కుటుంబాన్ని మీరు పోషిస్తానని మాట ఇవ్వగలిగితే, ఈ పుష్పాన్ని ఇప్పుడే మీ పరం చేస్తా" అని చెప్పాను. వాళ్ల చేత ముమ్మారు ప్రమాణం చేయించుకుని, ఆ పుష్పరాజం వారి చేత బెట్టాను.

వాళ్లు మమ్మల్నందరినీ తమ ఇంటికి తీసుకెళ్లారు. మాటిఇచ్చిన ప్రకారం గౌరవంగానే పోషించసాగారు. నా వంటి ఆజన్మ దరిద్రునికి ఈ స్వల్పలాభం సహితం రాజ్యపదవిలా తోచడం ఆశ్చర్యమేమీ కాదు గదా! నేను మొదట వాళ్లిద్దరూ ఒకటే కాబోలు అనుకున్నాను. పదిరోజుల తర్వాత గాని వాళ్లు వేర్వేరు వ్యక్తులన్న సంగతి నాకు తెలిసింది కాదు. వాళ్లిద్దరూ మిత్రులు. ఇద్దరికీ ఒక్కతే విటగత్తె. అందువల్ల వారికి స్నేహం కలిసింది. కాని మమ్మల్ని పోషించే విషయంలో వారు తర్కించుకుంటున్నారని ఆ తర్వాత నాకు తెలిసింది. "అయ్యయ్యో! ఇటువంటి అధర్మప్రవృత్తి గల వారికిటువంటి దివ్యపుష్పాన్నిచ్చానే" అని పశ్చాత్తాపపడసాగాను. ఇంకో పదిరోజులయ్యేసరికి, ఆ వేశ్య వల్లనే ఇద్దరికీ విరోధం పుట్టి – ఒకరి ముఖం ఒకరు చూసుకోకుండా అయ్యారు. అక్కడితో ఆగక – ఒకే స్త్రీ వల్ల శత్రువులైనందువల్ల వారు ఒకర్నొకరు తిరస్కార భావంతో చూసుకుంటూ, దూషించుకుని ఒకనాటి రాత్రి దొమ్మి యుద్ధంలో ఒకరిచేత ఒకరు చంపబడ్డారు.

తర్వాత - మమ్మల్ని పోషించేవారు లేక, ఆ పువ్వు విషయమై వారి ఇళ్లలో వెదికి, ఎక్కడా కనిపించక పోవడంతో చివరికి అది ఆ వేశ్య దగ్గరకే చేరి ఉంటుందని భావించి, దాని దగ్గరకే వెళ్లి, ఆ పువ్వుకు సంబంధించిన వృత్తాంతం అంతా చెప్పి, "అది ఇస్తావో - నన్ను పోషిస్తావో చెప్పు" అని అడిగాను.

"ఇది నా సొత్తు అయింది. లంజకు ఇచ్చిన విత్తము ఏదైనా తిరిగిరాదని ఎరుగవా? అలాగే దీనికి సంబంధించిన ప్రమాణాలూ - ఒట్లూ నాకు చెందవు. అంతగా న్యాయం కావాలంటే, ఆ ఇద్దరికీ దాయాదులు ఎవరో కనుక్కొని వాళ్లు నీకు బాకీపడినట్లుగా చెప్పి చూడు! పోషించారా సరే! లేకపోతే అధికారులతో చెప్పుకో! నేను దీన్ని తిరిగి ఇవ్వడం కల్ల" అని తేటతెల్లం చేసింది. నేనా జ్ఞాతులను వెతకలేక, గ్రామాధికారుల వద్ద మొరపెట్టుకోగా, వారు దానిని రప్పించి అడిగారు. నాతో ఏం చెప్పిందో, అంతకంటే బింకంగా అదేమాట గ్రామాధికారులతో అన్నది. కర్తవ్యం పాలుబోక వాళ్లు ఏంచెయ్యాలా అని వితర్కిస్తూంటే మాదేశ ప్రభువులు చండవర్మ మారాజుగారు ఇక్కడకేదో ఆహ్వానం మీద వస్తూ దారిలోని ఆ గ్రామంలోనే బస చేశారు. అప్పుడు నేను నా సంగతులన్నీ వారికి తెలియచేశాను.

శ్రేష్ఠమైన వస్తువులన్నిటిపై రాజులు అభిలాష పడడం సహజమే! "పై సంగతులన్నీ తర్వాత విచారిస్తాం! ముందా దివ్య పుష్పం ప్రభువుల పరం చెయ్యి" అని ఆజ్ఞ వేసి, సాని దగ్గర్నుంచి పుష్పాన్ని తెప్పించారు. మమ్మల్ని కూడా ఈ సభకు రమ్మని చెప్పారు. ఇదీ నాకు తెలిసిన వృత్తాంతం" అని కృష్ణశర్మ చెప్పి కూర్చున్నాడు. అప్పుడు చండవర్మ మహారాజు లేచి, సభ్యులందర్నీ చూస్తూ "సభ్యులారా! ఈ పుష్పం - ఫలం ఇక్కడికి చేరిన వైనం మనం ప్రత్యక్షంగా వీటితో ప్రమేయం ఉన్న వాళ్ల వల్ల విని తెలుసుకున్నాం. ! అయితే భీమశర్మ తనకా ఫలాన్ని ఒక పురుషుడు ఇచ్చాడని, కృష్ణశర్మ తనకు ఆ పుష్పాన్ని స్త్రీ ఇచ్చిందనీ చెప్తున్నారు. కాని నా ఊహప్రకారం ఇవి వేర్వేరు వ్యక్తులు ఇచ్చినవిగా తోచడం లేదు" అంటూనే

"అయ్యా! నీకు ఈ ఫలం ఇచ్చిన పురుషుని పోలికలు ఎలా వున్నాయి?" అని అడిగాడు.

అప్పుడా బ్రహ్మచారి "కనుచీకటిగా ఉండడం వల్ల అంత బాగా పరిశీలించి చూడలేదు. నాకు ఫలం ఇచ్చేటపుడు పైట చెంగు విప్పి ఇచ్చినట్లే గుర్తు. గుర్రం ఎక్కి వచ్చినందువల్ల పురుషుడనుకుంటున్నాను. గుర్రం పంచకల్యాణిదే!" అని చెప్పాడు.

"సందేహం లేదు. ఈ రెండూ ఇచ్చినది స్త్రీ. ఆమె ఒక్కర్తే అనడానికీ సందేహించనక్కర్లేదు. అయితే మా ఊహప్రకారం ఆమె దేవతా స్త్రీయే అయి ఉండాలి. దేవతాస్త్రీలు అప్పుడప్పుడు భూలోకంలో విలాసంగా విహరించడానికి వస్తుంటారని వాడుక ఉంది. ఈ ఫలపుష్పాలు రెండూ దేవలోకానివే! దేవి దయ వల్ల లభించాయి. కనుక వీటికి నిత్యం పూజలు జరిపించాలి. వీటిని మన దగ్గరకు చేర్చిన ఈ బ్రాహ్మణులిద్దరికీ తగు రీతిన బహుమతులు ఇవ్వడం సముచితం అని నా అభిప్రాయం" అన్నాడు. సభ్యులందరూ ఆయనను బలపరిచి, అదే తక్షణ కర్తవ్యమన్నారు.

ఇట్లా కొంతసేపు ఆ ఫలపుష్పాల గురించి ఉపన్యాసాలు జరిగిన తర్వాత, సభవినోదం కోసం సంగీతం పాడ్డానికి మణిమంజరికి ఆజ్ఞ నిచ్చారు. అప్పుడా వైణికురాలు హాయిగా వీణపై రాగాలు పలికించి అందరికీ సంతోషం కలిగించింది.

సాధారణంగా గాన విద్యాభ్యాసం గలవారికి, ఇతరులు పాడేటప్పుడు తమకు కూడా పాడాలని ఉత్సాహం కలగడం సహజమే! అప్పుడు నాకు వీణావతి చేసిన స్వరకల్పనలన్నీ మనస్సులో గుర్తుగా ఉండడంతో వాటిని పాడి ఎలాగైనా సభ్యుల మెప్పు పొందాలన్న వెర్రి ఆనందం ఒకటి ఉద్భవించింది. అప్పుడు సభాముఖానికి వెళ్లి అగ్రసనాధిపతితో "ముహూర్త మాత్రం నా గాంధర్వ విశేషం విని నన్ను కృతార్థుని చేయండి" అని వీణావతి స్వరకల్పనను ఎత్తుకున్నాను. ఒక అద్భుతమైన మైకం కమ్మింది సభ్యులకు. చాలామంది బొమ్మల్లా మంత్రించినట్లు అలాగే ఉండిపోయారు. కొందరు పాటకు పరవశించి నృత్యం చేశారు. కొందరు తాము కూడా కూనిరాగాలు

తీశారు. అప్పుడు నేను వారందర్నీ మరింత సమ్మోహనానికి గురి చేస్తూ మోహనరాగం పాడాను. ఇంకేమున్నదీ సభ్యులంతా నిద్రలోకి జారుకున్నారు.

ఆ మత్తులోంచి తేరుకున్నాక, " ఇది దేవగానమే తప్ప - మనుష్య గానం కాదు" అని ప్రశంసించారు. మణిమంజరే ఆశ్చర్యపోయిందా పాటకు.

ధర్మాంగదుడు నన్ను పిల్చి, ప్రత్యేకంగా మెచ్చుకుని నా వివరాలు అడిగాడు. అద్భుత ఫలపుష్పాల్లాగానే మీరూ అప్రయత్నంగా మాకు లభించారు. మా అదృష్టం గట్టిది" అన్నాడు.

" నా పేరు సింహకేతుడు. నాది క్షత్రియజాతి. మాది కాశీపురం. దేశాటనం చేస్తూ ఇలా వచ్చాను. ఈ గానం స్వయంకృషితో నేర్చిందే! ఎవ్వరి దగ్గరా అభ్యసించినది కాదు." అన్నాను.

"వివాహమైందా?" అని అడగ్గా లేదన్నాను.

"మీకు ఏయే విద్యలో పాండిత్యం ఉంది?" అని అడగ్గా "అన్ని విద్యల్లోను కొంచెం-కొంచెంగా ప్రశంస ఉంద"న్నాను నాకు అన్ని విద్యల్లోనూ కొంత ప్రవేశమున్నదని చెప్పడంతో సభ్యులంతా నా విద్యా పరిశ్రమ ఎట్టిదో వినాలని కుతూహలం కన్పరిచారు. దాంతో మరునాడు శాస్త్ర ప్రసంగం నిమిత్తం సభ చెయ్యాలని అందరూ యోచించి నన్ను రావలసిందిగా ప్రార్థించారు.

ఆ వాదంలో ప్రతివాదులే నన్ను ప్రశంసించేసరికి "రాజకుమారా! నీ రూపం - సంగీతం - శాస్త్రజ్ఞానం అన్నీ అమోఘంగా ఉన్నాయి. నీకివ్వదగిన పారితోషిక మేదీ మా దగ్గరలేదు. మా రాజ్యం అంతా ఇచ్చినా నీ ప్రతిభకు సాటిరాదు. ఈ అద్భుత ఫల పుష్పాలు నీ దగ్గర ఉంటే బంగారానికి తావి అబ్బినట్లుగా ఉంది. దేవుణ్ణి పూజించడానికీ - నైవేద్యానికీ ఫలపుష్పాలు అర్పిస్తారు కదా!" అంటూ అవి తిరిగి నా పరం చేశారు.

ఒకనాడు నా గుర్రం రాజభటులకి దొరికింది. దాన్ని వారు అక్కడికి తీసుకొచ్చారు. నేను దాన్ని చూసి చాలా సంతోషించి, రాజుగార్ని అనుమతి కోరి నా గుర్రాన్ని నేను తిరిగి పొందాను. నా వినయగుణం కూడా వారికి బాగా నచ్చింది. విద్యా వినయ సంపన్నుడిగా వారి వద్ద నాకో ప్రత్యేకస్థానం

ఏర్పడింది. న్యాయమైన సొమ్ము నట్టేట పారేసినా నట్టింటికి నడిచి వస్తాయన్నట్లు నా వస్తువులన్నీ నన్ను చేరుకున్నాయి. నేను అక్కడ ఒక నెల ఉన్నాక, మలయాళ దేశప్రభువు చండవర్మ తన దేశానికి వెళ్తూ నన్ను తన వెంట రమ్మన్నాడు. సరే అన్నాను. ఈ పట్టణంలో చండవర్మ విడిదిగా నాకు ఇచ్చిన విలాసవంతమైన మేడలో వీణావతి వల్ల నేను గ్రహించిన స్వరవిశేషాలను పాడుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తున్నాను. ఒకరోజు సాయంకాలం నేను ఆ ఫలపుష్పాలు రెండూ ముందు పెట్టుకుని, మనోహరంగా విపంచి వాయిస్తోంటే, ఒక పెంపుడు చిలుక నా దగ్గర కొచ్చి వాలింది.

నేను పాట సందడిలో మొదట దాన్ని అంతగా పట్టించుకోలేదు. నేను పాట ఆపగానే, అది ముక్కున కరుచుకుని వచ్చిన ఒక పత్రికను నా ఎదుట పడేసింది. అందులో "పురుషోత్తమా! నీది అపూర్వ గాంధర్వ విద్యా విశేషము. దానికి వన్నె కలిగించేలా ఉంది సౌందర్యం. ఇవి నా మనస్సును హరించేశాయి. అద్భుత ఫలపుష్పాలకు సైతం అధిపతివై వున్న నన్ను చూడాలని ఉంది" అని 'వసంతి తిలక వృత్తం' ( ఒక సంస్కృత ఛందో విశేషం)లో శ్లోకంగా తన అభిప్రాయం పంపింది. నేనూ మరికొంత పరీక్షించాలని, సంస్కృతంలో శ్లోకం రాసి ఆ చిలక ముక్కుకు అందించగా, అది వచ్చిన చోటికే ఎగిరివెళ్లి నా సందేశం అందజేసింది.

ఇలా కొన్ని ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాక, ఒక రాత్రి నేను మేడమైన గానసాధనలో ఉండగా ఒక స్త్రీ వచ్చి నమస్కరించి వినయంగా తన పేరు 'తిలోత్తమ అనీ – తమ రాజపుత్రిక వసంత తిలక నా సంగీతం వినాలని ఎంతో కుతూహలపడుతూ వచ్చిందనీ– నేను అనుమతిస్తే తీసుకొస్తాననీ' అన్నది. అది విని "రాజపుత్రికలు ఇటువంటి రాత్రివేళ ఇతరుల మేడకు సంగీతం వినడానికైనా రావడం తప్పు కదా! సరే! ఎటూ రానే వచ్చింది కనుక తీసుకురా!" అన్నాను.

ఆమె వచ్చి కూర్చున్నాక, వీణావతి నన్ను వివశురాలిని చేసిన మోహన రాగాన్ని ఆలపించేసరికి, ఆ రాకుమార్తె వసంత తిలక నిజంగా

వివశత్వం పొంది, సిగ్గు విడచి తన మదనవికారం తెలియచేసింది. ఆమెని ఎలా కట్టడి చేయాలో తెలీక, నేనే మందలిస్తూ "అమ్మాయీ! ఇటువంటి విషయాలు పెద్దవారు చూసుకోవడానికి ఉండగా, కన్యకలు స్వతం త్రించకూడదు. తొందరేముంది? ఇప్పుడీ వికారాలు కట్టి పెట్టు" అంటూ పంపేశాను.

ఆ మర్నాడే రాజు తనకు పుత్ర సంతతి లేదనీ - వసంత తిలక అని ఒకే ఒక్క కూతురున్నదనీ, ఆమెను వివాహం చేసుకుని, రాజ్యం ఏలుకోవలసిందిగా కోరగా, నేను స్త్రీనన్న విషయం వెల్లడించలేక సిగ్గుతో మౌనం వహించాను. నా మౌనాన్ని సగం అంగీకార సూచకంగా తీసుకున్నారేమో చొరవచూపి పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించేశారు.

ఒక శుభముహర్తాన వసంత తిలకతో గొప్ప వైభవంగా జరిపించేశారు. నేనా పిల్లని ఎలా - ఎందుకు పెళ్లాడానో కూడా నాకే తెలీదు.

**శ్లో ॥ అఘటిత ఘటితాని ఘటయతి - ఘటిత ఘటితాని దుర్ఘటీ కురుతే।**

**విధిరేవతాని ఘటయతి - యాని పుమాన్ నైవ చింతయతి॥**

అనే శ్లోకాన్ని పదే పదే తల్చుకోసాగాను. లోకంలో ఎలాంటి వారైనా సంకల్పపూర్వకంగా పనులు చేస్తుంటారా? కొన్ని వాటికవే జరిగి పోతూంటాయి. నేనూ అలా సంకల్పించకనే అప్రయత్నంగా అలా జరిగింది. ఇది విధి నియామకం తప్ప ఇతర కారణమేదీ కాదు.

పెళ్లయ్యాక కోటి ఆశల్తో కొత్తపెళ్లికూతురు పతి కౌగిట్లో కరిగిపోవాలని ఉవ్విళ్లూరడం సహజమే కదా! వసంత తిలక స్థితి కూడా అంతే! కాని, నా గుట్టు ఎక్కడ బైటపడుతుందోనని 'పెళ్లయిన ఏడాదిలోగా మనం కలిస్తే నేను మరణిస్తానని ఒక సన్యాసి చెప్పాడు. కనుక ఒక్క ఏడాది వరకు ఓపికపట్టు! ఆపైన మనిష్టం!" అన్నాను. రతివిరహంతో వేగిపోతూన్నా, నా క్షేమం కోసం పాపం ఆ పిల్ల ఓర్పు వహించింది.

కొద్ది రోజుల్లోనే చండవర్మ స్వర్గస్తుడైనాడు. నేను సింహాసన మధిష్ఠించాను. శక్తి పూజ పేరిట జరుగుతున్న నరబలులను - ముఖ్యంగా ఇతర దేశస్థుల్ని బలివ్వడాన్ని ప్రజలు ఆపకపోతే కఠినంగా శిక్షలు విధిస్తానని ఆజ్ఞలు జారీ చేశాను. బలులు ఇచ్చేవారిని కనిపెట్టడానికీ - మంత్ర శాస్త్ర సంబంధ పుస్తకాలు లాక్కోవడానికీ ప్రత్యేకంగా దళాన్ని ఏర్పరిచాను.

మొన్నటిరోజు నాకీ పుస్తకం చేతికందేసరికి, మనవాళ్లే ఎవరో తప్పక బందీలుగా చిక్కి ఉంటారని ఊహించాను. ఇదంతా ఆ జగన్మాత విశాలాక్షి కృప తప్ప ఇంకొకటి కానే కాదు" అని చెప్పి విశాలాక్షి అద్భుత ఫల పుష్పాలను తెచ్చి వారికి చూపించింది.

అవి చూసిన ఇంద్రద్యుమ్నుడూ, మదనుడూ ఆశ్చర్యపోయారు. ఆమె వసంత తిలకను కూడా పిలిపించి, ఆ వృత్తాంతం అంతా చెప్పి, నా మనోహరుడితడే అని చెప్పేసరికి ఆమె చాలా విస్మయం చెందింది.

"ఈ ఫలాన్ని భ్రాంతి ఏదో - స్వప్నమేదో తెలీని స్థితిలోనే తిని నేను ఆకలి దప్పులను జయించాను" అంటూ విశాలాక్షి ఆ ఫలాన్ని నాలుగు ముక్కలుగా కోసి, ఇంద్రద్యుమ్న దంపతులకు, మదన - వసంత తిలకలకు సమానంగా పంచి ఇచ్చింది.

అప్పుడు ఇంద్రద్యుమ్నుడు "అమ్మాయీ! నీ చరిత్ర చిత్రాతి చిత్రం! మేము దేశం విడిచి చాలాకాలమైంది. మా పుత్రుడు విజయుడిని గురించి ఆతృత పడుతున్నాం! ఇప్పటికి మనమంతా కల్సుకున్నాం. క్షేమంగా ఇల్లు చేరాలని వుంది. ప్రయాణానికి ఏర్పాట్లు చెయ్యి" అన్నాడు. అప్పుడామె "మొదట మనమంతా కలసి కాశీపురానికి పోయి, నా శత్రురాజుల్ని తరిమేద్దాం. ఆ తర్వాత మీరు నిరావతీ పట్టణాన్ని చేరుకోవచ్చు!" అని ప్రతిపాదించింది.

అయితే "అమ్మా! నీ పట్ల కాశీ విశాలాక్షికి అపారమైన కృప ఉంది. మీరు సేనావాహినితో గుహమార్గాన కోటలోకి ప్రవేశించండి! శత్రువు

ఊహించని విధంగా ఒక్కుమ్మడిగా పైనబడి ఎదిరించండి. విజయం మీ స్వంతం అవుతుంది. నేను వచ్చి చాలాకాలమైంది. కనుక నేనొక్కసారి విజయుని క్షేమసమాచారాలు తెలిసి, అక్కడ్నుంచి మీరు కాశీపురం చేరుకొనేలోగా వచ్చి కలుస్తాను" అన్నాడు ఇంద్రద్యుమ్నుడు.

విశాలాక్షి అతని మాటలకు అంగీకరించి ప్రయాణానికి ఓడ నౌక దాన్ని సిద్ధం చేయించింది.

## ఇంద్రద్యుమ్నుని సముద్రప్రయాణం

మంచిరోజు చూసుకుని ఇంద్రద్యుమ్నుడు, విశాలాక్షి అనుమతితో, ఆ మళయాళ దేశం నుంచి బయల్దేరాడు. ఓడలోని ప్రజానీకానికి ఒక సంవత్సరానికి సరిపోయేంత ఆహార సామాగ్రి ఉన్నది. భార్యతో సహా బయల్దేరిన ఇంద్రద్యుమ్నుడు ఎక్కిన ఆ ఓడ మూడు వారాలు వేగంగానే నడిచింది. ఒకరోజు సాయంకాలం గాలివాన లక్షణాలను పసిగట్టిన కర్ణధారుడు (ఓడ వాతావరణ పరిరక్షకుడు) తెరచాపలు దించి లంగరు వేయించాడు.

మూడు రోజులపాటు ఒక మాదిరిగా ఉన్న గాలివాన, నాల్గోనాటికి పెనుతుఫాను ఆకృతి దాల్చింది. ఒక సర్దారుడు పడవ నిల్చేలా లేదని ధృవీకరించాడు. అందరూ దేవుడి మీద భారం వేసి భయం - భయంగా గడుపుతున్నారు. ఒక పెద్ద ప్రభంజనం తాకిడికి పడవ నట్ట నడిసంద్రాన తలక్రిందులైపోయింది. ఎంతో లాఘవంగా చిత్రసేనను పొదివి పట్టుకుని, ఇంద్రద్యుమ్నుడు సముద్రంలో ఈదసాగాడు. అయినప్పటికీ ఆమె జారిపోయింది. అంతలోనే సంయోగం - అంతలోనే వియోగం ఏర్పడిన ఆ విధి విచిత్రానికి ఇంద్రద్యుమ్నుడు ఆశ్చర్యపడి, చేసేది లేక తానైనా ఒడ్డుకు చేరగలనో లేదో అనుకుంటూ దేవునిపై భారం వేసి ఈదసాగాడు. చిత్రసేనను ఇక తిరిగి చూడలేనేమో! నడిసంద్రాన జారిపోయింది అని విచారపడుతూంటే, ఆ దైవలీల వర్ణించడం ఎవరి తరం? అంత

నడిసముద్రంలోన అతడికి మంచి గంధం వాసన వేసింది. అదొక పడవ తయారీకి వాడిన కర్రగా గుర్తించి, దాన్ని అందుకున్నాడు. అప్పటికే చిత్రసేన దాన్ని దొరకబుచ్చుకుని, దానిపై కరచుకుని పడుకుని ఉంది. మళ్లీ భార్యను అలా చూడగలుగుతాడని అనుకోని ఇంద్రద్యుమ్నుని సంతోషానికి అవధులు లేకపోయాయి. భార్య కూడా తన భర్తే చిత్రంగా ఆ కర్ర మీదికి చేరడంతో "ఇది విధివిలాసం తప్ప ఇంకొకటి కాదని" నిర్ధారించుకుంది.

రెండున్నర రోజుల తర్వాత – ఆ గంధపుచెక్క వారిని ఒక ఒడ్డుకి చేర్చింది. ఎట్టకేలకు తీరం కనిపించేసరికి, ఆ దంపతుల ఆనందానికి మేర లేకపోయింది. వాళ్లిద్దరూ ఆ దేశంలో ప్రవేశించి, కొద్దిరోజులు ఆ దేశంలో తిరిగేసరికి, ఒక చోట ఏదో సందడి వినిపించింది.

ఆ దేశవేమిటో – ఎందుకా సందడి జరుగుతూందో తెలుసుకుందామని, ఒకరిద్దరు పౌరులను ఆపి, కారణం అడిగారు. అలాగే ఎంతకాలమై తాము సముద్రంలో రాత్రీ పగలూ తేడా తెలీక గడిపిందీ తెలుసుకుందామని తిథి వార నక్షత్రాల గురించి అడిగేసరికి "అయ్యా! ఈ సేన ఇంద్రద్యుమ్న మహారాజుల వారి కుమారులైన విజయులది. వారు తండ్రిగార్ని వెతుక్కొంటూ, దైవజ్ఞుల మాటను బట్టి మూడురోజుల క్రిందట ఇక్కడ కొచ్చారు. ఇది చిత్రభాను సంవత్సరం. నేడు ఆషాడ శుద్ధ పాడ్యమి. శుక్రవారం. పునర్వసు నక్షత్రం. బ్రాహ్మణశ్రేష్ఠుడొకాయన ఇప్పుడే పంచాంగం పఠించి ఇలా వెళ్లాడు" అన్నారా పౌరులు.

ఇంద్రద్యుమ్నుడు ఆశ్చర్యపోయి, భార్యతో "విన్నావా చిత్రసేనా! మన విజయుడు మనల్ని వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చాడట! భగవత్ సంకల్పమెంత చిత్రమో చూడు! ఇతడు చెప్పినదాన్ని బట్టి మనం ఓడ ఎక్కి ఇప్పటికి మనం మూడు సంవత్సరాలైంది. పద వెళ్దాం!" అని భార్యతో కలిసి వడివడిగా అడుగులేయసాగాడు.

వాళ్లు విజయుని శిబిరంలోకి ఆతృతగా వెళ్లబోతూంటే, ద్వారం వద్ద భటుడొకడు అడ్డగించి, "ఇప్పుడే కాశీరాజు గారూ – మలయాళదేశపు

రాజుగారూ లోపలికి వెళ్లారు. తమరిప్పుడు వెళ్లడానికి సమయం కాదు" అని చెప్పాడు.

అప్పుడు ఇంద్రద్యుమ్నుడు నవ్వుతూ "మీ తండ్రీ - తల్లీ కూడా వచ్చారని చెప్పు" అన్నాడు. వాడు తెల్లబోయి "తమరు ఇంద్రద్యుమ్న మహారాజు గారా? ఇలా ఉన్నారేమిటి? నా తప్పు మన్నించండి" అంటూ లోపలికి పరుగెత్తి విజయునితో చెప్పాడు. వెంటనే లోపలినుంచి విజయుడితోపాటు విశాలాక్షీ - మదనులు కూడా ఆతృతగా బైటికే వచ్చేశారు. విజయుడు పరుగు - పరుగున వచ్చి తల్లిదండ్రుల్ని కౌగిలించుకున్నాడు.

"నా బంధువులంతా ఇక్కడే ఉన్నారే! నేడు ఎంత మంచిరోజు" అని సంతోషించాడు రాజు.

అందరూ లోపలికెళ్లి కూర్చున్నారు. ఇంద్రద్యుమ్నుడు తాను బయలుదేరింది మొదలు అంతవరకూ జరిగినదంతా చెప్పి అక్కడికెలా వచ్చావని విజయుడ్ని అడిగాడు. అతడక్కడికి ఎలా చేరుకున్నదీ వివరించాడు.

"మీరు అరణ్యంలోకి వెళ్లిన కొన్ని రోజులకు, మన సైనికులు వచ్చి, అక్కడ జరిగిందంతా చెప్పారు. మా అమ్మను దారిలో శబర సైన్యం అడ్డగించి తీసుకుపోయారనగానే, నేను చాలా విచారించి, చతురంగ బలాల్ని కూడగట్టి అడవులన్నీ గాలించాను. కాని మా అమ్మ జాడ ఎక్కడా దొరకలేదు.

దాంతో నాకు మనస్సు చెదిరి, ప్రతి అడవీ, ప్రతి గ్రామం, ప్రతీ పట్టణం తిరుగుతూ చాలా దేశాలు చూశాను. విరాగిలా దేశాటనం చేస్తూ కాశీపురం చేరుకున్నాను. అక్కడ అనునిత్యం గంగాస్నానం - విఘ్నేశ్వర దర్శనం. ఇదీ నా నిత్యకృత్యం. ఓ రోజు విశ్వేశ్వరాలయానికి ఎప్పటిలాగే వెళ్లగా "మహారాజున్నాడు" అంటూ ద్వారపాలకులు నన్ను నిలిపేశారు. "చక్రవర్తి కుమారుడినైన నన్నా అడ్డగిస్తారు?" అనుకుంటూ, చింతిస్తూంటే ఒక సన్యాసి నన్ను ఆశీర్వదించి వివరాలడిగాడు. అతడేవో లెక్కలు గుణించి "మీ తల్లిదండ్రులు జలగండంలో ఉన్నారు. నీటి సంబంధమైన చిక్కుల్లో

పడ్డారు. ఆషాడశుద్ధపాడ్యమి నాటికి ఓఢ్ర దేశంలో తెల్లారు. కనుక నువ్వు ఆ ముహూర్తానికి అక్కడి సముద్ర తీరాన గల ఈ గ్రామాన్ని చేరుకోగలవు" అని ఆనతిచ్చాడా త్రికాలజ్ఞుడు.

ఇన్ని దేశాలు తిరిగాను. ఆ దేశం కూడా చుట్టబెట్టి, ఆ త్రికాలవేది చెప్పిన సమయానికి అక్కడుండి అదీ చూసేస్తే నేం? అనిపించింది. మర్నాడే నేను ఈ ఊరికి పయనమవుతుండగా, ఆ వూళ్లో అంతా అల్లకల్లోలంగా ఉంది. విచారించి చూడగా ఆ దేశపు రాజుగారైన హేమాంగదుని అల్లుడూ – కూతురూ వచ్చి కోటలో ప్రవేశించి శత్రురాజుల్ని వెళ్లగొడుతున్నారనీ – శత్రవులు పిక్కబలం చూపిస్తున్నారని తెలిసింది. నాకీ సంతోషవార్త చెప్పినవాడికి – బహుమానం ఇచ్చి, హేమాంగదుని బంధువుల్తో ముచ్చటించి వెళ్దామని కోటలోకి వెళ్లాను, అప్పటికే శత్రురాజుల్ని పారద్రోలిన విశాలాక్షీ – మదనుల గురించీ; చేతికి చిక్కిన శత్రురాజుల స్త్రీలను చెరపట్టక దయార్ద్ర హృదయంతో సగౌరవంగా పంపిన ఆ రాజదంపతుల ఔదార్యం గురించీ ప్రజలు వేనోళ్లపొగుడుతున్నారు.

నేను వారి దర్శనార్థం వచ్చానన్న విషయం తెలియగానే, మదనుడు ఎంతో ఆత్మీయంగా నా దగ్గరకొచ్చి అంతఃపురానికి తీసుకెళ్లి విశాలాక్షికి చూపాడు. ఆమె మన బంధుత్వాన్ని గుర్తుచేసుకుని ఆదరంగా చూసింది. మిమ్మల్నా నాడు మళయాళ దేశంలో భారీ ఎత్తున ఓడను కూర్చి సమస్త సంభారాలతోను – పరిజనంతోను తాను స్వయంగా ఓడ ఎక్కించిన విషయం గుర్తు చేసుకుంది. "ఇంద్రద్యుమ్న దంపతులు ఇంతకాలం మీ దేశం చేరకపోవడానికి కారణమేమిటో తెలీడం లేదు" అంటూ వారు కూడా నా వెంట వచ్చారు. దారిలో మీరు పడ్డ కష్టాలు చెప్పుకుంటూ మొదట మన పట్టణానికి వెళ్లాం! అక్కడ కొన్నాళ్లుండి– ఆ సన్యాసి మాట తలచుకొని మొన్నటికి ఈ రేవు చేరుకున్నాం! దేవుడే ఆ త్రికాలవేత్త రూపంలో నాకీ సంగతి తెలిపాడేమో అని ఇప్పుడనిపిస్తోంది నాకు" అంటూ విజయుడు తాను ఓఢ్ర దేశానికెలా వచ్చిందీ వివరించాడు.

అది విన్న ఇంద్రద్యుమ్నుడు, "మన కర్మ మనల్ని ఇన్నాళ్లు ఈ రీతిగా తిప్పింది. ఇప్పటికి దైవానుగ్రహం కలిగిందన్నమాట ! మేం సముద్రంలోన మునిగిపోకుండా మమ్మల్ని కాపాడింది ఒక గంధపు చెక్క. కనుక ఈ క్షేత్రాన్ని ఒక పుణ్యస్థలంగా చేసి, ఆ కర్రతో విగ్రహాలు చేసి స్థాపిస్తాను. ఇక్కడ గొప్ప ఆలయాలు నిర్మింపజేస్తాను. అంతవరకు నేను మన ఊరు రాను. అంతా త్వరగా జరగాలి. శిల్పుల్ని పిలిపించు!" అంటూ ఆ గంధపు దూలాన్ని ఒడ్డుకు లాగించి దానికి పూజాపురస్కారాలు చేయసాగాడు.

ఎక్కడెక్కడి శిల్పకారులో వచ్చారు. తమ శిల్ప విన్యాసంతో అద్భుతమైన గోపురాలు ఏర్పరచి చిత్రమైన ఆలయాలు నిర్మించారు. ఇక – ఆ కర్రను విగ్రహాలుగా చెక్కగల సమర్థుడెవరా?". అని ఆలోచిస్తుండగా, ఒకరోజున ఒక శిల్పి వచ్చి " నేను శిల్పశాస్త్రం యావత్తు ఔపోసన పట్టినవాడ్ని! శాస్త్రీయమైన దారుశిల్పాలు చెక్కగలను" అన్నాడు.

ఇంద్రద్యుమ్నుడు అందుకు సంతోషించి "నీకు ఏమేమి సామాగ్రులు కావాలో చెప్పు! అన్నీ ఏర్పాటు చేస్తాను" అన్నాడు. "నాకేమి అక్కర లేదు. ఈ విగ్రహాలను ఒకచోట రహస్యంగా చెక్కుతాను. అంతా తెరవెనుకనే జరగాలి. విగ్రహాలు పూర్తయ్యానని నేను చెప్పేవరకు తెరలోపలికి ఎవరూ రాకూడదు, వస్తే ప్రమాదం" అన్నాడు.

ఇంద్రద్యుమ్నుడు అందుకు అంగీకరించాడు. ఆ శిల్పికి ఒక రహస్యస్థలం ఏర్పాటుచేశాడు. శిల్పి విగ్రహాలు చెక్కడం ప్రారంభించిన నాటి నుంచీ ఒక వ్రతం మాదిరిగా రాజు ప్రతిరోజూ గోదానం చేయడం ప్రారంభించాడు. కొమ్ములకు డెక్కలకు బంగారం తాపడం చేయించిన గోవులు అవి. అట్టి గో సహస్రపు డెక్కల చేత రాపిడికి అక్కడ నేల అంతా పల్లమై ఒక చెరువైంది. అదే మనం స్నానం చేసిన ఇంద్రద్యుమ్నం.!

రెండు మూడు సంవత్సరాలు గడిచినా, శిల్పి తెర తీయలేదు. ఇంతకాలం నిజంగా ఈ శిల్పి విగ్రహాలు చెక్కుతూనే ఉన్నాడా? సామాగ్రి

ఏదీ అడగడు. చెక్క చప్పుళ్లేమీ వినబడవు. శిల్పి ఇవతలకు రాడు. తెర వెనుక అతడు బతికున్నాడో - లేడో అన్నదీ అనుమానమే! ఆలయాలు చూస్తే తయారైపోయి దేవతాప్రతిష్ఠకు సిద్ధంగా ఉన్నాయి. ఇక ఉపేక్షించడం తగదు..." అనుకొని ఒక నాటి సాయంకాలం రాజు ఆ తెర తొలగించి చూశాడు.

అక్కడ శిల్పి లేడు. విగ్రహాలు, ముఖం, కాళ్లు, చేతులు అన్నీ అమరి ఉన్నాయి గాని, అరచేతులు, భుజాలు, పాదాలు, తొడలు మాత్రం లేకుండా ఉన్నాయి. అంటే తాము తొందర పడటం వల్ల అవి పూర్తికాలేదని అర్థం!

"అయ్యో! శిల్పి చెప్పనే చెప్పాడు. తొందరపడ్డాం! ఇంత చక్కని విగ్రహాలను ఇప్పుడెవరు పూర్తి చేయగలరు?" అని ఇంద్రద్యుమ్నుడు విచారిస్తుంటే, దేవుడు కలలో కనిపించి "చింతించకు! నేనిలాటి రూపంతోనే భూమ్మీద జగన్నాథస్వామి పేరిట ప్రసిద్ధి చెందుతాను. నీ భక్తికి మెచ్చుకున్నాను. నీ కీర్తి స్థిరంగా ఉంటుంది" అని అంతర్ధానం చెందాడు.

రాజు ఆ విషయాన్ని అందరికీ చెప్పి, ఆ స్వామికి తనపై గల ప్రేమకు సంతోషిస్తూ, విగ్రహస్థాపనకు శుభలగ్నం తెలుసుకుందామని ఇంద్రద్యుమ్నుడు యోగబలంతో బ్రహ్మలోకానికి వెళ్లాడు. అతని మాటలు విని బ్రహ్మ నవ్వుతూ "వెళ్లవయ్యా వెళ్లు! లగ్నం కోసం ఇంతదూరం వచ్చావు! అక్కడ అన్నీ జరిగిపోయాయి" అంటూ సాగనంపాడు. ఆ రాజు మళ్లీ భూలోకానికి వచ్చి చూసేసరికి, స్వామి వారు తాను నిర్మించిన ఆలయంలో కాక మరొక ఆలయంలో స్థాపించబడి, అద్భుతమైన ఉత్సవవిశేషాలు అనుభవిస్తున్నాడు. అక్కడ తనను ఎరిగిన వారే లేరు.

ఆలయంలోకి పోబోతూంటే, కాపలావాళ్లు అడ్డుకున్నారు.

"ఇదేమి విపరీతం? నేను మహారాజునని గుర్తించకుండా, వీళ్లు నన్నే తోసేస్తున్నారే" అనుకుంటూ వారికి ఎన్ని విధాల నచ్చచెప్పినా, అతడ్ని

ఎవరూ పట్టించుకోలేదు. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు సముద్ర తీరానికి వెళ్లి భక్తితో స్వామిని ధ్యానించగా "రాజా! చింతించకు! కారణాంతరాల వల్ల నువ్వు రాకముందే నేను ప్రతిష్ఠించబడ్డాను" అయితే ఏటేటా తొమ్మిదిరోజులపాటు నువ్వు నిర్మింపజేసిన ఆలయాల్లో కూడా ఉత్సవ మర్యాదలు పొందుతాను, నీ కీర్తి శాశ్వతంగా ఉంటుంది. నువ్వు స్వర్గ సుఖాలు పొందేలా వరం అనుగ్రహిస్తున్నాను. అయితే, చిరకాలం కావడం వల్ల నీ బంధువులంతా పరలోకగతులయ్యారు. నువ్వు ఇక్కడ్నుంచి వెళ్లి చాలాకాలమైంది కనుక, నీ కోసం తెలియడం లేదు. కనుక - స్వర్గంలోకంలో నీ కోసం ఎదురుచూస్తున్న నీ భార్యని కలుసుకో! వెళ్లు! అదిగో! దేవలోకం నుంచి దివ్య విమానం నీ కోసమే వస్తోంది.....ఎక్కు" అన్నాడా స్వామి. ఆ ప్రకారం ఇంద్రద్యుమ్నుడు స్వర్గానికి చేరుకున్నాడు.

గోపా! అందువల్ల జగన్నాథుని రూపం అలా ఉంది. సుభద్ర ఇక్కడ ఆయనకు భార్య. బలభద్రుడు శేషుని రూపు. దీన్నిక్కడ బుద్ధావతారం అంటారు. అగ్ని వల్ల దగ్ధమైనట్లు ఇక్కడ ఈ స్వామి దర్శనం వల్ల ఎంతటి పాపాలైనా హరింపబడతాయి. కలియుగంలో ఇతడే ప్రత్యక్షదైవం. మన పూర్వజన్మపుణ్యం వల్ల ఈ దేవుని సేవ లభించింది. నీ ప్రశ్నలకు ఇదీ ఈ స్థలమహత్మ్యం రూపేణా తోచిన జవాబు. ఇంక లే!" అని సిద్ధుడు చెప్పాడు.

అప్పుడా గోపకుడు చాలా ఆనందించి, ఆ స్థలపురాణానికి ఆశ్చర్యపోతూ, చాలాసార్లు ఆ కథావిశేషాలే తల్చుకుంటూ గురువుగారితో కూడ కావడి ఎత్తుకుని నడుస్తూంటే, ఇద్దరూ తరువాత మజిలీ చేరారు.



# కాశీ మజిలీ కథలు

## 15వ మజిలీ

పదిహేనో మజిలీ స్థలానికి, ముందరి గ్రామం ఎంతో దూరంగా ఉండడం వల్ల, ఆ యతీంద్రుడు అందులో ఉన్న సత్రంలో బస చేశాడు. స్వయంపాకం నిమిత్తం ముందుగా స్నానానికి వెళ్లాడు. స్నానం చేశాక జపం చేసుకుంటూండగా ఆ సమయంలో ఆ ప్రాంతపు వింతలు చూడటానికి వెళ్లిన శౌనకుడు (గోపాలుడు) వేగంగా తిరిగి వచ్చి,తాను చూసి వచ్చిన విశేషాలు తెలియజేయడానికి ఆయన మౌనముద్రను భంగం కలిగిస్తూ ఇలా అన్నాడు.

## సంగీత వృక్షం కథ

"స్వామీ! మీ జపానికి అంతరాయం కలిగించినందుకు క్షమించండి! నేను చూసిన విశేషం విన్న తర్వాత మీరు నా మీద కోపం చేయరు. మీరు ఎలాగూ జపం చేసుకుంటున్నారు కదా! ఊరికే ఇక్కడ కూర్చోవడం దేనికీ? ఈ ప్రాంత విశేషాలు చూసి రావాలనిపించి, నేను అటూ ఇటూ తిరుగుతూంటే – కనుచూపు మేరలో దట్టమైన వృక్షాల గుంపు ఒకటి కనిపించింది. పర్వతంలా ఉన్న ఆ తోట ఏ పాటిదో అని దాని దాపునకు వెళ్లాను. అందులో చాలా వృక్షాలు. ఏది ఏ రకమో తెలీనన్ని జాతులున్నాయి. తినడానికి పనికొచ్చే పళ్లు ఉన్నాయేమో అని పరిశీలిస్తుండగా, నా చెవులకు ఒక గొప్ప గానం వినిపించింది. ఆహా! ఏం గానం? ఎంత మాధుర్యం? ఆ వీనుల విందుకు ఆశ్చర్యపోతూ నాలుగువైపులా పరికించి చూశాను. కాని పాట ఎక్కడ్నుంచి వస్తోందో తెలీడం లేదు. అక్కడ ప్రజలు ఎవ్వరూ లేరు. పోనీ! ఇళ్ళున్నాయా అంటే – అవీ లేవు. అప్పుడప్పుడు దేవతలు విమానాలెక్కి

తిరుగుతూ పాడుకుంటుంటారు గదా! అట్లాంటి గానధ్వని నేనేమైనా విన్నానేమో అనుకొని ఆకాశం వంక పరిశీలించి చూశాను. ఎక్కడా ఎలాటి జాడ లేదు. అదీగాక - అదెక్కడ్నుంచో దూరాన్నించి వినిపిస్తున్నట్లు లేదు. నాకు చాలా దగ్గరలోనే ఆ మధురగానం వినిపిస్తున్నది. చెట్ల మీద ఎవరైనా నివశిస్తున్నారేమో అని పరికిస్తే, అదీ లేదు.

అంతలో ఆ గానం అదొక గొప్ప అనుభూతి దాయకంగా వినిపించింది. అప్పుడు నాకు అన్పించింది- ఆహా! ఈ సంగీతం మానవలోక సంబంధమైనది కాదు......అని రూఢిగా చెప్పవచ్చు! ఆ వృక్షా ప్రచ్ఛన్నంగా ఉండే దేవతలు ఆ సంగీతం పాడుతున్నారని చెప్పడానికి అవకాశం ఉంది. అయితే ఈ సంగీతాలాపన ఒకే రీతిలోలేదు. ఎప్పటికప్పుడు మారిపోతోంది. నేను చాలాసేపు అక్కడే ఉండి విన్నాను. ఆ గానం వింటూంటే మనస్సుకి ఉల్లాసం తోచి, హాయి అయిన కాలక్షేపం కలుగుతూన్నది.

అయ్యా! ముందుగా ఆ వృత్తాంతం ఏమిటో నాకు చెప్పండి! జపం తర్వాత చేసుకోవచ్చు! అది వినేదాకా నాకు తోచడం లేదు" అని వినయంగా ప్రార్థించాడు.

తన జపానికి అంతరాయం కలిగించినందుకు, మొదట వాడి మీద ఎంతో కోపం వచ్చినప్పటికీ - వాడి దీనాలాపాలతో అదంతా పోయి, మణిసిద్ధుడు నవ్వేసి "ఒరే! నీతో చాలా చిక్కగా ఉంది సుమా! సమయం చూడకుండా అడిగేస్తుంటావు. ఏం మించిపోయింది? ఇంకా కొంతసేపు ఆగి అడగవచ్చుగా! ఎన్నిసార్లు చెప్పినా, నీ ఆత్రం నీదే! నేనెక్కడికైనా వెళ్లిపోతానా ఏం? భోజనం అయ్యాక సావధానంగా కూర్చొని చెప్పుకుంటే చక్కగా ఉంటుంది కదా! సరే! కానియ్! ఇక ముందు ఎప్పుడూ జపవిఘ్నం చెయ్యకు" అని పలికి, ఆ మణివిశేషం చేత ఆ వృత్తాంతం అంతా ఆకళింపు చేసుకొని ఆనందంగా వాడికి ఆ వృత్తాంతం ఇట్లా చెప్పసాగాడు.......

# రుచికుని కథ

పూర్వం జగన్నాథం అనే పట్టణంలో, బలదేవుడనే పూలవ్యాపారి ఉండేవాడు. అతడు ప్రతిరోజూ పూలదండలు కట్టుకుని అమ్ముకుంటూ బ్రతికేవాడు. బలదేవుడు ప్రతిరోజూ రెండు పూటలా క్రమం తప్పక, జగన్నాథ స్వామివారి ఆలయానికి వెళ్లి, స్వామి వారికి మంచి మంచి పూలదండలు అర్పిస్తూ స్వామివార్ని అర్చిస్తూ తిరిగి వస్తూండేవాడు. అందువల్ల అతడికి హరిదాసు అనే మారుపేరు కూడా కలిగింది. ఆ దేవుని పట్ల అతడికి గల భక్తివిశ్వాసాలు - అతడి సాధుజీవితం చూసి ప్రజలు అతడినో విరాగిగా కూడా భావిస్తూండేవారు.

ఒకరోజు కళింగదేశపు రాజు కుటుంబ సమేతంగా యాత్రకు రాగా దాది ఎత్తుకున్న నాలుగేళ్ల కుర్రవాడిని చూసి, ఆ రాజకుమారుడి లాంటి పుత్రుడ్ని తనకు ప్రసాదించమని బలదేవుడు భగవంతుని ప్రార్థించేవాడు. కొన్నాళ్లకు అతని కోరిక ఫలించి అతని భార్య అందమైన కొడుకుని కన్నది. పిల్లవాడికి ఏం పేరు పెట్టాలని బ్రాహ్మణులను అడగ్గా, అతడికి తగ్గ పేరు రుచికుడని సూచించారా బ్రాహ్మణులు. ఈ బాలుడు ఇంత చిన్న వయసులోనే ఇంత అందంగా ఉన్నాడు గదా! పెద్దవాడైతే ఇంకెంత అందంగా ఉంటాడో అనుకోసాగారు ఆ బ్రాహ్మణులతోపాటు లోకులందరూ.

రుచికునికి ఐదారేళ్లు రాకముందే తల్లి మరణించింది. ఐనా బలదేవుడు వాడికి తండ్రీ - తల్లీ తానే అయి పెంచసాగాడు. రుచికుడు కూడ చిన్నప్పట్నుంచి తండ్రిలాగే దండలు అల్లేవాడు. మాలాకార వృత్తిలో తండ్రికి సహాయపడేవాడు. ఎనిమిదేళ్లొచ్చేసరికి ఆ పిల్లవాడికి గౌతముడనే బ్రాహ్మణపిల్లవానితో మైత్రి కుదిరింది.

గౌతముడు సహాధ్యాయిగా, తన ఇంటికే ఉపాధ్యాయుల్ని పిలిపించి, బలదేవుడు రుచికునికి విద్య నేర్పించసాగాడు. రుచికుడు ఏకసంథాగ్రాహి కావడంతో, చెప్పిన విద్య చెప్పినట్లు పట్టుబడి త్వరలోనే అనేక విద్యల్లో

పాండిత్యం సంపాదించాడు. దండలల్లడంతో అతని నైపుణ్యానికి మోజుపడని వారు ఆ పట్టణంలో లేరు. తండ్రిని మించిన తనయుడై నాడతడు ఈ కళలో. ముఖ్యంగా వారకాంతలకు రుచికుడల్లిన చిత్రవిచిత్ర గతుల పూలమాలికలంటే మహా మోజు.

ఒకరోజు గౌతముడు, రుచికునితో "సోదరా! నువ్వు తయారుచేసిన దండలు అంగళ్లలో విశేషంగా అమ్ముడౌతున్నాయి. నీ మీద ఉన్న ప్రేమ కొద్దీ మీ తండ్రి నిన్ను ఇల్లు కదలనివ్వడు. కాని నువ్వు స్వయంగా మాలలు అమ్మితే నీకు ఇంకా ఎక్కువ ధర వస్తుంది. మీ తండ్రి గుడికి వెళ్లి పోయినప్పుడు మనం వేశ్యావాటికకు వెళ్లి దండలు అమ్ముకొద్దామా?" అన్నాడు రహస్యంగా.

తండ్రి గుడికి వెళ్లగానే, చక్కగా అలంకరించుకుని, రుచికుడు గౌతమునితో వేశ్యావాటికకు వెళ్లాడు. అక్కడ సంగీతం పాడుతున్న వేశ్యల్నీ సౌందర్యరాశుల్నీ చూసి "మనవూళ్లో ఇలాటి వింతలున్నాయని ఇన్నాళ్లూ చెప్పావు కావేం? వీళ్లు అప్సరసలూ - ఇది స్వర్గమూ కాదు గదా" అని ఆశ్చర్యపోయాడు రుచికుడు.

ఒకచోట ఒక వారాంగన నిమిత్తం ఇద్దరు వ్యక్తులు పోట్లాడు కుంటూంటే గౌతమ - రుచికులు వెళ్లి విడిపించారు. ఆ సందట్లో వాళ్ల చేతుల్లోని దండలు నలిగిపోయాయి. అప్పుడతడు గౌతమునితో "అన్నా! ఈ దండలు నలిగిపోయాయి. వేళవుతూంది. వీట్ని అమ్మే ప్రయత్నం చేయడమూ వ్యర్థప్రయత్నమే! ఇక పోదామా!" అంటూండగా, దారిలో వారికో విశేషమైన సౌధం కనిపించింది. అదొక గొప్ప వేశ్య చంద్రలేఖది.

తాను కట్టిన దండలకు విశేషమైన మోజు ఉందని - చంద్రలేఖ వంటి ఖరీదైన వేశ్యలు అవి తప్ప ధరించరనీ ప్రత్యక్షంగా ఆమె చెలికత్తె నోట విన్నాడు రుచికుడు. అంతేగాక, ఆమె రుచికుడినే పెళ్లాడాలనుకుంటున్నదనీ- అయితే, ఇంతవరకు రుచికుడిని ప్రత్యక్షంగా చూడలేదనీ కూడా అతడికి బోధపడింది. వెంటనే, రుచికుడామె మేడమీదకు పోవడానికి ఉత్సాహపడగా "చాల్చాలు! పద! మీ తండ్రి వచ్చే వేళైంది"

అంటూ రుచికుడిని మందలించాడు గౌతముడు. అతడు ఎంతకూ కదలక, అక్కడే ఉండిపోయేసరికి "మీ తండ్రి గారిని తీసుకొస్తా" నంటూ గౌతముడు వెళ్లిపోయాడు.

ఈలోగా చంద్రలేఖ తన చెలికత్తె కోసం వీధిలోకొచ్చి చూడసాగింది. అప్పుడు రుచికుడు ఆమె దగ్గరకు వెళ్లి "నువ్వు రుచికుని దండలకోసం నీ సఖిని అంగడికి పంపావు గాని, అవి నా దగ్గర ఉన్నాయి. కాని కాస్తంత నలిగాయి. కావాలా?" అని అడగ్గా, ఆమె వాటి తీరు పరిశీలించి "ఈ నేర్పు రుచికునిదే! నలిగితేనేం - ఎంతకు అమ్ముతావు?" అని అడగ్గా, కొంత సంభాషణ తర్వాత తానే రుచికుడినని వెల్లడి చేసేశాడామెకు.

ఆమె సాదరంగా అతడ్ని లోపలికి తీసుకెళ్లింది. "నువ్వు రూపంలో మాత్రమే కాక విద్యల్లోనూ సాటిలేనివాడివని విన్నాను. ముఖ్యంగా ఈ మాలాకార వృత్తిలో నీ గురువు ఎవరు? చిత్ర విచిత్ర గతుల్లో ఎలా అల్లుతావీ మాలలు?" అంటూ శృంగారం ఒలకబోయసాగింది.

ఆ హొయలూ - ఆ వగలూ చూసి, రుచికునికి శరీరం వశం తప్పి, చిత్తం చంచలం కాగా, తన పాలిట మనోహరుడతడే అని నిర్ణయిం చుకున్న ఆ వేశ్య అతడ్ని శృంగారంలో ముంచి తేల్చింది.

అంతలో వీధి ద్వారం దగ్గర సందడి వినిపించింది. అది విన్న రుచికుడు, బెంబేలు పడుతూ "గౌతముడు వెళ్లి మా తండ్రి నిక్కడికి తీసుకొచ్చాడు కాబోలు! ఇద్దరం అల్లరి పాలౌతామేమో! నన్నెక్కడైనా దాచేసి అవమానం పాలు కాకుండా చూడు" అన్నాడు.

చంద్రలేఖ నవ్వుతూ "రుచిరా! మా ఇంట్లో దాక్కుంటే పరమేశ్వ రుడైనా పట్టుకోలేడు." అంటూ ఓ రహస్యమందిరం చూపగా "ఇంతకంటే భద్రమైనది ఏది?" అని అడిగాడు. అయితే - అన్నిటి కంటె భద్రమైనది నా ఇంటిని ఆనుకుని ఉన్నతోట. దానికి ఒకటే దారి. పదిరోజులు అహర్నిశలు వెతికినా కనిపించవు. అందులోని ఒక గదిలో ఉండు" అంటూ అతడ్ని ఆ ఉద్యానవనంలోకి పంపించి, పెరటి తలుపు బిగించి వెళ్లి వీధి తలుపు తెరచింది.

గౌతమ, బలదేవులు రాజభటుల్తో కూడ వచ్చి ఉన్నారు. తమ పుత్రుని ఆమె దాచిందనే అభియోగం మోపి, రాజభటుల్తో ఇల్లంతా వెతికించాడు. రాత్రంతా వెతికినా ఆ ఇంట్లో రుచికుడు కనిపించలేదు. తెల్లారాక తోటను కూడా వెతకాలన్నారు వారు. దాన్ని తెరిచే అధికారం మాకు లేదంది చంద్రలేఖ. రాజభటులకు అన్ని అధికారాలూ ఉన్నాయి కనుక - వాళ్లు తోటలో బలవంతంగా ప్రవేశించారు. అయితే, వారు అతడ్ని కనుక్కోలేక తిరిగొచ్చేశారు. నిజానికి - దానికింకో దారిలేదు. అయినా రుచికుడు ఎలా తప్పించుకున్నదీ చంద్రలేఖకే అర్థంకాలేదు. వాళ్లు వెళ్లాక ఆమె స్వయంగా అతడికోసం తోటంతా వెతికింది.

బలదేవుడు, కొడుకు కనిపించక మంచం పట్టాడు. అతడి బాధ చూడలేక, గౌతముడు చంద్రలేఖ వద్ద కొచ్చి "నీవు తండ్రీ కొడుకుల్ని విడదీసిన పాపం మూటకట్టుకోకు! రుచికుడిని వదిలిపెట్టు " అని దీనంగా చెప్పుకున్నాడు. ఆమె అప్పుడు అతనికి యదార్థం వివరించింది. ఒకవేళ ఆమె తోటలో సంచారవృక్షాలున్నాయేమో అని శంకించాడతడు.

"నేను రుచికుడ్ని భర్తగా వరించాను. అతని పుత్రుడిని వెతికిస్తానని బలదేవునితో చెప్పు! నీకు కావలసినంత ధనం ఇస్తాను. దేశాటనం చేసి అతని జాడ తెలుసుకో! రుచికుడు నీకు మంచి మిత్రుడు కదా" అంది చంద్రలేఖ.

గౌతముడు కూడా అందుకు అంగీకరించాడు. తాను మిత్రుడ్ని వెతకడానికి దేశాటనానికి వెళ్తున్నట్లు చెప్పి బయల్దేరాడు.

కొన్నాళ్లకు - గౌతముని వద్ద నుంచి చంద్రలేఖకు ఒక ఉత్తరం వచ్చింది.

అందులో......"చంద్రలేఖా! నేను ఎన్నో దేశాలు తిరిగాను. కాని రుచికుని జాడతెలియలేదు. ఇప్పుడిక్కడ సముద్రప్రాంతంలో ఉన్న రామచంద్రపురం అనే పట్టణానికి వచ్చాను. ఇక్కడొక విశేషం కనిపించింది. ఈ పట్టణాన్ని పరిపాలించే శూరసేనునికి తిలోత్తమ అనే కూతురుంది.

ఆమె విద్యారూప గుణశీలాల్లో అసామాన్యురాలు. ఎటువంటి రాజకుమారుడు ఆమెను పెళ్లాడవచ్చినా దివ్యప్రభావ సంపన్నుడైన వాడిని తప్ప, ఇతరులను పెళ్లాడనని పంతం పట్టిందా చిన్నది. అటువంటి వాడు ఎలా వుంటాడు? అని తండ్రి అడగ్గా, కొన్నాళ్ల క్రితం ఒక గొప్ప సౌందర్యవంతుని చిత్రాన్ని చిత్రఫలకం మీద రాసి 'ఇటు వంటివాడ్ని నేను పెళ్లిచేసుకోదల్చుకున్నాను" అని చెప్పిందట.

శూరసేనుడు ఇక చేసేది లేక, ఆ చిత్ర పటాన్ని ఆ ఊళ్లో ఉన్న ఒక దేవాలయంలో వ్రేలాడగట్టించి, అటువంటి లక్షణాలే అన్నీ ఉన్నట్టి రాజకుమారుడ్ని లేదా అటువంటి పురుషుని తెచ్చినవారికి పారితోషికం ఇస్తానని ప్రకటించాడు. నేను ఆ గుడిలోకి వెళ్లి ఆ చిత్రపటాన్ని చూడగా, అది మన రుచికుని రూపురేఖావిలాసాలను పోలి ఉంది. ఆకృతి పరికిస్తే అచ్చం నా మిత్రుని చూసినట్లే ఉంది. కన్నుల కరువుదీరా అణువణువు ఆ చిత్రపటాన్ని పరిశీలించాను.

మన రుచికుడా తిలోత్తమకు ఎలా తెలుసు? అది ఆమె ఊహాచిత్రమా? లేక స్వప్నంలో చూసిందా? అసలామెకు ఈ చిత్రం చిత్రించాలని ఎలా అనిపించింది? అడగడానికా - నాకు అవకాశం లేని అంతఃపురాల్లో ఎక్కడో ఉంటుందా రాకుమార్తె. కనుక - నువ్వు ఒక్కసారి ఇక్కడికొస్తే, తిలోత్తమతో మాట్లాడి విషయం తెలుసుకోవచ్చు!" అని ఉంది.

రుచికుడి గురించి తిలోత్తమ ద్వారా ఏమైనా విశేషాలు తెలుస్తాయేమోనని, చంద్రలేఖ రహస్యంగా రామచంద్రపురం చేరింది.

దేవాలయంలో రుచికుని చిత్రపటాన్ని చూసి ముద్దుపెట్టుకొని కొంతసేపు పరితాపం పడింది. బసకు వచ్చినా ఆమె ఆలోచనలన్నీ చిత్రపటం మీదనే ఉన్నాయి.

రాజుపుత్రి తిలోత్తమతో ఎలాగైనా మైత్రిచేసి, రుచికుని గురించి తెల్సుకోదలచింది. దానికి తన విద్యాప్రదర్శనను మార్గంగా ఎంచుకుంది. మర్నాడు తానొక విద్యావినోద సభ చేస్తాననీ - అందులో తనను జయించిన

వారికి కానుక లివ్వబడతాయనీ – ఆ వూళ్లో ఉన్న విద్వాంసులు, ప్రజలు ఆ సభకు రావచ్చుననీ ప్రకటనలు రాయించింది. మొదటి చేసిన సభకు అంత స్పందన లేకున్నా, తర్వాత సభకు ఆ పట్టణంలో ఆమె విద్యాపాటవం ప్రదర్శించే రోజు, రాజు కూడా ఆ సభకు హాజరయ్యాడు. ఆ పట్టణంలోని విద్వాంసుల్ని ఓడించి అవధానం, విచిత్రకవిత్వం, బంధకవిత్వం వంటి ప్రక్రియల్లో తన ప్రతిభ చూపించేసరికి, రాజు కూడా ముగ్ధుడై సభానంతరం సమ్మానింపబోగా, ఆమె అది తనకు అవసరం లేదనీ – ప్రభువుల అనుగ్రహం ఉంటే చాలుననీ అంది.

చంద్రలేఖ వినయానికీ, చతుర మధుర సంభాషణకు సంతోషించిన శూరసేనుడు ఆమెకు అభయప్రదానం చేసి, పరివారంతో సహా వెళ్లిపోయాడు.

## తిలోత్తమ కథ

శూరసేనుడు ఇంటికి వెళ్లిన కొంతసేపటికి కొందరు రాజభటులొచ్చి, చంద్రలేఖతో "నిన్ను చూడాలని మా రాజపుత్రిక తిలోత్తమ వేడుక పడుతోంది. రాజుగారు కూడా మిమ్మల్ని తప్పక తీసుకురమ్మన్నారు. వెంటనే బయలుదేరండి. అన్నారు.

చంద్రలేఖ ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తోంది కనుక, చక్కగా అలంకరించుకుని తన పరిచారికను వెంటబెట్టుకుని తిలోత్తమ అంతః పురానికి వెళ్లింది. తన కోరిక నెరవేరబోతోందన్న ఆనందంలో ఉన్న చంద్రలేఖను రాజకుమార్తె పరిచారికలు సత్కరించారు. తిలోత్తమను చూడటంతోనే, చంద్రలేఖ ఆమెకు నమస్కరించింది.

"నిన్నటి సభలో నువ్వు చేసిన వింతలు విని, నేను చాలా సంతోషించాను. నువ్వు నీ కులానికే వన్నె తెచ్చావు. నీకు విద్యలు నేర్పించినదెవరు? ఏయే విద్యలు అభ్యసించావు? చక్కని వరుడ్ని వివాహం చేసుకోక, నీ యౌవనాన్ని ఎందుకు వృథా చేసుకుంటున్నావు?" అంటూ ప్రశ్నించింది తిలోత్తమ.

రాజపుత్రిక తనని పొగడటం భరించలేనట్లు ఇబ్బందిగా ముఖం పెట్టి "రాజకుమారీ! నేను ఒక్కొక్కరి దగ్గర ఒక్కో విద్యని నేర్చుకున్నాను. అయితే చదివినవి సంపూర్ణంగానే చదివాను. నీకంటె విద్వాంసురాలిని కాను. నన్ను అంతగా పొగడకు. నన్ను నీ ఇష్టసఖిగా మన్నించడం కంటె నాకు ఆనందం వేరొకటి ఉండదు. ఇక వివాహం విషయం! అది దైవికం. నేను ఈ విషయంలో నిన్నేమీ అడగను. ఒకరి మనస్సు ఒకరు చెప్పుకోడానికి అభ్యంతరం ఏముంది? నెమ్మదిగా అన్నీ తెలుస్తాయి" అంది.

తిలోత్తమ ఆమెను అప్పటికప్పుడే తన ప్రాణసఖిగా చేసుకున్నట్లు వాగ్దానం చేసి చంద్రలేఖని కౌగలించుకుంది. అప్పుడు ఇద్దరి కన్నుల వెంట ఆనందబాష్పాలు కురిశాయి. అది మొదలు వారిద్దరూ ఒకర్నొకరు నిముషమైనా ఎడబాయక విద్యా వినోదగానాలతో గడపసాగారు.

ఒకరోజున చంద్రలేఖ – "మనమిప్పుడు నూత్నయవ్వనంలో ఉన్నాం! మన వయసు అడవిగాచిన వెన్నెల్లా వృధాగా పోతూంది. మాది కళావంతల కులం గనుక నాకు తగిన వరుడు లభించడు. నీకు అటువంటి సమస్య లేదు గదా! అదీగాక నువ్వొక సుందరుడ్ని చిత్రించి, అలాంటి వాడినే పెళ్లాడతానన్నావట కదా! ఎక్కడైనా ఊహాసుందరులు లభ్యమవుతారా? అసలు అలాంటి వాడ్ని ఎక్కడేనా చూశావా? లేక నీ ఊహా?" అని అడిగింది. రహస్యం కాకుంటే చెప్పమన్నది.

తిలోత్తమకు కళ్లలో నీళ్లొచ్చాయి. ఒక నిట్టూర్పు విడిచి "నా వంటి మందభాగ్యురాలికి అనుకూలుడైన వరుడు ఎలా దొరుకుతాడు? నువ్వు ఈ అంతఃపురంలో అడుగుపెట్టిన తర్వాతనే నేను ఆహారపానీయాలు కొంతైనా తీసుకోగల్గుతున్నాను. అంతకుముందు నా పరిస్థితి ఏం అడుగుతావ్? ఇక – ఆ చిత్రం లోని మనోహరుని గురించి చెప్తాను విను! అదొక గాథ" అంటూ చెప్పసాగింది.

"నాకు యుక్త వయస్సు రాగానే , మా తండ్రి ఎక్కడెక్కడి రాజు కుమారుల పటాలను తెప్పించి చూపించాడు. వారి చరిత్రలూ – రూపాలూ చూడగా వారెవ్వరూ నాకు తగరని నాకు అనిపించింది. దివ్యప్రభా వసంపన్నుడిని పెళ్లాడాలని నాకు కోరిక.

ఒకరోజు సాయంత్రం చక్కగా అలంకరించుకుని మేడమీద వీణ వాయిస్తున్నాను. ఆకాశంలో బంగారు చిరుగంటల ధ్వని వంటిది వినిపించింది. అందరం తలెత్తి చూశాం! ఓ వెన్నెల్లాటి కాంతి పుంజం ఒకటి మా కళ్లు మిరుమిట్లు గొలిపేలా కన్పించేసరికి దిగ్గున లేచి కళ్లు మూసుకుని నా చెలికత్తెలతో సహా అందరం దానికి నమస్కరించాం.

ఆ కాంతి కిరణాలు మా మేడ అంతా వ్యాపించడంతో, అది ఎటువంటిదో చూడాలని అభిలాష కలిగినా, కళ్ళు తెరవడానికి శక్యమైంది కాదు. అయితే, కొంతసేపటికి కాంతిజాలం - మెరుపు అదృశ్యమై, మా ఎదుట ఒక పురుషుడు నిలిచి ఉన్నాడు. అప్పుడు మేము కళ్లు తెరిచి చూశాం! అతడు తప్పక దివ్యపురుషుడే అయి ఉంటాడనిపించి నమస్కరించాను. అతడు నన్ను మృదువుగా స్పృశించి లేవనెత్తేసరికి, ఆ స్పర్శ నాలో పులకింతలు రేపింది. నా శరీరం వశం తప్పింది.

కొంతసేపటి తర్వాత, నేను ధైర్యం తెచ్చుకుని, "మనోహరా! మీరు ఇంద్రుడా? చంద్రుడా? మన్మథుడా? వసంతుడా? ఆకాశం నుంచి దిగి వచ్చినందున దివ్యులే అయి ఉంటారు. కానీ దేవతలు రెప్పవెయ్యరంటారే! అది సదేహాస్పదంగా ఉంది. నేను తిలోత్తమను! దివ్యప్రభావ సంపన్నుడ్ని గాని పెళ్లిచేసుకోనని నియమం పెట్టుకున్నాను. నా కోరిక తీర్చడానికి భగవంతుడే నిన్ను పంపాడనిపిస్తోంది. రహస్యం కాకపోతే, మీ వృత్తాంతం వినాలని వేడుగ్గా ఉంది" అన్నాను.

అప్పుడతడు ఏమీ అనకుండా, చిర్నవ్వుతో నా చెలికత్తెల వంక చూశాడు. నేను వాళ్లని అవతలకు పంపేశాను. అప్పుడతడు తన మెడలోని పుష్పహారాన్ని నా కంఠాన అలంకరించాడు. నేను నా మెడలో ఉన్న ముత్యాలహారం అతనికి వేశాను. నా చేయి పట్టుకుని అతడే చొరవగా నన్ను శయ్యమీదకు తీసుకువెళ్లాడు.

మూడు రోజులపాటు ఒక్కక్షణమైనా విడువక రతిక్రీడలు జరిపినా, మాకు ఒక్క గడియగ్గానే తోచింది. చెలికత్తెలు ఈ విషయం తెలిసినవారు కనుక అక్కడికెవ్వర్నీ రానివ్వలేదు.

నాలుగో నాటి ఉదయం అతడు కనిపించలేదు. అతని జాడ ఎవరికీ తెలీదన్నారు. నేను నిరాశ చేసుకుని వెక్కి వెక్కి ఏడుస్తూంటే నా సఖులు నాకు ధైర్యం చెప్పారు "ఆకాశం నుంచి వచ్చినట్లే ఆకాశాన వెళ్లి ఉంటాడు. మళ్లీ ఆ దారినే వస్తాడు. ఆ మాత్రం వియోగం భరించక తప్పదు" అంటూ ధైర్యం చెప్పారు. ఆకాశం వైపు చూస్చూచి కళ్లకు చిల్లులు పడి నిద్ర రాదు. ఆకలి వేయదు.

నా తండ్రికి ఇవేమీ తెలీక నాకు వివాహం తలపెట్టాడు. అతడు వెళ్లి సంవత్సరమైంది. నువ్వు నా జత కలిశాక ఈ మాత్రం ఆహారమైనా తింటున్నాను. నువ్వు నా ప్రాణసఖివి కనుక నీకు చెప్పాను" అంది తిలోత్తమ.

అతడు వేసిన పూలదండను భద్రంగా దాచి ఉంచింది కనుక తెప్పించి చూపించింది. అది చూసి రుచికుడు అల్లిందేనని గుర్తుపట్టిన చంద్రలేఖ "ఎక్కడి జగన్నాధం? ఎక్కడి రామచంద్రపురం? ఆకాశగమన శక్తి రుచికుడికి ఉందా? ఉంటే గౌతముడు చెప్పకపోతాడా...? నేను మరికొన్నాళ్లిక్కడ ఉంటే ఆ దివ్యుడు రాకపోతాడా? అంతా అతని వల్లనే తెలీకపోతుందా?" అనుకుంది. చంద్రలేఖకు ఇదంతా అద్భుతంగా తోచసాగింది.

అయితే, తన రహస్యం ఏమీ చెప్పక "తిలోత్తమా! ఆకాశం నుండి ఊడిపడి ఉండొచ్చు కాని, ఆ వచ్చిన వాడి కులమేమిటో – శీలమేమిటో – పేరేమిటో అయినా తెలీకుండా భర్తగా వరించి – సర్వం అర్పించావంటే, అది నీ చపలత్వమే! సరే! వరించావు అనుకుందాం! మూడు రోజులు క్రీడించారు కదా! నడుమ ఎప్పుడైనా అడగవచ్చు కదా! ఆ పురుషుడైనా నీవెవరో – ఏమిటో తెలీకుండా ఊరకే నీతో రతి సల్పాడంటే చిత్రంగా ఉంది. కానియ్! జరిగిపోయిన దానికి విచారించి లాభం లేదు. అతడెప్పటికైనా రాక పోడు. నాకు అలాగే అనిపిస్తోంది. నేనూ దీన్ని గురించి ఆలోచిస్తాను " అని ఊరడిస్తూ తిలోత్తమ దుఃఖం పోగొట్టగల్గింది. అప్పట్నుంచి తిలోత్తమ లాగానే, చంద్రలేఖ కూడా ఆకాశం వైపు ఓ కన్నేసి ఉంచింది.

# బలసింహుని కథ

ఇది ఇలా ఉండగా – శూరసేనుని బావమరిది, బలసింహుడు అనేవాడు చంద్రలేఖ ఆ వూళ్లో సభ చేసింది మొదలు ఆమెనే వలచి విరహంతో వేగిపోతూన్నాడు. ఆమెతో ఎంతగా మాట్లాడాలని పరితపించినా ఆమె అంతః పురంలోనే ఉండటం వల్ల, అతడికి అది శక్యం కాలేదు.

ఆమెను వశం చేసుకోడానికి అతడెన్నో మంత్ర తంత్ర ప్రక్రియలను ఆశ్రయించాడు. ఆ సంగతి తన పరిచారిక చెప్పినా చంద్రలేఖ నమ్మలేదు. ఒకరోజు బలసింహుని పరిచారిక మందర, చంద్రలేఖ దగ్గర కొచ్చి రహస్యంగా "చంద్రలేఖా! నీకు మేలు కలిగించేదిగా భావించి నీతో ఒక రహస్యం చెప్పదల్చుకున్నాను. మా రాజుగారి బావమరిది నిన్ను సభలో చూసినది మొదలు నిన్ను వలచి ఉన్నాడు. అతని వైభవం నీకీపాటికి తెలిసే ఉంటుంది. రాజుగారు సైతం అతనికి జడుస్తుంటారు.

శూరసింహరాజుగారికి పుత్రసంతానం లేదు గనుక, అనంతరం రాజ్యం బలసింహుడిదే అవుతుంది. అతడు నీ మీద ప్రేమ పెంచుకున్నాడు. రూపు రేఖల్లో నీకు సాటి రాగలవాడు. నువ్వు వారాంగనవే కనుక, అతడి ప్రాపు చేరు! నీ యవ్వనం సార్ధకం చేసుకుని సుఖించు! అతనికేమీ లోటు లేదు. నీకు మేలు జరుగుతుంది" అంటూ బోధ చేసింది.

అందుకు చంద్రలేఖ నవ్వి "నువ్వు నిజంగా మంధరవే! నేను కులానికి వారకాంతనైనా – గుణానికి వ్యభిచారిణిని కాను. నా భర్త మరోదేశంలో ఉన్నాడు. కనుక నీ యజమానికి ఈ మాటలు చెప్పు! ఇంకెప్పుడూ ఇటువంటి రాయబారాలు తీసుకురాకు!" అంది మందలిస్తూ.

మందరవెళ్లి, ఈ మాటలను వక్రీకరించి చెప్పింది. "దానికి ఎంత గర్వం అనుకున్నావు? పైగా రాజపుత్రిక తిలోత్తమ స్నేహం దొరికేసరికి కిందా మీదా కానడం లేదు. అది నీ మాటా – నా మాటా ఎక్కడ లెక్కజేస్తుంది? " అని అతడికి కోసం తెప్పించింది.

అయితే బలసింహుడు అంతలోనే తిరిగి శాంతించి "జవరాళ్ల చిత్తాలు క్షణక్షణానికీ మారుతుంటాయిలే! ఇంతమాత్రానికే దాని గురించి ఆశ వదల్లేను. నువ్వు ఆమె మనసు కనిపెడుతూండు. నిదానంగా సమయం చూసి నాకు చెప్పు!" అంటూ దానికి కానుక ఇచ్చాడు.

ఏం చెయ్యాలో తోచక బలసింహుడు ఆ ఊళ్లోని శకునాలు చెప్పే యోగిని దగ్గరకు వెళ్లాడు. ఆమెకు రహస్యంగా తన వలపు వృత్తాంతం చెప్పుకున్నాడు. చంద్రలేఖ తనకు వశమయ్యేలా చేస్తే చాలాధనం ఇస్తానని ఆశ చూపించాడు. ఆ మాంత్రికురాలు ఇది విని, బాగా ఆనందించి "ఓహో! ఇదెంత పని? ఆ కాంత ఇక నీ చెంత ఉన్నదనే అనుకో! నాకిచ్చే సొమ్మెంతో ముందు చెప్పు! అందులో సగం ముందుగా ఇవ్వు! తర్వాత బహుమతితో సహా మిగతా సగాన్ని ఇద్దువుగాని! అందుకు అవసరమైన ఓషధిని ఇప్పుడే సిద్ధం చేసి నీ చేతిలో పెడతాను" అనేసరికి బలసింహుడు సంతోషించాడు.

"దేవీ! నేను పెద్దల చాటువాడిని అని నీకు తెలిసిందే! అలాగైనా నిన్ను అసంతృప్తిగా పనిచేయమని అడగను. ముందు నీకు రెండువేలు నిష్కాలు ఇస్తాను. తర్వాత నా దాన గుణం నువ్వే చూచెదవు. ఈ మాత్రానికి ఇప్పటికి సంతోషపడు! నీ ఉపకారం ఎన్నటికీ మరవను" అని బ్రతిమాలడసాగాడు.

జాలిపడి అంగీకరించినట్లుగా తల ఊపి "తీసుకురా! సొమ్ముదేముంది? మాట కావాలి నాకు" అని ఒప్పుకుంది. బలసింహుడు అప్పుడే వెళ్లి ఆ సొమ్ము అంతా తెచ్చి రహస్యంగా దానికిచ్చాడు. అది అతడ్ని స్నానం చేసి రమ్మని, ఒక మంత్రం ఉపదేశించి ఇలా అంది.....

**శ్లో ॥ శివ శిరసి స్థిత మాల్యం జీవం జీవక మయోర యో రస్థి ।**
**వామక రేణ గృహీతం నా ల్యూవర్త్యోద్ధితం పత్రం ॥**

రాజపుత్రా! ఎన్నో శ్లోకాలతో సమానమైన ఈ శ్లోకం ప్రకారం – ఈ చూర్ణాన్ని నేను ఉపదేశించిన మంత్రం జపిస్తూ, నువ్వు కోరుకున్న స్త్రీ శిరస్సున జల్లు! నీకు కుక్కలాగ వశమై, నువ్వు ఉన్నచోటుకే వచ్చి, నిత్యం నిన్ను వదలకుండా పడి ఉంటుంది." అని మూలికా చూర్ణం ఇచ్చి పంపింది.

బలసింహుడు ఆ చూర్ణాన్ని పదిలంగా మూటకట్టుకుని, ఆ మంత్రగత్తె చెప్పినట్లు మంత్రం జపిస్తూ, నిర్ణీత సంఖ్య పూర్తి అయ్యాక జపం అయిపోయింది. ఇక చూర్ణం జల్లడమే మిగిలింది అనుకుంటూ, అవకాశానికై నిరీక్షించసాగాడు.

ఎలాగో మందరను తోడు చేసుకుని, చంద్రలేఖ మేడ దగ్గరకు చేరుకున్నాడు. ఆమె గాఢంగా నిద్రపోతోంది. ఎంత బాగా చూర్ణం తలకు పట్టించగలిగితే, అంత ఎక్కువకాలం తన దగ్గర పడి ఉంటుంది కాబోలు అనుకున్న బలసింహుడు, ఆమె తలమీద చూర్ణం బలంగా రుద్దాడు.

అప్పుడ చంద్రలేఖ అదిరిపడి కళ్లు నులుముకుంటూ లేచింది. ఎదుట పళ్లికిలిస్తూ నిలబడ్డ బలసింహుని చూసింది. "ఎవడవు నువ్వు" అని అడిగింది. దానికి అతడేం జవాబు చెప్పక "హ్రాం హ్రీం హ్రూం క్లీం హుం అంటూ ఆ మంత్రాన్ని మళ్లీ జపిస్తూ, మిగిలి ఉన్న ఆ చూర్ణం కొంత ఆమె నెత్తిమీద మళ్లీ జల్లుతూ "నేను – నేను – రమ్ము! రమ్ము!" అంటూ గంభీరముద్రతో నిలబడ్డాడు.

దానికి చంద్రలేఖ ఉలిక్కిపడి "ఓహో! నేను అనగా ఏమి? నువ్వు ఎవ్వడవు? ఈ అర్ధరాత్రి వచ్చి రమ్మంటూ ఈ దుమ్ము నా నెత్తి కేల రాస్తివి" అంటూ అంతకంటే గంభీరంగా పలికింది.

"అయ్యో! చంద్రలేఖా! ఈ మాత్రం తెలీదా? నేనంటే ఎవరను కున్నావు; నిద్ర మెలకువ రాలేదు కాబోలు ! ఈసారి తెలుస్తుందిలే!" అంటూ మిగిలి వున్న చూర్ణం పూర్తిగా ఆమె నెత్తిన పోశాడు. అప్పుడామె "దొంగ–దొంగ "అని అరిచింది. ఆ కేకలకు అంతఃపురంలోని వాళ్లంతా నిద్రమేల్కొని అక్కడి కొచ్చేశారు. బలసింహుడు పారిపోయాడు.

తిలోత్తమ కూడా మేల్కొని వచ్చి అక్కడే ఆ రాత్రి ఉండి "ఎవరా మనిషి? నువ్వు చూశావా? గుర్తుపట్టగలవా?" అంటూ ప్రశ్నించినా, ఆమె చుట్టం అవుతాడు గనుక, ఆమె చిన్నబోతుందని ఆ వ్యక్తి పేరు, వెల్లడించలేదు చంద్రలేఖ.

అంతఃపురంలో ఘర్షణకు, తన పేరు బయటకు పొక్కి రాజు తన నెక్కడ శిక్షిస్తాడో అని భయపడుతూనే, మూలిక ప్రభావం తలకెక్కితే చంద్రలేఖ తనకోసం పడిఛస్తుంది అనే ఆశ కూడా లోలోపల పీకుతూన్న బలసింహుడు, ఏ చిన్న అలికిడైనా, ఆమే వచ్చిందనుకుని "ఇటు రా! ఇటురా!" అంటూ ఆ రాత్రంతా ఏదో మత్తు ఆవహించినవాడిలా గడపసాగాడు. ఉదయాన్నే అతడి దగ్గరకు మంధర రాగా "చంద్రలేఖకు నా మీద కొంచెమైనా అనురాగం కలిగిందా?" అని అడిగాడు.

అది నవ్వుతూ " ఆ మాంత్రికురాలు నిన్ను బాగానే మోసం చేసిందిలే! దానికి నీ మీద ఏమాత్రం ఇష్టంలేదు. తిలోత్తమ దగ్గర - మీ చుట్టరికాన్ని బట్టి నోరు మెదపక పోయినప్పటికీ, "మంధరా! బలసింహుడు చేసినది నాకు తెలీక కాదు! రాజబంధువు అని ఈసారికి ఊరుకున్నాను. ఇంకోసారిటు వంటిది జరిగితే, రాజుగారికి చెప్పకపోను. అతడ్ని మర్యాదగా ఉండమని బుద్ధి గలిగి మెసలమనీ చెప్పు! నీకు ఇలాటి బుద్ధులు తగవు" అంటూ మందలించింది.

తిలోత్తమ - చంద్రలేఖలు ఊరి బైట ఉద్యానవనంలో కొన్ని రోజుల పాటు వనవిహారం- జలకాలు-తదితర క్రీడల్లో మునిగి తేల్తారని తెలుసుకున్నాడు బలసింహుడు. ఒక ఉపాయం పన్ని - గజదొంగలుగా ఆ నగరంలోనే పేరు పడిన మర్కట - మారీచులను కలుసుకున్నాడు. వాళ్లు ఒక కన్నుకు తెలీకుండా ఇంకో కంటిని మాయ చెయ్యగల ఘనులు. చంద్రలేఖ ఉద్యానవనంలో నిద్రపోతూండగా- మంచంతో సహా ఆమెని తన రహస్య గృహానికి చేర్చమని - తగిన పారితోషికం ఇస్తానని ఆశచూపడంతో వాళ్లు అందుకంగీకరించారు.

ఆ ఉద్యానవనానికి చుట్టూ ప్రహరీగోడ ఉంది. లోపలి విచిత్రమయిన మేడలున్నాయి. అక్కడవాళ్లు యధేచ్ఛగా విహరిస్తున్నారు. వాళ్ల విహారాల తీరును మంధరద్వారా విన్నాక, ఎప్పుడెప్పుడు ఎవరెక్కడ విహరించేదీ ముందుగానే గజదొంగలకు సమాచారం అందించాడు.

వాళ్లు అర్ధరాత్రిపూట ఆ ఉద్యానవనంలో ప్రవేశించి, మేడమీదకెళ్లారు. అక్కడ నిద్రిస్తున్న ఇద్దరిలో చంద్రలేఖ ఎవరో వాళ్లకు అర్థం కాలేదు. ఇద్దరూ అందగత్తెలే! ఊహించి ఒక మంచం ఎత్తుకున్నారు. ఆమెకి మెలకువ రాకుండా, బలసింహుడి రహస్యగృహానికి చేర్చారు. బలసింహుడామెని తిలోత్తమగా గుర్తించి వణికిపోతూ వెంటనే ఆమెని యథాస్థానానికి చేర్చమన్నాడు. దొంగలు విసుక్కుంటూ, మళ్లీ ఆ మంచాన్నెత్తుకుని ఉద్యానవనం వైపు వెళ్లబోయారు. అటూ - ఇటూ తిరగడంలో కొంతసమయం వృధా అయి తెల్లవారుఘామున సమీపించింది. ఒక వీధిలో రాజభటుల పహారా, మరొక వీధిలో పెళ్లి ఊరేగింపు, ఇంకొక వీధిలో మేలుకుని ఉన్న ప్రజలు ఉండటంతో, వాళ్లకు తిరిగి ఉద్యానవనం వెళ్లే మార్గం తోచలేదు.

అప్పుడు వారిలో వారే ఇలా అనుకున్నారు. "బలసింహుడికి మనం భయపడేదేమిటి? ఓ వైపు చూడబోతే తెల్లారిపోతోంది. రాజభటులు మనని చూస్తే పట్టుకుంటారు. దీని వంటి మీద విలువైన రత్నాలూ - సొమ్ములూ ఉన్నాయి. దీన్ని అడవిదారిన తీసుకుపోదాం" అని నిశ్చయించుకుని, వాళ్లు రాకుమార్తెని అడవిదారి పట్టించారు.

చంద్రలేఖ లేచి తిలోత్తమ కోసం చూస్తే ఆమె కనిపించలేదు. ఇంతలో బిల బిల వచ్చిన సఖురాళ్లంతా గోడకు కన్నం వేయబడి ఉండటంతో దొంగలు పడ్డారని ఆశ్చర్య- భయాందోళనలతో చెప్పుకుంటూ శూరసింహునికి తెలిపారు. అమ్మాయి కనపడటం లేదని తెలిసి, రాజూ మంత్రీ విచారించి తిలోత్తమను వెదకటానికి భటుల్ని నలుమూలలా పంపించారు.

ఇంతలో బలసింహుడు వచ్చాడక్కడికి. "మీరేం చింతించకండి! దీని గుట్టంతా నేను గ్రహించాను" అన్నాడు. చంద్రలేఖని సాధించడానికి తనకు అవకాశం దొరికింది అనుకుంటూ.

"నీకేం తెలుసో చెప్పు" అన్నాడు శూరసింహుడు.

"ఈ పని చేయించింది ఇక్కడే ఉంది. తప్పు మనదే! వేశ్యతో తిలోత్తమ సహవాసం చేస్తుంటే, మనం వద్దని వారించకుండా అనుమతించాం. విద్యారూప సంపదలు అన్నీ ఉన్న తిలోత్తమను తీసుకొస్తే, ఎవరో ఆమెకు బాగా డబ్బు ఇవ్వజూపి ఉంటారు. అందుకు ఆశపడిన చంద్రలేఖ తిలోత్తమని తప్పించింది. నాకు ఇటువంటి వార్తలు అందుతున్నా ఇంత కట్టుదిట్టమైన చోట ఏం జరుగుతుందిలే? అని ఉపేక్ష వహించాను. మంథరకు మరికొంత సమాచారం తెలుసు!" అన్నాడు బలసింహుడు.

శూరసింహుడు మంథరని రప్పించాడు.

"దేవా!ఈ చంద్రలేఖ వచ్చినది మొదలు, కపటపు ఆలోచనలే చేస్తోంది. తిలోత్తమను ఎక్కడికైనా తీసుకుపోవాలని దాని పన్నాగం. దానికి రోజుకో ఐదు ఉత్తరాలైనా వస్తుంటాయి. మొన్న నేను తెలివిగ ప్రవర్తించి దూత దగ్గర్నుంచి ఉత్తరం తీసుకున్నాను. అందులో 'చంద్రలేఖా! నువ్వెళ్లి చాలా రోజులైంది. తిలోత్తమనెప్పుడు తీసుకొస్తావో తెలీదు. నేను నీ విరహంలో పడి కుంగిపోతున్నాను. ఎలాగైనా కార్యం సఫలం చేసుకొని రా! నీ జవాబు కోసం ఎదురుచూస్తుంటాను" అని ఉంది. అంతలో చంద్రలేఖ వచ్చి ఉత్తరం తీసేసుకోవడంతో, తరువాత ఏముందీ తెలీదు.

నేను అది చదివినందుకే చంద్రలేఖ చాలా కోపగించి "తిలోత్తమకు చెప్పి నిన్ను దండింపచేస్తా" అంది. ఈ విషయం ఇంకెవరికీ చెప్పక మా అయ్యగారికి మాత్రమే చెప్పాను - నాకు ఇంతే తెలుసు".

రాజు చంద్రలేఖని పిలిపించి, మంథర చెప్పినదంతా మళ్లీ విన్పించి "దీనికి నువ్వే మంటావ్?" అని అడిగాడు.

ఆ మాటలకు చంద్రలేఖ దిగ్భ్రాంతి చెందింది. ఈ ముసలి దాది నా మీద కోపం పూని ఇలా చెప్పింది. ఇంత పకడ్బందీగా పన్నిన ఈ ఉచ్చులోంచి నేను ఎలా తప్పించుకోవాలి? విధి నాకు ఎలాటి ఆపదను తెచ్చి పెట్టింది?" అని మనసులోనే విచారిస్తూ.

అయ్యా! నేను అటువంటి దాన్ననీ, అటువంటి పనులు చెయ్యగల దాన్ననీ మీకు నమ్మకం కలిగితే, వెంటనే నాకు శిక్ష విధించండి! ఎటువంటి శిక్ష విధించినా అది అనుభవించడానికి నేను సిద్ధంగా ఉన్నాను" అని తలవంచుకున్నది.

అప్పుడు మంత్రి "నువ్వు అలా అంటే కాదు! నేరం చెయ్యనట్లు నిదర్శనాలు ఏవి ఉన్నా సూచించు! లేకపోతే శిక్షించబడతావు" అన్నాడు. బలసింహుడు కలుగజేసుకొని " మీకా అనుమానం దేనికీ?అది చెప్పిన మాటల్లో నిజం తెలిసిపోలేదా? దీన్ని తప్పకుండా దండించాలి" అన్నాడు.

మంత్రి అతడ్ని శాంతపరుస్తూ " ఆగాగు! తొందరపడకు! ఈమె మొహం చూస్తే, వేరే కారణం మీద అలా చెప్తోందేమో అనిపిస్తోంది. నేరం చేసిన దాఖలాలు స్పష్టంగా లేవు" అన్నాడు. అయినప్పటికీ బలసింహుడు ఆమెను శిక్షించవలసిందే అని పట్టుపట్టాడు.

అప్పుడు మంత్రి "మంధర చెప్పిన మాటల మీద నాకు నమ్మకం లేదు. ఈమె తిలోత్తమ కంటే కూడా విద్యారూపాలలో అధికురాలు. మహారాజులైనా సరే - ఈమెని అంతఃపురంలో పెట్టుకుంటారు. ఈమెకి తిలోత్తమ మీద గల ప్రేమ వల్ల అలా చెప్పి ఉండొచ్చు! ఆ వియోగదుఃఖం ఆమె చేత అలా చెప్పించిందేమో! చంద్రలేఖని దండింపరాదు" అన్నాడు. అప్పుడు బలసింహుడి సూచన మేరకు ఆమెని బండిమీద ఊరేగించి, సముద్రతీర ప్రాంతంలోని మహారణ్యంలో వదిలివచ్చారు.

భటులు వెనక్కు వెళ్లిపోయాక, బలసింహుడు రహస్యంగా అరణ్యంలో చంద్రలేఖ ఉన్న చోటుకు వెళ్లాడు.

చంద్రలేఖ నేలమీద పడి ఉంది. ఆమె కేమీ తెలీడం లేదు. అతడు ఆమె కట్లు విప్పి "నేను ఇలా చేయించానని కోపగించకు. ఈ తప్పుకి తగిన విధంగా నిన్ను సుఖపెడతాను. నీ మీద నేను మోజుపడి వున్నాను" అంటూ ఆమెను లేవనెత్తబోతూంటే ఆ ప్రాంతంలో వేటకు వచ్చిన కిరాతకుడు అది చూసి ఏదో మృగం కాబోలు అనుకుని పొరపాటు పడి బాణం వేశాడు.

"హా చంద్రలేఖా! అని అరుస్తూ, అతడు ప్రాణాలు విడిచాడు. తన బాణానికి కూలినవాడు మనిషి అని గ్రహించడంతో, కిరాతకుడు భయపడిపారిపోయాడు. చంద్రలేఖకు స్పృహవచ్చి, చనిపోయి వున్న బలసింహుడిని చూసి, తన కట్లు విప్పింది అతడేనని గుర్తించింది. అక్కడ సిద్ధంగా తన కోసం అతడు రాచిన ఆహారపదార్థాలను గ్రహించింది. ఆ తర్వాత అతడెందుకు అలా చేసి ఉంటాడో ఊహించి, అతని దుర్బుద్ధే అతడిని ఈవిధంగా దిక్కులేని చావుకు గురిచేసిందని - దేవుడికి తనమీద దయ కలిగినందుకు సంతోషించింది. అలసట తీరాక, కనిపించిన త్రోవన పడి నడవసాగింది.

అలా వెళ్లగా, కొంతసేపటికి సముద్రం వచ్చింది. ఒక ఓడ అటువైపుగా వచ్చింది. అది గాలి తాకిడికి అటువైపు వచ్చింది. గాని, అక్కడ రేవు పట్టణమేదీ లేదని, ఆమెకు ఆ తర్వాత తెలిసింది. అందులో ఉన్నవాళ్లు ఒడ్డుకు చేరినందుకు సంతోషిస్తున్నారు.

ఆ ప్రయాణికులతో " ఈ రాత్రి ఇక్కడ వంటలు చేసుకుని, విశ్రమించండి! తూర్పు గాలి తిరగ్గానే ఓడ నడుపుతాను." అని గట్టిగా చెప్పాడు ఓడకు చెదిన కర్ణధారుడు.

చంద్రలేఖ ప్రయాణీకుల్తో కలిసిపోయి, మర్నాడు చక్కగా ఆ ఓడ ఎక్కేసింది. రెండు రోజులకు ఓడ త్రిగర్త దేశ రాజధాని అలకాపురం రేవు చేరింది. అప్పుడు చాలామంది దిగిపోయారు.

చంద్రలేఖ వద్ద పైకం చెల్లించినట్లు పత్రికేదీ లేకపోవడంతో ఆమెను దిగడానికి అనుమతించక, ఆమె ఓడ ఎక్కిన స్థలం చెప్పగా "అలాటి అరణ్యమధ్యానికి నువ్వెలా వచ్చావు? అంటూ ప్రశ్నలు వేసి ఆమెను ఒక గదిలో ఉంచేటట్లు పనివాళ్లకు ఆజ్ఞాపించాడు.

అందరూ దిగి వెళ్లాక - అతడు ఆమె వద్దకు వచ్చి "శృంగార భావాలు వెలిబుచ్చే చూపుల్తో ఆమె వివరాలడిగాడు మళ్లీ. చంద్రలేఖ అతడి మనోభావాన్ని పసిగట్టి, వేరే వరుస కలిపి "అన్నా ! నా నివాసం రామచంద్రాపురం." అంటూ అవసరమైన మేరకు విషయం చెప్పి " ఈ మణి రుసుముగా తీసుకో! నన్ను తీరానికి తీసుకువెళ్లు" అంది.

"దీనికి రుసుం అక్కర్లేదులే! ఒక్కసారి నీ చెక్కిళ్లు ముద్దాడి నీ అధరామృతం గ్రోలనీ – చాలు!" అంటూ మోహావేశితుడయ్యాడు.

"సంసారులకు ఇలాంటివి తగవు" అంటూ చెప్పినా వినిపించుకోకుండా ఆమెతో వివాదపడసాగాడు.

ఆ తీరానికి కొత్తగా వచ్చే ఓడల్ని పరీక్షించే రేవు రాజభటులు వచ్చి "ఓడ సర్దారెక్కడ? అని అరుస్తూ, అక్కడికొచ్చారు. అతడు తనను నిర్బంధించి బలాత్కరిస్తున్నాడని వారితో చెప్పుకోగా, చంద్రలేఖ స్థితికి జాలి పడి, వారే ఆమెని రేవులో దింపించే ఏర్పాటు చేశారు.

## వీరగుప్తుని కథ

అప్పుడు చంద్రలేఖ స్త్రీ జాతినే నిందిస్తూ ఇట్టి కష్టపు జన్మనెత్తాను. నా రూపమే నాకు ఇంత ముప్పు కలిస్తోంది. ఎక్కడికి పోయినా ఈ రూపం వల్ల నాకు చిక్కులే ఎదురవుతున్నాయి. ఇక ఈ రూపం మార్చి పురుష వేషం వేసుకుంటే సుఖంగా ఉండొచ్చు!" అనుకొని, అప్పటికప్పుడే అంగడికి వెళ్లి, తన దగ్గర ఉన్న ఆభరణాన్ని ఒకటి విక్రయించి, దాంతో మంచి దుస్తులు – పురుషలు ధరించదగినవి కొనుక్కొని, వీరుని వేషంలో వీరగుప్తుడని పేరు పెట్టుకుని ఆ రాజధానిలో తిరగసాగింది.

ఆ పట్టణాన్ని ధర్మాంగదుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతని మంత్రి హఠాత్‌గా మరణించడంతో – ఆ ఉద్యోగం తనకు ఇవ్వవలసిందిగా ఎందరో వచ్చారు. అయితే, మంత్రికి కావలసిన బుద్ధికుశలత పరీక్షించి గాని, రాజు వారికి ఉద్యోగం ఇవ్వనని చెప్పి కొన్ని పరీక్షలు పెట్టగా వచ్చిన వారెవరూ వాటిలో నిలబడలేకపోయారు.

"నేను అడిగిన వెంటనే, నా మనస్సుకు నచ్చేలా ఎవరు నాకు జవాబివ్వగలుగుతారో, వారినే మంత్రిగా చేసుకుంటా" నని ఆ రాజు సింహద్వారం వద్ద ప్రకటన వ్రేలాడదీయించారు. ఎవరూ అతని మాటలకు సరైన జవాబు చెప్పలేకపోయారు. విలాసంగా నగరమంతా తిరుగుతూన్న వీరగుప్తుడా ప్రకటన చూసి, తన పేరు రాసి, నిండు సభలో ఉన్న ధర్మాంగదునికి తాను సమాధానం ఇవ్వగలనని వెల్లడించాడు.

అర్ధాంగీకారంగానే అతడ్ని లోపలికి అనుమతించాడు ప్రభువు. అయితే, వీరగుప్తుని ముఖ విశేషం చూశాక "ఇతడు మంత్రి పదవికే కాదు! రాజ్యాధికారం ఇచ్చినా అందుకు తగినవాడే! ఇతడినొక్క ప్రశ్న వేస్తాను. చెప్తే, వెంటనే మంత్రిగా నియమిస్తాను" అని మనస్సులో అనుకొన్నాడు.

"పలు ప్రశ్నలు వేసి పరీక్షించను. ఈ ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పు! అయ్యా! పన్నెండులో నాలుగు పోతే ఎంత?" అని అడిగాడు.

వీరగుప్తుడు రెండో క్షణంలో "సున్న" అన్నాడు. ఈ పాటి లెక్క తెలీని ఇతడీ పదవికి తగుదునమ్మా అంటూ ఎలా తయారైపోయాడో అనుకున్నారు సభాసదులు.

కాని, ధర్మాంగదుడు మాత్రం "భేష్! ఇన్నాళ్లకు నాకు తగిన మంత్రివి దొరికావు. నేడు చాలా సుదినం. నువ్వే నా మంత్రివి." అని ఇంకోమాటకవకాశం ఇవ్వకుండా అతడ్ని మంత్రిగా ప్రకటించి, అప్పటికప్పుడే అధికార ముద్రలను కూడా అందజేశాడు.

ఆ అర్థం అక్కడ ఉన్నవాళ్లెవ్వరూ గ్రహించలేక, రాజుని వట్టి మూర్ఖుడని నిందించసాగారు. మరికొందరు సాహసించి, రాజుగారితో "అయ్యా! తాము ఇంతకు ముందు ఎందరికో చిక్కుప్రశ్నలు ఇచ్చి, వాళ్లేది చెప్పినా ఒప్పుకోకుండా, ఊరకే పొమ్మన్నారు. ఇప్పుడితడ్ని సుఖమైన ప్రశ్న అడిగారు. అతడు సరిగా చెప్పకున్నా ప్రధానిగా చేసుకున్నారు. పన్నెండులో నాల్గుపోతే సున్న ఎలా అవుతుంది. ఎనిమిది కాదా? ఈ సందేహం మమ్మల్నందరినీ బాధిస్తోంది. కారణమేమిటో చెప్పండి" అనగా ధర్మాంగదుడు నవ్వుతూ "ఇందుకే నేను ఎవ్వర్నీ మంత్రిగా ఒప్పుకోనిది. వినండి! పన్నెండులో నాలుగుపోతే ఎనిమిది అని అందరికీ తెలిసిందే! ఇక్కడ నా ప్రశ్నలోని గూడార్థాన్ని అర్థం చేసుకున్నవారికే సరైన సమాదానం తోచగలదు. పన్నెండు అంటే పన్నెండు నెలలు అని నా ఉద్దేశం – వీటిలోంచి నాల్గు తీసేయడం అంటే నాల్గుమాసాలు అని అర్థం.

వర్షాకాలం నాలుగుమాసాలు తీసేస్తే ఇంకేముందీ? వర్షాలు కురవకపోతే పంటలు పండుతాయా? అలా ఆ నాలుగు పోతే, ఆ సంవత్సరం సున్నా గాక ఇంకేమవుతుంది? ఇదే నా ప్రశ్నలోని గూఢార్థం. అది గ్రహించి సమాధానం చెప్పగల్గిన ధీశాలి ఇతడు.

"ఇంతటి సూక్ష్మబుద్ధికి మంత్రిత్వం ఇవ్వడం నా తప్పా?", అని ప్రశ్నించేసరికి సభ్యులందరూ తెల్లబోయారు. ఇద్దరూ బుద్ధికుశలురే అని ప్రశంసించారు. క్రమంగా మంత్రి అయిన వీరగుప్తుడు తన బుద్ధి - ప్రతిభ నిరూపించుకోవడంతో ధర్మాంగదుడు మరింత సంతోషించి, రాజ్యభారం అంతా అతడి మీదనే ఉంచి, అతడు చెప్పినట్లు తాను నడవసాగాడు. వీరగుప్తుడు మంత్రి అయ్యాక దేశం సుభిక్షంగా ఉండి, పాడిపంటలు అభివృద్ధి చెందాయి. ప్రజల స్తోత్రాలకు అతడు పాత్రుడైనాడు...."

అప్పటికే వేళమించిపోవడంతో, అక్కడికి కథ ఆపి, ఆ యతి శిఖామణి, ఆవలి కథను తర్వాత ఇలా చెప్ప ప్రారంభించాడు.



# కాశీ మజిలీ కథలు

## 16వ మజిలీ

## భక్తురాలి కథ

పట్టీ – వినుము.....

ఆ విధంగా చంద్రలేఖ, వీరగుప్తుడనే నామాంతరంతో ధర్మాంగదుని కొలువులో మంత్రిగా ఉండి, ఒకరోజు నగర దర్శనం నిమిత్తం తగిన పరివారంతో ఊళ్లో సంచరిస్తూంటే, ఒక వీధిలో కోకిల స్వరంతో పాడుతూన్న ఒక చిన్నదాని వీణాగానం వినిపించింది.

ఆ పాటకు మనస్సు ద్రవించి, ఏదో తెలీని ఉత్సాహం కలిగి, అట్టే నిలబడిపోయి ఒక పరిచారకునితో "ఓరీ! ఈ ప్రాంతంలో ఎక్కడో సంగీతం వినబడుతోంది. అదెక్కడ్నుంచి వస్తోందో చూసిరా!" అని ఆజ్ఞాపించాడు.

వాడు వచ్చి "ఇక్కడికి దగ్గర్లో తారకేశ్వరుని ఆలయం ఉంది. అక్కడ ఒక భక్తురాలు తన్మయత్వంతో గానం చేస్తోంది" అని చెప్పాడు.

"మనం అక్కడికి వెళ్లవచ్చు కదా!" అని అడగ్గా "దేవాలయానికి పోవడానికి ఎవరి అనుమతి కావాలి స్వామీ? అది కూడా మన అధికారానికి లోబడి ఉన్నదే! సందేహం లేదు. రండి – వెళ్దాం! మనస్సులో ఏదైనా తలచుకొని, స్వామి వారికి మొక్కుకుంటే, తప్పకుండా వారికా కార్యం సాఫల్యమవుతుంది. ఈ తారకేశ్వరుని మొక్కులు చెల్లించుకోవడానికి చాలా దేశాల నుంచి ప్రజలు వస్తూంటారు. మీరూ చూడదగినదే!" అనగా ఆ మంత్రి సంతోషంతో ఆలయంలోనికి వెళ్లాడు.

అక్కడున్న ముఖమంటపం మీద వీణతంత్రులకు సరితూగే కంఠ స్వరంతో కమ్మగా పాడుతూన్న ఆ భక్తురాలిని చూసి ఆశ్చర్యపోయాడు. మంత్రి వేషంలో ఉన్న చంద్రలేఖకు మనస్సులోనే ఆమెను చూడడం వల్ల ఏదో సంతోషం ఉదయించింది.

పరివారంతో సహా మంత్రిగారు వెళ్లేసరికి, భక్తురాలు - అక్కడున్న వాళ్లందరూ తటాలున లేచి అవతలకు వెళ్లారు - గౌరవ సూచకంగా.

ఇంతలో - గుడి ధర్మకర్త వచ్చి సగౌరవంగా వీరగుప్తుని తీసుకువెళ్లి, ఆ ఆలయానికి సంబంధించిన వింతలు- విశేషాలు చూపించి, గర్భాలయంలోనికి తీసుకువెళ్లి స్వామివారినీ చూపించాడు. ఆ తర్వాత ముఖమంటపం దగ్గరకు తీసుకొచ్చి, అక్కడ తగిన ఆసనాలు ఏర్పరచి వాటి మీద కూర్చోపెట్టాడు.

అప్పుడు వీరగుప్తుడు ధర్మకర్తని చూసి "మనం వచ్చే వేళకు ఇక్కడో చిన్నది గానం చేస్తోంది. ఆమె ఎవరు?" అని అడిగాడు.

"ఆమె ఒక భక్తురాలు. దాని కులం - శీలం - పేరు ఏవీ ఎవరికీ తెలియవు. కొన్ని రోజులనుంచి ఈ ఆలయంలో ఉన్న విజ్ఞాన యోగిని ఆశ్రయించుకుని ఉంది. నిత్యం సాయంత్రం ఈ స్వామిమీద కీర్తనలు పాడుతూ వుంటుంది. స్వామి వారి నైవేద్యంలోంచి కొంత పదార్థం దానికి ప్రసాదంగా ఇస్తున్నాను. ఆమె అదే భుజిస్తుంది" అని చెప్పాడు ధర్మకర్త.

"దీని కంఠ స్వరం చక్కగా ఉంది సుమీ! అని మంత్రి అనగా "తాము ఆజ్ఞాపించాలేగాని, ఇంకోసారి పాడించాలంటే చెప్పండి! ఆమె కూడా సంతోషంగా పాడుతుంది. స్వామి వారి దాసురాలే!" అంటూ, ఆమె దగ్గరకెళ్లి "అమ్మా! మంత్రిగారు సంగీతం వినాలని వేడుకపడుతున్నారు. త్వరగా వచ్చి రెండు శివకీర్తనలు ఆలాపించు!" అనగా, ఆమె రావడానికి సంశయించింది.

తర్వాత ఏం అనుకున్నదో ఏమో!....తటాలున వచ్చి, మంత్రిగారికి నమస్కరించి, శ్రుతి చేసి చక్కగా పాడింది. కాషాయవస్త్రాలు, విభూతి, రుద్రాక్షలు ధరించి వున్నా, నివురు గప్పిన నిప్పు అనేలా అద్భుత తేజస్సుతో ప్రకాశిస్తూన్న ఆమెను వీరగుప్తుడు పరిశీలనగా చూడసాగాడు.

ఆ భక్తురాలు శివకీర్తనలు రెండు పాడి, మధ్యలో చంద్రలేఖ రచించి తిలోత్తమకు చెప్పిన గీతం ఒకటి పాడింది. ఆ గీతంలో చంద్రలేఖ ముద్ర ఉంది. అది పాడటంతోనే వీరగుప్తుని వేషంలో ఉన్న చంద్రలేఖకు మనస్సు ఝల్లుమన్నది. "ఔరా! ఈ గీతం నేను రచించి, తిలోత్తమకు మాత్రమే చెప్పాను. ఇంకెవరికీ చెప్పలేదు. ఆమె ఇంకొకరికి చెప్పినట్లు లేదు. ఈ భక్తురాలు ఆమే! సందేహం లేదు. ఆకారం, కంఠస్వరం అన్నీ ఆమెవే! ఇట్టి విరాగిణి వేషంలో మొదట గుర్తుపట్టలేక పోయినా, పరిశీలిస్తే నిరూపణ సాధ్యమే" అనుకుంటూ ఆమెను గానం ఆపమని, పక్కవాళ్లను అందర్నీ దూరంగా వెళ్లమని ఆజ్ఞ ఇచ్చింది చంద్రలేఖ.

"తల్లీ! నువ్వు పాడిన గీతాలకు నా గుండె నీరైంది. నీ దర్శనంతో నాకు ధన్యత చేకూరింది. నువ్వెక్కడ్నించి వచ్చావు? నీ కులశీలనామాదులేవి? ఎవరి వద్ద విద్యను అభ్యసించావు? నీ తల్లిదండ్రులు ఎవరు? నీ వృత్తాంతం చెప్పి మాకు ఆనందం కలిగించు!" అని వినయంగా ప్రార్థించింది.

మంత్రి వంటి వాడే తనని మన్నన చేసేసరికి, ఆ భక్తురాలు మెచ్చుకుంటూ "అయ్యా! నా పూర్వాశ్రమ వృత్తాంతం ఏమీ నాకు గుర్తు లేదు. ఇప్పుడు నన్ను అందరూ భక్తురాలు అని పిలుస్తుంటారు. ఈ విజ్ఞానయోగి శిష్యురాల్ని! తారకేశ్వరుని సేవించడమే నాకు పని. ఇంతకంటే నాకీ జన్మలో ఇంకేం కావాలి?" అని చెప్పింది. చంద్రలేఖ చిరకాల పరిచయం వల్ల, తిలోత్తమ కంఠస్వరాన్ని గుర్తించింది. అయితే – ఆమె చెప్పిన మాటలకు శోకం క్రమ్ముకొచ్చి కళ్లల్లో నీళ్లుకారుతూంటే ఆపుకుంటూ " తల్లీ ! నన్ను ఇతరుల్లా భావించకు! నీకు ఎవరివల్లనైనా ఆపదలు కలిగేలా వుంటే చెప్పు! వాటిని ఇప్పుడే తొలగజేయగలను. నీ ముఖం చూస్తుంటే ఏదో విపత్తు చేత

ఇటువంటి వైరాగ్యాన్ని అవలంబించావనిపిస్తోంది. నాకు చెప్పడం వల్ల నీకు మేలే గాని కీడు కలుగదు. నువ్వీ యోగిని వేషం ఎన్నాళ్లయింది?" అని అడిగింది.

అప్పుడామె అదే కోకిల కంఠంతో "దేవా! నేను రామచంద్రపుర ప్రభువైన శూరసేన మహారాజుగారి కూతురు తిలోత్తమను. దొంగలెవరో నన్నొక రాత్రి వేళ మంచంతో సహా ఎత్తుకుపోయారు. ఉదయం నేను నిద్రలేచే వేళకు దొంగల మధ్య అరణ్యంలో ఉన్నాను. బలిష్ఠంగా ఉన్న ఆ ఇద్దరూ నన్నా అరణ్యమధ్యంలో ఏం చేసినా చెప్పుకోడానికి నాకు దిక్కులేదు. అయితే వారి దృష్టి నా సౌందర్యం మీద కంటే, నా సొమ్ములమీదనే ఎక్కువగా ఉన్నదని నాకు అర్థమైంది. అయినప్పటికీ - నేను వాళ్లెవరో, ఏంకావాలో అడిగాను.

'బలసింహుడనే రాజుగారి బామ్మర్ది, నీతో సావాసంగా మెసిలే చంద్రలేఖను ఎత్తుకు రమ్మనగా, పొరపాటున నిన్ను తీసుకుపోయేసరికి అతడు మమ్మల్ని నిందించి, నిన్ను తిరిగి యథాస్థానానికి చేర్చమన్నాడు. మేం అలాగే వస్తూంటే, దారిలో అలికిడి అధికమై భయంతో ఇక్కడికి తెచ్చేశాం! మాకు రావలసిన సొమ్ము అందకుండా పోయింది. పొరపాటు ఎలా జరిగినప్పటికీ, నష్టపోయింది మేమే! కనుక - మా కష్టానికి ప్రతిఫలం మేము నీ దగ్గర్నుంచి రాబట్టుకుంటాం! నీ దగ్గరున్న సొమ్ములన్నీ ఇచ్చేస్తే సరేసరి! మేము నిన్ను ఒకచోట కొన్నట్లు చెప్తాం! నువ్వూ అలాగే చెప్పాలి. తెల్సిందా. లేదంటే ఇప్పుడే నరికేస్తాం!' అన్నారు. ప్రాణభయంతో వాళ్లడిగిన ఆభరణాలన్నీ ఇచ్చేయడమే గాక, వాళ్లు చెప్పినట్లే చెయ్యడానికి ఒప్పుకున్నాను. అలా చెయ్యకపోయినా - ఆ అడవిలో క్రూరమృగాల వాత పడితే నాకు లభించేది మరణమే కదా! వాళ్లు నన్నొక పట్నంలో వ్యాపారి దగ్గరకు తీసుకెళ్లి "ఈమెని పారశీక దేశంలో వెయ్యి దీనారులకు కొన్నాం! నీకు కావాలంటే చెప్పు! అమ్మేద్దామనుకుంటున్నాం!" అన్నారు.

"లోకసమ్మతమైన పనులు చెప్పి, అవే చేయిస్తానని ప్రమాణం చేస్తే నేను అమ్ముడుపోతానని - లేకుంటే లేదని" దొంగల్తో ముందే చెప్పడంతో వారు వ్యాపారికి అదే చెప్పి నన్ను అమ్మేశారు. అతడు అందుకు ఒడంబడి,

నన్ను కొన్నాక తన భార్యకు అప్పగించాడు. ఆమె నన్ను గౌరవగానే చూడసాగింది. కాని ఆ వ్యాపారి కొడుకు దేవలుడనే వాడితోనే నాకు చిక్కొచ్చి పడింది. నా రూపం చూసి మోహించి, ఓ రోజు తన అభిప్రాయం వెల్లడించగా నేను మందలించాను.

అప్పటికి మరచిపోయిన దేవలుడు, రెండ్రోజుల తర్వాత "నీకీ దాస్యవృత్తి దేనికీ? నేను చెప్పినట్లు చెయ్యి! మదనబాధకు తాళలేకపోతూన్న నన్ను కృతార్థుని చేస్తే నీకు మంచి స్థితి కలిగిస్తాను" అంటూ మళ్లీ ప్రతిపాదించాడు. నేను వ్యాపారికీ, అతని భార్యకూ ఈ సంగతి చెప్పగా - ఒక్కడే కొడుకు కావడం వల్ల దండించలేక, వాడున్న వైపుకు వెళ్లకు అంటూ నేనేదో అతని చుట్టూ తిరుగుతన్నట్లు నాకే నీతి చెప్పారు.

అది అవకాశంగా తీసుకొని, దేవలుడు ఇంకో అడుగేసి నా చెయ్యి పట్టుకోబోగా, నేను అవతలకు పారిపోయి ఇరుగుపొరుగుల వారితో మొరపెట్టుకున్నా - ప్రయోజనం లేకపోయింది. ధనికుడైన ఆ వర్తకునికిగాని అతని కొడుక్కుగాని చెప్పే సాహసం చెయ్యలేకపోయారు వాళ్లెవరూ.

'రాజపుత్రికను - నాకీ కర్మం ఏమిటి? నా ఈ విద్య, రూపం ఇవన్నీ దాసీ వృత్తికా? నాకీ హీనస్థితి దేనికీ?" అని ఆ రాత్రి బలవంతంగా చనిపోవడానికి నిర్ణయించుకున్నాను.

అర్ధరాత్రి ఆ ఇంట్లో వాళ్ళంతా నిద్రపోతూంటే, ఈ దేవాలయంలో నూతిని ఇంతకుముందే చూసి ఉండటం వల్ల - దేవుని సన్నిధిలో మృతి చెందడం పుణ్యం అని ఆలోచించి మెల్లగా ఇక్కడికి వచ్చాను. ఈ గుడి తలుపులు రాత్రులు కూడా తెరిచే ఉంటాయి.

నేను లోపలకొచ్చి, ఈ నూతిగట్టు మీద కెక్కి చేతులు పైకెత్తి జోడించి భగవంతుని స్మరించుకుంటూన్నంతలో ఒక మాట జ్ఞాపకం వచ్చింది. "అయ్యో! నేను ఇప్పుడు చావ సిద్ధంగా ఉన్నాను.

ఈ సమయంలో తారకేశ్వరునికి ప్రదక్షిణం చేసి వస్తే ముక్తి కలుగుతుంది కదా! ప్రదక్షిణ మెంతసేపు? కొద్ది నిమిషాల్లో అయిపోతుంది" అని తలచి, నూతిగోడ దిగి ఉత్తరపు దిక్కుగా ప్రదక్షిణం చేయడానికి ప్రారంభించాను.

## బలదేవుని కథ

ఆ వైపున ఉన్న మంటపంలో అగ్ని వ్రేల్చే వెల్తురులో ఏదో మాట్లాడుతూన్న జనుల సందడి ఒకటి వినబడింది. అందుకు నేను సంకోచిస్తూ, ఆ దారిన పోతే, ప్రజలు నన్ను పలకరిస్తారని భయంతో అటు వెళ్లక, 'వాళ్లు నిద్రపోయాక వెళ్దాం' అనుకుని అక్కడే ఆగిపోగా వాళ్ల మాటలు వినిపించాయి.

"శిష్యా! విను! సంసారం పెళ్లాం పిల్లలు డబ్బు వీటన్నిటితో ముడిపడి ఉంది. పోనీ! దేహం అంటే ఇది గాల్లో దీపం లాంటిది. ఎప్పుడు ఆరిపోతుందో తెలీదు. భార్యపుత్రులు స్నేహితులు వీళ్లమీద ప్రేమ పెంచుకుందామంటే వీళ్లూ సందేహమే! ఎవరు శాశ్వతం? ఇదంతా ఒక కల మాదిరి తోచే సందడి. ఈ ఐహిక సుఖం అనేది ఓ ఇంద్రజాలం! అంతేనా?

కామం అనే రోగం చేత వర్ధిల్లుతూ, దేని చేతను జయించబడని ధనసంపాదనేచ్ఛ అనేది ఒక గొప్ప శత్రువు. ఈ శత్రువు ఇంకా ఎట్లాంటిదీ అంటే – అదీ చెబుతాను విను! కైవల్యం సంప్రాప్తించే వైరాగ్యం అవలంబిద్దామంటే అందుకు అవరోధాన్ని కలిగిస్తుంది. ఎన్ని అవగుణాలుండాలో అన్నీ ఉన్నాయి దీనికి. కొడుకులు పుట్టేదాకా ఒక విచారం. పుట్టాక వారు విద్యాబుద్ధులు, ఆయుష్షు కలిగి పెద్దవారై ఓ ఇంటి వాళ్లయ్యేంత వరకు అది ఇంకొక విచారం! తండ్రికి ఎప్పుడూ చింత కలిగించే పుత్రులు శత్రువులు తప్ప మిత్రులా? చూడగా – క్షణ భంగురమైన ఈ జీవితంలో భవబంధాలన్నీ నీటి బుడగలురా శిష్యా ! దీనికి ఒక ఉదాహరణ చెప్తాను....

ఎవరెవరకో ఎందుకు? నా జీవితమే ఒక దృష్టాంతం. నేను పూర్వాశ్రమంలో జగన్నాధంలో నివశిస్తూ, స్వామికి మాలికలు కట్టి ఆరాధిస్తూండేవాడిని. చాలాకాలం వరకు నాకు సంతానం లేదనే చింత బాధించేది. అందుకోసం దానాలూ - ధర్మాలూ చాలా చేశాను. ఎలాగో పుత్రుడు కలిగాడు. కాని వాడు పుట్టిన కొద్దికాలానికే, అంతుతెలియని రోగంతో నా భార్య మరణించింది. వాడు తల్లి లేని వాడైనా అన్నీ నేనే అయి ఏ లోటూ రాకుండా పెంచుకుంటూ వచ్చాను. చాలా అందంగా ఉండేవాడని రుచికుడని పేరు పెట్టాను.

వాడ్ని ఎక్కడికీ కదలనివ్వక ఇంట్లోనే విద్యాబుద్ధులు చెప్పిస్తూ తీరిక వేళల్లో కులవృత్తి అయిన మాలలు కట్టే పని నేర్పాను. అదేం చిత్రమో వాడు తండ్రిని మించిన తనయుడయ్యాడు. నా కంటె ఎక్కువ పేరు సంపాదించాడు. ఒకరోజు సాయంత్రం పూలదండలు అమ్మడానికి వెళ్లినవాడు తిరిగి రాలేదు. ఊరంతా వెతికించినా ఫలితం లేకపోయింది.

ఒక్కగానొక్క బిడ్డ కోసం విచారిస్తూ నిద్రాహారాలు మాని, అహర్నిశలూ వాడినే తల్చుకుంటూ, ఇక పుత్ర విరహం భరించలేక, బలవన్మరణం చెందాలనుకున్నాను. నా సంగతి తెలుసుకున్న ఒక వృద్ధ బ్రాహ్మణుడు నా దగ్గర కొచ్చి 'బలదేవా! నీవు పుత్రవ్యామోహం వల్ల బలవన్మరణానికి పాల్పడే స్థితిలో ఉన్నావని తెలిసింది. ఆ పని నువ్వెప్పుడూ చేయకూడనిది సుమీ! నువ్వు భక్తుడవు కదా! ఇంతవరకు చేసిన పుణ్యం పోవడమే గాక, చాలా కాలం పాటు నరకంలో పడతావు...." అంటూ మంచి మాటలతో నా ఉద్యమాన్ని మాన్పించాడు. అప్పట్నుంచీ నేనీ అవధూత వేషం పూని, పెద్దల సేవలోన తరించి ఆత్మజ్ఞానం పొంది విజ్ఞానయోగి అనే పేరిట తిరుగుతున్నాను. శిష్యా! ఈ శోకం అంతా నాకు కుమారుని వల్లనే కదా వచ్చింది. మొదట్లోనే అతడు నాకు కలగకపోతే ఈ దుఃఖమే ఉండకపోను.

అందువల్ల - నీకు నేను చేస్తున్న ఈ ఉపదేశం జాగ్రత్తగా విను!

ఉ. కోరకు మే పదార్థమును గోరిన వచ్చునె రాని వస్తువుల్?
గోరక యున్న ఈవె తనకున్ లభింయింపనున్న యర్థముల్
గోరిన రానిచోఁ గలిగి కోల్పడుచో వెత, గాన సజ్జనుల్
గోర రనాస్థఁబ్రాప్తములు గొందురు కుందరు వస్తుహానికిన్.

ఇలా ఉపదేశించే ఆ యోగి పుంగవుని మాటలు అమృత బిందువుల్లాగ నా చెవులకు సోకాయి. అప్పుడు నేను విచారం వదలి, సంతోషాన్ని పొంది నాకీ బలవన్మరణం తప్పించడానికి భగవంతుడే నాకీ రూపంగా ఉపదేశించాడు కాబోలు! పడినదానికంటే ఇక్కట్లు పడతానా? నాల్రోజులు కళ్లు మూసుకుంటే ఈ జీవిక తెల్లారదా? ఈ యోగి చెప్పినదే నాకు గురూపదేశం అనుకుంటాను. మా ఇంటి వాళ్లు లేవకముందే తిరిగి వెళ్లిపోతాను' అనుకుని, వెంటనే ఆ ప్రయత్నం మాని ఇంటికి వెళ్లాను. బుద్ధి ఎంతలో ఎలా మారిపోయిందో!? బుద్ధిః కర్మానుసారిణి అంటే ఇదే కాబోలు!

వర్తకుని ఇంట పూర్వం లాగానే నాకు విధించిన పనులు నేను నిర్వర్తించుకుంటూండగా, ఓ నాటి అర్ధరాత్రి దేవలుడు నేను నిద్రిస్తున్న గదిలోకి కత్తితో ప్రవేశించి నన్ను లేపి "ఇప్పుడు నాతో నువ్వు రతి క్రీడకు ఒప్పుకుంటావా? లేక ఈ కత్తితో నరికేయమంటావా?" అని అడిగాడు.

నేను భయంతో "దేవలుడు నన్ను చంపేస్తున్నాడో" అంటూ బిగ్గరగా అరిచాను. ఆ కేకలకు అతని తల్లిదండ్రులొచ్చి అతని రెక్కలు వెనిక్కిలాగి పట్టుకున్నారు. వాడు దురహంకారంతో "వదలండి! ఈ రండని చంపేస్తే కాని నా కోపం తీరదు" అంటూ పెనుగులాడసాగాడు. ఆ విసురులో వాడి చేతిలోని ఉన్న 'వాడి' గల కత్తి అతని కంఠానికి తగిలి తల తెగిపోయింది.

అప్పుడు దేవలుని తల్లిదండ్రులు ఎంతో శోకిస్తూ "నువ్వు మా కొంపతీశావు. నీ మూలంగా మా వంశం నాశనమైంది. నీకు పదివేల నమస్కారాలు. నీ ఇష్టమొచ్చిన చోటికి పో! మా ఇంట్లో ఉండకు" అంటూ నిందించారు.

అందుకు నేను "నన్నూరకే నిందించకండి! దేవలుని మరణానికి కారణం అతని దుర్బుద్ధే! మీ అనుమతి లేనిదే పోవడం దేనికి అని ఉండి, ఇప్పుడు మీరు చెప్పారు గనుక – ఇదే పోతున్నా!" అని నేను ఆ ఇంటినుండి బయటపడ్డాను.

నాకు ఇంకెక్కడికీ పోవడానికి ఇష్టంలేక, నేరుగా ఈ ఆలయానికి వచ్చి విజ్ఞానయోగిని ఆశ్రయించాను. ఆయన నన్ను తన శిష్యకోటిలో చేర్చుకున్నారు.

నిత్యం ఆ యోగిపుంగవుని బోధనామృతం వల్ల తృప్తిపొందుతూ, సాయంకాలాన ఈ తారకేశ్వరుని గురించి గానం చేస్తూ హాయిగా గడుపుతూన్నాను. భక్తురాలని పేరు పెట్టి నిత్యం స్వామిప్రసాదం నాకు ఇచ్చేట్లుగా ధర్మకర్తగారు ఆనతిచ్చారు. ఇదే నా వృత్తాంతం" అని చెప్పింది తిలోత్తమ.

మంత్రిరూపంలో ఉన్న చంద్రలేఖ, తిలోత్తమ అవస్థకు ఎంతో విచారిస్తూ, బలసింహుడు చేసిన కపటోపాయం ఫలితం గదా ఇదంతా అనుకుంటూ రహస్యంగా తిలోత్తమకు తన వృత్తాంతం చెప్పాలని నిశ్చయించి, కర్తవ్యం ఏమిటని ఆలోచిస్తున్న సమయంలో ద్వారపాలకుడు వచ్చి "అయ్యా! విదేశీ బ్రాహ్మణుడెవరో తమ దర్శనం కోసం ద్వారం దగ్గర వేచియున్నాడు. తమతోనే ఏదో మనవి చేసుకోవాలట! ప్రవేశపెట్టమంటారా?" అని అడగ్గా బ్రాహ్మణులకు అటువంటి అవసరమే లేదు. వారికి పూర్తి స్వేచ్ఛ ఉంది. వారెప్పుడైనా రావచ్చు" అంది.

అప్పుడా భటుడు, ఆ బ్రాహ్మణుని తీసుకొని వచ్చి మంత్రి ఎదుట వదలి "ప్రభువుల వారు వీరే" అని చూపించాడు. మంత్రికి ఆ బ్రాహ్మణుని చూడ్డంతోనే ముఖం వికసించింది. నమస్కరించి కూర్చోమని చెప్పి వారి రాకకు కారణం అడిగింది చంద్రలేఖ.

అప్పుడా బ్రాహ్మణుడా మంత్రిని ఆశీర్వదించి "అయ్యా! నా వృత్తాంతము వినండి. నా పేరు గౌతముడు. జగన్నాథం అనే ఊరు మాది.

రుచికుడు అనే నా మిత్రుడ్ని వెతుకుతూ బయల్దేరి ఎన్నెన్నో పట్టణాలు చూస్తూ ఢిల్లీ నగరానికి చేరుకున్నాను. అక్కడ దైవానుగ్రహం వల్ల నా మిత్రుడు కనిపించాడు. అతడ్ని వెంటబెట్టుకుని, అక్కడినుంచి బయలుదేరి నాలుగు రోజులు క్రిందట ఈ పట్టణాన్ని చేరుకున్నాను. ఇక్కడ్నుంచి మేము మా దేశానికి ఓడమీద పోవలసి వుంది. నేటి సాయంకాలం ఓడల్ని బయల్దేరదీస్తారట! విదేశీయుల్ని ఎక్కువగా పరీక్షిస్తే గాని ఆజ్ఞాపత్రికను ఇవ్వబోము అని మీ క్రింది అధికారులు చెప్తున్నారు.

మేము మా దేశం విడిచి చాలాకాలమైంది. ఎలాగైనా మా ప్రయాణం నిరాటంకంగా సాగేలా మీరు ఆజ్ఞాపత్రికలను ఇప్పించాలని ప్రార్థిస్తున్నాను. ఇదే నా కోరిక" అని చెప్పడం ముగించాడు.

అది విన్నాక మంత్రివేషంలో ఉన్న చంద్రలేఖ ఆశ్చర్యసాగరంలో మునిగి, కొంతసేపు ఒళ్లెరగనంత ఆనందంలో పడిపోయింది. "ఆహా! విధి లీల కాకుంటే ఇదేమి? కాలమే మంచి చెడ్డలను కూర్చగలదంటే ఇదే! ఓర్పుండాలే గాని దుఃఖాలు కలిగినట్లే సుఖాలు కూడా మనకు చేరువ కాగలవనడానికి ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి?" అని రకరకాలుగా అనుకుంటూ, తన సంతోషాన్ని అతి ప్రయత్నం మీద అణుచుకొంది.

"ఆర్యా! మీరు నేడే ఓడ ఎక్కి మీ దేశానికి వెళ్లదలచుకుంటే మిమ్ములను నేనే స్వయంగా పరీక్షిస్తాను. మీ మిత్రుని తీసుకొని మా ఇంటికి రండి! మీ నిమిత్తం కొంచెం ఆలస్యమైనా పడవ నిలిపేలా ఆజ్ఞఇవ్వగలను. బ్రాహ్మణులకు ఈపాటి ఉపకారం చేయడం అబ్బురం కాదు" అని తమ ఇల్లు ఆయనకు చూపించమని ఒక భటుని పంపింది.

భక్తురాలి వైపు చూసి "అమ్మా! నీ వృత్తాంతం వింటూంటే, ఎటువంటివారికైనా జాలి కలగకపోదు. నీవు చూస్తే రాచబిడ్డవు. ఇట్టి నీచ వృత్తి నీకేల? మీ తండ్రికి ఉత్తరం రాసి, నిన్ను మీ దేశానికి పంపేస్తాను" అని ధైర్యం చెప్పి "అంతవరకూ మా ఇంట అంతఃపురం స్త్రీలతో కలిసి ఉందువు గాని- రమ్ము" అని యుక్తి యుక్తంగా బోధించి ఒప్పించింది.

అప్పుడా మంత్రి తాను ఇంటికి పోతూ, ఆ భక్తురాలిని సగౌరవంగా తీసుకుని రమ్మని ఒక పరిచారికను పంపించింది. భక్తురాలు, మంత్రి తన పట్ల చూపిన అపూర్వమైన గౌరవాన్ని స్మరించుకుంటూ పల్లకీ ఎక్కి, వారి మేడకు పోయింది.

ఈ లోపల చంద్రలేఖ పురుష వేషం తీసేసి, మునుపటి చంద్రలేఖగా తయారై, అంతఃపురం నుంచి భక్తురాల్ని అక్కడికి రప్పించుకుంది. మంత్రి మేడలో ఆమెను అలా చూసిన తిలోత్తమ, ఆమె చంద్రలేఖ అంట నమ్మలేకపోయింది. ఆమె పోలికలున్న మంత్రి భార్య కాబోలు అనుకుంది. అదీగాక చంద్రలేఖ ఇక్కడికి ఎలా వస్తుంది? నన్ను వెతుక్కుంటూ ఏమైనా వచ్చిందా? అని రకరకాలుగా ఆలోచించసాగింది.

అట్టే నిలచిపోయిన తిలోత్తమను చూసి చంద్రలేఖ ఇక ఆగలేక "ప్రాణసఖీ! నన్నే మర్చిపోయావన్నమాట! పలకరించవేమి?" అని తానే లేచి సఖిని కౌగలించుకుంది.

ఇద్దరూ చిరకాల వియోగం వల్ల కలిగిన శోకాన్ని ఒకరితో ఒకరు పంచుకున్నారు. ఎంతో ఆశ్చర్యంగా తాము అక్కడెలా కలుసుకోవడం దైవం కూర్చిన ఘటనగా చెప్పుకుని సంతృప్తి పడ్డారు.

చంద్రలేఖ, తిలోత్తమకు తన వృత్తాంతం అంతా చెప్పి "సఖీ! మనకు ఇప్పుడు కాలం కూడా అనుకూలిస్తున్నది. విను!నీకు సంతోషం కలిగించే ఇంకో ఘటన జరగబోతోంది. అలనాడు నీ మేడకు వచ్చి నీతో క్రీడించి దూరదేశాల కేగిన నీ ప్రియపురుషుడు ఇక్కడకు వచ్చినట్లు తెలిసింది. కొద్దిసేపట్లో అతడ్నీ నీకు చూపించగలను. అతడి వృత్తాంతం పూర్తిగా కాకున్నా, కొంత తెలిసి ఉండీ నేను నీకు ఇంతకుమునుపు చెప్పలేదు. అతని చేతనే అంతా చెప్పిస్తాను' అని పలికింది.

చంద్రలేఖ ఇట్లా అంటూండగానే, విదేశీపురుషులు ఇద్దరొచ్చారంటూ ద్వారపాలిక రాగా, వారిని తీసుకునిరమ్మని ఆమెనే పంపింది.

అది వెళ్లి వెంటనే ఆ ఇద్దర్నీ లోపల ప్రవేశపెట్టింది. అయితే అప్పుడు గౌతముడు - రుచికుడు అందులో పురుషులెవరూ లేరనీ; స్త్రీలు మాత్రమే ఉన్నారనీ దూరం నుంచి చూసి దారి తప్పామేమో అనుకుంటూ ఆ అంతః పురంలో ఇంకోవైపు వెళ్లడానికి సిద్ధమవుతూంటే చంద్రలేఖ సఖి "అయ్యా! అటు కాదు...ఇటే! మిమ్మల్ని లోపలకు తీసుకురమ్మన్నది వారే"! అని చెప్పింది.

ఆ మాట విని వాళ్లు సంశయపడుతూనే, ఆ స్త్రీలున్న చోటకు వెళ్లారు. పూర్వం కంటే అద్భుత తేజస్సుతో మెరుస్తున్న రుచికుని చూసి చంద్రలేఖ - తిలోత్తమ ఆశ్చర్యపోతూ మాట్లాడాలని తత్తరపాటు పడుతూంటే, గౌతముడే ముందుగా చంద్రలేఖని గుర్తుపట్టాడు.

"ఇక్కడికి నువ్వు ఎప్పుడు వచ్చావు? నేను గౌతముడ్ని! నా మిత్రుడితడు. రుచికుడు. జ్ఞాపకం ఉందా?" అని అడిగేసరికి వారికి నమస్కరిస్తూ నిలబడింది చంద్రలేఖ. వాళ్లని కూర్చోమని చెప్పింది.

"గౌతమా! నువ్వు నన్ను గుర్తుపట్టగలవో లేవో అని మాట్లాడలేదు. పాపం! నువ్వీ రుచికుని గురించి చాలా శ్రమపడ్డావు. ఇతడు ఎక్కడ కనబడ్డాడు? విశేషాలేమిటి?" అని అడిగింది.

"చంద్రలేఖా! మా వృత్తాంతం చాలా ఉంది గానీ, నువ్వు ఈ పురానికి ఎప్పుడొచ్చావు? ఈ మంత్రిగారికీ - నీకూ ఏమిటి సంబంధం? నీ సంగతి చెప్పు ముందు" అని అడగ్గా, చంద్రలేఖ తాను జగన్నాథం విడిచి వచ్చింది మొదలు అప్పటివరకు జరిగిన కథంతా చెప్పింది. ఆ తరువాత "ఆర్యా! నీ మిత్రుని చరిత్రం ఇంద్రజాలంలా ఉంది. జగన్నాథంలో అంతర్ధానమై, రామచంద్ర నగరంలో తిలోత్తమను విరహం పాల్జేసి ఢిల్లీ నగరంలో నీకు కనపడ్డాడు. రెక్కలు కట్టుకొని తిరిగేవాళ్లకైనా ఇలా జరగడం సాధ్యం కాదేమో! మమ్మల్ని అతడు మర్చిపోయినా, మేము మాత్రం అతని కోసమే ఇన్ని పాట్లు పడుతున్నాం! ఇదిగో - ఈ చిన్నదెవరనుకుంటున్నావు? తిలోత్తమ అంటే ఈమెయే! ఇతనికోసమే జోగురాలు కూడా అయింది. సకాలంలో నేను కనబడకపోతే, అలా విరాగిణిగానే ఆమె బతుకు తెల్లవారిపోయేదేమో..!? సరే! దైవికంగా జరిగిందేదో జరిగింది. మీ

వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది" అని కూడా పలికిన చంద్రలేఖకు, రుచికుడు సమాధానంగా ఇలా అన్నాడు.

"చంద్రలేఖా! మీరు నా కోసం నిజంగానే పడరాని పాట్లు పడుతున్నారన్నది తేటతెల్లమవుతోంది. ఇందుకు మీకు నను కృతజ్ఞుడిని. నా వృత్తాంతం వినండి.....! ఆనాటి రాత్రి నీ ఉద్యానవనంలోకి వెళ్లి నువ్వు తలుపులు వేసేశాక, నేను నలుమూలలా చూస్తూ - ఇక్కడ క్రింద ఎక్కడ ఉన్నా భటులకు దొరికిపోతానేమో అని, దట్టంగా లతలు పెనవేసుకుని ఉన్న ఒక అశోక వృక్షాన్నెక్కి, దాని చిట్టచివరి కొమ్మల సందున ఆకు చాటు పిందెలా అణగి ఉన్నాను.

## జయంతుని కథ

ఇంతలో నాకు దగ్గరగా ఎవరో మాట్లాడుతున్నట్టు ధ్వని వినిపించేసరికి అదిరి పడి తలపైకెత్తి చూశాను. మెరుపుతీగల్లాటి కాంతులేవో ప్రోగై నామీద పడుతూన్నట్లు తోచింది. ఆశ్చర్యంగా నేను అదేమిటో పరిశీలిద్దామనుకొనే లోగానే, ఆ కాంతి పుంజం నేనున్న చెట్టుమీదకే వచ్చి అలా నిలబడింది. అప్పుడు నాకు అదొక దివ్యమైన బంగారు రథం అని అర్ధమైంది. ఆ రథంలోంచి నాకు మాటలు వినిపించిన మాటలను బట్టి అది దేవలోకానికి చెందినదని తెలిసింది. వారిలో పురుషుడిలా అన్నాడు.....

"తిలోత్తమా! వాయుదేవుని పుణ్యమా అని ప్రయాణానికి ఆటంకం కలిగితే కలిగింది గాని, అద్భుతమైన సువాసనలు వెదజల్లే పుష్పాలున్న ఈ తోటలో విడిది చేయించిన ఘనుడు కూడా అతడే కదా! ఈ తోట చూడు! నీ మాటల్ని అంతగా పట్టించుకోక వెళ్లిపోదామనుకున్నా గానీ - ఇక్కడికి రావడం మంచిదే అయింది. వేగం వెళ్లి నీకు నచ్చిన పువ్వులు కోసుకొని రా!" అనడంతో - ఒక స్త్రీ ఇలా బదులిచ్చింది.

"జయంతా! నేను ఎంతో సంతోషంగా ఇంతదూరం ఊరకే నిన్ను తీసుకొచ్చాననుకున్నావా? దీనిలోని అద్భుత సౌందర్యానికి నేనెంతో సంతృప్తి పొందాను. ఆహా! మన దేవలోకానికి ఏమీ తీసిపోని. పుష్పజాతులీ భూలోకపు తోటలోనూ ఉన్నాయే! అబ్బో! ఈ తోటలోకి నేను ఒంటరిగా పోగలనా? వెళ్లి తిరిగి రాగలనా? నువ్వు కూడా నాతో రా!" అంది.

"తిలోత్తమా! ఇది అర్ధరాత్రి. ఇంత రాత్రి ఎవరుంటారిక్కడ? ఇది మనుషులకు నిద్రాసమయం. నీకేం భయంలేదు. కావలసినన్ని పూలు నీకు నచ్చినట్లు కోసుకో! సర్లే! నేనూ వస్తా!" అని అతడు కూడా రథం దిగి ఆ స్త్రీ వెంట తోటలోకి వెళ్లాడు. ఆకాశగమనం గలవారు కనుక వారు నేలపై పాదం మోపకుండానే సంచరించసాగారు.

వారిద్దరూ ఇంద్రుడి పుత్రుడైన జయంతుడూ దేవలోక వేశ్య అయిన తిలోత్తమా అని నాకు అర్థమైంది. వారా తోటలో ఇంకో దిక్కుకు వెళ్లడం చూసి, సాహసించి నేను ఆ కొమ్మల మధ్య నుంచి రథం ఆపిన కొమ్మమీదికి ఎగబ్రాకాను. లోపల ఎలా ఉందో చూడాలన్న కుతూహలం కొద్దీ, అందులోకి జొరబడ్డాను. ఆ రథం రెండు భాగాలుగా ఉంది. ఒకటి మంటపం లాంటిది. అందులో రత్న స్తంభాలున్నాయి. ఇంకొకటి శయ్యామందిరం. అందులో చక్కని పడక, కొన్ని విశేష వింత వస్తువులు ఉన్నాయి.

నేను ఒక్కక్షణం ఆలోచించాను. ఎంతో అసాధ్యమైన, దివ్యరథం ఎవరి కంట పడనిది నా కంటపడింది. దీనిలో ప్రయాణించగల అవకాశం నిజంగా స్వప్నంలో కూడా దొరకదే! అటువంటిది వాస్తవంగా నాకు కళ్లెదుట రా - రమ్మని పిలుస్తున్నట్లుగా తోచింది. శయ్యా మందిర విభాగంలో వాళ్లు ఎక్కువకాలం గడుపుతారు కనుక, మొదట ఉన్న భాగంలోని రత్నకంబళాల మాటున ఒక చిత్ర ప్రతిమలాగ దాగున్నాను నేను. ఇంతలో కావలసినన్ని పూల కోసుకొని వాళ్ళిద్దరూ రథంలోకి వచ్చారు. అదేమి మహిమో తెలీదు కాని, ఆ రథం వాళ్లు ఎక్కగానే మర తిప్పినట్లుగా రివ్వున కదిలి, పైకి వాయువేగంతో నడవసాగింది. దానికి రెక్కల్లేవు. చక్రాలు లేవు. అయినా అది అలా నడుస్తోందంటే - దేవతా మహిమ కాక

ఇంకేమిటి?....ఇలా ఆలోచిస్తూ కొంతసేపు పోయాక భూలోకం వైపు చూశాను. ఇంకెక్కడి భూలోకం?అంతా అలుక్కుపోయినట్లుంది. తప్ప నాకేం కనబడలేదు. నేను ఒక స్తంభాన్ని పెనవేసుకుక్కూర్చున్నాను.

ఆ పువ్వుల సువాసనను ఆఘ్రాణిస్తూ తిలోత్తమ " మనోహరా! ఈ పుష్పాలెంత వింతగా ఉన్నాయో చూశావా? ఇవి మనలోకంలో ఉన్నాయా? మనుషులు మనకంటే తక్కువ వారంటారు కానీ వారికీ భోగ వస్తువులు చాలానే ఉన్నాయి. లేకపోతే వాళ్లకీ అద్భుతపుష్పాలు దేనికి? ఏమో! మనలాగే వాళ్ళూ సౌఖ్యాలనుభవిస్తారు కాబోలు!" అంది జయంతుడితో.

అప్పుడతడు "ప్రియా! నువ్వు చెప్తే నమ్మవు కానీ, వాళ్లలో రూపానికి రూపం - భోగానికి భోగం అన్నీ ఉన్నవాళ్లు; మనల్ని ఈ రెండిట్లోనూ మించిన వాళ్లూ ఎంతోమంది ఉన్నారు. ఇంత ఎందుకు? మీలోనిదే ఒకర్తె అయిన, ఊర్వశి భూలోక సుందరుడైన పురూరవుని వరించింది. అంతవరకేల? మా తండ్రి అహల్యని మోహించలేదా? ఈ రెండు ఉదాహరణలను బట్టి నువ్వే గ్రహించుకోవచ్చు! రూపంలో మనలను మించిన వారు భూలోకంలో ఉన్నారని, వాళ్లకీ- మనకీ ప్రధానమైన తేడా ఎక్కడ ఉన్నదంటే...వాళ్లకి ఆకలి దప్పులున్నాయి. మనకు లేవు. వారికి జరామరణాలున్నాయి. మనకు అవి లేవు. వాళ్లకు కష్టాలు - వ్యాధులు ఉన్నాయి. మనకు అవి లేవు. ఇన్ని మాటలేల? మన దేవలోకపు వృక్షజాతులన్నీ కొద్దిపాటి తేడాతో వివిధనామధేయాలతో, ఈ భూలోకంలోనూ అలరారుతున్నాయి. ఒక్క సంగీత వృక్షం మాత్రం భూలోకంలోలేదు. మిగిలిన వన్నీ ఉన్నాయి" అని వివరించాడు.

ఇలా వారు ఇష్టాగోష్ఠి వినోదంగా పోతూండగా, ఆ ప్రాంతాల్లో వడిగా పారిపోతూన్న సిద్ధులు - కింపురుషులనే జాతులవారికి ఒక సంవాదం సాగింది. దాని సారాంశం ప్రకారం....స్వర్గంలో గొప్ప అలజడిగా ఉందనీ, రక్తాక్షుడనే రాక్షసుడు స్వర్గం మీదకి దండెత్తగా వాడి సంగతి తెలిసిన ఇంద్రుడు, ఆ రక్కసునితో విరోధం పెట్టుకోక, అతడికి ఎదురేగి వినయంగా ప్రార్థించి నందనవనంలో విడిది చేయించాడనీ, అయినప్పటికీ వాడు

దుర్మదాంధత వల్ల ఇంద్రునితో కయ్యానికి కాలు దువ్వే ప్రయత్నమే చేశాడనీ, యుద్ధంలో ఇంద్రుడు ఓడిపోతూన్న తరుణంలో దేవతలంతా పారిపోతూన్నారనీ, తాము కూడా ఆ రాక్షస మూకల ధాటికి ఓర్వలేక ఇలా వచ్చేస్తున్నామనీ, ఇప్పుడు స్వర్గం వైపు ఎవ్వర్నీ వెళ్లొద్దని దార్లో కనపడిన వాళ్లందరికీ చెప్తున్నామనీ' కింపురుషులన్నారు.

అప్పుడా జయంతుడు మహాకోపంతో "తిలోత్తమా! నువ్వు ఇంటికి పద! నేనా క్రూర దానవుని - మా తండ్రిపై దండెత్తిన వాడ్ని రూపుమాపనిదే స్వర్గానికి రాను" అని ఆయుధాలు ధరించి విమానం దిగి ఎక్కడికో వెళ్లిపోయాడు.

ఆ విమానం తిన్నగా స్వర్గం దాపుల్లో ఉన్న నందనోద్యానం దగ్గర గల విమానశాలలోకి వెళ్లడంతో, దిగబోతూ తిలోత్తమ నన్ను చూసింది. ఆమె కూడా నన్ను ఆశ్చర్యంగా చూస్తూ "అయ్యా! తమరెవరు? ఈ విమానంలోకి ఎప్పుడు, ఎలా వచ్చారు? మీరు నివశించే లోకం ఏది? మీ వృత్తాంతం చెప్పండి" అని అడిగింది.

నేను కూడా కొంచెంసేపు చెప్పాలా? వద్దా? అని ఆలోచించి, నేను ఇప్పుడు చెప్పకపోయినా, దేవజాతులవారు దివ్యదృష్టితో ఎలాగైనా తెల్సుకోగలరు. దాచి ప్రయోజనం ఏమి? అనుకుంటూ "దేవకాంతా! మా కాపురం శ్రీజగన్నాథం. నన్ను రుచికుడంటారు. నేను ఆ స్వామి భక్తుడను. నిరంతరం నాదైన చిత్ర విచిత్ర పుష్పమాలికలు అల్లే నేర్పుతో అలాంటి హారాలు అల్లి స్వామివారిని అర్చిస్తుంటాను. ఇలా ఉంటే - నేను మొన్న స్వర్గ విషయాలన్నీ ఒక చోట పురాణంలో విని, ఎలాగైనా స్వర్గాన్ని చూడాలని వేడుకపడుతూ నిద్రపోయాను. భక్త సులభుడైన శ్రీ జగన్నాథస్వామి నాకు కలలో కనిపించి "వత్సా! నువ్వు చింతించకు! నీ కోరిక తీర్చగలను. రేపటి రాత్రి, ఈ ఊళ్లో ఉన్న చంద్రలేఖ అనే వేశ్యకు చెందిన అద్భుత వనం ఒకటి ఉంది గదా! అందు ఒక అశోక వృక్షాన్నెక్కి ఉండు! అక్కడికి దేవేంద్ర సుతుడు - తిలోత్తమలు స్వర్ణవిమానంలో విహారానికొస్తారు. నువ్వు అప్పుడా విమానం ఎక్కు. సరాసరి దేవలోకానికి చేరుకోగలవు. దేవ దానవ యుద్ధం

సంఘటిల్లేలా ఉంది. రాక్షసుల్ని తరుముతూ దేవతలు దానవలోకం వైపు వెళ్తారు. తిలోత్తమతో నీకు మైత్రి ఏర్పడుతుంది. ఆ కాంత ఏకాంతంగా నీకు స్వర్లోక విశేషాలన్నీ చూపిస్తుంది" అని చెప్పి అంతర్ధానం చెందాడు.

నేను ఆ వచన ప్రకారం చేసి, మీ లోకానికి వచ్చాను. స్వామివచనము అమోఘమూ - ఉల్లంఘించరానిదీ కదా! నీవు తిలోత్తమవే కావచ్చు! ఇక పైన జరగవలసిందంతా నీ వలనే కావలసి ఉంది" అని కొంత కల్పన జోడించి చెప్పాను. "సాక్షాత్ స్వామివారే ఆనతిచ్చినపుడు "నీవు విమానంలో ఎక్కి, ఎక్కడో నక్కి' కూర్చోవలసిన అవసరమేమున్నది? మా కళ్ల పడవచ్చు కదా!" అని కూడా ఆమె వితర్కించలేదు.

నా మాటలన్నీ యదార్థమే కాబోలు అనుకుని, భయభక్తి విశ్వాసాలు ముఖంలో కనిపిస్తుండగా "ఓ! అట్లాగా! స్వామి కార్యమంటే తప్పక ఆచరించి తీరవలసిందే! అని అందరికీ శిరోధార్యమే! కొంతసేపు ఈ వనంలో విహరిస్తూండండి! పట్టణంలో అలజడి ఎలా ఉందో, విశేషాలేమిటో తెలుసుకు వస్తా" అంటూ ఆమె అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

ఆ నందనవనంలో ఎవ్వరూలేరు. బహుశా రాక్షసభయం చేత కాబోలు కావలివారితో సహా అంతా వెళ్లిపోయారు. ఆ వనంలో నేను యధేచ్ఛగా విహరిస్తూ, కావలసిన పళ్లు తింటూ, సంగీత వృక్షాల ఆటలు వింటూ, కొన్ని పుష్పాలు కోసి నాదైన ప్రత్యేకతతో విచిత్రగతులతో కొన్ని పుష్పహారాలు అల్లాను. మానవులకే కాక దేవతలకు సైతం అవి ముచ్చటగొల్పగలవని ఆశ.

ఇంతలో తిలోత్తమ తిరిగొచ్చింది. "ఆర్యా! నేను పట్టణమంతా కలియదిరిగాను. రాక్షసభీతి వల్ల తలుపులన్నీ మూయబడి ఉన్నాయి. ఈ పట్టణమంతా యంత్రనిర్మాణ విరాజితం. ఇంకొక కీలు త్రిప్పితే మార్గాలన్నీ కనిపిస్తాయి. ప్రతీ ఇంటికీ ఇంకో రహస్య మార్గం ఉంది. అవి మాకు తప్ప ఇతరులకు తెలియవు. నీకు ఆ విశేషాలు చూపిస్తాను - రా!" అని చెప్తూనే నేను కట్టిన దండలు చూసి ఆశ్చర్యపడింది. నా ఆశ వమ్ముకాలేదు. ఆ

దండలు ఆ మానిని మనస్సును ఆకర్షించాయి. లోకమేదైనా స్త్రీ జాతికీ పుష్పాలపై మక్కువ ఒక్కటే కదా. అన్పించింది నాకు.

నేను నందనవనంలో విహరించింది అతికొద్ది భాగం మాత్రమే! నిజానికి ఆ వనంలో నేను చూడని విశేషాలు చాలా ఉన్నాయి. అందుకని మొదట తిలోత్తమ నాకా నందనోద్యాన విశేషాలు చూపించసాగింది.

చంద్రలేఖా! ఆ వనంలో విశేషాలన్నీ చెప్పడానికి నా తరమా? ఆహా! ఆ పూల సువాసనలు నేను ఆఘ్రాణించి, ఇప్పటికీ తల్చుకుంటూంటే ఏదో చెప్పరాని మైమరపు. ఆ తోట స్వర్గపట్టణానికి తూర్పుగా ఉంది. అందులో మొదట విమానశాలలు, తర్వాత చిత్రశాలలు, ఆపైన విహారశాలలు, ఆ వెనుకనే రత్నశాలలు, మధ్య మధ్య ఎన్నో చిత్రవిచిత్ర శాలలు ఉన్నాయి. ఫల-పుష్ప జాతులు ఎక్కడికక్కడ కొత్తవే ఉన్నాయి తప్ప, ఒకచోట కనిపించింది - ఇంకోచోట కనిపించడం లేదు.

ఆ తోటలో పోతూంటే, జలయంత్రాలు చిమ్మే నీటితుంపర్లకు ఒక వైపు వర్షాకాలంలో తడిసినట్లు దేహం తడిసిపోయింది. ఒకవైపు మంచుబిందువులు పూలతేనెలతో కలిసి పన్నీరు చిలికినట్లుగా తోచింది. ఒకచోట వసంతకాలపు పిల్లగాలులు మనస్సును సేదతీర్చాయి. ఆరు రుతువులూ ఏకకాలంలో అక్కడే ఉన్నాయా? అన్పించసాగింది. ఆ తోటలో ఎంతోసేపు తిరిగినప్పటికీ, దాని తుదీ మొదలూ నాకు కనిపించింది కాదు.

అంతకుముందు రక్కసుల దండు వెడలగా, పొదలమాటున దాగిన వనమాలి స్త్రీలు తిలోత్తమను చూసి ధైర్యంగా బయటకొచ్చారు. కాని నన్ను చూసి సంకోచంతో చేసైగలో నేనెవ్వరని తిలోత్తమను అడగ్గా, ఆమె "రక్కసులు ఎక్కడికిపోయారో ఏమోగాని, ఇతడొక పుణ్యపురుషుడు. మన ప్రభువుల వారు రాక్షసుల్ని తరుముతూ వెళ్లారట. మీకేం భయం లేదు" అంటూ చెప్పేసరికి, వారు జయజయ ధ్వానాలు చేశారు.

తరువాత మరికొన్ని విశేషాలు చూసి, ఒక వృక్షం దగ్గర నిల్చి నేను ప్రశ్నించగా "ఆర్యా! ఇదే సంగీతవృక్షం. ఇది వైణిక బృందం పాట

పాడినట్లుగా పాడుతుంది. గాలివీచిన కొద్దీ రాగాలు పలుకుతాయి. మా లోకంలోని గొప్ప విశేషం ఇది" అని చెప్పింది తిలోత్తమ.

"దీనికి బీజం ఏమిటి? వృద్ధి చెందించే విధానం ఏమిటి? భూలోకంలో పాతితే బ్రతుకుతుందా?" అని అడిగాను.

ఆమె కొంచెం ఆలోచించి "ఈ చెట్టు పూర్వం కైలాసంలో ఉండేదట! శివుణ్ణి ప్రార్థించి విష్ణువు తన లోకానికి తెచ్చుకున్నాడు. అక్కడ్నుంచి బ్రహ్మ, ఇంద్రాదులు విస్తరింపజేశారు." అని చెప్పి నన్ను పట్టణంలోనికి తీసుకెళ్ళిపోయింది. మరిన్ని వివరాలు నేనే అడగడానికి అవకాశం ఇవ్వకుండా.

ఆ పట్టణ శోభ ఏమని వివరించను? మణులతో ప్రకాశిస్తున్న మేడలెన్నెన్నో! అక్కడి రాళ్లు కూడా రత్నాలేకాబోలు! రాజవీధులు కాని వేవీ లేవు.

ఆ వింతలు చూస్తూ నేను ఆశ్చర్యపోతూంటే, తిలోత్తమ నవ్వి "అక్కడే ఆగిపోయావేం? నాతోపాటు రావా?" అని అడిగింది.

"నీకూ - నాకూ మధ్య ప్రవాహం ఉంది. ఎలా దాటడం?" అన్నాను.

"అది ప్రవాహం కాదు. మణికాంతుల సమూహం" అందామె. "తిలోత్తమా! నీకు పుణ్యం ఉంటుంది గాని, నా చెయ్యి వదలకు, కొద్ది ఎడమైనా నాకు నువ్వు కనబడకపోతావు కాబోలు" అని బ్రతిమిలాడాను.

అక్కడ మేడలమీద ఉన్నవారు దేవకాంతలు అనుకున్నాను. కాదట! వారు సాలభంజికలట! నాకు అంతా ఆశ్చర్యంగా ఉంది.

"అది ఇంద్రుని మేడ. దానికి దగ్గర్లో ఉన్నది శచీదేవిది. ఆ పక్కనున్నది..... అదే ఇంద్రసుతుడు జయంతునిది. దానికి తూర్పున 'సుధర్మ' అనే దేవసభ ఉంది....." ఇలా ఒక్కొక్కటే చూపించి "రా! ఇక మా ఇంటికెళ్దాం!" అంది. అంతలో ఆమె ఇల్లు సమీపించాం!

తిలోత్తమ నన్నొక గదిలోనికి తీసుకెళ్లింది. దాంట్లో వస్తువులు అలంకారాలు వర్ణించడానికి ఒక్క ఏడాది చాలదు. నేనా గదిలోని విశేషాలను తిలకిస్తూండగా, తిలోత్తమ జగదేకమోహనంగా అలంకరించుకుని నా శయ్య దగ్గరకొచ్చి నిల్చింది. మొదట ఆమెను చూసి ఇంకెవరో అనుకున్నానంటే నమ్ము! అంత మార్పొచ్చింది- ఆమెకా అలంకారాలతో నేనైతే చూపులు మరల్చుకోలేకపోయాను.

"ఆర్యా! నువ్విప్పుడు మాకు అతిథివి! పైగా హరిభక్తుడివి. నిన్ను అర్చించవలసిన విధి మాకుంది. నా సపర్య లందుకో!" అంటూ మొట్టమొదట ఆమె దేవచందనం నా మేనుకు పూసింది. ఆ చందన పరిమళాన్ని నేనేమని స్తుతించను? తర్వాత ఒక మందార మాల తెచ్చి నాకు వేసింది. నా వొళ్లు పులకరించింది. మనస్సులో చెలరేగిన శృంగార భావాలను అదుపుచేసుకోలేకపోయాను.

అప్పుడు నేను "నీ సపర్యలకు నాకెంతో ఆనందం కలిగింది. నీవు దేవకన్యవు.నీ అర్చనలు స్వీకరించి నేను ఊరకే ఉండకూడదు. ప్రత్యర్చన చేయాలి. ఆ గిన్నె ఇవ్వు" అని దివ్యచందనం ఉన్న పాత్రను అందుకుని నేను ఆ సుకుమారి దేహానికి శృంగారభావాలుదయించే అవయవాలకు పూశాను. ఆమె అడ్డు చెప్పలేదు. ఇద్దరి మనసుల్లోను మదన భావాలుదయించాయి. నేను గౌతమునితో కూడ కొన్ని శృంగార ప్రబంధాలను చదివి వున్నవాడిని. ఆమె పులకరింతలు కనిపెట్టి, కళాస్థానాలు స్పృశిస్తూనే నెమ్మదిగా ఆమెని శయ్యమీదికి వాల్చాను. ఇక తర్వాత చెప్పవలసిందేమిటో, నీకు చెప్పనక్కర్లేదు. నువ్వే గ్రహించుకోగలవు.

**శ్లో ॥ తన్మయఃకి మహంధాబాలా మన్మయా కిముభావపి।**

**కియానంద మయావే తి న విజ్ఞాతం మయా తథా॥**

అప్పుడు మేమిద్దరం తనువులు మరిచి తన్మయభావం చెందుతూ, ఒకరిలో ఒకరం ఒదిగిపోతూ, మేము అనుభవించిన ఆనందం....ఓహో! అది చెప్పనలవి కానిది.

దేవకన్యలలోనే అగ్రగణ్య అనదగ్గ తిలోత్తమ సౌందర్యం - చాతుర్యం - లావణ్యం- యవ్వనం- మదన కళా ప్రతిభ...మనోహరాలని వేరేగా చెప్పాలా? ఆమెతో సంభోగసౌఖ్యం ఎంతకాలం అనుభవించానో చెప్పలేను. గడియలాగనైనా తోచలేదు. కాని ఇంద్రుడొచ్చి, నా కపటం గ్రహించి నన్ను శిక్షిస్తాడేమో అని నాకు మనస్సులో పీకుతూనే ఉంది.

తిలోత్తమకు కూడ నా వల్ల అపారమైన సుఖం లభించే ఉండాలి. ఆమె నా పట్ల అనురాగబద్ధ అయి, నేను కోరిన వెంటనే నాకు అనితర అలభ్య దర్శనమైన దేవసభ చూపించడానికి సిద్ధపడింది.

అప్పటికింకా దేవేంద్రుని గురించి సమాచారమేమీ లేదు. పట్టణంలో అలజడి ఇంకా అలాగే ఉంది. అప్పుడామె నన్నొక రహస్య స్థలానికి తీసుకుపోయి, ఒక మర తిప్పేసరికి దేవసభకు దారితీసే ఒక తలుపు తెరవబడింది. ఆ మార్గం ద్వారా లోపలికెళ్లాం! అదొక గుహలా ఉంది. కాని రత్నకాంతుల వల్ల చీకటి ఎంత మాత్రం లేదు. సరాసరి ఆ దారి వెంటపోగా దేవసభాభవనం కన్పడింది.

అయితే- ఆ దారి ఇంద్రసింహాసనం వెనక్కు మమ్మల్ని తీసుకెళ్లింది. ఆ సభాభవన విశేషాలు వివరించసాధ్యంకాదు. అయినా నాకు తోచిన రీతిలో చెప్తాను.

తూర్పు దిక్కున చింతామణి అనే పేరుగల ఇంద్రసింహాసనం ఉంది. అది రత్నఖచితమైంది. దానికి రెండు పక్కలా ఎన్నో రత్న పీఠాలు- ఉత్తర దక్షిణ భాగాలలో దేవతలు కూర్చునే పీఠాలు. ఎదురుగా రంభాదులు నాట్యం చేసే రంగస్థలం. అది అతిచక్కగా అలంకరించబడి ఉంది. దిక్పాలకులు, మహర్షులు, బృహస్పతి ఇంద్రుడికి దగ్గరలో కూర్చుంటారట!

ఇంతలో రహస్య ద్వారంలో ఎవరివో మాటలు వినిపించేసరికి, చింతామణి పీఠం వెనక్కు, భయపడుతూ నన్ను లాక్కుపోయిందామె.

మేము ఆ దేవ రహస్య ద్వారానికి దగ్గరగానే ఉండటంతో మాకు ఆ మాటలు విన్పించాయి. వాటి సారాంశం చెప్తాను. విను!

మేము లోపలికి వచ్చిన ఆ రహస్య ద్వారాన్ని కాపలా కాసేవాడి పేరు నందుడు. ఇంద్రుడతడ్ని ఎప్పుడూ అక్కడే ఉండమన్నాడు. అయితే సురాపానం చేసిన మత్తులో అతడు అట్నుంచటే తనకు బాగా కావలసిన ప్రియురాలి నెవతినో మరిగి ఆమెతో రతికేళి జరిపి అక్కడికి వెళ్లకుండా గడిపేశాడు. ఆ సంగతి విజయుడనే వాడికి తెలిసింది. ఈ విషయం ప్రభువునకు తెలిస్తే శిక్షిస్తాడని భయపడి, ఆ సంగతి గుప్తంగా ఉంచమని విజయుడిని బ్రతిమాలుకోసాగాడు నందుడు. మేము ఆ రహస్యద్వారానికి మరీ చేరువగా ఉండడం వల్ల వాళ్ల ప్రతిమాటా మాకు స్పష్టంగా వినిపిస్తోంది.

రాక్షసుడితో యుద్ధంలో దేవేంద్రుడు గెలిచాడనీ, అది శత్రువుల పని అయి ఉండదనీ, ద్వారం మూయడం తామే మర్చిపోయి ఉండవచ్చుననీ, శ్రీ హరి సహాయం వల్ల విజయం చేకూరిందనీ, దిగ్విజయ విశేషాలు చెప్పడానికీ పూట సభ ఏర్పాటు చేస్తాడనీ, అన్నీ సిద్ధంగా ఉంచాలని, పీఠాలు చక్కగా అమర్చాలనీ వాళ్లు సంభాషించుకొని, ఆ ప్రయత్నంలో పడ్డాం. ప్రధాన ద్వారం తెరిచారు.

నేనూ, తిలోత్తమ ఒక పెట్టె వెనుకదాగి కూర్చున్నాం! భేరీధ్వనులు మిన్నంటాయి. మేము ఎవరికీ కనబడటం లేదు. ఇంద్రుడొచ్చాడు. మాకు అంతా కన్పిస్తున్నారు. నన్ను నిర్భయంగా ఉండమంది తిలోత్తమ.

## ఇంద్రుని కథ

పిమ్మట ఇంద్రుడు తను సింహాసనం అలంకరించాడు. తరువాత దేవతలు, మునులు వారి వారి స్థానాలు అలంకరించారు.

అప్పుడు - బృహస్పతి లేచి ఆ రాక్షసుని విశేషాలు కొన్ని చెప్పి, జయంతుడు అతడ్ని ఎలా ఓడించిందీ ఆ పరాక్రమ వైభవం ప్రశంసించాడు. ఆ తర్వాత కొందరు తమకు తోచినరీతిగా సురపతిని గురించి ఉపన్యసించారు. తదుపరి రంభాదుల నాట్యం సాగింది. ఇంద్రుడు తన విజయం గురించి వివరించి, దేవతలలో పరాక్రమం చూపిన వారికీ- యుద్ధంలో సహకరించిన వారికీ కానుకలిచ్చాడు.

ఎవరికి వారు తమ నివాసాలకు పోయినా, సభాద్వారం మూసి వేయకుండా కాపలాదారులు విచ్చుకత్తులతో పహరా కాయసాగారు. ఇక ఆ దారిన పోవడానికి మాకు వీల్లేకపోయింది.

తిలోత్తమ చాలారకాలుగా ఆలోచించి, కాపలావాళ్లకు కన్పించకుండా రహస్యద్వారం దాకా నన్ను తీసుకువెళ్లింది. అంతకుముందే మేం వచ్చిన ద్వారాన్ని నందుడు-విజయుడు లోపలివైపు బిగించి తాళం వేశారు.

దాంతో ఆమె చాలా భయపడింది. ఈ ద్వారానికి తాళం వేసేశారు. ఇక మనకు బ్రతుకు లేదు. ఇంకో దారిన వెళ్లడం మన తరం కాదు. పెద్దగుమ్మంలోంచి ఇంద్రుని అనుమతి లేకుండా రాకపోకలు సాగించడం అసాధ్యం. ఇప్పుడు మనని చూస్తే అనుమానిస్తారు. అవతలికి పోవడానికి నీక్కూడా సాధ్యం కాదు. ఇక్కడ ఎన్నాళ్లు ఉంటాం?

ఈ సభలోకి వచ్చేవాళ్లకీ- పోయేవాళ్లకీ లెక్క ఉంటుంది. ఈ మార్గంలో నేను వెళ్తే లోపలికెలా వెళ్లావని అడగకపోరు. ఏం చెప్పగలను? అని ఎన్నో విధాల ఆలోచిస్తూ, అంతలో కళ్లు తెరిచింది.

“ఆః! జ్ఞాపకం వచ్చింది. రుచికా! మనకో అవకాశం ఉంది. రాబోయే శుక్రవారం ఇక్కడ శ్రీ పుష్పయాగం అనే గొప్ప ఉత్సవం చేస్తారు. ఆ రాత్రి ఈ సభలో ‘పార్వతీ పరిణయం’ అనే నాటకం వేస్తారు. అప్పుడు చాలా సమ్మర్ధంగా ఉంటుంది. ఆ సందట్లో మనం దాటిపోవచ్చు!” అని మళ్లీ అంతలోనే, “కాని, నాకో చిక్కొచ్చి పడిందే! ఆ నాటకం బృహస్పతి రచన. అందులో నాకు ఒక వేషం ఉంది. పార్వతి వేషం ఊర్వశి వేస్తోంది. నేను ఆమె చెలికత్తె జయ వేషం వెయ్యాలి. ఆ నాటకంలో వేషధారులంతా రేపు రాత్రి బృహస్పతి గారింటికి వెళ్లాలి. అప్పుడు నా సంగతి బయటపడి పోగలదు. దీనికేది సాధనం?” అని ఆమె ఆలోచనలో పడింది.

తిలోత్తమ అధైర్యం చూసి నాకు భయం వేసింది. మనస్సులోనే జగన్నాధస్వామిని ధ్యానించసాగాను. ఆమెకైతే దుఃఖంలో ఒళ్లు తెలీడం లేదు. నేను ఇంద్రసభ చూస్తాను అనబట్టి కదా- ఆమె నాకోసం రాచమార్గాన రాక, పెరటి ద్వారాన వచ్చి అనవసరంగా నా కోసం ఇరుక్కుపోయింది..... అని నాకు ఇంకా విచారం అధికమైంది.

నాకు ఆకలిగా ఉండడంతో, అక్కడ అలంకారంగా కట్టబడిన పళ్లు తిన్నాను. తిలోత్తమకు ఈ బాధ లేదు. ఆ రోజు మొత్తం విచారంగానే గడిచింది.

మరునాడు మేము అలా భయ-విచారాల్తో ఉండగా పెద్ద భేరీ ధ్వని వినిపించింది. అది విని "ఇంద్రుడు సభ చేస్తున్నాడు. అంటే ఏదో కారణముండి ఉంటుంది. ఎంతో ముఖ్యమైన పని ఉంటే తప్ప ఇలా సమయం కాని సమయంలో సభ చేయరు. ఇప్పుడేం చెప్పుకుంటారో మనం వినవచ్చు! తలమాత్రం పైకెత్తకు" అని హెచ్చరించింది.

ఇంద్రుడు, బృహస్పతి, దేవతలు విచారపుముఖాల్తో సభలోని కడుగుపెట్టారు. రంభా ఊర్వశులు కూడా వచ్చినా నాట్యాలేం లేక నిశ్శబ్ధంగా నిలబడ్డారు. అప్పుడు ఇంద్రుడు "రక్తాక్షుడి కొడుకు విరూపాక్షుడు మొన్న యద్ధంలో ఓడి పారిపోయినవాడు, మళ్లీ సేనల్ని సమకూర్చుకొని మన పట్టణాన్ని ముట్టడించ రానున్నట్లు వదంతి పుట్టింది. మనం ఉత్సవ సన్నాహాల్లో ఉండగా దెబ్బతీస్తే ప్రమాదం. కనుక నిజానిజాలు తెలుసుకోవలసిందిగా గూఢచారుల్ని పంపాను. కనుక ఈ తరుణంలో మనం చేయవలసిన శ్రీ పుష్పయాగం చెయ్యడమా? మానడమా అని ఆలోచన.

"దేవేంద్రా! విరూపాక్షుడు చాలా బలవంతుడు. కనుక నిజంగానే అటువంటి ప్రయత్నం చేసినా ఆశ్చర్యం లేదు. అది వదంతి అని తీసిపారేయలేం! మన ప్రయత్నంలో మనం ఉండాల్సిందే! ఉత్సవం ఇప్పుడు కాకపోతే, ఇంకో సమయంలో చేసుకోవచ్చు! ఆ సలహా అందరికీ నచ్చింది.

"స్వర్గపు వాకిళ్లు అన్నీ మూసి ఉంచండి! సైన్యం అంతా స్వర్గం చుట్టూ మోహరించండి" అని చెప్పి ఇంద్రుడు సభ చాలించాడు.

ద్వారపాలకులు సింహద్వారం మూసి, రహస్య ద్వారం దగ్గరకు వచ్చారు. అప్పుడు తిలోత్తమ సంతోషిస్తూ విరూపాక్షుడి బెడద వల్ల మనం ఇక్కడ్నుంచి తప్పుకోవచ్చు! రహస్యద్వారం తాళం తెరుస్తారు ఇప్పుడు.

సింహద్వారం మూసేశారు కదా! కాని, కాపలావాడుంటాడు కదా! నేను వాడిని ఏదోలా మాటల్లో పెట్టి దూరం తీసుకుపోగానే, నువ్వు గోడచాటున నిల్చో! తర్వాత నేను వచ్చి నిన్ను తీసుకుపోతాను" అంది.

ఇంతలో ఆమె ఒక చోట తడిమి, ఒక మర త్రిప్పగా తటాల్న ద్వారం తెరుచుకుంది. అక్కడున్న నందుడు "ఎవరు వారు?" అని కేకేశాడు.

"నందా! నేను తిలోత్తమని! నన్ను లోపల పెట్టి తలుపులు వేశావేం? చూడలేదా?" అంది.

"నువ్వు ముందుగా సభలోకి వెళ్లావా ఏమిటి? నేను చూడలేదే? నువ్వు కనబడలేదని అందరూ చెప్పుకుంటున్నారు" అని వాడు అడగ్గా, తిలోత్తమ రక్కున మాట మార్చేసింది.

"నందా! నీ భార్య కుశలమా? దానికీ - నాకూ స్నేహం. నీతో ఎప్పుడైనా నా గురించి ప్రస్తావిస్తుందా? నాకు నువ్వు వరసకు బావవవుతావు. మా అక్కను అడిగానని చెప్పు! ఇంకో రహస్యం ఉంది. చెవిలో చెప్పాలి. ఇలా రా! ఎవరికీ చెప్పవు కదా! " అని కొంత దూరం సాగింది.

"ఏమిటా రహస్యం?" అంటూ వాడు ఆమె దగ్గరకు వెళ్లాడు. ఏదో చెప్తూన్నట్లు అభినయిస్తూ ఆమె వాడిని మెల్లగా దూరంగా తీసుకుపోయింది.

వాడు అటు వెళ్లగానే నేను వెంటనే బయటకొచ్చి, ఆమె సూచించిన గోడ వెనుక దాగి వున్నాను.

ఆమె వాడికి ఏ చెప్పిందో కాని, వాడు ఆ ద్వారం మూసేసి ఏదో ఆలోచించుకుంటూ తనలో తనే పొంగిపోసాగాడు. ఆమె మళ్లీ అటువైపు వచ్చి "ఈ గుమ్మం చాలా భద్రంగా కాపాడు" అని చెప్పి, గోడ మలుపులో ఉన్న నా దగ్గరకొచ్చి నన్ను వెంటబెట్టుకుని రహస్యంగా ఇల్లు చేరింది.

అప్పుడు మాకు చావు తప్పించుకున్నంత ఆనందం కలిగింది.

తాను అక్కడ్నుంచి వెళ్లాక ఏం జరిగింధని చెలికత్తెల నడిగింది. తిలోత్తమ.

"నువ్వు వెళ్లాక మొదట జయంతుడు వర్తమానం పంపాడు. తిలోత్తమ క్షేమంగా ఇల్లు చేరిందా' అని మేం చెప్పాం! ఆయన తర్వాత దేవగురువుల వారు పంపగా రంభ వచ్చింది" అన్నారు చెలులు.

"ఆమెకేం చెప్పారు?" ఆతృతగా అడిగింది తిలోత్తమ.

"ఇంట్లో లేదు. ఎక్కడికెళ్లిందీ తెలీదు అన్నాం! తర్వాత ఇంద్రుల వారు కబురుపంపారు. బృహస్పతులవారు కూడా చాలా కోపం చేశారట! ఈ లోగా విరూపాక్షుడి గొడవలో నీ విషయం అడుగునపడిపోయింది.

అది విని తిలోత్తమ విచారంగా నన్ను తన అంతఃపురంలోకి తీసుకుపోయింది. ఎవరి సమస్యలు వారికుంటాయి గదా! కానీ - తిలోత్తమకు సమస్యలు నావల్లనే వచ్చాయి. అంతలో వీధిలో ఏదో చాటింపు వినబడింది. పరిచారికలు అది తెలుసుకుని వచ్చి, "విరూపాక్షుని గురించి వచ్చిన వార్తలన్నీ అసత్యాలట! రేపు యధావిధిగా పుష్పయాగోత్సవం జరిపించబడుతుందనీ -పురమార్గాలు అన్నీ తెరవబడతాయనీ - అందరూ స్వేచ్ఛగా సంచరించవచ్చుననీ చాటిస్తున్నారు" అని చెప్పారు.

అది వినడంతోనే "అయితే నాటకం జరుగుతుంది. ఎక్కడికి పోయావని అడిగితే, ఏం చెప్పాలి?" అంటూ నా దగ్గర కూర్చుని ఆలోచిస్తూంటే ఒక చెలికత్తె వచ్చి "జయంతుడొస్తున్నాడు" అంది.

ఆ మాటకు తిలోత్తమ తుళ్లిపడి, నన్నో మూలదాచి, అతడికెదురేగి స్వాగతం చెప్పింది. "తిలోత్తమా! ఇన్నాళ్లూ ఎక్కడికి పోయావు? పార్వతీ పరిణయం' నాటకంలో నీదో పాత్ర ఉందట! దాన్ని సరిచూసుకోడానికి నువ్వు బృహస్పతి గారింటికి పోలేదట! ఆయనకు కోపం వచ్చింది. మా తండ్రి గారితో కూడ అదే మాట అన్నారు...."అని కొద్దిసేపు తిలోత్తమ సమాధానం కోసం చూసి "అది సరే! నేను హడావుడిగా వెళ్లిపోయాక నువ్వేం చేశావు?" అని అడిగాడు.

"జయంతా! నా వృత్తాంతం ఏమని చెప్పేది? నువ్వు నన్ను అలా దారిమధ్యలో వదిలేసి, దేవేంద్రుల వారి సహాయార్థం వెళ్లిపోయాక, అక్కడ

నన్నో రాక్షసుడు బలాత్కారంగా లాక్కుపోయాడు.....” అంటూ ప్రారంభించి, అతికేలాగ అందమైన అబద్ధం చెప్పి “ఎలాగో వాడ్ని వదిలించుకుని ఇల్లు చేరుకునేసరికి, అప్పటికే నా కోసం రెండు వర్తమానాలూ - బృహస్పతి గారూ, తమ తండ్రిగారూ పంపినవి కాబోలు! వారు కోపగిస్తే నేనేం చేయగలను?” అంది దీనంగా. “ఔరా! ఏమి ఈమె సమయస్ఫూర్తి?” అని నేను ఆశ్చర్యపోయాను. జయంతుడు “సర్లే! నువ్వు క్షేమంగా ఇల్లు చేరావు. అంతే చాలు! అన్నట్టు నా సంగతి తండ్రిగారికి తెలీనివ్వకు” అనేసి అతడటువెళ్లి పోగానే, రంభా ఊర్వశులు వచ్చారు. “ఏమే! ఈ రాత్రి నాటకంలోకి వస్తావా? నీ వేషం ఇంకొకరు వెయ్యలేరు. దిక్పాలకులంతా వస్తారట! చక్కగా ప్రదర్శించాలి” అంటూన్నారు. నేను రంభా ఊర్వశుల సౌందర్యం కళ్లారా పరికించాను. వాళ్లని చూసేసరికి నా జన్మ ధన్యమైనట్లే అనిపించింది.

పరిచారిక వచ్చి “ఇంద్రుల వారి దూత నిన్ను తీసుకెళ్లడానికి వచ్చి వాకిట నిలిచాడు” అంది. తిలోత్తమ రంభా ఊర్వశుల్ని సాగనంపి, “నేను రాత్రి తప్పకుండా నాటకంలో పాల్గొంటాను. మీరు పదండి! ఇదుగో, దేవేంద్రులవారి నుంచి వర్తమానం. అక్కడి కెళ్లాలి” అంటూ హడావుడి పడసాగింది. నిజానికి ఆమెకు నన్నొదిలి వెళ్లాలని లేదు. కానీ తప్పదు.

నా దగ్గరకొచ్చి “నువ్వు అంతా వింటున్నావు కదా! నేను ఇంద్రుడి దగ్గరికెళ్లొస్తా! ఇక్కడే ఉండు ! ఎవరూ రాకుండా తాళం వేసేస్తాను. నీకేం భయం లేదు” అంటూ వెళ్లిపోయింది.

ఆమెలేని ప్రతి నిమిషం ఒక్కో యుగంలా తోచింది నాకు.

ఇంతలో ఆమె వచ్చింది. జయంతుని వల్ల నా వార్త విని ఇంద్రుడు సానుభూతి చూపించడానికే పిలిచాడు. రాక్షసుని వల్ల ఏమీ ప్రమాదం జరగనందుకు ఆనందించాడు. రాత్రి నాటకంలోనికి వెళ్లవలసిందనీ చెప్పాడు. గండం గడిచిందనుకున్నాను. కాని గట్టి చిక్కే వచ్చింది.” అని ఆమె ఆగింది.

“ఏమిటి?” అని అడిగాను ఆతృతగా.

మేము మాట్లాడుతూంటే విజయుడనే ద్వారపాలకుడు వచ్చి, "సభను అలంకరిస్తుండగా చింతామణి పీఠం వెనుక ఈ కాగితం దొరికింది. దీన్లో ఉన్నది దేవ లిపి కాదు. మనుష్య లిపిలా ఉంది. ఇలాంటిది సభలోకి ఎలా వచ్చిందీ అన్నది దేవర వారే శోధించాలి...."అంటూ ఒక కాగితం అందించాడు. సకలభాషలూ తెలిసిన దేవేంద్రుడు అది చదివి "పూలదండకోసం ఎవరో రాసినట్లున్న ఉత్తరం ఇది. ఈ రుచికుడెవరు? ఎక్కడి శ్రీ జగన్నాథం? ఈ ఉత్తరం సభలో ఉండడం చిత్రంగా ఉందే!" అని రెండో ద్వారపాలకుడైన నందుడికీ - బృహస్పతి వారికీ తక్షణం రమ్మని కబురంపాడు.

నేను భయపడి, ఇంద్రుడి దగ్గర శెలవు పుచ్చుకొని వచ్చేశాను. ఆ ఉత్తరం నువ్వు అక్కడ మర్చిపోయి ఉంటావు. నందుడ్ని నిర్బంధించి అడిగితే, నా సంగతీ - దాని ద్వారా మన గుట్టూ బయటపడొచ్చు! ఇంక నువ్విక్కడుంటే ప్రమాదమే! నిన్ను భూలోకం చేరుస్తాను. నువ్వు సుఖంగా ఉంటే చాలు! నేను నీకొక మేలు చేస్తాను. భూలోకంలో నా పేరేగల ఒక రాజకుమార్తె ఉంది. రూపలావణ్యాలన్నీ నావే! సామాన్యుడిని పెళ్లాడదట! దివ్యపురుషుడైతేనే ఆమెకు కావాలట! మొన్నటి ప్రయాణంలో ఆమె గురించి తెలిసిందిలే! నువ్వు ఆమెకు అన్ని విధాలా తగినవాడివి! ఆమె మేడమీద నిన్ను వదుల్తాను. నువ్వే ఆ భూలోక తిలోత్తమకు అన్ని విధాలా తగినవాడివి। ఆమెతో సుఖించు। నేను త్వరగా వచ్చి, నాటకం అందుకోవాలి" అన్నదామె.

"అయ్యయ్యో! నా మూలంగా నీకు ఎన్ని కష్టాలొచ్చాయి?" అంటూ విచారించాను. ఆమె కూడా "నిన్ను విడవాలంటే చాలా కష్టమైనదని తోస్తోంది. కానీ తప్పదు" అంటూ విమానశాలకు దింపి వెళ్లిపోయింది.

"ఆ మేడ మీద, ఆ క్షణాన ఈ భూలోక తిలోత్తమ వీణవాయిస్తూన్నది" అంటూ చంద్రలేఖ పక్కనున్న సుందరిని ఓరగా చూడగా, ఆమె సిగ్గు పడిపోయింది.

మళ్లీ తన వృత్తాంతం చెప్పడం కొనసాగించాడు రుచికుడు-

ఆమెకీ నేనంటే ఆ క్షణాన విపరీతమైన మోహం కలిగింది. చెలికత్తెలను సైతం ఆవలకు పంపేసింది. మూడురోజులపాటు పగలూ - రేయీ తెలియకుండా మేం క్రీడించాం! కనీసం ఒకరి గురించి ఒకరం కనుక్కోడానికైనా మేం వ్యవధి ఇవ్వక మదన విహారంలో మూడు రోజులూ క్షణాల్లో దొర్లించాం!

నాలుగో నాటి ఉదయం కళ్లు తెరిచేసరికి నేను అక్కడ లేను. నన్నెవరో ఎక్కడికో తీసుకుపోతున్నారు. నేను అడిగిన కొంతసేపటికి "మేము దేవదూతలం! ఇంద్రుని ఆజ్ఞ మేరకు నిన్ను స్వర్గానికి తీసుకెళ్తున్నాం!" అన్నారు వాళ్లు. దాంతో నాకు గుండెలో గుబులు ప్రారంభమైంది.

అక్కడేమైందో! పాపం! తిలోత్తమ మాట నిజమే అయింది. ఆమెకి ఎన్ని కష్టాలొచ్చాయి నా వల్ల. ఆమెనేం బాధిస్తున్నారో!? ఇంద్రుడు నన్ను ఏం చెయ్యదల్చాడో!?' రకరకాల ఆలోచనలతో సంభ్రమాందోళనలు నాకు కమ్ముకోగా "అయ్యలారా! ఇంద్రుడు నన్ను తీసుకు రమ్మన్నకారణమేమి? అక్కడ నా ప్రసక్తి ఎందుకొచ్చింది?" అని వినయంగానే అడిగాను. అయినా వాళ్లు నోరు విప్పితేగా? సరాసరి స్వర్గపట్టణానికి నన్ను తీసుకువెళ్లారు.

ఆ సమయంలో దేవేంద్రుడు శివపూజ చేస్తున్నాడట! అందువల్ల నన్నొక మేడలో బందీగా ఉంచారు. అది భూలోకపు బందిఖానా కాదు కదా! ప్రహరీతో కూడిన ఓ చక్కని తోట మధ్య ఉంది. ఈ లోకంలోని రాజభవనం అయినా అలా ఉండదేమో! బందీగా అంటే - నాకు బంధనాలు తగిలించి ఉంచలేదని అర్థం. సంకెళ్లేం లేవు. కాని నేనా పరిసరాలు దాటరాదు.

తిలోత్తమ మాట ఇంద్రునితో ప్రస్తావించ వచ్చా? కూడదా? అని సందేహంలో పడ్డాను. చెప్తే ఒక బాధ. చెప్పకుంటే ఇంకో బాధ! ఏం చేయాలి?....ఆలోచనతో సతమతమవుతున్నా నేను, తోటలో విహరిస్తే కాస్త మనసు కుదుటపడుతుందేమో అని తోటలో అటూ ఇటూ తిరగసాగాను.

ఇంతలో ఒక చిలుక ఒక పత్రికతో నా ముందు వచ్చి వాలింది. అది నాకా పత్రిక అందించి కాస్త పక్కకు జరిగింది- నేనా ఉత్తరం విప్పి చూడగా, అది తిలోత్తమ రాసిందని అర్థమైంది. అంతా మానవ భాషలోనే ఉంది. దానివల్ల – తిలోత్తమ నన్ను వదిలి వెళ్లాక ఎంత క్షోభ అనుభవించిందీ తేట తెల్లమైంది. అందులో.....

"అయ్యా! నిన్నారీతిగా భూలోకంలో వదిలివెళ్లాక, నాకు మనః స్థిమితం లేకపోయింది. ఇంద్రుడు బృహస్పతికీ – నందుడికే కబురంపాడని నీకు తెలిసిన అంశమే! వాళ్లు వచ్చాక "ఇది మన సభలో ఎందుకుందో?" అంటూ ఇంద్రుడా ఉత్తరాన్ని బృహస్పతి చేతిలో పెట్టాడు. ఆయన అది చదివి ఇది భూలోకంలో శ్రీ జగన్నాథక్షేత్రంలో నివశించే రుచికుడనే మాలికాకారునికి, ఒక వేశ్య తనక్కొన్ని పూలదండలు కావాలని రాసింది. ఈ ఉత్తరమిక్కడ ఉండడం అనుమానించదగినదే" అని ధృవీకరించాడు.

ఇంద్రుడు నందుణ్ణి బెదిరించేసరికి "నేను కొంచెం సురాపానం పుచ్చుకున్నప్పుడు, ఆ మత్తులో సరిగ్గా చూసి ఉండలేదు. అప్పుడెవరో రహస్యమార్గాన్ని ఉపయోగించి ఉంటారు. ద్వారం తెరవబడి ఉంది. కారణమైతే నాకూ తెలియదు. నాకు తెలిసినంతవరకు మొన్న ఆ తిలోత్తమ అదే మార్గం గుండా వచ్చింది" అన్నాడా ద్వారపాలకుడు.

ఆ మాటలు విన్న ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. "తిలోత్తమ రాక్షసునికి చిక్కి ఉండగా, ఈ రహస్య మార్గానికెలా వస్తుంది? మత్తు తలకెక్కి నువ్వెవర్ని చూసి ఎవరనుకున్నావో? నీ మాటలు నమ్మలేను" అన్నాడు.

అయినప్పటికీ ఇంద్రుడు నాకు కబురంపాడు. నందుడు మళ్లీ అదే మాట అనడంతో "ఏమిటిది తిలోత్తమా? నందుడు ఇలా అంటూన్నాడేమిటి? మొన్న గానీ నువ్వీ రహస్య మార్గాన్ని ఉపయోగించలేదు కదా" అని సూటిగా అడిగేశాడు.

"దేవా! నన్ను మీరిలా అడగడం ఆశ్చర్యంగా ఉంది. రాక్షసునికి చిక్కిన నేను ఇక్కడికెలా రాగలను? నాకేం తెలీదు?" అనేశాను.

ఇంద్రుడు కూడా ఈ చిక్కుముడి అర్థంకాక "నందుడి మాట నమ్మదగినది కాదు. ఉత్తరమెలా వచ్చిందీ అంటే తిలోత్తమ వచ్చిందంటున్నాడు. పోనీ! వచ్చిందే అనుకుందాం! ఆమెకీ ఉత్తరంతో సంబంధం ఎలా ఉంటుంది? ఆ రుచికుడెవరు? ఏదో కారణం ఉండే ఉంటుంది. గురుదేవా! జ్యోతిష్య శాస్త్ర రీత్యా లెక్కగట్టి, ఆ రుచికుడెక్క డున్నాడో చూడండి! అతడ్నే రప్పిద్దాం ! అన్నీ తేలిపోతాయి" అన్నాడు పరిష్కారాన్ని సూచిస్తూ ఇంద్రుడు.

ఈలోగా ఇంద్రుడు మరికొందర్ని విచారించి, నన్ను అనుమానించి "ఏమే తిలోత్తమా! నువ్వేదో ఉత్తమురాలివి అనుకున్నాను. మర్మం అంతా నీ దగ్గరే ఉన్నట్లుంది. నిజం చెప్పు! ఆ రుచికుడెవరు? అతడు స్వర్గానికెలా వచ్చాడు?" అని అడగ్గా "వాళ్ల మాటలన్నీ అబద్ధాలు. నాకేమీ తెలీదు. వాళ్లు ఎవర్ని చూసి ఎవరనుకున్నారో? నేను మొదట ఏది చెప్పానో అదే నిజం!" అన్నాను.

ఇప్పుడు ఇంద్రుడు నన్ను ఇంకా శోధిస్తూ "తిలోత్తమా! నీకున్న మర్యాద పోగొట్టుకొనేలా ఉన్నావు. సరే! ఆ రుచికుడినే అడుగుతాను. ఇక్కడకు రప్పించి మరీ అడిగాక గాని నిజం తేలేలా లేదు" అని అప్పటికి వెళ్లిపొమ్మన్నాడు. జయంతుడూ ఇది విని నన్ను గుచ్చి గుచ్చి ప్రశ్నించాడు. నేను ఒకే మాట మీద నిలబడిపోయాను.

రుచికా! జరిగింది ఇది. ఇకమీదట భారమంతా నీ మీదనే ఉంది. నీటముంచినా, పాలముంచినా భారం నీదే! జగన్నాథస్వామి భక్తుడివి. స్వామివారి పట్ల నీకున్న భక్తికీ - ఒక భక్తునిగా నీపై స్వామివారికున్న అనుగ్రహానికి ఫలితం ఇప్పుడు కనిపించాలి. ఏదో విచారంలో ఉండి రాశా! తప్పులుంటే క్షమించు!.....నీ ప్రియురాలు."

తిలోత్తమ రాసిన ఆ ఉత్తరాన్ని చదువుతూంటే నాకు కన్నీళ్లాగలేదు. ప్రత్యుత్తరం ఇమ్మన్నట్లుగా ఆ చిలక చేష్టలు చేస్తోంది.

నేను ఆ ఉత్తరం వెనుకనే "చింతించకు! స్వామి మనవైపు ఉన్నాడు. నీకు అవమానం రానివ్వను. నేనూ చాలా విచారిస్తున్నాను" అని పండు రసంతో రాసి, ఆ చిలకకు అందించగా అది ఆ లేఖ తీసుకుని ఎగిరిపోయింది.

ఇంతలో దేవదూతలు ఉన్న ఇంద్రసభకు తీసుకుపోగా, నేను దేవేంద్రుని చూసి సాష్టాంగ నమస్కారం చేశాను. మిగిలినవారికి చేతులు జోడించి నమస్కరించాను. నన్ను చూసి వాళ్లందరూ ఆశ్చర్య పడుతున్నట్లనిపించింది.

ఇంద్రుడు నన్ను సూటిగా చూస్తూ "నువ్వెవరు? నీ పేరేమిటి? నీ నివాసం ఎక్కడ? ఇది వరకు స్వర్గానికి వచ్చావా?" అని అడిగాడు.

నేనూ తొణక్కుండా, నా ఊరూ పేరూ చెప్పి "స్వామి దయ వల్ల నాకు మునుపు స్వర్గ దర్శనం లభించింది. ఇప్పుడు మీ దయతో ఇంకోసారి లభించింది. నన్ను రప్పించిన కారణం సెలవివ్వండి." అన్నాను వినయంగా.

బృహస్పతి ఆశ్చర్యపడుతూ "నువ్వు మొదట స్వర్గానికెలా వచ్చావు? నిజం చెప్తే నీకు పారితోషికం ఇప్పిస్తాను'' అన్నాడు.

అందుకు నేను "అబద్ధమాడవలసిన అవసరం నాకు లేదు. మా తండ్రి బలదేవుడు శ్రీజగన్నాథంలో నివశిస్తూ పూలదండలు కట్టే వృత్తిలో ఉన్నాడు. స్వామిని సేవించే పరమభక్తుడు. ఆ స్వామి వరప్రసాదంగా నన్ను కన్నాడు. తల్లి లేదు. గారాబంగా పెంచాడు. నాకు పదహారేళ్ళు రాగా, పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించాడు. అయితే -నేను దేవకన్యలను తప్ప మానవకన్యలను పెళ్లాడనని చెప్పాను....దానిక్కారణం - మానవకాంతలలో సౌందర్యం ఉంటే విద్య ఉండక, అది ఉంటే శీలం ఉండక ఏదో ఒక లోపం. నా తండ్రి ఎంతమందితోనో చెప్పించాడు నాకు. నా తండ్రీ ఎంతో చెప్పి చూశాడు. నేను వినలేదు.

ఒకరోజు నా ఇష్టదైవమైన జగన్నాథస్వామిని ధ్యానించి నిద్రపోయాను. కలలో స్వామి కనిపించి "నీ కోరిక తీరుతుందిలే" అన్నాడు. అదేరోజు రాత్రి మా తండ్రికీ కలలో కనిపించి "చింతించకు! నీ కొడుకు కోరిక తీరుస్తాను. రామచంద్రపురంలో తిలోత్తమ అనే రాజకుమార్తె పెరుగుతోంది. ఆమెనిచ్చి పెళ్లి చేస్తే నీ కొడుకు స్వర్గసుఖాలననుభ వించగలడు. ఆ రాజు కూడా నీతో సంబంధం కలుపుకుంటాడు" అని చెప్పాడట!

పెళ్లికి అందువల్ల నేను అంగీకరించాను. ఆ ప్రకారం తిలోత్తమతో నాకు పెళ్లి జరిగింది. ఆమె నిజంగానే చక్కనిది.

కొన్నాళ్ళయ్యాక నేను తండ్రితో "అయ్యా! పెళ్లి చేసుకుంటే స్వర్గసౌఖ్యాలు కలుగుతాయన్నావు. నాకింత వరకూ అట్టివి అనుభవంలోకి రాలేదు. స్వామి నా మాట మరచినట్లున్నాడు. స్వర్గ విశేషాలు నాకు ఇంతవరకూ అనుభవానికి రాలేదు. నేను భార్యని వదిలేసి సన్యాసినై తిరుగుతాను. ఏవేవో చెప్పి నాకు పెళ్లి చేశావు" అన్నాను. "దేవుడి మాట వృధాపోదు. కొన్ని రోజులు ఓపిక పట్టు. ఈలోగా నేను స్వామిని ధ్యానించి దర్శించి కనుక్కుంటాను" అన్నాడు. ఆ రాత్రి నామీద వాత్సల్యం వల్ల స్వామి మళ్లీ కలలో కనిపించి "నీ పుత్రుని అభీష్టం నెరవేరుతుందిలే! కొద్దిరోజుల్లో స్వర్గాన్ని రక్తాక్షుడనే రాక్షసుడు ముట్టడిస్తాడు. ఇంద్రుణ్ణి కవ్విస్తాడు. స్వర్గరక్షణార్థం ఇంద్రుడు వెళ్తాడు. అప్పుడు నా గుడి వెనక్కు వచ్చే విమానంలో అతడు తిలోత్తమతో కలిసి ఎక్కితే, స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తాడు" అని చెప్పాడట!

అన్నట్లుగానే విమానం రావడం - నేను తిలోత్తమతో ఎక్కడం అది స్వర్గానికి రావడం జరిగాయి. మేమిద్దరం నందనవనంలో కొంతసేపు క్రీడించాం. అప్పుడెవరో వచ్చి "తిలోత్తమా! ఇతనెవరే?" అని అడిగారు. ఆమె నవ్వుతూ "ఓ పుణ్యపురుషుడు" అంది. "నువ్వు తిలోత్తమ అంశతో పుట్టి ఉంటావు. నీ పేరులాగానే రూపంలోనూ భేదం లేదు కాబోలు? అందుకే వాళ్లు అలా పిల్చారు. వాళ్లకీ నీ జవాబూ సరిపోయింది" అని నేనామెని మెచ్చుకుని అక్కడ్నుంచి పట్టణంలో కొచ్చాం! అది జనశూన్యంగా ఉంది.

నిరాటంకంగా వీధులన్నీ తిరిగాం! మా తండ్రికి స్వామి కల్లో కనిపించి రహస్య ద్వారం కీలు తిప్పమని చెప్పినట్లే చేశాం! అక్కడ ఎవరూ లేరు. లోపలికి వెళ్లి విశేషాలు చూశాం! మళ్లీ ఆ దారినే బైటికొస్తుంటే, ద్వారం దగ్గర ఎవరో నిలిపి "లోపలికెళ్లిన వైనం' ప్రశ్నిస్తే ఆమె ఏదో అందుకు తగ్గ జవాబు చెప్పి నా దగ్గరకొచ్చింది. మేమిద్దరం మరికొంతసేపు అక్కడ

విహరించి, మళ్లీ విమానం ఎక్కి భూలోకానికి పోయి మా అత్తవారింట కొన్నాళ్లున్నాం! ఇంతలో తమ దూతలు విషయమేమీ చెప్పకుండా నన్ను ఇక్కడకు తీసుకొచ్చారు. అప్పుడు నేను చూసిన సభ ఇదే! గత జన్మ పుణ్యవశాన రెండోసారి చూడగలుగుతున్నాను. అప్పుడు కలగని దేవర దర్శనం ఇప్పుడు కలిగింది. జన్మధన్యమైంది. ఎల్లకాలం ఇక్కడే నేనుండేలాగ అనుగ్రహించండి." అంటూ ప్రార్థించాను.

ఇంద్రుడాశ్చర్యపోతూ బృహస్పతి వైపు చూసి "గురువర్యా! ఇతడి చరిత్ర చిత్రంగా ఉందే! బుద్ధికి బృహస్పతి' అని అక్కడ నానుడి. నిజం కూడా అదే! కనుక ఇది సత్యమా కాదా శోధించి చెప్పండి."అన్నాడు.

ఆయన ఏ కళనున్నాడో గాని, "దేవేంద్రా! వీడెంత వాడు కాకపోతే స్వర్గానికి సశరీరంగా రెండుసార్లు రాగలుగుతాడు? వీడి తండ్రి జగన్నాథస్వామికి పరమభక్తుడు. వీడి పూర్వజన్మ పుణ్యవిశేషమని తెలుస్తూనే ఉంది. ఈ ఉత్తరం వీడికి చెందిందే! మర్చిపోయుంటాడు. ఇక – వీడ్ని భూలోకానికి పంపెయ్!" అన్నాడు.

"హరిదయకు పాత్రుడైన ఇతడ్ని సత్కరించకుండా పంపడం స్వర్గ మర్యాద కాదు. అలా చేస్తే శ్రీ విష్ణువు దేవునికి అపచారం చేసినట్లే ! ఇకపాపం! తిలోత్తమ మీద అనవసరంగా అపోహపడ్డాం! ఆమె చెప్పింది కూడా నిజమే! ఒకర్నొకరు తెలీక అపోహపడి ఉంటారు. ఇందులో ఎవరి తప్పు లేదు. సరేగాని! హరిభక్తి శిఖామణీ! అది తీర్చి నిన్ను నీ లోకానికి పంపేస్తాం" అన్నాడు ఇంద్రుడు.

"మీ లోకంలో సంగీత వృక్షం నాకు అతి మనోహరంగా తోచింది. దాన్ని భూలోకంలో పెంచాలని ఉత్సాహం! ఇదే నా కోరిక. నా భార్య తిలోత్తమలా ఉంటుందని శ్రీ జగన్నాథస్వామి అనడం వల్ల – ఆమెను చూడాలనుంది. ఆమె నొక్కసారి ఇక్కడకు రప్పించండి" అన్నాను వినయంగా.

"రుచికా! నువ్వు కోరింది అసాధ్యమే అయినప్పటికీ, ఆ సంగీత వృక్షం కోరిక తీరుస్తా లే! భూలోకంలో నీకు నచ్చిన చోట దాని బీజం

పాతు. అది మనోహరమైన వృక్షం. పుణ్యాత్ములకు తప్ప పాపాత్ములకు కనబడదు. దాని గానం వినబడదు. పాపాత్ములకు అదొక ముళ్ల చెట్టులాగానే తోస్తుంది. భూమ్మీద పాప పుణ్య విచక్షణకు అదొక గీటురాయి వంటిది" అంటూ ఆ చెట్టు విత్తనం తెప్పించివ్వడమే గాక, తిలోత్తమనీ రప్పించాడు.

"తిలోత్తమా! నువ్వు చెప్పింది నిజమే? అకారణంగా నా నిందకు గురయ్యావు. సౌందర్యంలో సరిగ్గా నిన్ను పోలిన వనిత, ఈ రుచికుని భార్య. అతడామెతో పూర్వపుణ్యవశాన ఇక్కడకు రాగలిగితే - అది చూసి మనవాళ్లు నువ్వే అనుకున్నారు. ఇద్దర్నీ అనుమానించాను. బాధపడకండి! ఇక - నువ్వు, తన భార్య పోలికలో వున్నావనీ- చూడాలనీ అంటే నిన్ను రప్పించాను" అన్నాడు ఇంద్రుడు. నేను ఆమె వంక ఆరాధనగా చూశాను.

ఆమె కూడా నన్ను అనురాగంతో చూస్తూ "ఆర్యా! నీకు నమస్కారం! నన్ను రక్షించి, నా మీద పడిన నింద తొలగించారు. నిత్యం మీ పేరు తలుచుకోవడమే, నేను మాకు చేయగల ప్రత్యుపకారం" అని వాళ్లందరి ముందు నన్ను ప్రశంసించింది. అంతలోనే ఆమె ఎంత అందంగా ఎంత చాకచక్యంగా రెండు సందర్భాలకూ అతికేలాగ ప్రవర్తించిందీ అని నేనెంతో ఆశ్చర్యపోయాను. ఆహా! స్త్రీ లెంత మాయల మారులో కదా!" అన్నాడు రుచికుడు పరిహాసంగా.

అందుకు చంద్రలేఖ నవ్వుతూ "సర్లే! నువ్విలా అనడం అన్నిటికంటె ఆశ్చర్యంగా ఉంది. ముల్లోకాలకే ప్రభువులైన ఇంద్రుని కొలువున బుద్ధికి బృహస్పతి అనదగ్గ వాడి సమక్షాన కట్టుకథలు చెప్పి నమ్మించేసిన మహా మాయగాడివి! నీ సాహసం ముందు ఆమె చేసిన సాహసం ఎంత?" అని చురక అంటించి "తర్వాతేం జరిగిందో చెప్పు" అంది.

"ఇంక చెప్పడానికేముందీ? ఇంద్రుడిచ్చిన సంగీతవృక్షబీజం పుచ్చుకుని, నా మిత్రుడైన గౌతముడిని మదిలో ఒక్కసారి స్మరించుకుని, అతడెక్కడుంటే అక్కడికి నన్ను చేర్చమని ఇంద్ర దూతలతో చెప్పాను. ఇక్కడ భూలోకంలో ఇన్ని పరిణామాలు జరిగి, అంతా తలొక దిక్కుకు చెదిరిపోతారని నాకేం తెలుసు? అతడింకా జగన్నాథపురంలో వాళ్ల ఇంటిలోనే ఉండి

ఉంటాడనుకున్నాను. గౌతముడ్ని వెంటబెట్టుకుని నేను నా ఇంటికి పోవచ్చునని నా ఊహ! తీరా దూతలు నన్ను వదిలేసరికి నేను తేలింది ఢిల్లీ నగరంలో! సరే! గౌతముడికి నువ్వు ధనమిచ్చి నా కోసం నగరాలన్నీ గాలించమన్నావట! అతడా పని మీదనే ఉన్నాడు. దైవికంగా నేనే అతడ్ని కలిసి విషయమంతా చెప్పగా, ఇద్దరం బయల్దేరాం! ఇక్కడకొచ్చి ఓడ ఎక్కి స్వదేశం చేరాలని ప్రయత్నం! ఇక్కడ నువ్వీ పురుషరూపంలో మంత్రాంగం చేస్తుంటావని మాకు తెలీదు గనుక ఇదీ దైవికమే! దైవానుగ్రహమే లేకుంటే ప్రాణాధికులైన మిమ్మల్నందరినీ ఒకే చోట ఇంత త్వరగా ఎలా కలుసుకుంటాను? ఇదీ నా దివ్య వృత్తాంతం" అని ముగించాడు రుచికుడు. అతడి అదృష్టాన్ని అందరూ ప్రశంసించారు.

"చెరకు తిన్ననోటికి బెండు సహిస్తుందా? అలాగే దేవకాంతతో రతిసౌఖ్యం అనుభవించిన మీకు మా పట్ల ఏం మక్కువ కలుగుతుంది లెండి? మేమే మీ కోసం నానా పాట్లు పడ్డాం! ఆ తిలోత్తమ మిమ్మల్ని ఇక్కడ ఉండనిస్తుందా? ఎప్పుడో మళ్లీ స్వర్గానికి తీసుకువెళ్తుందేమోనని మాకు తోస్తోంది.నీ అభిప్రాయం ఏమిటి" అని అడిగింది చంద్రలేఖ.

అందుకు రుచికుడామెను ఓదార్చుతూ "చంద్రలేఖా! అలా ఎన్నడూ నువ్వు అనుకోకు. రూపంలో మీరు దేవకాంతల్ని మించినవాళ్లు! తిలోత్తమ నన్నెప్పుడూ కావాలని కోరుకోదు. ఆమెకుండే ప్రతిబంధకాలు ఆమెకున్నాయి. అప్పుడు యుద్ధసమయం కనుక నిరాటంకంగా తిరిగాం! ఇక – ఇతర సమయాల్లో ఇంద్రుని అనుమతి అసలు లేకుండా అడుగువేయగలదా! కనుకనే – ఏ లోకంలోని వారికి ఆ లోకంలోని స్త్రీ లే భార్యలుగా తగి ఉండగలుగుతారు. ఇక మిమ్మల్ని విడిచిపెట్టనని ప్రమాణం చేస్తున్నాను. మీరు నాకై పడిన బాధల్ని తల్చుకుంటే ఎంతో దుఃఖం కలుగుతోంది" అని వాళ్లిద్దర్నీ విడివిడిగా కౌగలించుకుని, వారి హృదయాలకు స్వాంతన చేకూర్చాడు.

ఆ తరువాత – చంద్రలేఖ వల్ల తన తండ్రి సంగతి తెలుసుకున్నాడు

రుచికుడు. విజ్ఞాన యోగిగా ప్రజల మన్ననలు అందుకుంటూన్న బలదేవునికి పుత్రుని వృత్తాంతం మహదానందాన్ని కలిగించింది.

తనకు మంత్రి పదవినిచ్చిన ధర్మాంగదునికి కూడా చంద్రలేఖ, రుచికుని వృత్తాంతం అంతా చెప్పి - ఇన్నాళ్లూ వీరగుప్తునిగా తాను పురుషవేషంలో ఉండడానికి గల కారణాలను వివరించి చెప్పింది. ధర్మాంగదుడు అటువంటి సజ్జనులందర్నీ తన నగరంలోనే ఉండవలసిందని ఎంతో బ్రతిమాలుకున్నాడు. కాని తన జన్మభూమి అయిన జగన్నాథంలోనే నివశించడానికి తండ్రి ఆనతి మేరకు రుచికుడు నిర్ణయించుకున్నందున, ధర్మాంగదుని ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరించి "మీ వంటి ఆప్తులు మాకెప్పుడూ దర్శనీయులే! మేమే మిమ్మల్ని అప్పుడప్పుడు వచ్చి చూసి వెళ్తూంటాం" అని సమాధానపరిచాడు. చంద్రలేఖని పుత్రికా సమానంగా భావించిన ధర్మాంగదుడు ఆమెకు కొన్ని గ్రామాలను కానుకగా ఇచ్చి, తిలోత్తమాది ప్రభృతుల నందర్నీ సత్కరించి వాళ్ళందర్నీ అనురాగపూర్వకంగా వాళ్ల దేశానికి పంపే ఏర్పాట్లు చేశాడు.

రుచికుడు చంద్రలేఖనీ - తిలోత్తమనీ గాంధర్వ విధిన వివాహం చేసుకుని భార్యలుగా స్వీకరించాడు. వారితో సహా రామచంద్రపురానికి వెళ్లి పుత్రికావియోగం చేత చింతిస్తూన్న శూరసేన మహారాజుకు, తమ రాక చెప్పి ఆయనకు ఆనందం కలిగించాడు. అక్కడ కొన్ని రోజులున్నాడు.

శూరసేనునికి పుత్రికాసంతానం మాత్రమే కనుక, అల్లుడైన రుచికునికే రాజ్యపట్టాభిషేకం చేశాడు. రుచికుడు రాజ్యానికి వచ్చిన తక్షణం గౌతమునికి మంత్రి పదవి ఇచ్చి, అతనికి కూడా ఒక చక్కని కన్యతో వివాహం జరిపించాడు.

తాను స్వర్గం నుంచి తెచ్చిన సంగీత వృక్ష బీజాన్ని శ్రీ జగన్నాథంలోని స్వామివారి ఆలయంలో పాతించాలని ఉత్సాహపడి ఒకరోజు తన ఇద్దరు

భార్యలతో కూడా చతురంగ బలాలతో గౌతముని వెంటపెట్టుకుని, శ్రీ జగన్నాథం బయలుదేరారు. ఒకనాటి రాత్రి నువ్వు చూసిన చోట బసచేశారు.

మర్నాడు బయల్దేరే సమయంలో, పెట్టెలు సర్దుతూంటే, అది అతిసూక్ష్మబీజం కనుక చెయ్యిజారి ఎక్కడో పడిపోయింది. తర్వాత దాని కోసం ఎన్ని ప్రయత్నాలు చేసినా అది కనబడింది కాదు.

బుద్ధిమంతుడైన రుచికుడు అప్పుడు ఆ భూమి అంతట్నీ తన స్వంతం చేసుకొని, ఆ నేలంతా నీరు చల్లించి, మొక్క అక్కడే మొలకెత్తడానికి తగిన ఏర్పాట్లు చేయించాడు. అప్పుడది మొలకెత్తి క్రమంగా పెరిగి పెద్ద వృక్షమైంది. రుచికుడు అక్కడే మంచి మేడలు కట్టించి, సంవత్సరానికి ఆరు నెలలు ఇద్దరు భార్యలతోనూ అక్కడికొచ్చి నివశిస్తూ క్రీడిస్తూండేవాడు. చాలాకాలం అలా భూమ్మీదే స్వర్గసౌఖ్యాలనుభవిస్తూ చిరకాలం అలాగే ప్రజారంజకంగా రాజ్యపాలన చేశాడు.

గోపా! నీకు విన్పించిన గానం ఆ సంగీతం వృక్షం నుంచి బయలువెడలివచ్చిందే సుమా! నువ్వు పుణ్యాత్ముడివి కనుక, నీకా గీతం వినిపించింది. దేవేంద్రుడు ఆనతిచ్చిన ప్రకారం అది ఇతరులకు విన్పించదు. పైగా కంటకవృక్షంలా కనిపిస్తుంది. అది నాటి, నేటికి ఎన్ని వేల ఏళ్లు గడిచిందో!? దాని వృత్తాంతం ఇప్పుడు తెలిసినవారూ లేరు" అని మణిసిద్ధుడు చెప్పగా గోపాలుడు ఆనందించి "మీ కరుణ నాపైన పరిపూర్ణంగా ఉండగా నన్ను పాపాలు అంటుతాయా?" అన్నాడు.

తరువాత ఇద్దరూ భోజనం ముగించి కొంతసేపు విశ్రమించి గోపాలుడు కావడి ఎత్తుకుని రాగా, క్రమంగా వారిద్దరూ తదుపరి మజిలీకి ప్రయాణమయ్యారు.



# కాశీ మజిలీ కథలు

## 17 వ మజిలీ

పదిహేడవ మజిలీ ప్రదేశం - ఒక పట్టణం. అక్కడ విశాలంగా ఉన్న ఒక సత్రంలో బసచేశారు. స్వాములవారు స్నానం చేసి, జపం చేసుకుంటూన్న సమయాన శౌనకుడు, పుర విశేషాలు చూసి రావడానికి అంగడికి వెళ్లాడు.

ఆ వ్యాపారపువీధులు ఎంతో విశాలంగాను, చక్కని వస్తువులు అమ్మకానికి పెట్టి ఉండడం వల్లను ఆ వింతలు చూస్తూ క్రమంగా దూరంగా వెళ్లిపోయాడు. అలా వెళ్లేసరికి ఆ పట్టణపు కోట కనిపించింది. అది ఎంతో వెడల్పుగా - ఎత్తుగా ఉంది. దాన్ని ఓసారి చుట్టి రావాలని అనిపించింది గోపాలుడికి. వెంటనే ఆ ప్రయత్నం మొదలుపెట్టి, దాన్ని చుట్టి వచ్చేసరికి చాలా సేపు పట్టింది. అంతేగాక కోటలోపల కొన్ని వింతలు అతనికి చాలా ఆశ్చర్యం కలిగించాయి.

ఒకచోట - మంటపంలో అడ్డంగా వేసిన దూలాన తలక్రిందులుగా ఇద్దర్ని ఇనుప గొలుసుల్తో వ్రేలాడగట్టి ఉంచారు. వాళ్లని కట్టి చాలాకాలం అవుతున్నా, వాళ్లు చిరకాలం జీవించిన మనుషుల్లాగ ఉన్నారు. ఆ ప్రక్కన ఒకరాయి మీద 'దుర్జనులకు బుద్ధివచ్చుపని' అని రాయబడి ఉంది. ఆ విశేషాన్ని చూసి, శౌనకుడు అక్కడున్న వాళ్లను, ఆ పురుషులెవరనీ వాళ్లేం తప్పు చేశారనీ అడిగాడు. కాని ఎవరూ చెప్పిన వాళ్లే లేరు.

ఆ వింతను చాలాసార్లు శోధించినా కారణం అతడికి తోచలేదు. దాంతో అతడు చాలా వేగంగా సత్రానికి వెళ్లి, భోజనం ముగించి తన రాకకోసం ఎదురుచూస్తున్న మణిసిద్ధుని చూసి నమస్కరించి ఎదుట నిలబడ్డాడు.

అప్పుడా యతి చిరుకోపం నటిస్తూ "గోపా! నీకు పిసరంతైనా భయం లేకుండా పోయింది. నీ కొరకు ఎంతసేపు కాపుకాచుకొని ఉండమంటావు? ఎక్కడికి పోయావు? భోజనం మాట మరిచిపోయావా ఏం? ఏదో ఒక గొడవ పెట్టుకుని తిరుగుతూంటావు. ఈ రోజు ఏ వింతా కనబడలేదా చాల్లే! భోజనం చెయ్యి!" అనగా, అతడు కొంచెం సిగ్గుపడి నవ్వుతో ఇలా అన్నాడు.

"స్వామీ! నేను భోజనం కోసం మీ వెంట రాలేదు. నానాదేశ విశేషాలు చూడాలన్న కోరికతో కదా వచ్చాను. మరి – అవి జూడకనే పోతే ఏం లాభం? ఈ పట్టణం చాలా పెద్దది సుమండీ! అంగడిలోనే ఎన్ని విశేషాలు చూశాననుకున్నారు? ఇక్కడున్న కోటకు సమానమైన దాన్ని ఇంతవరకు మనం చూసి ఉండలేదు. ఆ కోట ముఖ మంటపంలో ఇద్దరు పురుషుల్ని ఇనుపగొలుసుల్తో తలక్రిందులుగా వ్రేలాడగట్టారు. వారు మరణించిన వారు కదా! చిరకాలం వారి శరీరాలు చెడక ఎలా నిల్చాయి? అది దుర్జనులకు బుద్ధి వచ్చు పని" అట! ఈ రోజు నేను చూసిన విశేషాల్లో అది నాకు చాలా అబ్బురంగా అన్పించింది.

వాళ్ళెవ్వరు! వాళ్లు చేసిన తప్పేమిటి? ఈ వృత్తాంతం ముందుగా చెప్పక తప్పదు. నా మీద కోప్పడకండి స్వామీ! ఈ కథ విన్న తర్వాత గాని, నాకు భోజనం రుచించదు" అని మణిసిద్ధుని పాదాలపైన పడ్డాడు గోపాలుడు. వాడు అంత దీనంగా వేడుకోడం చూసి ఆ యతీశ్వరుడు నవ్వేసి "నువ్వు ఆలస్యంగా వచ్చినప్పుడే అనుకున్నాను – నువ్వేదో గొడవ తెచ్చావని. దాని వృత్తాంతం చెప్తానులే! నేనెక్కడికి వెళ్తాను. ముందు అన్నం తిను! సావకాశంగా చెప్తాను. " అని వాడిని ఒప్పించాడు.

వాడి భోజనం అయ్యాక, ఒకచోట సావధానంగా కూర్చొని ఆ మాణిక్య ప్రభావాన ఆ వృత్తాంతం అంతా కరతలామలకంగా తెలుసుకొని ఇలా చెప్పాడు...

## ధర్మపాలుని కథ

తొలుత, మాళవదేశాన్ని విహారభద్రుడు – విజయకేతుడు అనే

ఇద్దరు మంత్రుల సహాయంతో ధర్మపాలుడు అనే రాజు ధర్మంగా పరిపాలన చేస్తూండేవాడు. అతని రాజధాని కౌశాంబీ పట్నం. ధర్మపాలుని భార్య సునంద. ఆమె భర్తకు అన్ని విధాలా అనుకూలవతి. పతిభక్తి పరాయణురాలు.

అతడొక రాజు కొలువులో ఉండగా, ఇద్దరు మంత్రులను చూసి "రాజుకు దండనీతి తెలిసినందువల్ల లాభమేమిటి?" అని అడిగాడు.

ముందుగా రెండో మంత్రి అయిన విజయకేతుడు లేచి, ప్రభువు పట్ల వినయవిశ్వాసాలు ఉట్టిపడేలా నమస్కరిస్తూ "దేవా! బంగారం అగ్నిలో పుటం పెట్టిన కొద్దీ ప్రకాశిస్తుంది. అలాగే నీతిగలవాడి దగ్గర బుద్ధి అగ్ని సంశోధితంలా ప్రకాశిస్తుంది. బుద్ధిబలం లేనివాడు ఎంత ఉన్నతుడైనా, పర్వతంలాగ తనమీద కెక్కిన వాళ్లని సైతం గుర్తించడు. సాధ్యాసాధ్యాలు విభజించి నడవడం. నియమం లేకుండా వ్యాపారాలు చక్కబరచుకోలేనివారిని స్వంతవాళ్లే అవమానిస్తారు. అతడి ఆజ్ఞకు ప్రజలు కూడ విలువ ఇవ్వరు. ఏ రాజైతే కొంత మాత్రమే స్వేచ్ఛ ఇచ్చి, తన ప్రతిభతో వాళ్లు ఆ మాత్రపు స్వేచ్ఛని కూడా దుర్వినియోగం చెయ్యకుండా జాగ్రత్తపడతాడో, ఆ రాజ్యంలో ప్రజలు సుఖిస్తారు. అలాక్కాక స్వేచ్ఛ అపారంగా ఇస్తే, ప్రజలు ఇంకా మితిమీరి సర్వ విషయాల్లోనూ ఆ స్వేచ్ఛ విస్తారంగా ఉపయోగించి సుంకరులౌతారు. అటువంటి మర్యాద లేని ప్రజ ఇహ-పరాల్లో రెండిటా చెడిపోగలదు. అది రాజుకు సైతం కీడే! కనుక దండనీతి ఉండాలి. అది ప్రజల అతిస్వేచ్ఛని అరికట్టి వారిని తిన్నగా ఉంచగలదు. అట్టి దండనీతి ఎవరైతే అభ్యసించి వుంటారో, అతడు మిక్కిలి ఖ్యాతి పొంది, సంకల్ప సిద్ధుడై ప్రజల్ని వశపరచుకొని, సుఖమయిన పరిపాలన అందివ్వగలడు. దండనీతి వల్ల ఇదీ లాభం" అని వివరించాడు. రాజు సంతోషిస్తూ విహారభద్రుని ముఖం చూశాడు.

అప్పుడు అన్ని రాజతంత్రాలూ బాగా తెలిసి, సందర్భానుసారం వాటిని బోధించగల విహారభద్రుడు లేచి, రాజుగారికి మొక్కి "దేవా! నా విజ్ఞప్తి వినండి! లోకంలో దైవానుగ్రహం వల్ల ఏదైనా సంపద కలిగితే, ధూర్తులు తమ డాంబికపు మాటలతో ప్రభువుల్ని భ్రమపెట్టి, అదంతా తమ

స్వప్రయోజకత్వం వల్ల సంపాదించిందే అంటూంటారు. మరికొందరు యోగులమంటూ శిఖ-యజ్ఞోపవీతం రెండూ ధరించడం మానేసి, అన్నీ వదిలేశాం అంటూ భోజనం మానేసి మిగిలినవన్నీ ఆరగించేస్తుంటారు. అందులో బంగారం వంటి విలువైనవీ ఉంటాయి. ఇంకా కొందరున్నారు. అల్పులే అయినప్పటికీ చక్రవర్తుల్లా విర్రవీగుతారు. శస్త్రాస్త్రాలు లేకుండా డాంబికాలు పలుకుతూ, రాజులని నమ్మించి వారు రాజుని తమ చెప్పు చేతుల్లో ఉంచుకోగలరు.

ఇప్పుడు మన విజయకేతుడు చెప్పిన దండనీతి అలాంటి వాళ్లు చెప్పిందే! ఇక దండనీతికి సంబంధించి విష్ణుగుప్తుడు ఆరువేల శ్లోకాలతో శాస్త్రం రచించాడు. దానికి అర్థం తెలియాలంటే శబ్దశాస్త్రం చదవాలి. అవన్నీ చదివేసరికి ముసలితనం వచ్చేస్తుంది. ఇక రాజ్యపాలన ఎప్పుడు? రాజు సుఖపడేదెప్పుడు?" అని ప్రశ్నార్థకంగా రాజు ముఖం వైపు చూశాడు.

ప్రభువు శ్రద్ధగా వింటూండటం గమనించి, కపటుడైన ఆ మంత్రి, క్రమంగా రాజుకు దండనీతి పట్ల -ఆ శాస్త్రాన్ని చదవడం పట్ల విముఖత కలిగించడమే లక్ష్యంగా ఉంచుకుని తదుపరి ఇలా చెప్పసాగాడు...

"రాజా! వెర్రి మాటలు నమ్మి, నిరంతరం దండనీతి శాస్త్రాన్ని పఠిస్తూ కాలం వృధా చేసుకోకు. ఎంత దండించినా ప్రజలు మూర్ఖులు-మూఢులై చేసిన తప్పులు మళ్లీ-మళ్లీ చేస్తూనే ఉంటారు. రాజ్యభారాన్ని ఈ తలనొప్పుల్తో మోసేకంటే, అధికారం చేతిలో ఉన్నంతకాలం, అప్సరసల్లాంటి అంతఃపుర స్త్రీలతో క్రీడిస్తూ చదరంగం, మధుపానం, వేట, పాచికలాట వంటి వాటితో రాజోచితమైన భోగాలతో తులదూగి అనుభవించాలి. శరీరాన్ని సార్ధకం చేసుకోవాలి. ఎందుకొచ్చిన దండగమారి దండనీతి శాస్త్ర పఠనం? శాస్త్ర ప్రకారం నడిచే వాళ్లెవరు? ఇలాటి మాటలు నమ్మకు! ఉత్తమజాతిలో పుట్టావు. మంచి ఐశ్వర్యం - చక్కని యవ్వనం సంప్రాప్తించాయి. విద్యాగ్రహణం అంటూ దండనీతి పఠనం జోలికిపోకు!" అని ఉపన్యసించాడు.

మంచి తరుణంలో ఉన్న ధర్మపాలుడికి ఈ విహారభద్రుడి వచనాలే రుచించాయి తప్ప, దీర్ఘకాలంలో విజయాన్ని-కీర్తిని కలిగించే విజయకేతుని వచనాలు చెవికెక్కలేదు. ఇటువంటి బోధనలే అవకాశం దొరికినప్పుడల్లా చేస్తూ, ధర్మపాలుని లోబరుచుకున్నాడా మంత్రి.

రాజుకూడా వ్యవహారాలన్నీ ఈ రెండో మంత్రి మీదనే వదిలేసి-విజయకేతుడ్ని గౌరవించడం మానేశాడు. తాను అంతఃపుర స్త్రీలతో సుఖిస్తూ నిత్యం వ్యసనాలలో పడి కాలక్షేపం చేయసాగాడు.

నిస్వార్థపరుడైన విజయకేతుడు "ఆహా! చెప్పుడు మాటల ప్రభావంతో, మూర్ఖుడై, వీడి మాటల వల్ల చెడిపోతున్నాడు. నాతో పూర్వంలా ఉండడం లేదు. నన్ను మన్నించకుంటే మానె-నీచకార్యాలకు నన్ను నియోగిస్తున్నాడు. ఆపదలో ఉన్నవారిని సైతం ఆదుకోడు. శత్రువుల్ని విశ్వసిస్తాడు. నేను దగ్గరలో ఉన్నా, ఇంకొకరితో ఇంకో విషయం మాట్లాడతాడు. రాజుకి నచ్చేలా మాట్లాడువారే ప్రియంచేకూర్చే వాళ్లవుతారు. సమర్థులైనా అప్రియం మాట్లాడితే, ద్వేషులవుతారు కాబోలు!

**శ్లో ॥ సులభాః పురుషాలోకే సతతం ప్రియవాదినః ।**

**అప్రియస్య పథ్యస్య వ్యక్తా శ్రోతాచ దుర్లభః ॥**

అని చెప్పినట్లు - ప్రియంగా మాట్లాడేవాళ్లు చాలామంది ఉంటారు. అప్రియంగాను, రుచించనివీ అయిన మాటలు చెప్పేవారూ - వినేవారూ కూడ లోకంలోన ఉండరు కదా! ఇతడి రాజ్యం త్వరలోనే శత్రువుల అధీనం అవుతుంది. నేనేం చేస్తాను? అలాగని చిరకాలంగా ఆశ్రయించి ఉన్న ఈ దివాణం విడిచిపోవడానికీ మనస్కొప్పడం లేదు. కానియ్! మూగవాడిలా నోర్మూసుకుని ఏదో కాలం వెళ్లిం చేస్తాను" అనుకుంటూ అక్కడే ఆ విధంగానే నడుచుకోసాగాడు.

ఆ విధంగా ధర్మపాలుడు కామవిషయభోగాల్లో మునిగిపోయి రాజ్యాన్ని దుష్టుడైన మంత్రి చేతిలో పెట్టి, అంతఃపురం వదిలి రాకుండా పరిపాలన సాగిస్తూంటే- ఓ రోజు చోళ దేశపు రాజుగారి మంత్రి యొక్క

పుత్రుడైన దుర్వినీతుడు అనేవాడు, ఈ రాజ్యంలోని స్థితిని అంతటినీ ఆకళింపు చేసుకున్నాక, కౌశాంబీ నగరంలో తిష్ఠవేసి, కొందరు మిత్రులను వెంటబెట్టుకుని ఎన్నెన్నో చిత్రాతిచిత్రాలైన క్రీడల్తో విహారభద్రుని ఆకట్టుకున్నాడు.

ఒకరోజు ఆ దుర్వినీతుడ్ని వెంటబెట్టుకొని విహారభద్రుడు, రాజు ధర్మపాలునికి పరిచయం చేసి "రాజా! ఇతడు చోళప్రభువుల మంత్రి చంద్రపాలితుడు అను వాని పుత్రుడు. ఇతని పేరు దుర్వినీతుడు. కాని మహాశూరుడు. ఇతని క్రీడా ప్రతిభ నేను స్వయంగానే చూసి వున్నాను. అక్కడ ప్రభువు వద్ద అతనికి గుర్తింపు లేకపోయేసరికి చిన్నబుచ్చుకుని మనల్ని ఆశ్రయించాడని తోస్తోంది. అతడు మనకు ఎట్లాగూ శత్రువే కదా! శత్రువునకు శత్రువు మనకు మిత్రుడని నానుడి! అతడూ ఇలాంటి ఊహతోనే వచ్చి ఉంటాడు. వేటలోన - పాచికలాటలోన చాలా ప్రవీణుడు. వీడుంటేనే చాలు - శత్రువులు భయపడతారని వాడుక. కనుక వీడికి తగిన కొలువు మనం ఇప్పించాలి" అన్నాడు.

అప్పుడు అక్కడే ఉన్న విజయకేతుడు, అంతకాలం ఆ రాజు కొలువున ఉన్న విశ్వాసం కొద్దీ "వీడసలే శత్రుదేశం వాడు. ఇట్టి వాళ్లని దండనీతి ప్రకారం - పరీక్షించకుండానే కోటలోనికి అనుమతించడం ఒక గొప్ప తప్పిదం. కాగా నేరుగా రాజ్యవ్యవహారాల్లో జోక్యం చేసుకోగల అవకాశం కల్పించడం ఇంకో పెద్ద తప్పు కాగలదు. నీతిశాస్త్రం ఏం చెప్తోందంటే......ఇటువంటి శత్రుదేశపు వ్యక్తి రాజ్యంలో అడుగుపెట్టినపుడు వెంటనే అతడ్ని బంధించాలని ఉంది. మీ ప్రియ మంత్రి దానికి ఒప్పుకోక పోగా, పైగా కొలువులోకి అతడ్ని రప్పించి పదవి ఇప్పించ ప్రయత్నం చేస్తున్నాడు-భేష్" అన్నాడు నిరసనగా.

అప్పుడు విహారభద్రుడు పక పక నవ్వుతూ "ఓహో! ఇతడు రాజు క్షేమం కోరేవాడు. మేం కోరని వాళ్లం! ఆహా! ఏం బుద్ధిబలం? నేనేదైనా పని చెయ్యాలనుకుంటే చాలు! కాదంటాడితడు. అది అతడికి సహజం కాబోలు! అట్టి బుద్ధి అతడిదైతే, నాకొచ్చిన నష్టమేమి? మన గుట్టు ఎట్లు

తెలుసుకోడానికి ఇతడే రావాలా? దురదృష్టవశాన అట్టి పరిస్థితే ఏర్పడితే – కోట ముట్టడించాక గుట్టు తెలీకపోతుందా? నేను శత్రువుల మర్మాలు ఇతడి ద్వారా తెలుసుకోదలచి, ఇతడికి అభయం ఇచ్చాను"...అని తిరుగులేని రీతిగా చెప్పేసరికి, విజయకేతుని మాటలకు యధాప్రకారం విలువ ఇవ్వక, ధర్మపాలుడు అంతఃపురానికి వెళ్లిపోయాడు.

ఇంకేముందీ? దుర్వినీతుడికి సహాయ మంత్రి పదవి లభించింది. విహారభద్రునికి చేదోడు-వాదోడుగా ప్రతి రాచకార్యంలోను కల్పించుకోవడం; రాజుగారి దగ్గర సప్తవ్యసనాలే ఉత్తమమని సంభాషించడం; అటువంటివి స్వయంగా ప్రోత్సాహించడం అతడి నిత్యకృత్యాలు.

'యథారాజా-తథాప్రజా' అన్నట్లుగా దండనీతి శూన్యమైన ధర్మపాలుని రాజ్యంలో జనులు దుర్మార్గవర్తనులై సంచరించసాగారు. రాజ్యంలో జూదగృహాలు, పానశాలలు అధికం అయ్యాయి. ఈ వ్యసనాలకు కావలసింది ధనం. కనుక చోరీలూ అధికం అయ్యాయి. పాపాలన్నిటికీ మూలం కామం. ఇక వ్యభిచారం సంగతి చెప్పనే అక్కర్లేదు. ప్రజలు కామాభిలాషులై సంచరించసాగారు. పాలన అదుపు తప్పడం మొదలైపోయింది.

ప్రజలు నిర్భీతిగా దుర్-వ్యాపారాలు చేస్తున్నారు. మందలించే వాళ్లు లేక, అల్పుల భూములు-సంపదలు అధికులు లాక్కున్నారు. బలవంతులదే రాజ్యమైంది. బలహీనులకు రక్షణ కరువైంది. ఆశ్రమ ధర్మాలు విస్మరించిన ప్రజలు, వావివరసలు మరచి సంకరం అవుతూంటే సంతోషిస్తూ ఈ వార్తల్ని ఎప్పటికప్పుడు తన రాజ్యానికి చేరవేయసాగాడు దుర్వినీతుడు. ఒకరోజు విజయకేతుడు అటువంటి వార్త కలిగిన పత్రికను పట్టుకుని, ధర్మపాలుని ఎదుట సాక్ష్యసహితంగా పెట్టినా, అది నిర్లక్ష్యం చేశాడా సురాపానమత్తుడైన రాజు.

ఇటువంటివే ఒకటి రెండు నిర్లక్ష్యచర్యలు, దుర్వినీతునికి మరింత చెలరేగిపోవడానికి ఆస్కారం కలిగించాయి. అతడు ఆ పట్టణంలోని ఒక ప్రధాన కూడలిలో స్థలం సంపాదించి, చుట్టూ ప్రహరీ కట్టించి, అందులోకి తమ దేశపు సేనలను రహస్యంగా చేర్పించసాగాడు.

విజయకేతుడు ఆ సంగతి గ్రహించి, రాణి సునందను హెచ్చరించడానికి ఒక ఉత్తరం రాశాడు. "అమ్మా! నీ భర్త విహారభద్రుని బోధ వల్ల రాజ్యపాలన అశ్రద్ధ చేస్తున్నాడు. దేశం భ్రష్టమైంది. దుర్వినీతుడు చోళదేశం నుంచి సైన్యాన్ని రప్పిస్తున్నాడు. ఎప్పుడో హఠాత్తుగా కోట ముట్టడించేస్తాడు. రాజ్యహానే గాక, మాన హాని కూడా సంభవించవచ్చు! ఈ దుర్వినీతుడు చోళ ప్రభువు యొక్క మంత్రి కొడుకు. నేనీ విషయాలు ఎంతగా పోరుతూన్నా మన ప్రభువులు పట్టించుకోవడం లేదు. నా మాట ఇద్దరూ వినిపించుకోరు. పట్టమహిషివి కనుక నీకు తెలియజేస్తున్నాను. దుర్వినీతుని ఇల్లు పరీక్షిస్తే, శత్రు సేనలు కనిపిస్తాయి. నువ్వు కూడా అశ్రద్ధ చేస్తే శత్రువు లొచ్చి మీద పడతారు. ముందే జాగ్రత్త పడటం మంచిది" అని రాసిన ఉత్తరాన్ని దాసీ చేత సునందకే అందేలా పంపించాడు.

విద్యావతి, రూపవతి, గుణవతి అయిన ఆ సునంద, ఆ ఉత్తరాన్ని చదువుకొని, భర్త స్థితికి విచారించింది. విజయకేతుని సుగుణ సంపత్తిని గురించి అంతకు ముందే విని ఉంది కనుక, అతని వినయవిశ్వాసాల కెంతో సంతోషించి, ప్రమత్తతతో మునిగిపోయిన ధర్మపాలునికి ఆ రాత్రంతా నీతి బోధ చేసి హితోపదేశం కావించింది. అంతకుముందు కలిగిన దుర్బుద్ధులన్నీ ఒ2క్కటే విడనాడక పోతే, అడవుల పాలౌతామని హెచ్చరించింది.

అంతేకాక, విహారభద్రుని మీద వైరాగ్యాన్ని - విజయకేతువు పైన అనురాగాన్ని కలిగించడానికి కృషి చేసింది.

మర్నాడు రాజు ధర్మపాలుడు, తనదైన పూర్వపు రాజసం-దర్పం ముఖంలో తీక్షణత కనిపిస్తుండగా సభకొచ్చి - మంత్రుల్ని రప్పించి "ఇప్పుడీరాజ్యం స్థితి గతులు ఏమిటి? ఎలా వున్నాయి?" అని అడిగాడు. విహారభద్రుడు పూర్వంలాగానే ఏదో చెప్పబోగా, తల ఊపి ఊరుకోక అవి అనర్థకారకాలని రాత్రి హితబోధ గుర్తొచ్చి "పట్టణమంతా చూడాలి! అశ్వాన్ని సిద్ధం చేయండి" అని ఆజ్ఞాపించాడు. అదీ విజయకేతుని వైపు తిరిగి ఆ మాట చెప్పేసరికి అతడు ఆనందించి "సునందాదేవి రాజు బుద్ధి మరలించిందన్నమాట!" అనుకుంటూ, వెంటనే ఆ ఏర్పాట్లు చేయించాడు.

రాజు మంత్రులిద్దర్నీ తన వెంట రమ్మని – దుర్వినీతుడ్ని కూడా వెంటబెట్టుకుని ఆ ఉత్తమాశ్వాన్ని అధిరోహించి కొంతసేపు పురవీధుల్లోని విచ్చలవిడిగా పెరిగిపోయిన జూదగృహాలు చూసి నిట్టూర్పు విడిచాడు.

తరువాత దుర్వినీతుడ్ని, 'అతడి గృహం ఎక్కడ?' అని అడిగితే, అతడు భయపడుతూ ఇంకో ఇల్లు చూపించాడు. అప్పుడు ధర్మపాలుడు అది గ్రహించి, విజయకేతుని వైపు చూశాడు. "దేవా! ఇది ఒకప్పుడు ఇతడు నివశించినది. కాని ఇప్పుడున్నది కాదు" అనడంతో, గత్యంతరం లేక కొత్తగా కూడలిలో నిర్మించుకున్న భవనం తానే చూపించాడు.

రెండో కోటవలె కట్టబడిన ఆ భవనం చూసి, ధర్మపాలుడు ఆశ్చర్యపోయి, విహారభద్రుని వైపు చూస్తూ కళ్లెర్ర చేసి గుర్రం దిగి ఆ ద్వారం తీయించమన్నాడు. తాళం చెవి లేదని దుర్వినీతుడు బొంకగా, తలుపులు బద్దలు కొట్టించి లోపలకు వెళ్లాడు.

లోపల నాల్గయిదు వేలమంది ఆయుధాలతో ఉన్నారు. వాళ్లని చూస్తూనే రాజు "ఎవరిదీ సేన?" అని అడగ్గా జంకు గొంకు లేక దుర్వినీతుడు "దేవరవారిదే' అన్నాడు. సైన్యాన్ని లోపలుంచి, తాళం వేయవలసిన అవసరం ఏమిటన్న ఆలోచన రాగానే ధర్మపాలుడు వెంటనే తలుపులు వేసేయవలసింది"గా ఆజ్ఞాపించాడు.

దుర్వినీతుడు అడ్డంగా నిలబడి లోపలి వారికేదో చేసే సైగ చేసేసరికి, తృటిలో అతడి పన్నాగాన్ని కనిపెట్టిన విజయకేతుడు భటులకు తానే ఆజ్ఞ ఇచ్చి "దుర్వినీతుడ్ని కూడ లోపలకు తొయ్యండి" అన్నాడు. భటులావిధంగా చేసి తాళం వేసేశారు.

అప్పుడా రాజు విహారభద్రుడ్ని చూస్తూ " దుర్వినీతుడి అవినీతి అంతా, నీ వల్ల పెచ్చు పెరిగిందే! దీనికి నిన్నేం చేసినా పాపం లేదు. ఇప్పుడీ ఉపద్రవం దాటాక, నీ పని చెప్తా" అని పలికి, విజయకేతుని వైపు చూసి "మంత్రి పుంగవా! మన సేనలెక్కడ? త్వరగా యుద్ధ సన్నాహం చేయించు! ఇప్పుడు తప్పక యుద్ధం జరగాల్సిందే! ఎందుకంటే- ఇదంతా చోళరాజు

కపటోపాయం అని నాకు తోస్తోంది. అతడు మనకు సహజశత్రువు. నీవు బుద్ధిమంతుడవే! నిన్ను ఉపేక్షించానని వెనుకటి కోపం ఉంచుకోక ఉపాయం సూచించు!" అని చెప్పాడు.

విజయకేతువు "అయ్యో! ఇప్పుడేది దారి? మన సేనలు ఎక్కడ ఏ స్థితిలో ఉన్నాయో తెలీదు. ఈలోగా ఇందులో వాళ్లు బైటకొస్తే ఏం చెయ్యడం?" అని ఆలోచిస్తూనే అక్కడ కొందర్ని కాపలా ఉంచి, అప్పుడే పట్టణంలో చాటింపు వేయించి, ఎక్కడెక్కడి సేనలూ రాచనగరు దగ్గరకు చేరుకోవలసిందని రాజాజ్ఞగా వెల్లడించాడు.

ఆ చాటింపు వల్ల రాజ్యరక్షణ తత్పరులైన కొందరు వడివడిగా చేరుకున్నారు. అందులో కొంత సైన్యాన్ని దుర్వినీతుని ఇంటి దగ్గర నిలిపాడు. దేశంలోని వివిధప్రాంతాల్లో ఉన్న సైన్యానికీ కబురంపాడు. కాని ఈలోగా చోళప్రభువు వసురక్షితుడు క్షణాలమీద ఆ వార్త అందుకొని, తానే సైన్యంతో వచ్చి ముందుగా ఆ పట్టణాన్ని ముట్టడించాడు. యుద్ధ భేరీ మోగించాడు.

విజయకేతుడు ప్రభువు దగ్గరకెళ్లి నమస్కరిస్తూ "దేవా! వసుమిత్రుడు చతురంగ బలాలతోను వచ్చి పట్టణం ముట్టడించాడు. మన ప్రయత్నంలో లోపమేమీ లేదు. ఉన్న సైన్యాన్నే సర్దాను. కోటతలుపులు అన్నీ మూయించాను. బురుజుల మీద ఆయుధవీరుల్ని నిలబెట్టాను. కానీ మన పని 'గతజలసేతుబంధనం'లా అయింది. నీళ్లు అన్నీ ప్రవహించి వెళ్లిపోయాక వంతెన కట్టిన చందం అయింది. ఓపిక ఉన్నంత వరకు పోరాడదాం! కాని కోటలో ఉన్న రహస్య మార్గాలు తెరిపించే యోచన కూడా పరిశీలించండి! అంతఃపుర కాంతలైనా మానప్రాణాలు దక్కించుకోగలుగుతారు" అని వివరించాడు.

ధర్మపాలుడు అది విని, శోకం తక్కువగా విచారగ్రస్తుడై "ఆహా! ఉపేక్ష ఎంతకు తెచ్చింది? ఇక ఇప్పుడు వగచి లాభం లేదు" అనుకుని, ఆ ఏర్పాట్లు చేయించాడు.

అది చూసి అంతఃపురకాంతలంతా గొల్లుమన్నారు. అప్పటికి

ధర్మపాలునికి మూడేళ్లప్రాయంగల ఒక కొడుకు ఉండటమే గాక, రాణి తిరిగి తొమ్మిదినెలల గర్భంతో ఉంది. అటువంటి సమయంలో ఈ అవస్థ వచ్చింది.

ఈలోగా రణభేరీ ధ్వనులు పట్టణంలో వినవచ్చాయి. కోట ముట్టడించినట్లు కూడా తెలిసింది. భయంతోనే ధర్మపాల- విజయకేతువులు ఆయుధాల ధరించినా, శత్రుసైన్యాన్ని పౌరుషం తెచ్చుకుని "విజయమో వీరస్వర్గమో! పోరాడి తీరాలి" అని ధైర్యం తెచ్చుకున్నారు. శత్రువులు కోట దరిదాపులకు చేరకుండా కొంతసేపు ఆయుధాలు ప్రయోగించారు.

దుర్వినీతుడికి కోట గుట్టు - మట్లు అన్నీ తెలుసు కనుక రాజూ - మంత్రీ లేని వైపునుంచి తుపాకులతో కాల్పించాడు. ఆ చప్పుళ్లకు కోటలోని స్త్రీలు తల్లడిల్లసాగారు. రాజూ - మంత్రీ కూడా తుపాకులు కాల్చసాగారు. కాని సముద్రంలా ఆవరించి ఉన్న సేనని అంతం చెయ్యలేకపోయారు.

శత్రుసైన్యం రెండోదారిన లోపల ప్రవేశిస్తూంటే, విజయకేతుడు విచారించి, బాలుడైన రాకుమారుడినీ - నిండు చూలాలైన రాజపత్నినీ రహస్యమార్గంలో కోట దాటించాడు. ఆ తొందరలో సునంద అనే రాజపత్నీ - రత్నావతి అనే దాదీ ఒక వైపు; రాకుమారుడ్ని ఎత్తుకున్న నింబవతి అనే దాదీ ఇంకో వైపూ వెళ్లిపోయారు. అందువల్ల ఒకరిజాడ మరొకరికి తెలీలేదు.

బలవంతంగా రెండోదారిన వచ్చిన శత్రుసేన, కోటలోకి ప్రవేశించేసరికి ధర్మపాలుడు పారిపోయత్నం చేశాడు. కాని దుర్వినీతుడు తన సేనతో వచ్చి చుట్టు ముట్టి కదలనీయలేదు.

ధర్మపాలుడు దుర్వినీతుడిని చూసి "ఓరీ దుర్మార్గా! ఇలాటి ద్రోహం నువ్వు చేస్తావని తెలీక, నీకు ఉద్యోగం ఇచ్చినందువల్ల కదా- ఇటువంటి దుర్మార్గానికి, వెన్నుపోటుకి సాహసించావు. కానీ - దేవుడు నీకు ఎప్పటికైనా ఆపదలు తెచ్చిపెట్టకపోతాడా? నువ్వయినా ఎల్లకాలం ఇలాగే ఉండిపోతావా? మోసం చేసి హఠాత్తుగా మీద పడి గెలవడం పౌరుషం అనిపించుకుం టుందా? సమయం తగినంత ఉండి, నా సేనలు వచ్చేవరకు ఆగితే నీ

పాటవమెంతో చూసేవాడిని, మాకిది ఆపత్కాలం, విజయకేతుడి మాటలు వినక, విహారభద్రుని నమ్మినందుకు నాకు మంచి ప్రాయశ్చిత్తమే జరిగింది" అంటూ రకరకాలుగా నిందించాడు.

ఇన్ని విధాల దూషిస్తున్నా, దుర్వినీతుడు కిక్కురుమనకుండా ధర్మపాలునికి సంకెళ్లు తగిలించి తీసుకుపోయాడు. వసురక్షితుని సైన్యం విజయసూచక కోలాహలం చేసింది.

విజయకేతుడిని కూడా బంధించాలని శత్రుసేనలు ఎంతో గాలించాయి కాని, అతడెక్కడా కనిపించలేదు. వసురక్షితుడు కోటను వశపరచుకున్నాక దుర్వినీతుడిని కొంత బలగంతో అక్కడే ఉంచి, తానూ విహారభద్రుడు కలిసి తాము బందీని చేసిన ధర్మపాలుని తీసుకొని వెళ్లిపోయి అతడ్ని ఒక కారాగారంలో పెట్టారు.

## అదృష్టదీపుడి కథ

రాజపత్ని సునంద యొక్క పుత్రుడ్ని ఎత్తుకున్న నింబవతి అనే దాది అరణ్యమార్గాన తనదైన వేగంతో పరుగెడుతూ - మధ్య మధ్య శత్రువులు తరుముతున్నారేమో అని అప్పుడప్పుడు వెనక్కు చూసుకుంటూ ఒక పగలూ - రాత్రీ గడిచేసరికి సూర్యోదయం వేళకు ఒక కీకారణ్యంలోకి ప్రవేశించింది.

విశ్రమించకుండా పరుగుతీయడం- భుజాన భారం ఉండటం వల్ల ఆమె అపారమైన అలసటతో ఇక ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేని స్థితిలో ఒక చెట్టునీడన పిల్లవాడిని పక్కన పెట్టుకుని అలసట వల్ల వెంటనే నిద్రపోయింది. కొంతసేపటికి ఆ చెట్టు తొర్ర లోంచి బైటకొచ్చిన పాము ఆమెను కాటువేసి, పిల్లవాడి శిరస్సున పడగపట్టింది.

దాది నింబవతి వెంటనే మరణించింది. పడగ పట్టి ఆ బాలుడికి నీడ కల్పిస్తూన్న ఆ కృష్ణసర్పాన్ని గొల్లలు చూశారు. ముద్దుల మాటగట్టేలా ముచ్చటగా ఆడుకుంటూన్న ఆ బాలుడ్ని చూసి, అదిలించి సర్పాన్ని తరిమేసి, ఆ పిల్లవాడిని ఎత్తుకొని ఊళ్లోకి తీసుకుపోయారు. తమ పెద్దలకా పిల్లాడిని

అప్పగించారు. వారి కులపెద్దకు సంతానం లేకపోవడంతో, అతడే ఆ బాలుని పెంచసాగాడు. ఆ గొల్ల పెద్ద పేరు - పింగళకుడు. పాడికి లోటులేని ఇంట అడుగుపెట్టినందున బాలుడికి బాల్యం నుంచీ వెన్న మీగడలు సమృద్ధిగా దక్కాయి. కృష్ణసర్పం పడగపట్టి కాచినందువల్ల ఆ బాలుడు అదృష్టవంతుడవుతాడని నమ్మకం గనుక, అతడికి అదృష్టదీపుడని పేరు పెట్టి పెంచసాగారు.

బాల్యంలో అందరిలాగానే అల్లరిచేసినా, ఐదేళ్లురాగానే కులపెద్ద గ్రామంలోని వీధి బడిలో చదవేస్తే, ఏకసంథాగ్రాహి అయిన అదృష్టదీపుడు ఆ చదువు ఇట్టే నేర్చేసుకున్నాడు. క్రమంగా తన బుద్ధిబలంతో అక్షరాలు మాత్రమేగాక రాయడం-చదవడం సాధన చేశాడు. ఆ పల్లెలో చదువు చెప్పేవానికి అక్షరాలు తప్ప ఇంకేమీ రావు.

ఎనిమిదేళ్ల వయసులో - అదృష్టదీపుడు తోటిపిల్లల్తో సహా పశువులను అడవికి మేతకు తీసుకెళ్లి సాయంత్రం వరకూ వాటిని మేపి ఇంటికి తీసుకొచ్చేవాడు. రాత్రివేళ పింగళకుని తల్లి పండుముసల్ది ఆ పిల్లవాడికి రకరకాల రాజుల కథలు చెప్తే ఆసక్తిగా వినేవాడు. అట్లా ఆ అడవిలో ఉన్నప్పటికీ అతనికి లౌకిక మర్యాదలన్నీ చక్కగా అలవడ్డాయి.

యవ్వనం వచ్చే వేళకు గొప్ప అందగాడిగా తయారైన అదృష్టదీపుడు, తోటివారితో కలసి అడవికి వెళ్లినపుడు అవ్వ చెప్పిన కథలను గుర్తుచేసుకొనేవాడు. ఆ కథల్ని బట్టి చూస్తే ఈ భూమ్మీద విచిత్రమైన పట్టణాలు, గ్రామాలు, రాజులు, రథాలు, సేనలు, గుర్రాలు మొ॥ ఎన్నో ఉన్నాయని తెలుస్తోంది. కాని, ఈ అడవిలో మాత్రం ఏమీ కనబడవు. భూమ్మీద ఒకడు సేవకుడుగా, మరొకడు పాలకుడుగా ఉండడానికి ఏం కారణమో? మనుష్య జాతి అంతా ఒకటే కదా! నేను పుట్టిన వార్ని పోలక, ఇంకోలా ఉండడానిక్కారణమేమిటి? పల్లెలో ఒక్కరూ నాలాగ ఉండరే! సరే! నా బుద్ధి బలంతో ఈ ఊరంతా నా అధికారానికి లోబడి ఉండేలా చేసుకొంటాను" అని ఆలోచించాడు.

పల్లెలోని యువకులందరినీ పిలిచి "మనం ఇలా అడవిలో ఖాళీగా తిరగడం దేనికి? నేనొక ఆట చెబుతాను. మీరంతా నేను చెప్పినట్లు నడుచుకుంటారా?" అని అడిగాడు. వాళ్లు "సరే"నన్నారు.

"ఈ భూమిని పాలించే రాజు ఒకడుంటాడు. అతనికి మంత్రీ భటులూ ఉంటారు. ఆ రాజు చక్కగా ప్రజాపరిపాలన చేస్తుంటాడు. మనమూ అలాగే అనుకుందాం! నేను రాజును! వీరు మంత్రులు. వీళ్లు పరిచారకులు. వీళ్లంతా ప్రజలు. ఇలా అడవిలో ఆడుకుందాం! చాలా చిత్రంగా ఉంటుంది" అన్నాడు. వాళ్లు సంతోషించారు.

అప్పుడు ఒక విశాలమైన మర్రిచెట్టు క్రింద వాళ్ల చేతనే చక్కగా బాగుచేయించి ఎత్తుగా కర్రల్తో మంచెను సింహాసనంలా కట్టించాడు. దాని చుట్టూ రాజసభను పోలిన రీతిలో ఎవరెవరు ఎక్కడ కూర్చోవాలో, మంత్రులకు సామంతులకు ఆసనాలు కర్రలతోనే తయారు చేయించాడు. పల్లెలోగల ఆ యువకుల్లోనే కొందరిని - సామంతులుగా, మరి కొందరిని ప్రజలుగా, ఒకరిద్దర్ని మంత్రులుగా - సేనాపతులుగా నిర్ణయించి రాజ్యపాలన అనుకరిస్తూ అధికారం నటిస్తూ ఆటాడసాగారు. ఈ ఆట ఉదయం నుంచి సాయంత్రం వరకు సాగేది. అక్కడా నేరాలూ-శిక్షలూ-ఆజ్ఞలూ-ఉద్యోగాలూ అన్నీ యధావిధిగా రాజాస్థానాన్ని పోలి ఉండేవి.

అదో కీకారణ్యం కనుక అక్కడికి దారి తప్పి ఎవరైనా రావలసిందే గాని అక్కడ ఏదో ఒక పనిమీద వచ్చేవారెవరూ లేరు. గ్రామానికీ పట్టణానికీ చాలాదూరం అది.

ఒకరోజు సింధుదేశపు రాజు వేటకు ఆ అడవికొచ్చాడు. శిబిరాలు వేయించి, రెండు మూడు రోజులు అక్కడ వేటాడుతూ ఉండిపోయాడు.

ఆ విషయం తన వారి ద్వారా తెలుసుకున్న అదృష్టదీపుడు, తేనె వెదురుబియ్యం, చారపప్పు, ముత్యాలు, చామరాలు వంటి వస్తువులన్నీ సేకరించి ఒక మూట కట్టించి ఒక వినతి పత్రికను ఇచ్చి ఆ సింధుదేశ ప్రభువుకు పంపించాడు అందులో-

"సింధుదేశ మహారాజులుంగారికి, అమరావతీ చక్రవర్తి అదృష్ట దీప మహారాజు చేయు వినతిపత్రిక.

తాము మా అడవికి వచ్చినందుకు మాకెంతో సంతోషం కలిగింది. ప్రస్తుతం మీ దర్శనం చేయడం అనివార్యకారణాల వల్ల మాకు వీలుపడలేదు. మీ మైత్రి కోరి మా జ్ఞాపకార్థం ఈ అటవీ వస్తువులు పంపుతున్నాం! ఈ అడవిలో మీరు ప్రవేశించినా - నివశించినా అందుకు మాకు ఏ విధమైన పన్ను చెల్లించనక్కర్లేదు. మమ్మల్ని గుర్తుంచుకోడమ మాకు ముఖ్యం. ఇవే పదివేల నమస్సులు" అని ఉంది.

సింధురాజు అది ఏదో తేలిగ్గా భావించక, నిజంగానే అలాటి అమరావతి ఉందనీ, దానికి అదృష్టదీపుడనే చక్రవర్తి ఉన్నాడనీ అనుకుని చక్రవర్తి కనుక తనకంటే అధికుడనీ భావించి, తనకు ఆయన చేసినట్టి మర్యాదకు చాలా సంతోషించి అతడు పంపిన కానుకలు స్వీకరించాడు.

అదృష్టదీపుడు పంపిన ఉత్తరానికి సమాధానంగా -

"అమరావతీ చక్రవర్తుల దివ్యసన్నిధికి,

తాము పంపిన కానుకలు - లేఖ అందాయి. మా పట్ల తాము చూపిన అనురాగానికి ఎంతో సంతోషించాము. వాటిని మీ జ్ఞాపకార్థం సదా తలుస్తాం! మీరూ మమ్మల్ని మర్చిపోరాదు. మేము పంపుతున్న ఈ చిరుకానుకలను స్వీకరిస్తూ, ఎప్పటికప్పుడు మీ వార్తలు తెలుపుతూ మైత్రి కొనసాగించగలరు" అని రాసి సింధుదేశపు రాజు ఒక ఏనుగు, రెండు ఒంటెలు, నాలుగు గుర్రాలు, మణులతో ఉన్న పతకం, పట్టు వస్త్రాలు కానుకగా ఆ లేఖ తెచ్చిన గొల్లయువకునితో అదృష్టదీపునికి పంపాడు.

ఆ ఉత్తరం వస్తుందని గాని - అలా కానుకలు అందుకుంటానని గాని అదృష్టదీపుడు ఊహించలేదు. ప్రతిస్పందన భేషుగ్గా ఉందని సంతోషించినా, వాటిని స్వంతానికి ఉపయోగించక తన బుద్ధిబలంతో రాజోచితమైన ఇంకొక సాహసచర్యకు శ్రీకారం చుట్టాడు.

అవ్వ ద్వారా అతడెందరో రాజుల పేర్లు విని ఉన్నందున వెంటనే నేపాళదేశపు రాజుగారికి ఒక ఉత్తరం రాసి, వారిలో మైత్రి

అభిలషిస్తున్నానంటూ సింధురాజు ఇచ్చిన కానుకలను అట్నుంచటే ఆయనకు పంపాడు.

నేపాళరాజు అదృష్టదీపుడితో మైత్రికి అంగీకారం తెలుపుతూ ప్రతిగా లేఖతో పాటు రెట్టింపు కానుకలు అందజేశాడు. అదృష్టదీపుడు వాటన్నిటీ్నీ విదర్భరాజుకు పంపగా, అతడు కూడా మైత్రిని అంగీకరిస్తూ తిరిగి రెట్టింపు కానుకల్ని పంపాడు.

ఇట్లాగే అదృష్టదీపుడు ప్రతి రాజుకూ పంపుతూండడం వల్ల అతని పేరు, అచిరకాలంలోనే భూమ్మీద అంతటా వ్యాపించింది. అంతేకాకుండా వేలకొద్దీ గుర్రాలూ, ఏనుగులూ, ఒంటెలూ, రాశులకొద్దీ రత్నాలూ కానుకలుగా రావడంతో, వాట్లో కొన్నిటిని అమ్మించి ఆ డబ్బుతో చాలా పట్టణాల్లో తన పేరిట సత్రాలు కట్టించాడు.

అడవిలోని తన గొల్లపల్లె యువకులకు మంచి దుస్తులు ఇప్పించడం, వారికి గుర్రపు స్వారీ, ఏనుగుల్ని స్వాధీనంలోకి తెచ్చుకోవడం వంటి విద్యలు నేర్పించాడు. కేవలం వెదురు ఆసనాలతో వాటిపై కూర్చొని రాజ్యం చేస్తున్న అదృష్టదీపునికి నిజంగానే చాలామందికి ఎక్కువ అదృష్టం ఉందని-అతనిమాట మీద గురికుదిరిందా పల్లెవాళ్లకు. అక్కడ అతడేం చెప్తే అదే వేదం. అతడి ఆజ్ఞ వాళ్లు తక్షణం అమలు చేస్తారు.

ఒక్కొక్క రాజు దగ్గర్నుంచీ వచ్చే కానుకలు పరిమితి దాటి లభిస్తూండటంతో, ఒక్కోసారి వాటిని చెరిసగం చేసి ఇద్దరు రాజులకి పంపేవాడు. రాజుల జాబితాలో – మళ్లీ విదర్భ, నేపాళ, తదితర రాజులతో మైత్రి కొనసాగించడానికి కొన్నాళ్ల తర్వాత మొదట పంపినవారికే కొత్తకానుకలు పంపిస్తూండేవాడు. ఆయా రాజధానుల్లో పండుగలకు దానధర్మాలకై కొంత వెచ్చించేవాడు.

ఇదొక క్రమపద్ధతి ప్రకారం నిరంతరం సాగిస్తూండే చర్యకావడంతో అదృష్టదీపుని ప్రఖ్యాతి మొత్తం రాజ్యాలన్నిటా మారుమోగసాగింది. అతనికి అందిన ప్రతి కాసునూ, తిరిగి ఇంకొకరికి వినియోగించడమే తప్ప స్వంతానికి

ముట్టుకొనేవాడు కాడు. ఆ మఱ్ఱిచెట్టు తన సరదా రాజ్యం ఏనాడూ విస్మరించేవాడు కాడు.

ఇలా రెండు – మూడేళ్లు గడిచాయి. భూమ్మీద చాలామంది రాజులు అతని స్నేహితులయ్యారు. ఎక్కడ చూసినా అతని పేరే మార్మోగుతుంది.

ఓరోజు అన్ని రాజ్యాల రాజులూ, కాశీరాజ్యానికి విశ్వేశ్వర మహాదేవుని పూజా మహోత్సవం కోసం కాశీ వచ్చారు. అప్పుడు అంతా కలిసి మాట్లాడుకోవడంలో అధికభాగం అమరావతీ చక్రవర్తి అదృష్టదీపుని గురించే చర్చ జరిగింది. ప్రతివారూ ఆ చక్రవర్తి తనకు మిత్రుడంటే తనకు సన్నిహితుడని చెప్పుకుని మురిసిపోయారు.

చక్రవర్తిగారొస్తారేమోనని రాజులందరూ ఎదురుచూశారు. కాని అతని జాడలేదు. రాజులందరూ అతడ్ని ప్రస్తుతించడంతో ఎక్కడివాడీ అదృష్టదీపుడు? అమరావతి అనే రాజధాని ఏ దేశంలోది? అతనికెంత భూమి ఉంది? బలగం ఎంత?....మొదలైన ప్రశ్నలు ఉత్పన్నమయ్యాయి. రాజులందరూ సభచేశారు. చక్రవర్తిగారి వివరాలు ఇంతకాలం తెలుసుకోనందుకు చాలా చింతించారు. మనందరికీ మిత్రుడు సౌజన్యమూర్తి అయిన ఆ ప్రభువు వృత్తాంతం ఏమీ తెలియడం లేదు. ఎలా? ఆయన ఎక్కడికీ రాడు. మనమే పోయి చూడాలి. లేఖలను బట్టి సుగుణాల ఖని అని అర్థమవుతోంది. అతని సత్రాలు ఈ కాశీపురిలోనూ ఉన్నాయి. గనుక వాటి అధికారులకు వారి ప్రభువు గురించి తెలీకపోదు" అనుకుని వారిని పిలిపించి అడిగారు.

కాశీలోనే అదృష్టదీపునికి చెందిన నాలుగు సత్రాలున్నాయి. ఒక్కసారే లక్షల కొద్దీ ధనం ఇచ్చాడు. కేవలం దాని వడ్డీ మీదనే అవి నిర్వహించ బడుతున్నాయి. కనుక వాటి నిర్వహణకు అసలు యజమాని అవసరమే కలగడం లేదు. అదృష్టదీపుని గురించి ఏమీ తెలియకనే ఆ సత్రాలు నిరాటంకంగా సాగుతున్నాయి. ఇది రాజులందరికీ చిత్రాతి చిత్రంగా తోచసాగింది. అయినప్పటికీ సభకు పిలిపించినందున ఆ అధికారులను "ఇవి ఎవరి సత్రాలు?" అని అడిగారు.

"అదృష్టదీప చక్రవర్తుల వారివి " అన్నారా అధికారులు.

"వారి నివాసం"

"మాకు తెలీదు. కానీ మహాప్రభువులు ఎక్కడో ఉండి, ఎంతో కార్యభార నిర్వహణలో ఉండి ఉంటారు."

"మరి మీకు నిత్యం కావలసిన డబ్బు - ఎక్కడ్నుంచి వస్తోంది?"

"వారు సత్రం నిర్వహణ నిమిత్తం ధనం మీది వడ్డీయే చాలా వస్తోంది."

"ఆదాయ-వ్యయ లెక్కలు పరిశీలింపచేయరా?"

"ఆయనకు మనుషులపై విశ్వాసం మెండు! ఎవరైనా తినడానికే కదా - సత్రం ఉన్నది. ధర్మకార్యనిర్వహణలో అవినీతికి తావుండదు".

వాళ్లని పంపించేశాక, అందరికీ ఆయన గొప్పదనం మరింత విశదంగా అర్థమైంది. ఆ చక్రవర్తి నిజంగా వందనీయుడే! చూసి తీరవలసిన వాడే! కానీ...ఎక్కడ? ఎలా? వివిధరాజ్యాల పటాలు తెప్పించారు. వాట్ని ఒకదాని సరిహద్దులకు ఒకటి చేర్చుకుంటూ పోతున్నారు. ఏ భూభాగంలోనూ ఖాళీ అన్నదే సరిహద్దులకు తగలకుండా మిగలడం లేదు.

అన్ని దేశాలు కలిగిన జంబూ ద్వీప భూభాగం గల పటం పరిశీలించినా, అమరావతి జాడ లేదు. "ఏవైనా పర్వతాలకు ఆవల ఉన్న దేశమా? కానుకలు తెచ్చినపుడైనా ఆ దూతల్ని అడగకపోయామే!" అనుకుంటూ విచారించారు.

అదృష్టదీపుని వృత్తాంతం తెలుసుకోడానికి ఎన్ని రకాల ప్రయత్నించినా సాధ్యం కాకపోవడంతో "ఈసారి అదృష్టదీపుని నుంచి మనలో ఎవరికి కానుకలు వచ్చినా, ఆ వచ్చినవారితో కూడా మన భటులను పంపి ఆయన దేశం తెలుసుకోవాలి" అని తీర్మానించుకుని తమ తమ దేశాలకు వెళ్లిపోయారు.

ఒకనాడు - అదృష్టదీపుడు పాండ్యదేశ రాజైన మలయధ్వజ

మహారాజుకి పదివేల గుర్రాలు, ఆరువేల ఒంటెలు, రత్నహారాలు, వాహనాలు పంపేసరికి, ఆ రాజు ఆశ్చర్యపోయి, "ఆ చక్రవర్తి పంపిన కానుకల విలువకు నేనేం తిరిగి పంపగలను? నా ఐశ్వర్యం మొత్తం సరిపోతుందో లేదో! ఇక ఆయన ఐశ్వర్యం ఎంతటిదో! ఆయన దర్శనం చేసుకుంటేనే జీవితం ధన్యమవుతుంది. నేను స్వయంగా వెళ్లి ఆ మహాపురుషుని పాదాలపై పడి క్షమించమని కోరాలి" అనుకుని, కానుకలు తెచ్చిన కింకరులతో ఇలా అన్నాడు.

"చక్రవర్తిగారి భటులారా! ప్రభువుల వారి సత్కారానికి నేను తలమునకలయ్యేంత సంతోషంతో ఉన్నాను. ఆయనకు ప్రతిసత్కారాన్ని అందించగల స్థితిలో నేను లేను. స్వయంగా వచ్చి ఆయన పాదాలపై పడతాను. వారి దర్శనమే పుణ్యం! ఆ దేశానికి ఎలా వెళ్లాలి? అది ఎక్కడ ఉంది? అమరావతికి దారేది? నాకు ప్రభువుల వారి దర్శనం ఇప్పిస్తారా?"

అంత భక్తిగా – వినయంగా పాండ్యరాజు అడిగేసరికి అదృష్టదీపుడు భటులు "దేవా! వారి పేర లేఖ రాసి ఇవ్వండి! ముందుగా అనుమతి పొందాలి. మీకు అంత ఉత్సాహంగా ఉంటే ఉత్తరం ఇవ్వండి. మేము ప్రత్యుత్తరం తెచ్చి ఇచ్చాక, ఆ ప్రకారం జరిగించవచ్చు!" అన్నారు.

పాండ్యరాజు అందుకు అంగీకరించి ప్రార్థిస్తూ ఉత్తరం రాశాడు. వస్తువాహనాలతో కూడా తన భటులు కొందరిని పంపి జవాబు తెమ్మని ఆజ్ఞ చేశాడు.

ఇటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు ఏం చేయాలో తన వారికి అదృష్టదీపుడు ముందుగానే చెప్పి ఉంచడం వల్ల, వారిలో కొందరు ముందుగా అదృష్టదీపుడి దగ్గరకొచ్చి మలయధ్వజుడి దూతలు వస్తున్నట్లు చెప్పారు. తన గుట్టు బయటపడితే, ఇప్పటిదాకా వచ్చిన కీర్తికి చేటు కలుగుతుంది కనుక, ఇప్పుడా భటులను రానివ్వకూడదనుకున్నాడు. తానిప్పుడు తీర్థయాత్రలకు వెళ్లినట్లు–ఆయన తిరిగొచ్చాక ఉత్తరం తామే రాస్తామనీ, అప్పుడు రావచ్చునన్నట్లు మంత్రి చేత ఉత్తరం రాయించాడు. ఎదురొస్తున్న మలయధ్వజుడి భటులకు అందజేయిస్తూనే ఆ ఉత్తరంలోనే "మలయధ్వజుడు

పంపిన ద్రవ్యాన్నంతట్నీ దానధర్మాలక్రింద ఒక్కరోజులో పుణ్యక్షేత్రాలలో పంచిపెట్టవలసిందని ప్రభువుల ఆజ్ఞ" అని మంత్రి రాసినట్లుగా రాయించాడు.

అదృష్టదీపుడు లేనపుడు వెళ్లడం దేనికి అనుకున్న ఆ భటులు వెనుదిరుగుతూ "ఆహా! దాతృత్వం అంటే అదీ! అలా ఉండాలి ఒక్కరోజులో అంత ధనాన్నీ పంచేయమన్నాడంటే, చక్రవర్తిగా అతడెంత ఉన్నతుడో"నని ఆ అద్భుత చర్యలు వర్ణించి, వివరించి మరీ తమ దేశంలో చెప్పుకున్నారు మలయధ్వజుని భటులు.

అదృష్టదీపునికి ఇరవయేళ్లొచ్చాయి. అవ్వ ద్వారా తన జన్మరహస్యం తెలుసుకున్నాడు. అవ్వ చెప్పిన మాటల ప్రకారం–"పాముకరిచి చనిపోయింది తన తల్లే కాబోలు" అనీ, తండ్రీ–తల్లివైపు బంధువులూ ఎక్కడో ఉండే ఉంటారనీ అర్థం చేసుకున్నాడు. కాని, తన కులమేమిటో గోత్రమేమిటో తెలిసే అవకాశం లేనందుకు విచారించాడు.

తనకు ఎంతో ఆప్తుడిగా మెలుగుతున్న ప్రియమిత్రుడు బలభద్రునితో మాత్రం తనవాళ్లను వెతుక్కుంటూ వెళ్తున్నామని–సిద్ధంగా ఉండవలసిందని చెప్పి తనకు కానుకలుగా వచ్చిన ఉత్తమాశ్వాలలో మేలుజాతి గుర్రాన్ని ఒకదాన్ని ఎంపిక చేసుకుని; మిత్రుడికీ అటువంటి గుర్రమే ఇచ్చి ఓరోజు అడవినుంచి అంతర్ధానమయ్యారు అదృష్టదీపుడు, అతని మిత్రుడు.

బలభద్ర–అదృష్టదీపులిద్దరూ కొన్నాళ్లకు విదర్భదేశపు రాజధాని భర్మపురం చేరుకున్నారు. దానికి పాలకుడు అనంత వర్మ. ఆ పట్టణంలో విదేశీయుల కోసం కట్టించిన సత్రం అదృష్టదీపుడు నిర్మింపజేసినదే అని తెలిసి, అక్కడికెళ్లాడు. సత్రపు అధికారులు గొప్ప మర్యాద చూపారు. విదేశీయులెవరొచ్చినా అతిథి సత్కారాలు ఎంత ఉన్నత స్థాయిలో ఉండాలో, ఆ విధానాలు ఏర్పరచి, అవి అమలు జరగాలని ఆజ్ఞ వేసింది అదృష్టదీపుడే! అయితే వచ్చినవాడు ఆ సత్రం నిర్మాత అని వారికి తెలియదు. తెలిస్తే ఇంకెంత స్వాగత సమ్మానాలూ–ఉపచారాలూ ఉండేవో!? సాధారణంగానే

మర్యాదలు చాలా బాగా అమలు జరుగుతున్నాయి. తాను ప్రచ్ఛన్నంగా చూసి సంతృప్తి చెందాడు.

ఆ సత్రంలో ఎక్కడెక్కడి దేశాల నుంచో చేరి, తమ-తమ పనుల మీద ఆయా రాజ్యాలలో అడుగుపెట్టిన వారంతా, ఆయన ఘనకీర్తిని వేనోళ్ల పొగుడుతున్నారు. పరోక్షంగా అదృష్టదీపుడు అవన్నీ విని ఆనందించాడు. అదృష్టదీపచక్రవర్తి తీర్థయాత్రల నిమిత్తం వెళ్లాడని తెలిసి, కొందరు ఆయనను కేవలం అర్థించడానికే, ఆయన ఏ తీర్థంలో నన్నా కన్పించడా? భూరి దానాలు ఇవ్వడా అనుకుని బయల్దేరిన వాళ్లూ ఉన్నారు.

ఆ పట్టణంలో అదృష్టదీపుడికో సాముద్రిక వేత్త అయిన సన్యాసి తారసపడి; అతడి హస్తరేఖలు చూసి "ఆహా! ఇటువంటి చేతిని నా జన్మలో చూడలేదు. నువ్వు అదృష్టదీపుడంత కీర్తిపొందుతావు. నీ తల్లీ - తండ్రీ బ్రతికే ఉన్నారు. నీకో సోదరుడు కూడా ఉండాలి" అని చెప్పి "నీకు చక్రవర్తి యోగం ఉంది. అది ఈ సరికే మొదలైంది" అనీ అన్నాడు.

అయితే, అవ్వ చెప్పినట్లుగా పాము కరచి చనిపోయింది దాది అయి వుంటుందని ఊహించి, తనకో తమ్ముడున్నందుకు ఆనందించాడు.

## కాంతిమతి కథ

అదృష్టదీపుడికి సన్యాసి చెప్పిన మాటలన్నీ ఆ పట్టణపు రాజు కూతురైన కాంతిమతి యొక్క చెలికత్తె ఒకర్తె వినడం తటస్థించింది. తన ప్రియసఖికి అనుకూలుడైన భర్త దొరకగలడా? లేడా? తెలుసుకోదలచి వచ్చిందామె. దాని పేరు చతురిక. సన్యాసి చెప్పిన లక్షణాలు అదృష్టదీపుడిలో ఉండడం తాను స్వయంగా చూసి, ఆశ్చర్యపడి, ఆ సౌందర్య సంపన్నుడిని గురించి రెండు మూడు రోజులపాటు అనుసరించి తెలుసుకుంది. అతడి మాట, నడవడి అన్నీ పరీక్షించి కాంతిమతికి తగ్గ వాడితడే అని నిర్ధారించుకుంది.

"సన్యాసి దర్శనానికి వెళ్లి, ఇన్ని రోజులేం చేస్తున్నావు?" అని అడిగిన రాకుమార్తె ప్రశ్నకు జవాబుగా "సఖీ! నేనా సన్యాసి వద్దకెళ్లాను కానీ,

నిజానికి ఆయనేం చెప్పనక్కర్లేదని-భగవంతుడే అక్కడికొక అందగాడిని పంపాడనుకుంటున్నాను. నేను వెళ్లే సమయానికి ఒక రాచఠీవి గల యువకుడు- మారువేషంలో ఉన్న రాజేనేమో కూడా.....అతని చేత చెయ్యి చూపించుకుంటూన్నాడు. అతని రేఖలు చూస్తూనే ఆ సాముద్రిక వేత్త అబ్బురపాటు ఇంతా - అంతా కాదు. అతడు భూమండలమంతా ఏలగలడనీ-అదృష్టదీపుడంత కీర్తి మంతుడు కాగలడనీ సంబరంగా చెప్పాడు. ఇక ఆ యువకుడి గురించి విను. సౌందర్యంలో జయంతుడు-మన్మధుడైనా అతనికి సాటి రారు. నూనూగుమీసాల నూత్నయవ్వనుడు. అతడి చర్య-చేష్ట-వైఖరి కనిపెట్టడానికి రహస్యంగా అతడ్ని వెన్నంటి మూడు రోజులు తిరిగాను. అతడికో మిత్రుడున్నాడు. పేరు బలభద్రుడు. వాళ్ల సంభాషణను బట్టి అతడెవరో ప్రఖ్యాతపురుషుడనీ- ఏ కారణం చేతనో మారువేషంలో తిరుగుతున్నాడనీ తోచింది నాకు. అయితే తల్లిదండ్రులు- సోదరుని కోసం వెతుకుతున్నాడు కాబోలు! వారిని గురించిన పరితాపం అతని మాటల్లో కనిపించింది" అని చెప్పి "అమ్మాయి! నువ్వు ఒక్కసారి గనుక అతడ్ని చూస్తే విరహవేదనతో వేగిపోవడం ఖాయం" అని ఊరించింది.

చతురిక అసాధారణంగా అలా పొగడదు. అది బాగా ఎరిగున్న కాంతిమతి "నువ్వింతగా చెబుతున్నావంటే, అతడ్ని చూడాలని నా మనస్సు చాలా తొందరచేస్తోంది. ఎప్పుడు చూపుతావు?" అంటూ కాంతిమతి ఉత్సాహంగా అడిగింది.

"నేను ఆయన్ని ఒప్పించి, చిత్రపటాన్ని లిఖించి తెస్తాను. అది నచ్చితే అప్పుడు ప్రత్యక్షంగా చూద్దువుగాని-నీకై నీవు తొందర పడితే, రాచబిడ్డవు- పలచనైపోగలవు. కాస్త తాళు!" అని ఆమె ఆరాటానికి పగ్గం వేసి చిత్రరచన సామగ్రితో బయల్దేరిందా చతురిక.

బలభద్రునితో సంభాషిస్తున్న అదృష్టదీపునికి నమస్కరించి, "నాకు చిత్రపటాలు రాసే నేర్పుంది. చక్కని రూపం గలిగిన వారి చిత్రపటాలు వేసి అమ్ముకుంటూ జీవనం సాగిస్తూంటాను. తాము నా ప్రార్ధన మన్నించి తమ రూపం చిత్రించడానికి అనుమతివ్వండి" అని కోరింది.

"నా పేరు హరిదాసు! ఏదో ఊళ్లు పట్టి తిరుగుతూన్న వాణ్ణి.

సామాన్యుణ్ణి! ప్రయాస తప్ప నా రూపం వల్ల ఏం లాభం?" అన్నాడు అదృష్టదీపుడు.

దాన్ని బట్టి అతడేదో దాస్తున్నాడని గ్రహించేసిన చతురిక "అయ్యా! నాకిది ప్రయాసకాదు. ప్రమోదమే! మీ వల్ల నాకు మేలు జరుగవచ్చునన్నది నా ఊహ! దయచేసి అనుగ్రహించండి. కొద్దిసేపు స్థిరంగా అలా నిల్చుంటే చాలు! మీ ప్రతిబింబాన్ని రంగుల్లోకి అనువదిస్తాను" అని నైపుణ్యంగా అతడ్ని ఒప్పించింది. ఏదో బతుకు తెరువుకోసం అంతగా ప్రాధేయపడుతున్న ఆ స్త్రీని ఇంకా బతిమాలించుకోవడం భావ్యం కాదని సరేనన్నాడు.

నిజంగానే చతురిక అతని చిత్రాన్ని అద్భుతంగా వేసింది. ఆమె నైపుణ్యాన్ని అతడు మెచ్చుకుని, ఆ చిత్రపటం ఆమెకిచ్చేశాడు. ఆమె అత్యంత త్వరితంగా కాంతిమతి చేత బెట్టిందా చిత్రాన్ని.

అది చూస్తూనే, ఆ యువకుని సౌందర్యానికి కాంతిమతికి మూర్ఛపోయినంతపనైంది. తదేకంగా అలా చూస్తుండిపోయింది. గట్టిగా కుదిపిన సఖి గుచ్చి అడగ్గా, తానెక్కడ ఉన్నానని అడిగిందా రాకుమారి. "ఇతడు దివ్య లోకంలోని వాడు కాడు గదా! నిజంగా ఇలా ఉన్నాడా? లేక నన్ను ఆడించడానికి, నీ నైపుణ్యమంతా ఈ చిత్రంలో చొప్పించావా?" అని నమ్మలేనట్లు అంది కాంతిమతి.

"అమ్మాయీ! నేను ఈ విషయంలో పరిహాసాలాడతానా? నేను ముందే చెప్పాను కదా! అసాధారమైనవి తప్ప ఇతరమైనవి నన్నాకర్షించవు అని నీకు తెలీదా? ఇంకా నయం! ఇది పూర్తి చిత్రం కూడా కాదు! ఆయనని చిత్రించడానికి తగినన్ని రంగులు లేక గాని, ఉంటే ఇంక నువ్వు దిక్కులు మర్చిపోయేదానివేమో! ఆ సౌందర్యవంతుని ప్రత్యక్షంగా త్వరలోనే చూపిస్తాలే" అని భరోసా ఇచ్చింది చతురిక.

ఆమె అలా అనేసరికి, చతురికను వాటేసుకుని "త్వరగా! ఇప్పుడే చూపిస్తావా?" అంటూ తొందరచేసింది.

"అదంత తేలిక్కాదు. నాకే ఆయన్తో మాట్లాడ్డానికి నాల్రోజులగ్గాని

అవకాశం కుదరలేదు. ఇప్పుడు మళ్లీ వెంటనే వెళ్లి...ఎలా? తీసుకురావడానికో– తీసుకెళ్లడానికో సాధ్యంకానిది. ఏదో ఉపాయం ఆలోచించాలి! వేగిరపడకు. తప్పకుండా చూపుతాను" అని మళ్లీ వెళ్లింది చతురిక.

"అయ్యా!" అంటూ మళ్లీ వచ్చిన చతురికను చూసి నవ్వుతూ, అదృష్టదీపుడడిగాడు – "ఏమన్నా మర్చిపోయావా? ఏమిటి విశేషాలు?" అంటూ–

"మా రాజు గారికి కాంతిమతి అనే అమ్మాయి ఉంది. ఆమెకు ఈ చిత్రాన్ని చూపితే, ఇంత అందగాళ్లుండడం అసాధ్యం అంది. చూపిస్తే వెయ్యిదీనారాలిస్తా! అనీ అంది. నాలాంటి దీనుల గురించి మీరు కాస్త శ్రమిస్తే ఆ పారితోషికాన్ని మీరే నాకు ఇప్పించిన వారౌతారు. ఆమె చిత్ర పటం తెచ్చాను ఇదిగో" అంటూ కాంతిమతి చిత్రం చూపింది.

అది చూసేసరికి అతడి మనస్సు కూడా మోహంతో చలించింది. 'ఇటువంటి సౌందర్యవతిని భార్యగా పొందగల్గడం అంటే! ఈమె పారితోషికం ఆశించి కాదు! అంతకు మించి ఇంకేదో ఆశిస్తోంది. లేకుంటే ఈమె రాకుమార్తె చిత్రాన్ని ఎందుకు నాకు చూపిస్తుంది?' అనుకున్నాడు. అయినప్పటికీ తన మనస్సుని బయటపడనివ్వకుండా "చతురికా! నువ్వు చతురవు. చిత్రాల్లో అతిశయోక్తులూ పుట్టించగలవు. బొమ్మనెలా రాసినా రాయగలవు. ఈ చిత్రపటం గురించి నాకూ అనుమానంగానే ఉంది" అని ఓరగా ఆమెను చూసి అన్నాడు.

"అయ్యా! మిమ్మల్ని కావాలంటే ఆమె వద్దకు తీసుకువెళ్లగలను. మీకు అది మర్యాద కాదనుకుంటే, ఆమె మేడ ఉన్న గుర్తులు చెప్తాను. ఆ వీధి ద్వారా మీరు పాదయాత్ర చెయ్యవచ్చు! ఇద్దరూ ఒకర్నొకరు చూసుకోవచ్చు! ఆమె మిమ్మల్ని మేడమీంచి చూడగల ఏర్పాటు చేస్తాను" అందామె.

కాంతిమతిని చూడాలని ఉత్సాహంగా ఉన్నా, పరోపకారిలా ప్రవర్తిస్తూ అందుకు అంగీకరించాడు అదృష్టదీపుడు. చతురిక మాటల్ని

బట్టి కాంతిమతి తనను వలచిందని అర్థం చేసుకున్నాడు. ఆ సంగతులు బలభద్రునితో చెప్పగా అతడు ఏం జరిగినా మన మంచికే అన్నాడు.

చతురిక మేడ గుర్తులు చెప్పింది. ఒకనాటి సాయంకాలం ఆ మేడ క్రింద నుంచి మూడుసార్లు తిరిగాడు. పై నుంచి పూలు జల్లింది కాంతిమతి. తల పైకెత్తి చూశాడు అదృష్టదీపుడు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు. ఈలోగా ఇతరుల దృష్టి వారిపై పడడం వల్ల ఇక అక్కడ ఉండకూడదనుకొని, నిలవకుండా సత్రానికి వచ్చేశాడు.

అతడు వెళ్లిన కొద్దిసేపటికే, చతురిక అక్కడికొచ్చి "మిమ్మల్ని మరికొంత శ్రమపెట్టవలసి వస్తోంది. రాకుమార్తె మిమ్మల్ని సరిగ్గా చూసే అవకాశం లోకుల దృష్టి వల్ల కలగక బాధపడుతోంది. రేపు ఉద్యానవనంలో ఆమెను కలుసుకోగలరా?" అని అడిగింది.

"అంతఃపుర స్త్రీ, అందునా రాకుమార్తె. ఇంకేమన్నా ఉందా? రక్షకభటులు నన్ను శిక్షించరా?" అన్నాడు అదృష్టదీపుడు.

"ఉద్యానవనానికి ఉన్న ప్రధాన ద్వారం నుంచి కాక, ఉపద్వారం ద్వారా మిమ్మల్ని తీసుకెళ్తాను" అని మొహమాట పెట్టి ఆ ఒక్కసారికీ ఏదో ఒప్పించింది. అన్నట్లుగానే ఇద్దర్నీ కలిపింది. పక్కపక్కన వారిని అలాగే చూస్తూ సంబరపడింది. తనకోసం మిత్రుడు బలభద్రుడు ఎదురు చూస్తుంటాడని చెప్పి, కొంతసేపటి తర్వాత అదృష్టదీపుడు వెళ్లాడు. విరహంతో వేగిపోసాగింది కాంతిమతి. శైత్యోపచారాలేవీ ఫలించలేదు. ఏవీ ఆమె మదనతాపాన్ని హరించలేకపోయాయి. ఆ రాత్రి ఏదోలా తెల్లవారింది.

సూర్యోదయం కావడంతోనే, చతురిక, కాంతిమతికి కొన్ని జాగ్రత్తలు చెప్పి అతని ఇంటికి వెళ్లి కాంతిమతి గురించి అతడెలా భావిస్తున్నాడో చాటుగా చూసింది. తర్వాత అతనికి ఎదురెళ్లి "ఈరోజు మా రాకుమార్తె ఇంకొక ఉద్యానవనంలో ఉంది.

మీతో మాట్లాడలేకపోయినందుకు సిగ్గుతో నిన్న కలిసినపుడు మౌనంగా ఉన్నందుకు తనను తాను నిందించుకుంటూన్నది. ఈ రోజు అతిథి పూజ చేస్తుందట. కాదనకండి!" అంటూ చతురంగా పిలిచింది.

దానికి అదృష్టదీపుడు నవ్వుతూ "మీ రాజపుత్రిక నాకు సపర్యలు చేయనందుకు విచారించనక్కర్లేదని, నా మాటగా చెప్పు! మళ్లీ నన్నెందుకు శ్రమ పెడతావు?" అంటూ తన మనస్సు దాచుకుని పైకి బింకంగా మాట్లాడాడు.

చతురిక చొరవ వల్ల కాంతిమతిని ఇంకో ఉద్యానవనంలో తిరిగి కలుసుకోగలిగాడు అదృష్టదీపుడు. అక్కడ అతనికి పాద పూజ చేసి, ఇంట్లోకి తీసుకెళ్లింది. అతిథి పూజ అంటూ చందన చర్చ చేసింది. తానూ ఆమెకు గంధం పూశాడు. శయ్య ఇద్దరికీ స్వాగతం పలికింది. చతురిక పక్కకు తప్పుకుంది. సాయంకాలం వేళ వరకూ ఇద్దరూ మన్మథక్రీడలో తేలియాడారు. ఆ విధంగా కొన్నాళ్లు ఇద్దరూ సుఖించారు...అంతలో-

ఒకరోజు కాంతిమతి తండ్రి అనంతవర్మ ఆస్థానంలో కూర్చొని రాచకార్యాలు నిర్వర్తిస్తుండగా....ఒక ఉత్తరం కనబడింది. అతడది చదివాడు.

"రాజా! నువ్వొట్టి గుడ్డివాడివి. నీ ఇంట్లో జరిగే నేరాన్నే గమనించలేవు. నీ కూతురికి అతి స్వేచ్ఛ ఇచ్చావు. ఆమె ఇప్పుడు ప్రతిరోజూ ఒక పురుషునితో కులుకుతోంది. ఆమె ఇప్పుడు గర్భవతి కూడ. నేను నీ శ్రేయోభిలాషిని కనుక ఇంతగా రాస్తున్నాను. నీ కులానికి కళంకం రాగలదు. నా మాట నిజమో - అబద్ధమో తెలుసుకోదలిస్తే సాయంత్రం ఉద్యానవనానికి వెళ్లి చూడు! నీకే తెలుస్తుంది" అని ఉంది అందులో.

పేరు లేని ఆ ఉత్తరం చదువుకొని, అనంతవర్మ ఎంతో విచారించాడు. నిజం తెలిసి కూతుర్ని శిక్షించాలని, సభ చాలించి అంతఃపురానికి వెళ్లి "మన కాంతిమతి ఎక్కడ?" అని కోపంగా అడిగాడు. ఒక పరిచారిక చూసి వచ్చి "అమ్మాయిగారు ఉదయాన్నే ఉద్యానవనానికి వెళ్లారు. సాయంత్రానికి గాని రారట!" అంది.

అనంతవర్మ అక్కడ నుంచి కోపంగా ఉద్యానవనానికి బయల్దేరాడు. ద్వారం దగ్గర కొందర్ని కాపుపెట్టి "కొత్తవాడెవడొచ్చినా పోనివ్వకండి" అని చెప్పి తోటంతా వెతుకుతూ, కాంతిమతి ఉన్న మేడదగ్గరకు వెళ్లాడు.

రాజును దూరాన్నుంచే గమనించిన చతురిక గుట్టు రట్టయ్యేలా ఉందని తడబడుతూనే వెనుక వైపు నుంచి వెళ్లింది. ఒక శయ్యాగారంలో కామకేళిలో మునిగి ఉన్న వారిద్దరికీ 'రాజుగారొస్తున్నారు' అన్న వార్త చేరవేసింది.

అది విన్న అదృష్టదీపుడు అదిరిపడి, ఆమె మీద నుంచి లేచి వద్దంటున్నా వినకుండా మేడకు ఆనుకుని ఉన్న ఒక చెట్టు మానును ఆధారంగా చేసుకుని నేలకు దిగిపోయాడు.

అప్పటికి కనుచీకట్లు పడుతున్నాయి.

రాజు మేడ ఎక్కుతూ దార్లో ఉన్న చతురికను "అమ్మాయెక్కడ?" అని అడిగాడు.

చతురిక రాజును ఆపాలని ప్రయత్నం చేస్తూ "ఈ మేడలోపలే ఉంది. ఇంటికి రావాలని సిద్ధమవుతోంది" అన్నది.

రాజు ఆగకుండా చరచరా మేడలోపలికి వెళ్లాడు. కాంతిమతి అప్పుడే వస్త్రాలు ధరించి శృంగారపు అలంకారాలు కనిపించకుండా దాచే ప్రయత్నాన్ని చేస్తోంది. తండ్రిని చూస్తూనే ఆమె తెల్లబోయింది.

కొన్ని పరిమళద్రవ్యాలు ఇంకా అక్కడ ఉండటం; ఆమె ముఖం మీద- చేతుల మీద గోళ్ల గిచ్చుళ్లు, పంటి గాట్లు ఉండటం చూసి ఆమె అంతవరకు సంభోగంలో పాల్గొందని గ్రహించాడు. అయినా ప్రత్యక్ష నిదర్శనాలు దొరకబుచ్చుకోనిదే అడగరానిది కనుక తమాయించుకొని "అమ్మాయీ! నువ్వింత స్వతంత్రురాలివైనావా? ఇంతరాత్రి వరకు ఇక్కడ ఒంటరిగా ఉండవచ్చా? అంతఃపురానికి పో" అని ఆమెను ఇంటికి సాగనంపాడు.

'బయటకాపు పెట్టాను గనుక ఇతడిక్కడినుంచి తప్పించుకుపోలేడు. ఇవాళ చీకటి పడింది గనుక, రేపు ఉదయం వచ్చి వాడ్ని వెతికించి శిక్షిస్తాను' అనుకుంటూ తాను తిరిగి కొలువు కూటానికి వెళ్లాడు.

కాంతిమతి ఇంటి కొచ్చిందన్నమాటే గాని, ఆమె ప్రాణాలన్నీ ఆ

తోటలోనే ఉన్నాయి. అందులోనూ – కాపలా ఉందని తెలిశాక అక్కడ్నించి తన ప్రియుణ్ణి ఎలా తప్పించాలా? అని ఆలోచించసాగింది.

అప్పుడు చతురిక "సఖీ! విచారించకు! దీనికి నేనో ఉపాయం ఆలోచించాను. రాత్రి తెల్లారేలోగా అతడ్ని అక్కడ నుంచి తప్పిస్తా! నేను ఏది చెప్తే అది చెయ్యి" అని ఒక రహస్యం బోధించింది.

అప్పుడా రాకుమారి దేహానికి అపస్మారం కమ్మే మందు తిని, శయ్యమీద అడ్డంగా విరుచుకుపడిపోయింది.

'కాంతిమతిని పాము కరిచింది' అంటూ చతురిక ఏడుస్తూ కాంతిమతి తల్లితో చెప్పగా ఆమె మూర్ఛపోయింది. క్షణాల్లో ఈ వార్త రాజుగారికి చేరింది. ఆయన విషచికిత్సకులతో అక్కడికొచ్చి, పుత్రికకు కలిగిన అవస్థకు చింతించసాగాడు.

ఆ వైద్యులు కాంతిమతి చేత ఔషధాలు మింగించాలని ప్రయత్నించగా ఆమె పళ్లూ – దౌడలు బిగించేసింది. చతురిక వాటిని పుచ్చుకుని, తాను మింగించినట్లుగా నటించి రహస్యంగా అవతల పారేసింది.

ఈ దుఃఖంలో కాంతిమతి మీద కోపాన్ని ఆమె తల్లిదండ్రులు మరచిపోయారు. అంతలో చతురిక రాజపత్నితో "అమ్మా! మొన్న ఓ యోగి మన ఉద్యానవనంలోకి వచ్చినపుడు ఒక మొక్కను చూసి "పాము కాటుకు ఇది దివ్యంగా పనిచేస్తుంది" అన్నాడు. నేను ఆ మొక్కను జ్ఞాపకం పెట్టుకున్నాను. వెళ్లి తీసుకురానా?" అంది. అందుకా తల్లి ఆదుర్దాగా "అయ్యో! ఇంతవరకు చెప్పావు కావేం? ఏ మందులో ఏం మహిమ ఉందో? సందేహమెందుకు? త్వరగా వెళ్లి తీసుకొచ్చి నీ చెలిని బతికించుకో" అంది.

చతురిక కొంతదూరం వెళ్లి వెనక్కు తిరిగొచ్చి "రాజశాసనం లేక తోటలోనికి పోవడానికి వీలుపడదట! మరిచాను– నాకొక చీటీ ఇప్పించండి" అంది.

"అంతఃపుర సఖివి! యథేచ్ఛగా వెళ్లి రావచ్చు! నీకు చీటీ ఎందుకు?" అంది రాజపత్ని. రాజుతో ఆమె ఆ మాట చెప్పగా "చతురిక చెప్పింది నిజమే! శాసనం చేసింది నేనే! చీటీ తీసుకెళ్లు" అని చీటీ రాసిచ్చాడు.

చతురిక వేగంగా తోటలోనికి వెళ్లిపోయింది- చీటీ కావాలనే చూపించింది- అంతఃపురకాంతలను అడ్డుకోరు.

చతురిక అక్కడ అదృష్టదీపుడ్ని వెతికి పట్టుకొని, జరిగిన సంగతంతా చెప్పగా ఆమెకు తమ ఇద్దరి పట్ల గల అభిమానానికి అతడామెని మెచ్చుకున్నాడు.

"ప్రశంసలు తర్వాత....ముందు నువ్వు తప్పించుకో! ఇదిగో! ఇలా! అని గబగబా తన వస్త్రాలు విప్పి, అతనికి అవి కట్టించి స్త్రీ వేషం వేయించి....మేలి ముసుగు సవరించి "అందగాడా! వెళ్లిరా! జాగ్రత్త" అని చీటి అతనికిచ్చి పంపేసింది.

అతడు ద్వారపాలకులకు చీటీ తిరిగి చూపగా, ఇందాక వెళ్లిన మన చతురికయే కదా! అని పరీక్షించకుండా వదిలేశారు. అతడు ఇంటికెళ్లి బలభద్రునికి ఆ వృత్తాంతమంతా చెప్పి, సుఖంగా నిద్రపోయాడు.

కొంతసేపటి తర్వాత, చతురిక ఏదో వేరు తవ్వి తీసుకెళ్లి బైటకు రాబోతూంటే ద్వారం దగ్గర కాపలా వున్న వారు అడ్డుపడ్డారు.

తాను రాకుమార్తె చెలికత్తెనని, చతురికననీ చెప్తున్నా వారు వినకపోయేసరికి, "ఇంకాస్సేపట్లో రాజభటులొస్తారు. ఆపైన మీ యిష్టం" అంది. ఆమె అన్నట్లుగానే అనంతవర్మ భటులు రాగా, వారికి ద్వారపాలకుల సంగతి చెప్పింది చతురిక.

వాళ్లు ద్వార రక్షకులను మందలించి, అవతల అంతఃపురంలో రాకుమార్తె పరిస్థితి చెప్పి చతురికను త్వరగా పంపేశారు. ద్వారరక్షకులు కంగుతిని అంతకుముందే చీటి చూపి బైటికి వెళ్లిపోయిన వ్యక్తి తమను మోసం చేసినట్లు గుర్తించి ఆ రహస్యం ఎవరికీ చెప్పక మిన్నకుండిపోయారు.

చతురిక వేరు అరగదీసి, గంధంలా పూత పూస్తూ, కాంతిమతి చెవిలో ఊదుతున్నట్లు నటిస్తూ "నీ మనోహరుణ్ణి నా వేషంలో తోట దాటించేశాను. నువ్వింక నిశ్చింతగా తెలివి తెచ్చుకోవచ్చు!" అంది.

అప్పుడు కాంతిమతి మెల్లగా తేరుకున్నట్లు నటించింది. అంతా

చతురిక వైద్యాన్ని పొగిడారు. ఆమె కూడా గంభీరంగా "ఆc! ఇప్పుడు అమ్మాయిగారికి విశ్రాంతి అవసరం. ఆమెను నిద్రపోనివ్వాలి. పదండి! పదండి! లేచేసరికి బాగా తేరుకుంటుంది." అంటూ అక్కడున్న వాళ్లందర్నీ రాజుతో సహా పంపేసింది.

మర్నాటి ఉదయం అనంతవర్మ తోటంతా అణువణువూ వెతికించాడు. ఏమీ కనిపించకపోవడంతో - రాత్రి జరిగిన విషయం చెప్తే రాజు శిక్షిస్తాడనే భయంతో ద్వారపాలకులు నోరు మెదపకపోవడంతో ఆ సమస్య అంతం అయింది.

తనమీద గిట్టని వారెవరో ఆకాశరామన్న లేఖ రాశారనుకున్నాడు రాజు.

ఇల్లు చేరాక అదృష్టదీపుడిలా అనుకున్నాడు..."ఆహా! ఏమి ఈ సృష్టి విచిత్రం? ఈ జగత్తంతా కామం చేత ఆడించబడుతోంది. జగత్ ప్రసిద్ధి గాంచిన నేనే కామానికి వశుడినై రాత్రి అక్కడ చిక్కుపడి, చతురిక చాతుర్యం వల్ల స్త్రీగా వేషం దాల్చి బయటపడ్డాను కదా! దైవం అనుకూలించి గండం గడిచింది. పాపం! కాంతిమతి నా కోసం ఎంతో ప్రయాసపడింది. ఇప్పటికిక ఇక్కడ్నించి వెళ్లడమే ఇద్దరికీ శ్రేయస్కరం. ఈలోగా కొంతదేశం చుట్టి రావలసి ఉంది" అనుకుంటూ, కాంతిమతికి ఇవ్వమని తన మిత్రుడికి ఒక ఉత్తరం ఇచ్చాడు అదృష్టదీపుడు. అందులో.....

"కాంతిమతీ! నువ్వు నా కోసం ఎంతో పరితపించావు. కష్టాల కోర్చావు. నాకు చాలా బాధగా ఉంది. మనకు గాంధర్వ వివాహం జరిగింది కనుక నిన్ను నా పట్టమహిషిగా స్వీకరిస్తాను. మిగతా వివరాలు ఇప్పుడు చెప్పను. నా పేరు మాత్రం వెల్లడిస్తాను. దేశాటనం చేసి మళ్లీ వస్తాను. అంతవరకు నీ చిత్రఫలకం చూసుకుంటూంటాను.

ఇట్లు అదృష్టదీపచక్రవర్తి" అని ఉంది.

బలభద్రుడా ఉత్తరాన్ని ఎంతో నేర్పుతో చతురికకు అందించాడు. అది చూసి పొంగిపోయిన కాంతిమతి "చతురికా! ఆయన

ఎవరనుకుంటూన్నావ్? మనం ఎంతో గొప్పగా చెప్పుకునే అదృష్టదీపచక్రవర్తి అట! నా భాగ్యం ఏమని చెప్పను?" అంది ఆశ్చర్యంగా.

"ఔను! నువ్వు మొదట్నుంచీ అటువంటి వాడినే కదా భర్తగా కోరు కుంటున్నావ్! అటువంటి వాడు కాక ఆయనే లభించాడు. అది నీ అదృష్టం కాక ఇంకేమిటి? ఈ సంగతి మీ తండ్రికి తెలిస్తే ఆయన ఇంకా సంతోషి స్తాడు. నీ గర్భమే ఆయనకు ఆ సంగతి చెప్పేలా ఉంది" అంది చతురిక.

"అతడు రహస్యంగా ఉండడానికేదో కారణం ఉండి ఉంటుంది. తిరిగొస్తాడంటావా?" అనుమానంగా అడిగింది కాంతిమతి.

"భయంలేదు. ఈ ఉత్తరమే అందుకు తార్కాణం" అని అభయమిచ్చింది చతురిక.

ఈ వార్త కాంతిమతి తల్లితో చెప్పగా, ఆమె అవకాశం కోసం ఆగి, అదృష్టదీపుని ప్రసక్తి వచ్చినపుడు సందర్భోచితంగా "ఆయన మీకు అల్లుడే" అంటూ అసలు విషయం భర్త చెవిన వేసిందా ఇల్లాలు. అదృష్టదీపుడంతటివాడు తనకు అల్లుడైనందుకు ఆ విదర్భ దేశాధీశుడు ఎంతో ఆనందించాడు. గాంధర్వం అష్టవిధ వివాహాల్లో ఉన్నదే గనుక, గర్భవతైన కూతుర్ని శ్రద్ధగా చూసుకుంటూ అదృష్టదీపుని వెతికి రమ్మని భటుల్ని నలువైపులా పంపించాడు అనంతవర్మ.

బలభద్రునితో కూడ గుర్రం మీద బయల్దేరిన అదృష్టదీపుడు పదిరోజుల తర్వాత పుష్పగిరి చేరుకున్నాడు. దారిలో అతనికి కాంతిమతి పట్ల విరహం అధికం కాగా బలభద్రుడతడ్ని ఓదార్చాడు.

పుష్పగిరి చేరిన మిత్రులిద్దరూ అదృష్టదీపుని పేరిట గల సత్రంలోనే బసచేశారు. అక్కడ కూడా తన పేరు బాగా ప్రచారంలో ఉండడం అదృష్టదీపుడు గమనించాడు. తన మిత్రుని ఖ్యాతికి బలభద్రుడూ మురిసిపోయాడు.

ఒకనాడా సత్రం అరుగు మీద కూర్చొని ఉండగా, మాళవదేశ రాజధాని కోశాంబి నుంచి వచ్చిన విష్ణుశర్మ అనే బ్రాహ్మణుడు, "పాత

ప్రభువైన ధర్మపాలుని చెరబట్టి కొత్తగా గద్దె ఎక్కిన దుర్వినీతుడనేవాడు మా ధన కనక వస్తు వాహనాలన్నీ కొల్లగొట్టాడు. అక్కడ రక్షణలేక దేశాటనం చేస్తున్నాను. అదృష్ట దీపచక్రవర్తుల దర్శనార్థం పోతూన్నాను. ఆయన ఏ తీర్థంలో ఉన్నారో? నా అదృష్టం బాగుంటే నాకు ఆయన దర్శనం ఏ పుణ్యస్థలంలో లభించనున్నదో? మీ ముఖంలో ధర్మపాలుని పోలికలు బాగా కనిపిస్తున్నాయి" అన్నాడు.

అదృష్టదీపుడు అదిరిపడి, ఆ వృద్ధబ్రాహ్మణునికి కొంత నిజం తెలిసి ఉంటుందని అలనాటి చరిత్ర అడిగాడు. తనకు తెలిసినంతవరకూ అతడేమీ దాచలేదు.

"అయ్యో! మా పట్టణానికి చోళరాజు తాకిడి; అతని మంత్రి కుమారుడైన దుర్వినీతుడి దుష్పరిపాలన కలగడానిక్కారణం-మా ప్రభువైన ధర్మపాలుని కపటమంత్రి విహారభద్రుని చలవే! మహారాజుగారి భార్య అయిన సునంద మూడేళ్ల వయస్సున్న కొడుకుతో పారిపోయింది. అప్పుడామె గర్భతి కూడ! నాటి నుంచి వారి జాడే తెలీదు. ఇదీ ఆనాటి కథ" అని విష్ణుశర్మ చెప్తూంటే ఆ పేర్లు రాసుకున్నాడు అదృష్టదీపుడు.

అంతలో నగర విశేషాలు చూడబోయిన బలభద్రుడు ఆందోళనగా తిరిగొస్తూ, మిత్రుడ్ని చూసి "హమ్మయ్య! నువ్విక్కడ ఉన్నావు కదా!" అని గుండెలపై చేతులు వేసుకుని, నిట్టూర్చి "విధి లీల ఎంత చిత్రం?"అన్నాడు.

అతడేదో విశేషమే చూసి ఉంటాడని గ్రహించిన అదృష్టదీపుడు ఏమిటి సంగతి అని అడిగాడు.

"మిత్రమా? విశేషమంటే-విశేషం కాక ఇంకేమిటి? అచ్చంగా ముమ్మూర్తులా నీ పోలికలే అచ్చుగుద్దినట్లున్న ఓ చిన్నవాడ్ని రాజభటులు ఒక బండమీద ఊరేగిస్తున్నారు. నువ్వే కాబోలు అనుకుని దగ్గరగా వెళ్లబోయినా, ఈ పట్నంలో మనకెవరు తెలుసు?' అనుకుని ఆగిపోయాను.

## ప్రియంవద కథ

విచ్చుకత్తుల రాజభటులను చూసి 'ఇతడు ఏమి అపరాధం చేశాడని" అడగ్గా వాళ్లు నాకు సమాధానం చెప్పలేదు. అక్కడితో నేను

ఊరుకోక ఆ ప్రాంతంలో ఉన్న కొందర్ని అడగ్గా, "ఇతడు ఒక బ్రాహ్మణపుత్రుడు. హరిదత్తుడట! ఈ పట్టణపు రాజకూతురు ప్రియంవద అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్తానని ఒప్పుకొని, అంతఃపురం వరకూ వెళ్లి ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోయాడు. మొదటనే శాసనం చేసి ప్రకారం ఆమె ప్రశ్నలకు బదులివ్వక పోతే, ఊరేగించి మరీ ఉరి తీస్తారు. ఇతడ్ని కాపాడ్డానికి ఇంకొకరెవరైనా ప్రయత్నించవచ్చు! అంటే ఆ ప్రశ్నలకు జవాబులు ఇవ్వడానికి వాళ్లు సిద్ధంగా ఉంటే, ఇతడ్ని విడుస్తారు. వాళ్లు కూడా చెప్పలేకపోతే ఇద్దరికీ ఉరి తప్పదు! తెలిసి తెలిసి ఎవరు మృత్యువు గుహలోకి అడుగుపెడతారు?" అన్నారు. "మిత్రమా....! ఈ ఊళ్లోని అంగడివీధిలో నాకు తగిలిన విశేషం" అన్నాడు బలభద్రుడు.

"అన్నన్నా! ఆ బ్రాహ్మణ కుమారుడు అచ్చు నీలాగే ఉన్నాడు. దీనంగా బండమీద కూర్చున్నాడు. తెలియని పనికి ఏల పూనుకొన్నాడో మరి! అతడ్ని విడిపించగలవారెవరూ లేకపోయారు" అని కూడా జాలినిండిన స్వరంతో అన్నాడు బలభద్రుడు.

"అయ్యయ్యో! బ్రాహ్మణుడని - అవధ్యుడని ఎంచక ఉరితీసే రాజునేమనాలి? అతని కూతురు ఇంత అన్యాయపు వ్రతానికి ఎందుకు పూనుకొన్నదో? ఆ విప్రకుమారుడెక్కడ? పద" అంటూ బయల్దేరాడు అదృష్టదీపుడు. బలభద్రునికి తన మిత్రుడెక్కడ ఈ చిక్కుల్లో పడతాడో! అనే భయం పట్టుకొని, నిరుత్సాహపరచబోయినా అదృష్టదీపుడు సంకోచించలేదు.

ఇక తప్పదని అంగడి వీధివైపు బయల్దేరారు ఇద్దరూ. వాళ్లు అక్కడకు చేరుకునేసరికి, ఆ విప్రకుమారుని అప్పటికే వధ్యభూమికి తీసుకెళ్లి పోయారని ప్రజలు సానుభూతి వచనాలు పలుకుతున్నారు.

అవి వింటూ, అదృష్టదీపుడు " మిత్రగుప్తుడనేవాడు ఇతడి ప్రాణాలను కాపాడటానికి రాజు దగ్గరకు వెళ్లాడు. అంతవరకు ఉరితీయవద్దని తలారులకు చెప్పు!" అంటూ బలభద్రుని వధ్య భూమికి పంపించాడు.

తాను ఆ దేశపు రాజు దగ్గరకు వెళ్లి నమస్కరించి "అయ్యా! మాది

కాశీపురం. నన్ను మిత్రగుప్తుడంటారు. మీ అమ్మాయి వేసిన ప్రశ్నలకు హరిదత్తుని కాపాడటం కోసం నేను జవాబులిస్తాను. ఆరుమాసాల గడువు ఇవ్వండి! ఇప్పుడే ఆ హరిదత్తుని ఉరితీయవద్దు అంటూ ఆజ్ఞాపత్రం పంపించండి" అనగానే, రాజసభలోనివారు అతని ధైర్యసాహసాలకు ఆశ్చర్యపోయారు. ఇద్దరికీ ఉన్న పోలికలను బట్టి బంధువై ఉంటాడనుకున్నారు.

రాజవాహనుడు కూడా అతడి తెగింపునకు ఆశ్చర్యపోయి "నేను దారుణమైన శపథం చేశాను. నువ్వు విన్నావో - లేదో ఇప్పటికే, హరిదత్తుని గురించే సానుభూతి వెల్లువెత్తిన ప్రజానీకం నన్ను నిందిస్తున్నారు. నువ్వు కూడా జవాబులు చెప్పలేకపోతే ఇద్దర్నీ ఉరితీయవలసివస్తుంది. బాగా ఆలోచించుకో!" అన్నారు.

"మీ శపథం అంతా వినే వచ్చాను. ఆ విషయంలో నాకేమీ సందేహం లేదు. వధ్యభూమికి త్వరగా ఆజ్ఞాపత్రిక పంపండి. లేకుంటే దుర్వార్త వినవలసి వస్తుంది' అని ప్రార్థించాడు.

రాజవాహనుడు అతనిపేరు రాసుకున్నాడు. ఆరుమాసాలకు తిరిగొచ్చేట్టుగా ప్రమాణం చేయించుకుని, ఆర్నెల్లవరకు హరిదత్తుడ్ని ఉరితీయకుండా జైల్లో ఉంచమని ఆజ్ఞాపత్రిక వధ్యభూమికి పంపాడు. అక్కడి రక్షకభటులు ఆ పత్రిక చూసుకుని అలాగే అమలుపరిచారు. అదృష్టదీపుడికి హరిదత్తుడ్ని చూడాలనిపించింది. కాని పని తొందరలో చూడటం తటస్థించలేదు. ముందుగా హరిదత్తుడి ప్రాణాలు నిలపడం ముఖ్యం అనుకున్నాడు. ఆ ప్రశ్నలు గల పత్రం చూపించమన్నాడు. అందులోని ప్రశ్నలివి.

గీ. **ఎన్న భువనేశ్వరీ దేవి కెన్ని మొగము?**
**లవియు నేయే రుచుల చేత నమరు? మరి త**
**దాలయం బేద? నటదగునట్టి లిపియ**
**దేమి? యది చెప్పుడి విమదీయేచ్ఛ పగిది.**

క. వీనికి సదుత్తరము లెవం
డైన నొసంగినను వాని బ్రాణాధీశుం
గా నెంచెద, మడియించెద
బూనుచునటు చెప్పలేకపోయిన యంతన్.

(భువనేశ్వరీ దేవికి ఎన్ని ముఖాలు? వాటికి ఏయే కాంతులు? భువనేశ్వరీ దేవి ఆలయం ఎక్కడ ఉంది? అక్కడ లిపి ఏ భాష? వీటికి సరైన జవాబులు చెప్తే వారిని వరిస్తాను. లేదంటే ఉరి తీస్తాను.)

ఆ ప్రశ్నలు రెండు మూడు సార్లు చదువుకున్నాడు అదృష్టదీపుడు. తలవూపుతూ, రాజుదగ్గర అనుమతి తీసుకుని సత్రానికి వెళ్లాడు. "బలభద్రా! ఈ ప్రశ్నలకు ఎవరు జవాబు ఇవ్వగలరు? దేశాటన చేసిన వారైనా చెప్పగలరో–లేదో? అయినా ఆర్నెల్లు గడువు కోరి వచ్చాను. కనుక - నువ్విక్కడ ఉండు! నేను దేశాటనం చేసి ఆ వైనం తెలుసుకొస్తాను" అన్నాడు.

బలభద్రునికి కన్నీరాగలేదు. "అయ్యయ్యో! బాగా ఆలోచించి గాని, ఈ ప్రయత్నానికి దిగొద్దని నేను ముందే చెప్పాను కదా మిత్రమా! నువ్వింత సాహసం చేస్తావనుకోలేదు. ఇంత ప్రఖ్యాతీ సంపాదించి, చివరికొక స్త్రీ వల్ల మరణం పాలవడమా? ఉండు! మనం ఇప్పుడు ఎవరికీ తెలీకుండా పారిపోతే, మనని అడిగేదెవరు? హరిదత్తుడి సంగతి నీకు చెప్పడం నాదే తప్పు! ఏదో ఆర్నెల్లు ఆయువు అతడికి పొడిగించిన వాళ్లం అయ్యాం! అదే చాలు!" అంటూ విలపించాడు.

"మిత్రమా! గుక్కెడు ప్రాణాల కోసం అసత్యానికి పాల్పడతామా? సత్యపాలనకై పూర్వులు ఎలాంటికష్టాలు అనుభవించారో నీకు తెలీదా? అటువంటిది - ఒక బ్రాహ్మణుని కోసం ప్రాణత్యాగం చేయడం కంటే పుణ్యం ఏం ఉంటుందని చెప్పు! శరీరం అస్థిరం. కాలం ఎప్పుడూ ఒకే రీతిగా నడవదు. డబ్బు లేని రోజుల్లో ఎంతో కీర్తి లభించింది. ఇప్పుడో...బ్రాహ్మణుల ఆర్తి వింటూ కూడా ఏమీ ఇవ్వలేని స్థితి. పారిపోవడం పిరికి వాళ్ల లక్షణం. అది నాకు సమ్మతం కాదు. దైవానుగ్రహం ఉంటే

జవాబులు తప్పక దొరుకుతాయి. నువ్వు ధైర్యంగా ఉండు. ఈ ఆపద గట్టెక్కగలమనే నా విశ్వాసం" అని అదృష్టదీపుడు అతనికి ధైర్యం కలిగించాడు.

"నిజమే! మనకు అవమానం జరగదు. నేనూ నీతో దేశాటనం వచ్చేస్తాను" అన్నాడు మిత్రుడ్ని వదిలి ఉండలేని బలభద్రుడు.

"ఆ ప్రశ్నలకు జవాబుల కోసం మనం దేశాటనం చెయ్యనక్కర్లేదు. ఇక్కడ ఉండే తెలుసుకోవచ్చు! రాజకుమార్తె ప్రియంవద నిత్యం చేసే పనులు తెలుసుకో! వాటి వల్ల ఆ ప్రశ్నలకు జవాబులు రాబట్టవచ్చు! అందువల్ల నువ్వు ఇక్కడే ఉండి ఆమె చర్యలు గమనించు! నేనూ నా ప్రయత్నాలు చేస్తాను. నీవీ నగరంలో నిత్యం సంచరిస్తూంటే నీకు కొన్నిటికి జవాబులు తెలియగలవు" అన్నాడు. అదృష్టదీపుడు దేశాటన యోచన మానుకొని.

అంతవరకు కథ చెప్పేసరికి అర్ధరాత్రి అయింది. మణిసిద్ధుడు గోపాలుని చూసి "వత్సా! ఇప్పుడు నిద్రవేళ అయింది. తర్వాత కథ కూడ పెద్దదే! ఈ రాత్రికి ముగిసేలాగ తోచడం లేదు. సంక్షిప్తంగా చెప్పేయ్యమంటావా? లేక ఈ తరువాయి కథ ముందర మజిలీలో చెప్పమంటావా?" అని అడిగాడు.

వాడు "కథ చెప్తే, వివరంగానే చెప్పాలి కాని ముగించడం కోసం ఏవో నాలుగు మాటలతో కథ అయిపోయిందనిపించకండి గురువు గారూ! పోనివ్వండి! మీకు నిద్రవస్తే ఇప్పుడు పరుండి, రేపు చెప్పవచ్చు!" అన్నాడు.

అప్పుడు భోజనం చేసి, గోపాలుడు మార్గాయాసం తీరేలా ఆ యతి చంద్రుని పాదాలు వొత్తసాగాడు.

ఆ యోగి కూడా ఆ రాత్రి సుఖంగా నిద్రించి వేకువఝామున లేచి, గోపకుమారుడితో "కావడి ఎత్తు" అని పలికి మౌనంగా నడవసాగాడు. వాడు కావడి మోసుకుని తనతో పాటు నడుస్తూంటే, నీరెండ పొద్దు ఎక్కే వేళకు ముందరి మజిలీ చేరాడు.



# కాశీ మజిలీ కథలు

18వ మజిలీ

## భువనేశ్వరి దేవి కథ

పద్దెనిమిదవ మజిలీ చేరీ చేరగానే, శౌనకుడు తరువాయి కథ చెప్పవలసిందిగా మణిసిద్ధుని వేధించసాగాడు.

అందువల్ల ఆ యోగీంద్రుడు ఆరోజున తన అనుష్ఠానం అంతటినీ సంక్షిప్తంగా ముగించి, వంట చేసి భోజనాలు అయిపోగానే ఒక చక్కని-చల్లని చెట్టు నీడన కూర్చొని తరువాత కథను ఇలా చెప్పసాగాడు.

వత్సా! వినుము......

అదృష్టదీపుడు పుష్పగిరిలోనే ఉండి, రాజపుత్రిక నిత్యం ఏం చేస్తున్నదో పరీక్షిస్తూ.....ఆమె చెలికత్తెలను - దాదులను గురించి ఆరా తీయడం ప్రారంభించాడు. కొన్నాళ్లు గడిచాక - రాజకుమార్తెకు, కలహంసిక అనే దానితో చాలా స్నేహం ఉందని తెలుసుకున్నాడు.

ఒకరోజు దాని ఇంటికి వెళ్లి "కలహంసికా! నవ్వు చాలా తెలివైనదానివనీ - నీ దగ్గర కొన్ని విషయాలు తెలుసుకోవాలనీ వచ్చాను. మాది కాశీపురం. అదృష్టదీపునికి మిత్రుడిని. నా పేరు మిత్రగుప్తుడు. అదృష్టదీపుడు తీర్థయాత్రలకు పోగా, నేను అతడ్ని చూడాలని వెళ్తున్నాను. ఇక్కడికొచ్చి పదిరోజులైంది. ఈ వూర్లో ఎక్కువ తెలివైన వారెవరని అడిగితే నీ పేరే అంతా మొదట ప్రస్తావిస్తున్నారు. నేనూ నా మిత్రుడూ ఓ రోజు చతురంగ బలాలతోనూ అడవికి వెళ్లాం! మిట్టమధ్యాహ్నం వేళకి ఎండవేడిమికి తాళలేక, ఒక తాళ (తాటి) వృక్షం నీడలో నిలబడ్డాం! మా సేనలన్నీ దగ్గర్లో గల ఓ మర్రి చెట్టు నీడన నిలబడ్డాయి- ఉన్నట్టుండి నా మిత్రుడు ఒక్కసారి ఫక్కున నవ్వాడు.

"ఎందుకు అలా అకారణంగా నవ్వావు?" అంటూ నేను ఎంతో కుతూహలంగా ప్రశ్నిస్తే, అతడు జవాబు చెప్పలేదు సరికదా! "నేనెందుకు నవ్వానో కారణం నువ్వు ఊహించి చెప్తే నీకు వెయ్యి దీనారాలిస్తాను" అని ప్రతిజ్ఞ చేశాడు.

ఆ వెయ్యి దీనారాలు నాకొక లెక్కలోనివి కాదు. కాని పట్టుదల కొద్దీ నేను ఆరుమాసాల వ్యవధి కోరాను. సరే అన్నాడు. అది మొదలు నేను దేశాటనం చేస్తూ ఎక్కడెక్కడి బుద్ధిమంతులను ఇదే ప్రశ్న వేయసాగాను. కొందరు నన్ను వెర్రివాడిని చూసినట్లు చూశారు. ఎగతాళి చేశారు. నా మిత్రుడి సంగతి వారికేం తెల్సు? అతడు అకారణంగా నవ్వడు. సరే! ఎవరూ చెప్పలేకపోయారు. ఇప్పటికి తొంభైరోజులు గడిచిపోయాయి. ఇంకా మూడు నెలల్లో నేను సమాధానం తెల్సుకోవాలి.! నాకు దీనారాలు ముఖ్యం కాదన్నానుగా! ఆ జవాబు నీ తెలివి ఉపయోగించి నాకు చెపితే అందులో సగం నీ కిచ్చేస్తాను" అన్నాడు.

"ఇలాంటి ప్రశ్నలకు మా మిత్రురాలు ప్రియంవద చక్కగా సమాధానం చెప్పగలదు. రెండు మూడు రోజులు ఆగి వచ్చారంటే, దాన్ని అడిగి చెపుతాను. నాకేమీ పాండిత్యమూ – ప్రజ్ఞా లేదు. మీరు నన్ను ఇంత పెద్దను చేసి గౌరవిస్తే నేనేమనగలను? అదృష్టదీపచక్రవర్తుల మిత్రులైన మీకంటే నేను బుద్ధిశాలిని కాగలుగుతానా?" అంది కలహంసిక.

సరేనని రెండు రోజులాగి మళ్లీ వెళ్లాడు అదృష్టదీపుడు."అయ్యా! ప్రతి శుక్రవారం మా ప్రియంవద, భువనేశ్వరీ దేవిని అర్చించడానికి కేళీశైలానికి వెళ్తుంది. ఆ రోజు ఆమెతో ఏ విషయాలూ చర్చించను. ఆమెతో మాట్లాడడానికి వీలు కాలేదు. మిమ్మల్ని అనవసరంగా శ్రమపెట్టినందుకు సిగ్గుపడుతున్నాను" అందామె.

అదృష్టదీపుడు చిరుహాసం చేసి "ఇంతమాత్రానికి శ్రమేమున్నది? దీని కోసమే కదా నేను దేశాలు తిరుగుతున్నది? రేపు మళ్లీ వస్తా" అని పోబోయి, వెనక్కు వచ్చి "మీ స్నేహితురాలికి వివాహమైందా? పిల్లలెందరు? ప్రతిశుక్రవారం భువనేశ్వరిని అర్చించాలా? ఎక్కడుందా శైలం? రహస్యం కాకుంటే చెప్పు" అన్నాడు.

ఆమె వివాహం కాలేదనీ, ఆమె ప్రతి శుక్రవారం ఇంటిదగ్గరే

భువనేశ్వరిని అర్చిస్తుందనీ, సాయంత్రం విధిగా కేళీశైలానికి వెళ్తుందనీ, తాను ఆ శిఖరం ఎక్కేటపుడు ఆత్మీయుల్ని సైతం రానివ్వదనీ, ఆ శిఖరం మీద ఏమీ లేదనీ, ఆమె అక్కడేం చేస్తుందో తెలీదనీ, తానొక్కర్తే కొంతసేపు అక్కడుండి వస్తుందనీ, అది ఈ పట్టణానికి ఉత్తరంగా క్రోసెడు దూరాన ఉందనీ చాలా వివరాలే చెప్పింది కలహంసిక.

ఇంకా ఇలా అంది– "ఒకరోజు సాహసించి, ఆమె ఏం చేస్తుందో చూద్దామని ఆ శిఖరం మీదకు వెళ్లాను. ఏ శిల చాటున ఉందో - ఏమో నాకు ఆమె ఎక్కడా కనిపించలేదు. రాజపుత్రి కదా! తాను వద్దన్న పని చేస్తే నన్ను ఎక్కడ శిక్షిస్తుందో అని భయపడి, ఎక్కువ వెతక్కుండా వెంటనే వచ్చేశాను"."ఆమె శుక్రవారం కాకుండా, ఇంకెప్పుడైనా అక్కడకు వెళ్తుందా?"

"ఏ ఇతర రోజుల్లోను వెళ్లదు.""సరే! నేను మళ్లీ వస్తాను. ఈసారి నా ప్రశ్నకు జవాబు దొరుకుతుందని ఆశిస్తాను" అని అతడు శెలవు పుచ్చుకున్నాడు అక్కడనుంచి. ఆ సాయంత్రం కలహంసిక చెప్పిన గుర్తులు చూసుకుంటూ, అదృష్టదీపుడా కేళీశైలానికి వెళ్లాడు.

ఆ పర్వతం ఎత్తు క్రోసెడు. చుట్టు కొలత రెండు క్రోసులు. ఎటువైపునుంచైనా దాన్ని ఎక్కవచ్చు! ఎక్కడానికి అనువుగానే ఉండే కొండ అది. చిన్నచిన్న తుప్పలు, డొంకలు తప్ప పెద్ద చెట్లేవీ లేవు. శిఖరం మాత్రం విశాలంగా - బల్లపరుపుగా ఉంది. ఎంత జాగ్రత్తగా చూసినా, అక్కడ ఏమీ కనిపించలేదు. మర్నాడు మళ్లీ కలహంసిక దగ్గరకు వెళ్లాడు. "ప్రియంవదని అడిగాను. ఆమె పరిహాసం చేసి జవాబు చెప్తే ఏమిస్తాడో కనుక్కో" అంది. అని చెప్పి కలహంసిక అదృష్టదీపుని వంక చూసింది.

"ముందు చెప్పాను కదా! నాకు దొరికిన దానిలో సగం ఇస్తానని" అన్నాడు అదృష్టదీపుడు. అలాగే తాను ఈ శిఖరానికి వెళ్లిన మాట ఆమె చెవిన వేశాడు. అందుకు కారణం ఉంది. తాను వెళ్లి చూసిన కొండ, ఆమె చెప్పిన కేళీశైలం ఒక్కటేనా? కాదా? అని అతడికి సందేహం. అది తీర్చుకోవాలనే అతడా మాట చెప్పాడు. ఆ కొండ మీద పొదలు తప్ప ఏవీ లేవన్నాడు. ఆమె తత్తరపడి "అయ్యో! మీరు అక్కడి కెందుకెళ్లారు? నేను

ఇలా చెప్పానన్న విషయాన్ని మీరు ఎవరితోనైనా అన్నారో కష్టం" అందామె. "అదేం ఉండదు! అలా ఇతరులతో చెప్పడానికి నేనేం మూర్ఖుడినా? పనిలేనివాడినా? ఏదో విహారార్థం అలా వెళ్లానంతే! సరే! నా ప్రశ్నకు జవాబు నిమిత్తం రేపు రాగలవాడను" అని చెప్పి అక్కడ్నుంచి బయటపడ్డాడు.

ఇక అలాగే కొన్ని దినాలు కలహంసికకు కనబడక ఆ శైలాన్ని ఆమూలాగ్రం పరీక్షించాడు. ఏ విశేషమూ తోచలేదు. గడువు సమీపిస్తోంది. 'అనవసరంగా ఆ బ్రాహ్మణబాలుడు ఉరితీయబడతాడా? నా చావుకు నాకు విచారంలేదు. ఇక నేను పట్నం పోవడం ఎందుకు? రాత్రివేళ విశేషాలేమైనా కనిపిస్తాయేమో!' అనుకుంటూ అతడు ఆ రాత్రి కేళీశైలం దగ్గరే ఉండిపోయాడు. ఎప్పుడో నిద్ర పట్టేసింది.

అతడికా నిద్రలో అద్భుతమైన కల వచ్చింది. అతడు కళ్లు తెరిచాడు. కలకాదనిపిస్తోంది. అదో దివ్యభవనం. నవరత్న దీపాలతో కళ్లు మిరుమిట్లు గొల్పుతోంది. కళ్లు మూసుకునీ-తెరిచీ చూశాడు. అది కలకాదని నిర్ధారించుకున్నాడు. చటుక్కున లేచి కూర్చున్నాడు. తాను పర్వతం మీద ఉన్నట్లు గమనించాడు. అది ఒక ఔషధీలత ప్రభావం అనీ అతడు గమనించాడు. దాన్ని చేత్తో పట్టుకున్నంతసేపూ ఆ భవనం కనిపిస్తోంది. వదిలేసి చూశాడు. భవనం మాయమైంది. అది ఋజువు పరుచుకున్నాక ఔషధీలత పెకలించాడు. కనిపిస్తున్న మేడలోకి ప్రవేశించాడు. ద్వారాల పక్కనున్న సాలభంజికలను చూసి నిజమైన స్త్రీలనుకున్నాడు. ఏదో మాట్లాడబోయాడు. అవి ప్రతిమలని తెలిసింది. ముందుకు వెళ్లి సాహసించి ఒక గది తలుపులు తీశాడు. దాన్నిండా వజ్రాలు. అలాగే ఇంకో గదిలో రత్నాలు, మరో గదిలో వైఢూర్యాలు, వాటి కాంతులు భరించలేక తలుపులు మూసేశాడు. కాని అంతలోనే ఇవన్నీ నా అధీనమయితే, లోకంలోని యాచకులు అనేవారిని ఉండనివ్వను అనుకుంటూ కొన్నిట్ని తీసి మూట కట్టాడు. అలా ఆ భవనంలో తిరుగుతూంటే, ఓ మూల సోపానాలు కనిపించాయి. ఆ మెట్ల మీదుగా వెళ్లగా అక్కడో అంతస్తుంది. అక్కడ ఒక కాంతిపుంజం తప్ప మొదట్లో ఇంకేమీ కనబడలేదు. క్రమంగా ఆ వెలుగు అణగిపోయి, అక్కడో రత్న కంబళి, ఒకవైపు బంగారు విగ్రహం కనిపించాయి. రెండు చేతులు....మూడు తలలు కలిగిన ఆ శక్తి విగ్రహం

భయం గొల్పుతోంది.అది దాటి ఆ మెట్ల మీదుగా ఇంకా పైకి వెళ్లగా, ఇంకొక అంతస్తులో ఒక ఐదు ముఖాల మహాశక్తి పది చేతుల్తో దర్శనం ఇచ్చింది. దయవెదజల్లే నేత్రాలతో దివ్యతేజస్సుతో ఐదు రంగులతో అలరారుతోంది. పీఠం దిగువ భువనేశ్వరీ దేవి అని రాయబడి ఉంది. ఆ దేవి ఉన్న వెనుక గోడమీద ఒక పద్యం ఇలా రాయబడింది.

**గీ. ఇలనదృశౌషధీలత యెవని చేత**
**జిక్కు నాడె ఇందు రక్షింపబడుచు**
**తనరు నిధులకు నధికారి త్రిప్రియంవ**
**దాప్రియుండు నతండెవో తథ్యముగను.**

అని ఉన్న ఆ పద్యాన్ని మూడుసార్లు చదువుకుని, కొంచెం కలవరపడ్డాడు. "అయ్యో! ఈ లిపిలో అప్రియమైనమాట ఒకటి నాకు వర్తిస్తుంది. నేను ఇప్పుడు పడుతున్న శ్రమంతా హరిదత్తుని కోసమే తప్ప నాకోసం కాదు. ఇందులో లత దొరికినవాడే ప్రియంవద ప్రియుడని రాసి వుంది. కాని, పాపం! ఆ హరిదత్తుడు ఆశపడ్డ స్త్రీని నేనెలా స్వీకరిస్తాను? అయితే అవనీ! అంతవరకు వస్తే అప్పుడు చూసుకోవచ్చు!" అనుకుంటూ భువనేశ్వరీ దేవికి సాష్టాంగపడ్డాడు. ఆ మొక్కడంలో పరాకుగా తన చేతిలో తీగ ఔషధి నేలపై నుంచాడు.

అతడు భక్తిపూర్వకంగా ధ్యానించి లేచి కళ్లు తెరిచేసరికి, కొండ తప్ప ఇంకేం కనిపించలేదు. ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయి. తుప్పలు-డొంకలతో నేల కన్పించింది. అతడికి తాను చేసిన పొరపాటు తెలిసింది. అది అంతా కల అనుకోడానికి వీల్లేని విధంగా రత్నాల మూట తన దగ్గరే ఉంది. కల కాదు. దైవమాయ తప్ప మరొకటి కాదు. ఇక ప్రియంవద ప్రశ్నలకు నాకు ద్యోతకమైన అనుభవాలను బట్టి జవాబులు చెపుతాను" అని తెల్లవారగానే పట్టణంలోకి వెళ్లి మొదట కలహంసిక ఇంటికి వెళ్లాడు.

అతడ్ని చూసి ఆమె చాలా సంతోషంగా ఎదురొచ్చి "అయ్యా! మీ మిత్రుని నవ్వుకు కారణం వినండి! మర్రి చెట్టు విత్తనం చాలా చిన్నదైనా ఎంతో పెద్దదిగా వ్యాపించి, నా సేనను అంతట్నీ ఎండ తగలకుండా కాపాడి నీడనిస్తోంది. ఈ తాటి చెట్టు విత్తనం ఇంత పెద్దదిగా ఉన్నా, ఇద్దరికైనా

నీడ నివ్వలేక పోతోంది. సృష్టి విచిత్రమిదే కదా అని ఆయనకు నవ్వొచ్చింది. ఈ సమాధానం వారికి చెప్పి మీరు బహుమతి పుచ్చుకొని అందులో మా వాటా మాకు అందజేయండి" అంది.

ప్రియంవద బుద్ధికౌశలానికి మెచ్చుకున్న అదృష్టదీపుడు "కలహంసికా! నా మిత్రుడు ఇప్పుడు ఎక్కడో ఉన్నాడు. అతడి దగ్గర కెళ్లి వచ్చేసరికి చాలా ఆలస్యం అవుతుంది. నువ్వు చాలా శ్రమించావు. నీకోసమే కదా-ప్రియంవద జవాబు చెప్పింది. నా దగ్గర ప్రస్తుతం రత్నాలున్నాయి. వీటిని నీకు పారితోషికం ఇస్తున్నాను. తీసుకో!" అంటూ తాను మూట గట్టిన రత్నాలను ఆమె దోసిట్లో పోశాడు. ఆమె ఆ రత్నాలను చూసి, వాటి కాంతికి ఆశ్చర్యపడుతూ "అతడు సామాన్యడు కాడని" అతనికి నమస్కరించి అప్పటికప్పుడే ఆ రత్నాలను తీసుకుని ప్రియంవద దగ్గరకెళ్లింది.

అదృష్టదీపుడు, తాను చూసిన విశేషాలు బలభద్రునితో చెప్పడానికి ఆరాటపడుతూ చాలా వేగంగా ఇంటికి నడవసాగాడు. అంతలో రాజకింకరులు ఎదురుపడి "హరిదత్తా! ఎక్కడికిపోతావు! నడువు" అంటూ అతడిని ఒక మేడలో బంధించారు. "నేనేం నేరం చేశాను? నేను పెట్టిన గడువు దాటలేదే! నేను మిత్రగుప్తుడినైతే, హరిదత్తుడంటారేం? అతడెక్కడికైనా పారిపోయాడా ఏమి?" అని అడిగాడు. అందుకు వారు "నీ మాయ మాటలు నమ్మం! నువ్వు హరిదత్తుడవే! నువ్వు మమ్మల్ని మాయచేసి పారిపోయి మాకు మాట తెప్పించావు" అన్నారు కఠినంగా.

హరిదత్తుడికీ- నాకూ అన్ని పోలికలున్నాయా? ఆ వేళ బలభద్రుడూ అలాగే చెప్పాడు. సరే! అతడు తప్పించుకు పారిపోయాడు కాబోలు! అతడు బ్రతికితే అంతే చాలు!" అనుకున్నాడు మనస్సులో.

కలహంసికకు అదృష్టదీపుడిచ్చిన రత్నాలు చూసి చాలా ఆశ్చర్యపోయింది ప్రియంవద. "నువ్వు చెప్పినపుడు నేను నమ్మలేదు. ఈ మాత్రందానికే అంత ధనం ఇస్తాడా? అనుకున్నాను. ఈ రత్నాలకు మా తండ్రి రాజ్యం అంతా కూడా సరితూగదు. సరే గాని, నా ప్రశ్నలకు జవాబులు చెప్పేవాడు లేడు. నా యవ్వనానికి తగిన సార్థకత లేదు" అని నిట్టూర్చింది ఆమె. "అక్కా! నిన్ను ఎన్నాళ్లగానో ఒకటి అడుగుదాం అనుకుంటూన్నాను.

నీకు కోపం వస్తుందేమో అని ఊరుకొన్నాను. తప్పుంటే క్షమించు! ఇంతటి కఠోర వ్రతం ఎందుకు పూనావు?" అని మృదువుగా పలికింది కలహంసిక.

"సఖీ! ఆడవాళ్ల దగ్గర రహస్యం దాగదని నీకు చెప్పలేదు. అంతే గాని-నీకు చెప్పరాని రహస్యం ఏముంటుంది? నేను మా కులదేవత భువనేశ్వరీదేవి వరంతో పుట్టినదానిని. ఒకరోజున త్రికాలవేది అయిన ఒక యోగి మా ఇంటికి అతిథిగా రాగా, ఆయనకు శుశ్రూష చేయమని మా తండ్రి నన్ను నియోగించారు. నేను ఆయనకు చక్కగా సేవలు చేశాను. కొన్నాళ్ల తర్వాత ఆయన వెళ్లిపోతూండగా మా తండ్రి నన్ను చూపించి "మీ ఈ శిష్యురాలికి ఎలాటి వరుడు లభిస్తాడు?" అని అడిగాడు.

ఆ యోగి నన్ను చూసి "బాలా! నీకు పెళ్లి చేసుకోవాలని ఉందా?" అని అడగ్గా, స్త్రీ సహజమైన సిగ్గుతో ముందు నేనేమీ మాట్లాడలేదు. నాకు అది వచ్చీరాని వయసు. అందువల్ల "ఏదో తమ అనుగ్రహం" అనేశాను. అప్పుడాతడు ఏదో మంత్రం ధ్యానించి, ప్రశ్నల పట్టిక రాసిచ్చాడు. "వీటికి జవాబులు ఎవరు చెప్తారో వారినే పెళ్లాడు" అనీ - సార్వభౌముడు కాని వాడు వీటికి జవాబు చెప్పలేడనీ కూడా నాతో అని మా తండ్రికి కూడా చెప్పక నా చెవిలో ఏదో చెప్పి దీవించి వెళ్లిపోయాడు. గుర్వాజ్ఞ లేదు గనుక అతడు నా చెవిలో చెప్పింది మా తండ్రికైనా నేను చెప్పలేదు.

యతి మాటలు తల్చుకుంటే, నా యవ్వనం ఇలా వృథా అయిపోతుందేమో అని భయం వేస్తోంది. ఇవి దివ్యరత్నాలే! సందేహం లేదు." అంటూ వుండగా భటులతో తండ్రి కబురంపాడు ఇలా......"అమ్మా! హరిదత్తుడిగా మనకు తెలిసిన యువకుడు, నీ ప్రశ్నలకు సమాధానం ఇస్తానంటున్నాడు." అని చెప్పి పంపాడా రాజు.

" సరే! సమాధానాలు రాసివ్వమనండి" అని జవాబు పంపింది ప్రియంవద. చిత్రరూపంలో జవాబు రాశాడు అదృష్టదీపుడు. కలయో-నిజమో తెలీని స్థితిలో తాను చూసిన పుష్పగిరి కేళీ శైలం, శిఖరం పైన మూడు అంతస్థుల భువనేశ్వరీ మాత ఆలయం, ఐదు ముఖాలు-పదిచేతుల దేవి, వాటి రంగులు, గోడమీది పద్యం అన్నీ అందులో రాసిచ్చాడు.

యోగి ఆనాడు తన చెవిలో చెప్పిన జవాబులతో, ఆ చిత్తరువు సరిపోవడంతో, ఆమె ఆనందం పట్టలేక "ఇన్నాళ్లకు నాకు వివాహయోగం వచ్చింది సఖీ" అని కలహంసికను కౌగిలించుకుంది. "ఇది కలో-నిజమో తెలీదుగాని, ఇందులో నేను కోరిన ప్రశ్నలన్నింటికీ సమాధానాలున్నాయి" అంటూ గుర్తుకోసం తాను ఒకప్పుడు సంకేతాల రూపంగా రాసిన విశేషాలను చూపించింది. రెండు సరిపోలి వున్నాయి. "ఈ జవాబులు చెప్పిన వారిని నేను వరిస్తున్నాను" అంటూ తండ్రికి జవాబు రాసి పంపింది ప్రియంవద. రాజసభ నుంచి వచ్చిన సమాచారం ప్రకారం ఆమె దృష్టిలో హరిదత్తుడే ఆ జవాబులు చెప్పి ఉంటాడని ఆమె ఊహ. ఇక-ఇక్కడ సభలో కూడా, అదృష్టదీపుడిని మిత్రగుప్తుడిగా ఎరిగివున్నందున, అతడి జాడ లేక భటులు తెచ్చి తన ముందుంచిన హరదత్తుడనే ఆయనా భావిస్తున్నాడు.

అయితే-ఈ అపార్థాలన్నీ కలహంసిక ఉత్సాహంగా రాజసభలోకి అడుగుపెట్టడంతో దూదిపింజల్లా తేలిపోయాయి. కలహంసిక అతన్ని చూసి ఆశ్చర్యపడుతూ "ఇదేం వింత? ఈ సభలో ఉన్నది మిత్రగుప్తుడు కదా! హరిదత్తుడు అంటారేం?" అని చెప్పేసరికి అంతా తెల్లబోయారు. అంతటితో ఆగక "నువ్వు తెచ్చిన రత్నాలు సామాన్యమైనవి కావనీ-నిన్ను చూడాలనీ రాజకుమార్తె తొందరపడుతోంది. తానే ఈ హారం వేసినట్లుగా భావించి నన్ను మీ మెడలో హారం వేసి రమ్మంది" అంటూ అదృష్టదీపుడి మెడలో హారం వేయగా, అందరూ జయజయధ్వానాలు చేశారు. ఇంత జరిగినా మిత్రగుప్తుడి పేరిట ఉన్న అదృష్టదీపుడు నోరు మెదపలేదు. అందుక్కారణం.... ప్రియంవదా- హరిదత్తుల వివాహం చేస్తానని అతడు మనసులో భావించుకొని ఉండటమే!

అందువల్ల కలహంసిక తొందరపెడుతున్నా అతడి దృష్టి అంతా కారాగారం నుంచి పారిపోయిన హరిదత్తుని మీదనే ఉంది. "ఇప్పుడు అంతఃపురానికి రావడానికి వీలుపడదని- తానొక దీక్షలో ఉన్నాని "కలహంసికకు కూడా మాట్లాడే అవకాశం ఇవ్వక తన బసకు వెళ్లే ఏర్పాట్లు చెయ్యమన్నాడు" అదృష్టదీపుడు.

అతడికి వైభవంగా శకటం సిద్ధం చేయించి విడిదికి పంపేశాడు

రాజవాహనుడు. విజయుడై తిరిగొచ్చిన మిత్రుడ్ని చూసి బలభద్రుడు అతడ్ని అభినందించాడు.

"బలభద్రా! నేను హరిదత్తుని గెలిపించబోయి, ఒక చిక్కులో పడ్డాను. అందరూ నన్నే హరిదత్తుడనుకుంటున్నారు. నేను మిత్రగుప్తుడినని ప్రియంవద సఖి అయిన కలహంసికకు మాత్రమే తెలుసు! ప్రియంవదకు నేను అసలు తెలియదు-నన్ను గురించి వినడమే తప్ప నా రూపం కూడా ఆమె చూడలేదు. రాజసభ నుంచి వెళ్లిన జవాబులు హరిదత్తుడే చెప్పాడని ఆమె భావిస్తోంది. అందువల్ల నేను తెరమీద నుంచి నిష్క్రమించాలంటే-మనకి ఆ హరిదత్తుని జాడ తెలియాలి! జవాబులు ఎవరు చెప్పారన్నది-ప్రియంవదకు తరువాత తెలిసినా వచ్చే భయం ఏమీ లేదు గాని, రాజవాహనుడికి కూడ నేను ప్రత్యక్షంగా హరిదత్తుని లాగానే కనిపించడానికి కారణం...,భటులు నన్నే పారిపోయిన హరిదత్తుడనుకొని ఆ రాజు ముందు నిలబెట్టడమే! అందువల్ల - ఏ రీతిగా చూసినా మనం హరిదత్తుడిని వెతికి తీసుకురావడం మన తక్షణ కర్తవ్యం కావాలి!" అని మళ్లీ మళ్లీ చెప్పాడు అదృష్టదీపుడు.

బలభద్రుడు కూడా విషయాన్ని ఒకటికి రెండు సార్లు గందరగోళం లేకుండా విని, తనవంతు సహకారాన్ని అందించడానికి సిద్ధం అయ్యాడు. తిరిగి ఒక చోట కలుసుకోవడానికి సంకేతస్థలాన్ని రావడానికి నిర్ణీత గడువును ఏర్పరచుకొని ఇద్దరూ ఆ రాత్రే చెరొక దారిన వెళ్లారు. ఇద్దరికీ లక్ష్యం ఒక్కటే-హరిదత్తుని జాడ కనుక్కోవడం!

## హరిదత్తుని కథ

ఆ ప్రకారం వారి దారులు చీలి, చెరో దారీ పట్టాక బలభద్రుడు ఎన్నెన్నో గ్రామాలు, పల్లెలు, పట్నాలు వెతికి ఒక సాయంకాలానికి ధర్మపురం చేరాడు. అక్కడ పూర్వపరిచితమైన సత్రంలో బస చెయ్యగా, అంతకు ముందు అక్కడ పరిచయమై వున్న మిత్రుడొకడు బలభద్రుని గుర్తించి కుశలమడిగాడు. బలభద్రుడ్ని హరిదత్తుని గురించి అడిగాడు.

ఆ మిత్రుడు ఓ క్షణం ఆలోచించి "ఓహో! అతడు నీకు తెలుసన్నమాట! మెల్లగా మాట్లాడు! అది రహస్యం. ఈ ఊళ్లో అతని గురించి రకరకాలుగా ఉంది. రేపు మా ఇంటికి రా! నేనిప్పుడో తొందర పనిమీద వెళ్లాల్సి వుంది" అంటూ హడావుడిగా వెళ్లిపోయాడతడు.

దీంతో బలభద్రుని మనస్సులో ఎన్నో సందేహాలు...కొంతసేపు అక్కడక్కడ తిరిగి సత్రానికి చేరుకున్నాడు.

ఆ సత్రంలో దేశదేశాలకు చెందిన బాటసారులు విడిదిచేశారు. పురాణాలు చెప్పుకొనేవారు కొందరు, జంధ్యాలు వడికే వారు కొందరు, శాస్త్ర చర్చలు చేసేవారు కొందరు. లౌకిక విషయాలు చర్చించుకొనే వాళ్లు కొందరు....నానా గందరగోళంగాను ఉంది సత్రం. ఎక్కడెక్కడి విషయాలూ తెలుస్తాయి. కదా అన్నట్లు బలభద్రుడు వాళ్లకు చేరువగా కూర్చున్నాడు. ఒకచోట ఇద్దరి సంభాషణలో హరిదత్తుని గురించి కొంత సమాచారం తెలిసింది.

"అదృష్టదీపుడు కొన్నాళ్లక్రితం ఆ వూరొచ్చినట్టూ-ఆరాజు కూతురు కాంతిమతితో క్రీడించిన ఫలితంగా ఆమెకు గర్భం వచ్చినట్టూ-గాంధర్వ వివాహంగా భావించిన ఆ పిల్ల తండ్రి, కూతుర్ని, జాగ్రత్తగా చూస్తున్నట్టూ-ఈ మధ్యనే ఆమెకు ఓ కొడుకు పుట్టినట్టు" వారి మాటల మధ్యలో బలభద్రునికి అర్థమైంది. అది కొంతవరకు అతడికి తెలిసిన గాథే!

ఆ తరువాత అదృష్టదీపుడు అదృశ్యమయ్యాడని, కొడుకు బారసాలకైనా వస్తాడో-రాడోనని ప్రజలు చెవులు కొరుక్కుంటున్నారట!

ఇంతలో గూఢచారులు ఒక వ్యక్తిని పట్టుకొచ్చి, అదృష్టదీపుడు దొరికాడన్నారు. అయితే ఆ పట్టుకు రాబడ్డవాడు తాను హరిదత్తుడిననీ బ్రాహ్మణపుత్రుడిననీ కాంతిమతిని తానెన్నడూ చూడలేదనీ అంటున్నాడట! ఆమె కన్న పుత్రుడు తన కొడుకెలా అవుతాడని అతడి వాదనట!

రాజకుమార్తె కాంతిమతి మాత్రం 'అతడే నా భర్త! పోనివ్వకండి' అంటోందట!....ఇది ఒక ప్రక్క రాచనగరులో సాగుతున్న వ్యవహారం అని బలభద్రుడు వారి సంభాషణ వల్ల గ్రహించాడు.కాగా, ఈ సమాచారానికి అదనపు జోడింపు అన్నట్లుగా- అక్కడ చేరిన బాటసారులలో ఒకడైన బ్రహ్మావధాని చెప్పిన మాటల ప్రకారం-హరిదత్తుడి గాథ కొంతవరకు బలభద్రునికి తెలిసింది.

## హరిదత్తుని కథ

ఒకరోజు ఓ బ్రహ్మవధాని అరణ్యమార్గం గుండా నడుస్తూండగా, ఝాము ప్రొద్దెక్కేసరికి ఎండలో నడవలేక ఆయాసం వచ్చి, ఓ చెట్టు నీడన కొంతసేపు విశ్రమించగా, చెట్టు కొమ్మల్లోంచి శిశురోదనం వినిపించిందట! ఈ చంటిబిడ్డ ఏడుపు ఎక్కడ్నుంచి వస్తోందా? అనుకుంటూ పైకి చూసేసరికి కొమ్మల్లో ఓ కోతి శిశువును ముద్దాడటం కనిపించిందట. అతడాశ్చర్యపడి, శిశువును రక్షించి, తనకు సంతానం లేనందున పెంచుకుంటాన్నాడట! అయితే శిశువును కోతి నుంచి స్వాధీనం చేసుకున్నాక 'ఆ బిడ్డని ఎవరైనా వదిలేశారేమో' అనుకుంటూ అతడు ఆ చుట్టుప్రక్కల చూడగా వెనుదిరిగి వున్న వృద్ధురాలైన స్త్రీ కనిపించేసరికి, ఈ నవజాత శిశువుతో ఆమెకేం సంబంధం వుంటుందనుకొని, ఆమెను పలకరించకుండా వచ్చేసినట్లు చెప్పాడు. హరి చేత ఇవ్వబడినందున (హరి అంటే విష్ణువుతో పాటు కోతి అనే అర్థం కూడా ఉంది) హరిదత్తుడని పేరుపెట్టాడట!

ఇంతలో తన భార్యకూ ఒక కొడుకు కలిగేసరికి, హరిదత్తుడిపై ప్రేమ తగ్గిందట! అప్పుడు తమకు దగ్గర్లో ఉన్న ఒక అగ్రహారంలోని ఆచార్యుల వద్ద విద్యాభ్యాసానికి పెట్టాడట. ఆ ఆచార్యుల వారి కూతురి వల్ల ఎక్కడికో పారిపోయాడట. లోకులేవో కారణాలు చెప్పినా- అవి తర్కానికి నిలవలేదట! ఆ హరిదత్తుడూ-ఇప్పుడీ రాజుకు చిక్కిన హరిదత్తుడూ ఒకరేనా తెలుసుకోవాలని అతడు అనుకుంటున్నాడట!ఇదంతా బ్రహ్మవధాని నోటి వెంట విని "ఔరా! హరిదత్తుడి కింత గత చరిత్ర ఉందా?" అని ఆశ్చర్యబోయాడు బలభద్రుడు. అక్కడే ఒక మూల పడుకొని ఆ మాటలన్నీ వింటూన్న ఓ వృద్ధ స్త్రీ మెల్లగా లేచి వచ్చి "అయ్యా! తమరెవరు? హరిదత్తుని వృత్తాంతం చెప్పిన ఆ బ్రహ్మవధాని మీరేనా? చూపు సరిగ్గా అనడం లేదు" అంటూ అడిగింది.

దానికి తల అడ్డంగా ఊపుతూ "అమ్మా! నేను బలభద్రుడనేవాడిని, మీరెవరు? ఆ బ్రాహ్మణుని అవసరం మీకేమిటి?" అని అడిగాడు.

అప్పుడామె "ఏం చెప్పమంటావు నాయనా! నాకూ ఈ కథతో కొంత సంబంధం ఉండబట్టే అడిగాను. నేను మాళవరాజు ధర్మపాలుడి భార్య సునంద పరిచారికని. నా పేరు రత్నావతి.

శత్రువుల కోట ముట్టడించేసరికే గర్భవతి అయి వున్న

రాణిసునందా, మూడేళ్ల వయస్సున్న ఇంకో కొడుకును ఎత్తుకుని నింబవతి అనే దాసీ, నేనూ కోట దాటి అడవిదారిన పడ్డాం! ఆ గందరగోళంలో నింబవతి పిల్లాడితో ఎటుపోయిందో తెలీలేదు. ఇక నేనూ-రాణీ అరణ్యంలో తిరుగుతూంటే, ఆమెకు నొప్పులు మొదలై, పండంటి బిడ్డని ప్రసవించింది. నీళ్ల తేవడానికి వెళ్లిన నేను ఒక బ్రాహ్మణుని ఆ అడవిదారంట చూసినా నా తొందర్లో నేనుండటంతో అతడ్ని పట్టించుకోలేదు. తీరా నేను వెళ్లేసరికి సునంద లేదు. నాటి నుంచి నేటి వరకూ ఆమెను చూడలేదు. నింబవతి మొదటే మాకు దూరమైంది. రాణీని ఇప్పుడు దూరం జరిపాడా పాడు దేవుడు. ఈ బ్రాహ్మణుడు చెప్పినవన్నీ వింటూంటే అలనాటి సంఘటన గుర్తొచ్చింది. హరిదత్తుడు మా రాజపుత్రుడు. నేను ఆ బ్రాహ్మడిని చూడాలి. చెప్పండి! మీకు పుణ్యం ఉంటుంది" అని రత్నావతి తన వృత్తాంతం చెప్పి బలభద్రుని వేడుకుంది. అప్పటికి బలభద్రుడికి చాలా సందేహాలు మంచువిడిపోయినట్లు విడిపోయాయి. సందేహం లేదు! అదృష్టదీపుడూ-హరిదత్తుడూ ఒకే తల్లి బిడ్డలు. అందుకే వారికి ఆ పోలికలు సహజం! తాను మొట్టమొదటిసారి హరిదత్తుడ్ని చూసి తబ్బిబ్బు పడ్డదీ ఇందువల్లనే! అనుకున్నాడు బలభద్రుడు.

"అవ్వా! నువ్వు విచారించకు! నీ ఆప్తుల్ని కలుసుకుంటావులే! ఈ మాటలు నేను ఎలా చెప్పగలుగుతున్నానంటే-నేను, మీ రాజుగారి పెద్దకొడుక్కి స్నేహితుణ్ణి గనుక. అతడు క్షేమంగానే ఉన్నాడు. ఇక-నువ్వు చెప్పిన నింబవతి అనే ఆమె పాము కరచి మరణించింది. ఆ బాలుడు పెరిగి పెద్దవాడైనాడు లే! నా స్నేహితుడు అతడే! నేడో-రేపో ఈ భూమండలమంతా ఏలగలడు అతడు" అన్నాడు ఆమెని ఓదార్చిన బలభద్రుడు. ఆ రత్నావతికి ఎంతో సంతోషమైందా పలుకులకు.

"తల్లి మాత్రం ఎక్కడుందో ఇంకా తెలియాల్సి ఉంది" అని ఉదయాన్నే లేచి రత్నావతినీ-బ్రహ్మావధాని అనే ఆ బ్రాహ్మణునీ తాను వచ్చేవరకూ అక్కడే ఉండమని, కాంతిమతి చెలికత్తె అయిన నిపుణిక ఇంటికెళ్లాడు బలభద్రుడు.

ఆమె అతడ్ని గుర్తించి "అయ్యా! మీ మిత్రుడ్ని విడిచి నువ్వెటు వెళ్లిపోయావు. ఇక్కడికెప్పుడొచ్చావు? మీ అదృష్టదీపులవారికి మాపై దయ

తప్పింది. శిశువునైనా చూడడాయె! తనకేం సంబంధం అంటాడు" అంటూ నిష్ఠురమాడింది. "సమయానికొచ్చారు. పరిస్థితి చక్కపరచగలరు" అనీ కోరింది.

బలభద్రుడు నవ్వుతూ "భగవంతుని సృష్టి చాలా చిత్రమైంది. నిపుణికా! మనిషిని పోలిన మనిషి ఉండడం సహజమే! ఎంత వెర్రిబాగులవాడైనా పూర్వ పరిచయం గల్గిన స్త్రీని ఎరుగనని ఊరకే అంటాడా? అనగలడా?" అని ప్రశ్నించాడు.

ఆమె "నువ్వన్నదీ నిజమే! పద నీకు అతడ్ని చూపిస్తా" అని హరిదత్తుని దగ్గరకు తీసుకెళ్లింది. ఆ సమయానికి అతడు-"మీరెన్ని చెప్పినా నేను అంగీకరించను. నా దారిన నన్ను పోనివ్వండి'' అని పెనగులాడుతున్నాడు. పిచ్చేమో అన్నారు కొందరు.

ఆ స్థితిలో ఉన్న హరిదత్తుని దగ్గరకెళ్లి బలభద్రుడు "నన్ను గుర్తుపట్టగలవా మిత్రమా?" అని అడిగాడు.

అతడు పరిశీలించి "అయ్యా! మిమ్మన్నెలా మర్చిపోగలను, ఉరిబిగుసుకోబోయే సమయానికి తలారుల దగ్గర ప్రత్యక్షమై నా ఆయువును ఆర్నెల్లు పొడిగించిన ప్రాణదాతలు మీరు. నా వల్ల మీరు ఆ రాజ్యంలో చిక్కులు పడుతున్నారు కాబోలు! తమరైనా వీళ్లకు చెప్పి, నాకూ-ఆ ప్రియంవదకు ఎలాటి సంబంధం లేదని బోధపరచి నన్ను విడిపించి తీసుకెళ్లండి!" అన్నాడు."నీతో కొన్ని రహస్యాలు చెప్పాలి! నువ్వేమో పారిపోయి ఇక్కడికొచ్చి చిక్కుపడ్డావు" అన్నాడు బలభద్రుడు.

అది విని మిగిలిన వాళ్లు కాస్త దూరంగా జరిగారు...వాళ్లకు ఏకాంతం కల్పిస్తూ. అక్కడ అదృష్టదీపుడికీ ఆర్నెల్లకాలంలో జరిగిన సంగతులన్నీ వివరించాడు హరిదత్తుడికి.

అంతా విన్న హరిదత్తుడు "మీ మాటలు చిత్రంగా ఉన్నాయి. నాకు సోదరులు ఉండటం అసాధ్యం! నా దత్తత తండ్రికైనా నా తర్వాతనే ఒక పుత్రుడు జన్మించినందున అతడు నాకు తమ్ముడవుతాడు కాని అన్న కాలేదు గదా!" అని సందేహంలో పడ్డాడు.

"అందుకే నీ చరిత్ర నువ్వెరుగవని ముందే చెప్పాను" అంటూ నీవు చెప్తున్న బ్రహ్మావధాని ఇక్కడే ఉన్నాడు. ఆయనకు నువ్వెలా దొరికిందీ ఆయనతోనే చెప్పించనా?" అనేసరికి హరిదత్తుడు, నిజం ఇంత విడ్డూరంగా వుంటుందా?" అని ఆశ్చర్యపోయి "మిత్రమా! నేటి నుంచీ నా ప్రాణాన్ని నీ అధీనం చేస్తున్నాను. ఇది మొదలు నువ్వేది చెప్తే అది అలా ఆచరించేస్తుంటాను" అన్నాడు. అక్కడికి కాంతిమతి బిడ్డతో రాగా –

బలభద్రుడు "కాంతిమతీ! మీరే భ్రమపడుతున్నారు. నీ భర్తకు తమ్ముడు ఇతడు. ఒకేలా ఉండటం వల్ల మీరు ఇతడ్ని మీ భర్తగా భావించి పొరపాటుపడుతున్నారు. నిదానించి చూడండి! మీకు ఇతడు మరిది" అని స్పష్టం చేశాడు.

అప్పుడు బిడ్డని బలభద్రుని చేతబెట్టి కాంతిమతి, హరిదత్తుని పరీక్షగా చూసింది. మరిదిని గుర్తించింది. అప్పుడు బలభద్రుడు కాంతిమతితో "అమ్మా! ఈ సంగతులన్నీ నీ భర్తకు చెప్పి అతడ్ని తీసుకొస్తాం!" అని మాట ఇచ్చి, హరిదత్తుని వెంట బెట్టుకుపోయి సత్రంలోని రత్నావతి–బ్రహ్మావధానులను హరిదత్తునికి చూపాడు. వాళ్లూ అతడ్ని గుర్తించి ఆనందించారు. అన్నతో తాను కలిసి తిరిగొచ్చేవరకూ వారిని అక్కడే ఉండమని కోరి హరిదత్తుడు బలభద్రుని వెంట ప్రయాణమయ్యాడు. పుష్పగిరి చేరాక, తమ సంకేతస్థలంలో హరిదత్తుని ఉండమని– తాను వెళ్లి అదృష్టదీపుని తీసుకొస్తానని చెప్పి వెళ్లాడు బలభద్రుడు.

అంతవరకూ ఊరకే కూర్చోడం దేనికని, హరిదత్తుడు చక్కగా తయారై అంగడికి వెళ్లాడు.

ఆ రోజు శుక్రవారం, ప్రియంవద, కలహంసిక బండిలో కేళీశైలానికి వెళ్తూ, దారిలో కనబడ్డ హరిదత్తుని కూడా వెంటబెట్టుకుని రమ్మని కలహంసికను బండిలోంచి దింపి, తాను సాగిపోయింది.

కేళీశైలం మీద తాను జపం చేసుకొనే ప్రదేశం వైపు నడుస్తుండగా, ఒక రాయి ఆమె కాలికి తగిలి తూలి పడిపోయింది. పూలసజ్జలోనికి పూలు

ఎత్తుతుండగా, అక్కడ ఔషధీలత ఉండి, అదీ ఆమె చేతికి తగిలింది. ఔషధీలత ప్రభావం వల్ల ఆమెకు భువనేశ్వరీ దేవి ఆలయం సాక్షాత్కరించింది.

ఆమె ఆలయంలోనికి ప్రవేశించి అదృష్టదీపుడికి కనిపించిన విశేషాలన్నీ చూసింది. అతడు తెచ్చిన రత్నాలు అక్కడివేనని గుర్తించింది.

ఆ తరువాత - తాను తెచ్చిన పూలతో దేవిని అర్చించింది. ఆ పూలతో బాటు ఓషధీలత కూడా అమ్మవారి పాదాలపై పడింది. అంతే! అవన్నీ అదృశ్యమై శిఖరం మాత్రం మిగిలింది.

అదో అద్భుత ఇంద్రజాలం అని తలచి, ఆ విశేషాలను తన సఖులకు చెప్పాలని అంతఃపురానికి పోవడానికి తొందరపడుతూండగా, బలభద్రునికి చెప్పిన సంకేత స్థలం అదే కనుక అదృష్టదీపుడు అక్కడకు వచ్చాడు.

ఆమె అతడ్ని హరిదత్తుడిగా భావించి “మీరూ ఇక్కడికొచ్చారేం” అని నమస్కరించింది. జరిగిందంతా చెప్పింది.

అప్పుడతడు ఓషధీలత వెతుకుతున్నాడు. ఈలోగా మిత్రుడిని కలుసుకుందామని బలభద్రుడూ అక్కడకు రాగా, రాజభటులు అడ్డగించబోగా, అదృష్టదీపుడు “అతడు నా మిత్రుడే! రానివ్వండి” అని చేత్తో సైగ చేయడంతో వారు అతన్ని వదిలారు.

బలభద్రుడు అక్కడికొచ్చి “ఇతడు అదృష్టదీపుడా! హరిదత్తుడా? అని తానే విభ్రమంలో పడిపోయాడు. ఇన్నాళ్లు కలసి తిరిగిన తానే ఇంత అయోమయానికి గురైతే, పాపం! వారిని కొద్దికాలం చూసిన ప్రియురాళ్లు తడబాటు పడటంలో ఆశ్చర్యంలేదనుకున్నాడు.

“మిత్రమా! రా! దూరంగా నిలబడిపోయావేం?” అని పిలిచిన పిలుపు వల్ల అదృష్టదీపుడని గుర్తుపట్టాడు.

పరపురుషుడు రావడం వల్ల ప్రియంవద పక్కకు తొలగింది.

“హరిదత్తుని జాడ తెలిసిందా?” అంటూ కౌగిలించుకుని “నువ్వు లేక ఇన్నాళ్లూ నాకు ఏమీ తోచలేదు సుమీ!” అన్నాడు.

బలభద్రుడు ధర్మాపురం సత్రంలో తాను దిగిన నాటి నుంచీ, ఆ క్షణం వరకు జరిగిన విశేషాలన్నీ వివరించాడు. హరిదత్తుడు నీకు స్వయంగా

తమ్ముడే! అని రూఢిపరిచాడు. రత్నావతి – బ్రహ్మావధాన్లు అనే ప్రత్యక్ష సాక్షుల గురించీ చెప్పాడు.

ఇదంతా ప్రియంవద ప్రక్కనించి వింటూ అమితాశ్చర్యానందాన్ని పొందసాగింది.

అదృష్టదీపుడు అంతా విని "బలభద్రా! నేడెంత సుదినమో నేను మాటల్లో చెప్పలేను. ఎంత మంచి వార్త విన్నాను? హరిదత్తుడు నా తమ్ముడా! ఇప్పుడెక్కడున్నాడు? మా తండ్రి గారిని కారాగారబద్ధుడిగా చేసిన దుర్మార్గుడెవరు? మా తల్లి ఎక్కడుందో? నా తమ్ముడ్ని కాపాడిన బ్రహ్మావధాన్లునీ–మా కుటుంబాన్ని నమ్ముకున్న వృద్ధదాసి రత్నావతినీ కూడా మీ వెంట తీసుకురాలేకపోయావా? నా వల్ల ఒక నిండుప్రాణం నింబవతిని కోల్పోయాం! అయ్యో!" అని విచారించాడు.

"జరిగిపోయిందానికి విచారించి ప్రయోజనం ఏముందిలే మిత్రమా? ఇప్పుడు కాలం అనుకూలంగా ఉంది కదా! ఈమె ఎవరు? గుర్తులను బట్టి ప్రియంవద అనుకుంటాను. ఈమెను హరిదత్తునికి కూర్చుతానంటివి కదా!" అని గుర్తుచేశాడు బలభద్రుడు.

"మిత్రమా! నేను పట్టిన శపథం విడుస్తానా? నేను ఇక్కడికి వచ్చేసరికే ఈమె ఇక్కడ ఉంది. నన్ను ఎలా గుర్తుపట్టిందో గాని తెలిసినట్లే మాట్లాడింది. అయితే ఓషధీలత ఈమెకు చేతచిక్కినట్లే చిక్కిజారిపోయింది. దానికోసం నేను వెతుక్కుంటున్నాను. అంతే! ఇంతలో నువ్వొచ్చావు" అన్నాడు అదృష్టదీపుడు.

ఈలోగా కలహంసికతో కలిసి హరిదత్తుడు అక్కడికి వచ్చాడు. అతడ్ని చూస్తూ అదృష్టదీపుడే ఆశ్చర్యపోయాడు. ఇక కలహంసిక, ప్రియంవదలైతే అచ్చుగుద్దినట్లున్న ఆ ఇద్దర్నీ పక్కపక్కన చూసి అప్రతిభులై నోట మాట రాక నిల్చుండిపోయారు.

కలహంసిక "ప్రియంవదా! ఈయనెవరు? అచ్చం హరిదత్తుడి లాగే ఉన్నాడే!" అని తానే బాగా ఎరిగి ఉన్నప్పటికీ అదృష్టదీపుని వైపు చూసి తడబడింది.

అప్పుడు అసలు రహస్యాన్ని హరిదత్తుడు భేదించాడు.

"మిత్రమా! నీవు నన్ను ధర్మాపురం నుంచి తీసుకొచ్చి ఒకచోట ఉండమని నియమించితివి కదా! అప్పుడు నువ్వొచ్చేలోగా అంగడికి పోయి రావచ్చునని అటువెళ్లగా, ఈ కలహంసిక కంటపడ్డాను. ఈ ప్రియంవద కూడ నన్ను బాగా ఎరిగి వున్నదానివలెనే "ఆయన్ని బండి ఎక్కించి తీసుకురా!" అంది. ఈమె నన్ను తీసుకొచ్చింది. ఇక్కడ మన మంతా కలుసుకున్నాం!" అన్నాడు.

మొత్తం మీద మనం అనుకున్నట్లుగానే జరుగుతున్నది. "బలభద్రా! తమ్ముడ్ని వెదికి తెచ్చినట్లే, తల్లినీ వెతకాలి! ముందుగా ప్రియంవదతో తమ్మునికి పెళ్లి చేయాలి!" అంటూంటే, అప్పటికి ఆ ప్రియంవద నోరు పెగల్చుకుని "నా ప్రశ్నలకు జవాబు చెప్పిందెవరో ముందు తేల్చండి" అంది.

అప్పుడు కలహంసిక, ఆ ఇద్దరి దగ్గరకూ వెళ్లి మొక్కి "ఆర్యులారా! మీరిద్దరూ ఒకే రూపంతో ఉన్నారు. మీరు అన్నదమ్ములు కావచ్చు! మీలోన మా సఖి కోరిన దెవ్వరిని? దాని ప్రశ్నలకు జవాబులిచ్చిన దెవరు? ఇంతవరకు ఆమె ఎవర్ని ప్రియుడనుకుంటోందో - వారు ఆమె ఊహ ప్రకారం కానప్పుడు క్షమించగోరుతున్నాను" అంది.

అప్పుడు అదృష్టదీపుడు "కలహంసికా! నువ్వు మమ్మల్ని అడగడం దేనికీ? నీ స్నేహితురాలు ఎవరిని వరించానన్నది? హరిదత్తుడ్ని కదా! ఆ మాత్రం తెలుసుకోలేదా? ఆమెనే ఇటు వచ్చి చూసుకోమను!" అన్నాడు.

ప్రియంవద అక్కడికి వచ్చి, దగ్గరగా ఇద్దర్నీ పరిశీలించి చూసినా, విస్మయం వల్ల గుర్తుపట్టలేకపోయింది.

అప్పుడు బలభద్రుడు "ఓషధీలత చిక్కినవాడే నిధులకు అధికారి అనీ- ప్రియంవదా ప్రియుడనీ రాసి వుంది కదా! అందువల్ల ప్రియంవదకు భర్తకాదగ్గ అర్హత అదృష్టదీపుడిదే!" అన్నాడు. అదృష్టదీపుడు హరిదత్తుని చెయ్యి పట్టుకుని, ఒక చెట్టు వెనుకకు తీసుకెళ్లి, అక్కడికి దగ్గర్లో పూజాద్రవ్యాల నిర్మాల్యంలో చేయి పెట్టించి వెతికించేసరికి ఓషధీలత హరిదత్తునికి చిక్కింది.

స్వప్నంలాంటి సత్యం అనిపించేలా మణికాంతులతో వెలిగే అమ్మవారి మేడ అతనికి కనిపించింది. అతడాశ్చర్యపోతూ అదృష్టదీపుడిని అడగ్గా "తమ్ముడా! నీ సందేహానికీ సమాధానమిదే! చివరికీ లత నీకే దొరికింది కనుక- అది నీ తర్వాతే నా చేతికొచ్చింది గనుక దానికి అసలు అధికారివి నీవే! ఇక మీకు ఆ మేడ విశేషాలు చూపిస్తా!" అంటూ హరిదత్తుని చేత

మూలిక పట్టించి, ఒకరి వెంట ఒకరుగా అందరూ అమ్మవారి మూడంతస్తుల ఆలయంలోనికి అడుగుపెట్టారు. నిధుల విశేషాలు చూశారు.

అప్పుడు అదృష్టదీపుడు అమ్మవారి ఎదుట ప్రియంవదా-హరిదత్తులకు పాణిగ్రహణం చేయించి తన ప్రతిన నిలుపుకున్నాడు. తమ్ముని దీవించి, "నువ్వామె కోసం ప్రాణత్యాగానికైనా సిద్ధపడ్డావు! ఇప్పుడామెతో సుఖంగా ఉండు" అన్నాడు.

## సత్యవతి కథ

"అన్నా! నేనీ ప్రియంవదని కామించి, అటువంటి పనికి పూనుకోలేదు. బలవన్మరణం పాపం అనీ- ఉరితీయబడితే పాపం ఉండదనీ భావించడం వల్ల అలాంటి అసాధ్య కార్యానికి పూనుకున్నాను. అంత తెగవు ఎందుకు చూపానంటే......విను!....

నన్ను మా పెంపుడు తండ్రి, ఒక అగ్రహారంలో సోమశేఖరుడనే పండితునికి విద్య నేర్పమని అప్పగించాడు. నేను మాధుకరవృత్తి నవలంబించి చక్కగా విద్యనభ్యసించసాగాను. నా శ్రద్ధాసక్తులు చూశాక, అతడు నేనిలా ఇల్లిల్లూ భోజనం నిమిత్తం తిరగడం చూడలేక తన ఇంటనే ఉంచి అన్నీ తానే ఏర్పాటు చేసి నాకు విద్యబోధించసాగాడు.

ఆయనకు సత్యవతి అని పదహారేళ్ల కూతురుంది. చాలా అందగత్తె. కళలు అన్నీ తెలిసినది. కాని ఆమె భర్త పెళ్లయిన వెంటనే కాశీకి వెళ్లిపోయి, ఎంతకూ తిరిగిరాక పోవడంతో ఆమె యవ్వనం అడవిగాచిన వెన్నెల్లా చూపరులకు జాలి గొల్పేది. ఒకరోజు-

మా గురువుగారు భోజనం చేస్తూన్నందున పుస్తకాల గదిలోకెళ్లి ఏదో పుస్తకం కావలసి వచ్చి నన్ను తెమ్మన్నారు. ఆ గదిలో చీకటిగానూ ఉంటుంది. కొంచెం మూలగానూ వుంటుంది. కనుక దీపం తీసుకొని నేనొక్కడినే అటువైపుగా వెళ్తూంటే సాయం వస్తా-పద! అంటూ సత్యవతి తయారైంది నా వెంట.

నేను పుస్తకం కోసం వెతుకుతూంటే "హరిదత్తా! నువ్వు కొక్కోకం లాంటివి చదివావా? లక్ష్యలక్షణాలు తెలుస్తాయి గాని, అనుభవం ఉందా? ఉంటే ఇంత చక్కని వాడివై ఉండీ, యవ్వనాన్ని వృధా చేసుకుంటావా?

నువ్వు కోరాలే గానీ, కాదు అనే స్త్రీ ఉండదు" అని తన అభిప్రాయం చూచాయగా చెప్పింది. ఆ తర్వాత ఇంకోసారి అవకాశం చూసుకొని, తన మనసులో నాపై పెంచుకున్న వాంఛ విడమరిచి చెప్పింది. ఒకటి రెండు రోజులు పోయాక ఆమె ఓరోజు నన్ను బలవంతంగా ముద్దు పెట్టుకుంది.

ఇంకొకరోజు గట్టిగా కౌగలించుకుంది. నేను ఆమెను ఎంత ప్రతిఘటించినా లెక్కచేసేది కాదు. ఒకసారి గురువుగారు గ్రామాంతం వెళ్లినపుడు బాగా అలంకరించుకుని వచ్చి సుడిగాలిలా నన్ను కౌగిలించుకుని, కదల్నివ్వకుండా బంధించి ముద్దులు పెట్టుకుంది. తనను ఎవరేమనుకున్నా లక్ష్య పెట్టనని; ఇంద్రియాలను ఆపడం తన తరం కాదని మీద పడింది. కాని నేను పెనుగులాడి పారిపోయాను. అప్పుడామె కోపంతో ఊగిపోతూ, "ఛీ! కోరి వచ్చిన నన్ను ఇంత చులకన చేస్తావా! దుర్మార్గుడా! చెప్తా నీ పని" అంటూ తల విరబోసుకుని, దేహం మీద అక్కడక్కడ గీరుకుని, శివాలెత్తి పోతూ అరవసాగింది. ఏడ్చి రాగాలు పెట్టసాగింది.

ఇంతలో కూతురి కేకలు విని, గురుపత్ని అక్కడకు రాగా ఏడుస్తూనే "ఈ నిర్భాగ్యుణ్ణి మనం చేరదీస్తే, ఇతడు నామీద కన్నేసి నాన్న లేని సమయంలో నన్ను చెరచబోయాడు! నేను నిన్ను కేకలేస్తూ పిలిచేసరికి ఎటో పారిపోయి దాగున్నాడు." అంటూ నాటకం బాగా రక్తి కట్టించింది. ఇరుగుపొరుగులు కూడ ఆ స్త్రీ పట్ల సానుభూతితోను సత్యవతి గుణవంతురాలిగా వారి వద్ద మెలగడంతోను అందరూ దాని మాటే నమ్మారు. నాకు గురువు గారి వల్ల దండన తప్పదనుకుంటూ ఎలాగో తెల్లారేవరకు గడిపాను. ఆయన కృతఘ్నుడని ముద్రవేసి నన్ను ఇంట్లోంచి గెంటేశారు. లోకూలూ నన్నే నిందించసాగారు. చివరికాగ్రామంలో నాకు మంచి నీళ్లయినా పుట్టలేదు. చావు తప్ప గత్యంతరం లేదని, చివరికీ ఊరు చేరి, ఉరితీత వల్ల మరణాన్ని వరించాలనుకున్నాను. చావాలనే కోరిక తప్ప ప్రియంవద మీద కోరికతో మాత్రం ఆమె ప్రశ్నలకు జవాబు చెప్పాలని తయారవలేదు" అని వివరించాడు హరిదత్తుడు.

అతడి నిర్మలమైన వృత్తాంతానికి అందరూ శ్లాఘించి, ఆనంది ంచారు. అదృష్టదీపుడు కేళీశైలం నుంచి కొన్ని రత్నాలు, కొంత బంగారం,

తీసుకుని వారితో పాటు బండి ఎక్కి వైభవంగా రాజవాహనుని కోట లోనికి వచ్చాడు.

ప్రియంవద ద్వారా అతడే అదృష్టదీపుడనీ- అతడి స్వంత తమ్ముడే హరిదత్తుడనీ తెలిసిన రాజవాహనుడు ఎంతో సంతోషించాడు. పొరపాట్లు క్షమించవలసిందిగా కోరాడు. అదృష్టదీపుడు వచ్చాడన్న వార్త విని, యాచకులు- వివిధ శరణార్థులు తండోపతండాలుగా రాసాగారు. దేవి భవనంలో అక్షయంగా వున్న అపారసంపదలను అతడు చేతికి ఎముకలేదన్నట్లుగా దానం చేశాడు.

పుష్పగిరిలో తన సోదరునికి వివాహం తలపెట్టాడని, విన్న విద్వాంసులెందరెందరో అదృష్టదీపుని అర్థించడానికీ - సమ్మానాలు పొందడానికీ రాసాగారు అక్కడకు.

## ప్రియంవద-హరిదత్తుల వివాహం

వచ్చినవాళ్లను అందరినీ అదృష్టదీపుడు కుబేరులను చేసి పంపసాగాడు. ఒక్క రత్నం ఇచ్చినా, వారు కోటీశ్వరులైపోయారన్న మాటే!

ధర్మపురి నుంచి రత్నావతిని, బ్రహ్మావధానిని పిలిపించి వారి వల్ల తన పూర్వ వృత్తాంతం తెలుసుకుని-కాంతిమతినీ, చతురికను అక్కడికి రప్పించాడు అదృష్టదీపుడు. ఆ తరువాత...

ధర్మపాలుడనబడే తన తండ్రిని తల్చుకుంటూనే ఆ తనయుడు ధర్మపాలుని భార్య అయిన సునంద జాడ తెలిపినా- తీసుకొచ్చినా భూరి బహుమతి ప్రకటించాడు. ప్రకటించిన పదిరోజులకు సునందను వెంటబెట్టుకొని, ఒక బ్రాహ్మణుడొచ్చాడు. కొడుకులిద్దరూ ఆమెను కౌగలించుకుని ఆనందభాష్పాలు రాల్చారు.

వాళ్లిద్దరూ తన పుత్రులని తెలిసి ఆనందం పట్టలేకపోయిందా వీరమాత. కన్నీళ్లు ధారాపాతంగా వర్షిస్తూంటే – "అమ్మా! నువ్వు వీరమాతవి. సామాన్యుల్లాగ శోకించకు! నిన్ను ఇన్నాళ్లూ ఆదరించిన వారి ఇల్లు బంగారం చేస్తాను. అలాగే నిన్ను ఎవరెవరు అవమానించారో చెప్పు! వాళ్లను ఈ భూమ్మీద ఉండనివ్వం! నీ వృత్తాంతం చెప్పు!" అని అడగ్గా ఆమె తన కథ ఇలా చెప్పసాగింది....

# సునంద కథ

ఆనాడు నేను అరణ్యమధ్యంలో పుత్రుని ప్రసవించి, నీళ్లు తీసుకురావలసిందంటూ రత్నావతికి సైగచేశాను. ఆమె అటు వెళ్లగానే ఒక కోతి వచ్చి నా ఒడిలోని శిశువుకు ఎత్తుకొని పోతున్నా ఏం చేయడానికీ శక్తి లేక స్పృహ కోల్పోయాను.

ఇంతలో - ఆ దారినే మణిమంతుడనే వర్తకుడు అత్తవారింటి నుంచి పల్లకీ మీద భార్యను తీసుకొస్తూ, స్పృహలో లేని నన్ను చూసి దయతో పల్లకీ ఎక్కించుకుని తమ ఊరు తీసుకువెళ్లాడు.

మంచి వైద్యులచేత చికిత్స చేయించడం వల్ల నాలుగురోజులకు నాకు తెలివి వచ్చింది. కొడుకు కోసం విచారిస్తున్న నన్ను వాళ్లే ఓదార్చారు".

అదృష్టదీపుడు మణిమంతుని పేరు రాసుకొని, అతడ్ని తీసుకురావడానికి ఏనుగును పంపించాడు. ప్రత్యేకంగా దూతలక్కూడా చెప్పాడు. రెండు మూడేళ్లు వాళ్లింట్లో సురక్షితంగా ఉన్నాను. అతని భార్య నన్ను ఆప్యాయంగా చూసేది. కొన్నాళ్లయాక - నా ఒంటరితనం చూసి ఎవరెవరో నా మీద కన్నేసి, నన్ను ఆప్యాయంగా చూసే ఆ వర్తకుని భార్యకి తమ కామం గురించి చెప్తూ నన్ను జతకూర్చమనేవాడు.

చాలా ధనవంతుడైన వైదేశికుడనే వర్తకుడు, నాకు ఆశ్రయమిచ్చిన వ్యాపారి భార్య అంబిక వద్ద తన ఆలోచన వెల్లడించేసరికి ఆమె ఒక రోజు "సునందా! నేనున్నాళ్లూ నీకేలోటూ రాదనుకో! నువ్వు చూస్తే నడివయసులో ఉన్నావు...." అంటూ మెల్లగా వైదేశికుడి గురించీ-అతడి వ్యాపారాల గురించీ బోధించడం ప్రారంభించేసరికి నాకు అర్ధమైపోయింది.

అప్పుడు నేను కన్నీరు కారుస్తూ "అమ్మా! నీకు నామీద ఆదరం తగ్గిందా? ఇన్నాళ్లలో నన్నెన్నడూ ఇటువంటి ప్రేరణలకు లోను చెయ్యలేదు. అలాంటిదీవేళ నీలో ఈ మార్పేమిటి? నా ప్రాణం పోయినా- కులం చెడేపని చెయ్యను. శీలం వదిలిన స్త్రీ పరలోకాన నరకయాతన అనుభవిస్తుందని నీకు తెలీదా? కాబట్టి నువ్వు నన్నెన్నడూ ఇలాంటి నీచపు పనులకి నన్ను ప్రేరేపించకు" అనేసరికి ఆమె సిగ్గుపడి, ఇంకేం అనకుండా ఊరుకుంది.

ఆరాత్రి వైదేశికుడు నన్ను బలాత్కారంగా అనుభవించబోగా, నేను భయంతో బయటకు పరుగెత్తుకొచ్చి ఆ ప్రాంతంలో ఉన్న బ్రాహ్మణుని

ఇంటికి పారిపోయాను. అతడు అక్కడకు కూడా వెంట తరిమి రాగా, ఆ బ్రాహ్మణుని ఇంట వున్న ఒక రాజోద్యోగి దుడ్డుకర్రతో వైదేశికుడి మీద తిరగబడి "అర్ధరాత్రి వేళ ఈ అల్లరేమిటి?" అంటూ గద్దించాడు. అప్పటికీ వైదేశికుడు చెలరేగేసరికి, ఆ ఉద్యోగి ఈలవేసి రాజభటుల్ని రప్పించగా వారు వైదేశికునికి కారాగారప్రాప్తి కలిగించారు.

ఇక ఆ ఊరిలో తిరగలేక, ఇంకొక నగరం చేరి, భిక్షుకురాలిగా మారి, రాత్రులు దేవాలయ మంటపాల మీద తెల్లవారిస్తూ దేశయాత్ర చేశాను. ఓరోజు నీ ప్రకటన గురించీ-నా పోలికలగురించీ కొందరు బ్రాహ్మణులు ఒక గుడిదగ్గర మాట్లాడుకుంటూండగా విన్నాను.

అప్పటికే అదృష్టదీపుడి గురించి నా దేశాటనలో చాలా చోట్ల గొప్పగా చెప్పుకోవడం విని ఉన్నాను. ఆ మహారాజుకు నా ఊసేల? నాకు అతడు కొడుకుగానీ కాడు గద! అనుకుంటూనే ఆ బ్రాహ్మణులతో "రేపు మీకు సునంద జాడ చెబుతా" నంటే, వాళ్లు నన్ను వెర్రిదానిగా చూశారు. కాని-ఈ బ్రాహ్మణుడు మాత్రం నన్ను నమ్మి ప్రయాణం కట్టించి మీకు తీసుకొచ్చి అప్పగించాడు"...అని తన వృత్తాంతం వినిపించింది.

ఆ బ్రాహ్మణునికి అదృష్టదీపుడు తాను ప్రకటించినట్టి భూరి బహుమానాన్ని సంతోషంగా ఇచ్చాడు. అలాగే తల్లిని కలుసుకున్న ఆనందంలో ఎన్నో దానాలు చేశాడు. అంతేకాక ప్రియంవదతో తన సోదరునికి పెళ్లి జరిగిన సందర్భంగా దేశదేశాల రాజులకూ అద్భుతమైన విందు ఇచ్చాడు.అసలు అదృష్టదీపుడ్ని చూడాలన్న ఉత్సుకతతోనే ఎక్కడెక్కడి రాజులూ ప్రత్యేకించి పనిగట్టుకుని ఆ విందుకు విచ్చేశారు. వచ్చినవాళ్లంతా అపూర్వమైన ఆ విందు స్వీకరించి, తమ జీవితకాలంలో అటువంటి విందు ఎరగం అని పొగిడారు. అతని దాతృత్వం -తాము విన్నదానికంటే చాలా ఎక్కువ అని ప్రశంసించారు. అతడు దానంగా ఇచ్చే ఒక్కొక్క మణి విలువ తమ ఐశ్వర్యాన్ని మించినదని కొనియాడారు.

మరునాడే రాజులందరినీ కూడగట్టి, వసురక్షితుడి మీదికి దండు వెడలి, అతడి గుండెల్లో గుబులు పుట్టించాడు. అదృష్టదీపుడు ధర్మపాలుడి కొడుకని తెలిసేసరికి- లోకంలో అతడి కున్న మంచిపేరు విని ఉన్నందున

అతడికి రాజులందరి అండ ఉండడంతో అతడ్ని జయించడమూ అసాధ్యమని, సంధికీ అవకాశం లేదని పిక్కబలం చూపబోయాడు.

అదృష్టదీపుడా కపటి దురాలోచనను ముందే పసిగట్టి, బంధించి తన తండ్రిని చెర విడిపించి వసురక్షితుడ్ని ఆయన పాదాల చెంత పడవేశాడు. కొడుకు లిద్దర్నీ గర్వంగా - తృప్తిగా చూస్తూ ధర్మపాలుడు భగవత్ కృపను స్తుతించాడు.

దుర్వినీతుడు-విహారభద్రుడు తమ కౌశాంబిని ఏలుతూన్నారన్న విషయం విని, దండుతో వెళ్లి వారిని బంధించి కారాగారంలో బంధించాడు. కోటంతా శుద్ధి చేయించి ఒక శుభముహూర్తాన పట్టాభిషిక్తుడై, తనకు అండగా నిలబడిన రాజలోకానికి విలువైన బహుమతులు అందజేసి చిరకాల మైత్రి వర్ధిల్లచేయమని పేరుపేరునా కోరి సౌజన్యమూర్తి అనిపించుకున్నాడు. వినయకేతుని వెతికించి - రప్పించి అతనికి ప్రధానిగా పదవి ఇచ్చాడు.

గోపా! దుర్జనుల్ని రక్షించడం లోకానికి అపకారం అని కోటద్వారం వద్ద నువ్వు చూసిన రీతిలో ఆ ఇద్దర్నీ దండనీతికి గురిచేసి, వారి శరీరంలోన్ని రక్తమాంసాలు ఇంకిపోకుండా ఓషధీ రాసి చిరకాలం అదేస్థితిలో ఉండేలా చేశాడు. దుర్జనులకు బుద్ధి రావడానికి ఆ చర్య! నువ్వు చూసిన వాళ్లిద్దరూ దుర్వినీతుడూ, విహారభద్రుడూ. ఇదీ నువ్వడిగిన తలక్రిందులుగా వ్రేలాడే వారి వృత్తాంతం" అని మణిసిద్ధుడు చెప్పి, సంతోషంలో మునిగితేల్తున్న శౌనకునితో కూడ బయలుదేరి తరువాయి మజిలీ చేరాడు.

**మాలిని వృత్తం,**

**నిరుపమగుణభూషా! నిత్యసంతోషవేషా!**
**సురుగురుముని పూజా! స్తోత్రం సంసక్తతేజా!**
**నరహరిసద్భిఖ్యా!వందితాదిత్యముఖ్యా!**
**స్థిరతరగుణకీర్తి! దేవతా చక్రవర్తీ!**

శ్రీ విశ్వనాధార్పణమస్తు

విబుధ జనాభీ రక్షిత సుబ్బన దీక్షిత కవి విరచితంబగు

కాశీయాత్రా చరిత్ర మను మహాప్రబంధమున

ద్వితీయభాగం సమాప్తం

✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻✻